# వీక్షణం

VEEKSHANAM, TELUGU MONTHLY
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 15 సంచిక : 3 హైదరాబాద్ 188 మార్చ్ 2017 పేజీలు : 68 రు. 20

- కేంద్ర బడ్జెట్ 2017-18
- తెలంగాణ నిరుద్యోగుల ఆందోళన
- ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదా
- తమిళనాడు పరిణామాలు
- పెద్ద నోట్ల రద్దుపై చర్చ కొనసాగింపు
- బస్తర్‌లో హక్కుల హననం
- మొదలైన ట్రంప్ జాతీయోన్మాదం




## మెరిసే అక్షరాల వెనుక

ఎన్. రాజశేఖరం

సృజన ప్రచురణ

పేజీలు: 84 వెల: రు. 30

ప్రతులకు
**వరవరరావు**
ఫ్లాట్ నెం. 419, హిమసాయి హైట్స్
స్ట్రీట్ నెం. 6, జవహర్‌నగర్, హైదరాబాద్ - 500 020



## ఆవాజ్

మతం లేని సమాజం కోసం

**పి. వరలక్ష్మి**

విరసం ప్రచురణ

పేజీలు: 120 వెల: రు. 65

ప్రతులకు
**డి.వి. రామక్రిష్ణారావు**
ఎం.ఐ.జి.-14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలీ,
హైదరాబాద్ - 500 040.
ఫోన్ :99891 89250




## మార్క్స్ పెట్టుబడి రచనా క్రమం

ఫ్రాన్సిస్ వీన్

అనువాదం: ముక్తవరం పార్థసారథి

విరసం ప్రచురణ

పేజీలు: 80 వెల: రు. 50

ప్రతులకు :
**పి. వరలక్ష్మి**
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దటూరు, కడప జిల్లా - 516 360



## మలుపు తిప్పిన మహా ఉద్యమం

చైనా సాంస్కృతిక విప్లవంపై సమకాలీన వ్యాఖ్య

**విలియం హింటన్**

అనువాదం: సివిఎస్‌ఆర్ ప్రసాద్

విరసం ప్రచురణ

పేజీలు: 108 వెల: రు. 60

ప్రతులకు : **పాణి**
డోర్ నెం. 50-348-1, 19/బి, సెకండ్ ఫ్లోర్
అరోరా నగర్, బి క్యాంపు (పోస్ట్), కర్నూలు - 2

188 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మార్చ్ 2017
సంపుటి : 15
సంచిక : 03







'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
VEEKSHANAM
మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై 'VEEKSHANAM' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2017 ఫిబ్రవరి నెలలో వచ్చిన విరాళాలు - డా. పి. అంకయ్య, కనిగిరి - రు. 10,000: మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

హనుమంతరావు గారి జ్ఞాపకాలుగా తెచ్చిన ఫిబ్రవరి సంచికలో రచయితలు రాసిన విషయాల ద్వారా ఆయన గురించి తెలుసుకునే అవకాశం కలిగింది. ఆయన తన ఉద్యోగాన్ని ఎక్కడా ఎవరి ముందు ప్రదర్శించినట్టులేదు. భేదాభిప్రాయాల్ని రాత మూలకంగా ఎంతగా ఖండించినా వ్యక్తిగతంగా కలిసినప్పుడు ఎదుటి వారిని శ్లాఘించి ప్రోత్సాహపరచడమేగాని, ఈసడించడం లేదు. పెద్దా చిన్నా అనే భేదభావం చూపరట! ఆయన జీవితంలో ఎవరినీ కసిరి కోప్పడినట్టూ, అరచి కేకలేసినట్టు లేదని చాలామంది అంటే ఆశ్చర్యపోయాను. వారిని నేను దగ్గరగా చూడలేకపోయానే అని బాధ వేసింది. వారి ఫొటో అన్నా దొరుకుతుందంటే ఎవరు వేయలేదు. ఆయన సంస్మరణలో ప్రసంగించిన వారి ఫొటోలు చివరి అట్ట పేజీలో ఉన్నాయిగానీ, అసలు వ్యక్తి ఫొటో ఎక్కడా కన్పించలేదు. 90 ఏళ్లు దాటిన వారూ రాస్తుంటారా? అంటే అవునని తెలపడానికి వారి జీవితమే ఉదాహరణ. మా భూపతి నారాయణమూర్తి గారు 96లో రాస్తున్నారు. వీక్షణంలోని సంపాదకీయం వెంటవచ్చే కార్టూన్‌లన్నీ ఓ పుస్తకంగా తేగలరా? అవి చాలా బాగుంటున్నాయి. నిమిషంలో వార్త నసాళానికి అంటుతుంది గదా..

**- హజరత్ అలీ**
వేమూరు

ఫిబ్రవరి 2017 సంచికంతా కామ్రేడ్ వి. హనుమంతరావు గారి గురించి, 18 మందితో వారి గొప్పతనాన్ని, వారి విశిష్ట వ్యక్తిత్వం గురించి వ్యాసాలు ప్రచురించారు సరే, ఆ వ్యాసాలతో పాటు, హనుమంతరావు గారి ఫొటో కూడా వేసి ఉంటే ఆయనెలా ఉంటారో తెలుసుకునే అవకాశం ఉండేది. అలాగే పత్రికలో ప్రముఖ వ్యక్తుల జీవిత విశేషాలతో ప్రచురిస్తే పాఠకులు అలాంటి మహోన్నతులు ప్రజల కోసం తమ జీవితాల్ని ఎలా వెచ్చించారో తెలుసుకొని, వారి నుంచి ఎంతో స్ఫూర్తి పొందుతారు. ఉదాహరణకు యాకోవ్ స్వెర్ద్‌లోవ్ లాంటి మేధావి, గొప్ప కమ్యూనిస్టు కార్యశూరుడు లాంటి వ్యక్తులు వారి శ్రమ, కృషి, కమిట్‌మెంట్, నిబద్ధత ఎటువంటి వారినైనా కదిలిస్తుంది. స్ఫూర్తినిస్తుంది కదా. అలాగే జ్యోతిరావ్ పూలే, సాహూ మహరాజ్, అంబేద్కర్, అలాగే ప్రపంచ దేశాల విప్లవకారుల జీవితం, వారి కృషీ, వారి పని విధానం, వారి త్యాగాలు తదితరాలు స్వెర్ద్‌లోవ్ లాంటి వ్యక్తి లెనిన్‌కి అత్యంత ప్రీతిపాత్రుడు, గొప్ప నిబద్ధతా- అలుపెరగని శ్రామికుడు, విప్లవ కార్యక్రమాల కోసం ప్రతీక్షణం ఎంతగా తపించి అవిరామంగా శ్రమించే మేధావి ఒకడున్నాడని నాకింత వరకూ తెలియదు. అతని గురించి ఏ పుస్తకం రాలేదు. ఏ పత్రికలోనూ రాలేదు. అంత అద్భుతమైన వ్యక్తుల్ని పరిచయం చేసిన 'వీక్షణం'కి నా కృతజ్ఞతలు. పాలక వర్గాలపై విమర్శ చేసే పత్రికలే కనిపించని ఈ రోజుల్లో కనీసం సన్నాయి నొక్కులతోనైనా, చిన్న చిన్న విమర్శలన్నా చేయని పత్రికలు (కొన్ని) వామపక్ష పత్రికలు కూడా ప్రభుత్వాన్ని తూర్పారబెట్టని పత్రికలు ఎర్రట్టలూ ఎర్రక్షరాలతోనే పొంగిపోతూ కాలం గడిపేస్తున్న తరుణంలో, పాలకుల పరిపాలనా విధానాన్ని ఎట్టి మినహాయింపులు లేని, నిశిత విమర్శలతో, తీవ్రంగా ఎండగట్టి, వారి కపటత్వాన్ని చీల్చి చెండాడే సాహసవంతమైన పత్రికా, దోపిడీ వర్గాల ముసుగుల్ని చింపి ప్రజల్ని చైతన్యవంతం చేసే పత్రిక ఏదైనా ఉందంటే అది 'వీక్షణం' మాత్రమేననీ నా ధృఢ విశ్వాసం. అలాగే పత్రికకి అతి ముఖ్యం పాఠకులకు చైతన్యాన్ని పెంచేది అయిన సందేహాలు- సమాధానాల శీర్షిక ఇకనైనా పెడతారనీ, నాతో పాటు నా మిత్రులకు చాలా విషయాలు తెలుసుకోవాలనే ఆరాటం ఉన్నప్పటికీ, ఆ సందేహాలకి సమాధానాలు ఎలా పొందాలో? ఎక్కడ దొరుకుతాయో? ఎవరిస్తారో తెలియక తీవ్రంగా మధనపడుతున్నాం. దయచేసి ఇంత గొప్ప ఇంటలెక్చువల్ పత్రికకి ఇదిలేని లోటును ఇకనైనా తీరుస్తారని ఆశిస్తున్నాను.

**- బి.ఎ. నారాయణరావు**
విశాఖపట్నం

గత ఫిబ్రవరి సంచికలో అర్విణి రాజేంద్రబాబు రాసిన 'జైళ్లలోనే జీవితం సగభాగం' అన్న వ్యాసం చదవడం వల్ల భారతదేశంలో ఇంత లోపభూయిష్టంగా న్యాయవ్యవస్థ ఉన్నదా అన్న విషయం తెలుస్తుంది. బ్రిటిష్ వారు ఏర్పాటు చేసిన చట్టాల వలన విచారణ ఎదుర్కొంటున్న ఖైదీలు 70 శాతంగా జైళ్లలో మగ్గుతున్న విషయం తెలిపారు. బీహార్, జమ్ముకశ్మీర్‌లలో 81 నుండి 82 శాతంగా

(మిగతా 52వ పేజీలో...)

Statement about ownership and other particulars of periodical **Veekshanam as required** to be published in the first issue of every year after the last day of February

Form IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. Place of publication | : | Hyderabad |
| 2. Periodicity of its publication | : | Monthly |
| 3. Printer's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency 3-6-394, Street No. 3 Himayatnagar, Hyderabad - 500 029. |
| 4. Publisher's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency 3-6-394, Street No. 3 Himayatnagar, Hyderabad - 500 029. |
| 5. Editor's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency 3-6-394, Street No. 3 Himayatnagar, Hyderabad - 500 029. |
| 6. Name and addresses of individuals who own the newspaper | : | N. Venugopal Rao |

I, N. Venugopal Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/-
(N. Venugopal Rao)
Date : 1st March, 2017 Signature of the Publisher

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్;

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కడప - కొండ్రాయుడు; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి - కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం - ఆర్. శ్రీలత; విశాఖపట్నం - పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# పెచ్చరిల్లుతున్న మోడీ విష విద్వేష రాజకీయం

సంఘ్ పరివార్ లక్ష్యం సమాజాన్ని మత ప్రాతిపదిక మీద విభజించి, విషాన్ని, విద్వేషాన్ని వ్యాపింపజేసి, దాని రాజకీయ ఫలితాన్ని రాబట్టుకోవడం అనే విశ్లేషణ అందరికీ తెలిసినదే. మతాన్ని, అందులోనూ అసమానతనూ, హింసనూ బోధించిన హిందూ బ్రాహ్మణీయ ధర్మాన్ని ప్రాతిపదికగా పెట్టుకోవడం అంటే ఆ అసమానతకు నగ్నరూపమైన కులఅంతరాలను, కులవివక్షను వ్యాపింపజేయడమే. విచ్చలవిడి హింసను సాగిస్తూ దానికి సమర్థనలు అద్దడమే. సంఘపరివారపు ఈ లక్ష్యం గురించి గతంలో విశ్లేషకులు చెప్పినదాని కన్న ఎక్కువగా నరేంద్ర మోడీ పాలనా విధానాలు ఆచరణలో నిరూపిస్తున్నాయి. గుజరాత్ ముఖ్యమంత్రి గా ఆ రాష్ట్రంలో ప్రయోగాలు చేసిన మోడీ మరింత నిస్సిగ్గుగా ఆ విష విద్వేష రాజకీయ వ్యూహాన్ని ఇప్పుడు దేశం ముందుకు తెస్తున్నాడు.

ముఖ్యంగా ప్రస్తుతం సాగుతున్న ఉత్తరప్రదేశ్ రాష్ట్ర శాసనసభ ఎన్నికల ప్రచారంలో ఈ విద్వేష రాజకీయాలు పెచ్చరిల్లుతున్నాయి. ఉత్తరప్రదేశ్ దేశంలోకెల్లా పెద్ద రాష్ట్రం గనుక, అతి ఎక్కువ శాసనసభ స్థానాలతో 2019 పార్లమెంటు ఎన్నికలను ప్రభావితం చేయగల స్థానంలో ఉంది గనుక ఈ ఎన్నికలను సంఘ్ పరివార్ ఒక సవాలుగా పరిగణిస్తున్నది. ఉత్తరప్రదేశ్ లో దళిత, ముస్లిం, బహుజన రాజకీయాల పాత్ర కూడ గణనీయంగా ఉంది గనుక ప్రజల మధ్య విభజన విద్వేషాలు రగిలించి పబ్బం గడుపుకోవడం సులభమని సంఘ్ పరివార్ భావిస్తున్నది. ఎన్నికల ప్రచారంలో అన్ని సభలలోనూ నరేంద్ర మోడీతో సహా సంఘ పరివార్ ముఖ్యులందరూ వివాదాస్పద, అభ్యంతరకర వ్యాఖ్యలు చేస్తున్నారు. ఎన్నికలలో మతాన్ని వాడుకోగూడదని ఇటీవల సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును కూడ తుంగలో తొక్కుతూ, నరేంద్ర మోడీ బహిరంగంగా, నిర్దిష్టంగా మతాన్ని వాడుకుని ప్రజలలో భేదభావం సృష్టించడానికి ప్రయత్నిస్తున్నాడు. హిందువులను ముస్లింలకు వ్యతిరేకంగా రెచ్చగొట్టి హిందూ వోట్లు సంపాదించవచ్చునని ఆశిస్తున్నాడు.

ఈ ఉపన్యాసాలన్నిటిలోకీ అభ్యంతరకరమైనది ఫతేపూర్ ఉపన్యాసం. "ఒక గ్రామానికి ఖబరిస్తాన్ (ముస్లిం ఖనన స్థలం) మంజూరు చేసినట్టయితే, శ్మశానం (హిందూ దహన, ఖనన స్థలం) కూడ మంజూరు చేయాలి. రంజాన్ కు ఆ ప్రాంతాలలో విద్యుత్ సరఫరా చేస్తే దీపావళికి కూడ చేయాలి. హోళీకి ఏర్పాట్లు చేస్తే ఈద్ కు కూడ చేయాలి. భేదభావం ఉండగూడదు" అని మోడీ ఆ ఉపన్యాసంలో అన్నాడు. రెండు మతాలనూ సమానంగా చూడమని చెప్పడానికే, భేదభావం వద్దని చెప్పడానికే ఈ మాట అన్నాడని ఇప్పుడు సమర్థకులు అంటున్నారు గాని, చివరి సన్నాయి నొక్కు మినహాయిస్తే మిగిలిన మాటల్లో ధ్వని ఏమిటో ఎవరైనా ఊహించగలరు. పైగా ప్రస్తుతం అక్కడ ఉన్న సమాజ్ వాదీ పార్టీ ప్రభుత్వం, ముఖ్యమంత్రి అఖిలేశ్ యాదవ్ ముస్లింల పట్ల మొగ్గు చూపుతున్నారని ఎన్నోసార్లు చేసిన వ్యాఖ్యలతో ఈ వ్యాఖ్యలను కలిపి చదువుకుంటే ప్రభుత్వమేదో ముస్లింలకు ఎక్కువ ఒరగబెడుతున్నదని, అది హిందువులకు దక్కడం లేదని స్వయంగా ప్రధాన మంత్రి ఆరోపిస్తున్నాడు. ముస్లింలపట్ల, మైనారిటీల పట్ల ప్రభుత్వాలు బుజ్జగింపు ధోరణిని, వారి వాటాకన్న ఎక్కువ ఇచ్చే ధోరణిని అనుసరిస్తున్నాయని సంఘ్ పరివార్ చాల కాలంగా అబద్ధ ప్రచారం సాగిస్తున్నది. తమకు అవకాశాలు దక్కలేదనే అసంతృప్తితో ఉన్న హిందూ యువతరాన్ని ఈ బూచి చూపి ఆకర్షిస్తున్నది. సచార్ కమిటీ నివేదికతో పాటు ప్రభుత్వ గణాంకాలే ఎన్నో సార్లు ఈ అబద్ధాన్ని పటాపంచలు చేశాయి. కాని అమాయకుల్ని రెచ్చగొట్టడానికి ఇదే అబద్ధపు ఆయుధాన్ని అత్యున్నత అధికారపీఠాల నుంచి కూడ ప్రయోగిస్తున్నారు.

ఉత్తరప్రదేశ్ ఎన్నికల ప్రచారంలో సాగుతున్న ఇటువంటి విద్వేష ప్రచారం సంఘ్ పరివార్‌కు కొత్తది కాదు, కాకపోతే దశాబ్దాలుగా సాగిస్తున్న ఈ ఎత్తుగడలు ఈ రెండున్నరేళ్ల అధికార బలంతో మరింత పదునెక్కాయి. ఇటువంటి అబద్ధప్రచారాలే ప్రధాన ఆయుధంగా ఎంచుకున్నవాళ్లకు, నిజాలు, నిజాలు చెప్పేవాళ్లు, స్వతంత్రంగా ఆలోచించే వాళ్లు, సత్యశోధన చేసే సంస్థలు కంటగింపు కావడంలో ఆశ్చర్యం లేదు. అందుకే వాళ్ల దాడి విద్యావేత్తల మీద, పరిశోధకుల మీద, విద్యా సంస్థల మీద ఎక్కుపెడుతున్నారు. గత రెండున్నర సంవత్సరాలలో ఎన్ని విద్యాసంస్థల మీద, ప్రజాస్వామిక వేదికల మీద సంఘ్ పరివార్ దాడులు జరిగాయో లెక్కలేదు. చెన్నై ఐఐటి, పుణె ఫిల్మ్ అండ్ టెలివిజన్ ఇన్‌స్టిట్యూట్, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ, జాదవ్‌పూర్ యూనివర్సిటీ, జెఎన్‌యు, బనారస్ హిందూ యూనివర్సిటీలలో జరిగిన ఘటనలు అందరికీ తెలుసు. తాజాగా మహేంద్రగఢ్‌లోని హర్యానా సెంట్రల్ యూనివర్సిటీలో మహాశ్వేతాదేవి నాటకం ప్రదర్శించినందుకు విద్యార్థులనూ, అధ్యాపకులనూ వేధించారు. జోధ్ పూర్ యూనివర్సిటీలో ఒక జాతీయ సదస్సులో పత్రం సమర్పించడానికి జె ఎన్ యు ప్రొఫెసర్ నివేదితా మీనన్ ను ఆహ్వానించినందుకు డా. రాజశ్రీ రాణావత్ ను ఉద్యోగం నుంచి తొలగించారు. ఢిల్లీ యూనివర్సిటీ రాంజాస్ కాలేజ్‌లో 'కల్చర్స్ ఆఫ్ ప్రొటెస్ట్' (నిరసన సంస్కృతులు) అనే అంశం మీద ఫిబ్రవరి 21న ఇంగ్లిష్‌శాఖ నిర్వహించిన సదస్సులో జెఎన్‌యు విద్యార్థి నాయకులు ఉమర్ ఖలీద్, షెహ్లా రషీద్ ఉపన్యాసకులుగా ఉండగా, ఎబివిపి గూండాలు ఆ సదస్సు మీద దాడిచేసి, రాళ్లువిసిరి, సదస్సు హాల్ తలుపులు మూసి తాళాలు వేసి, హాజరైన విద్యార్థులనూ, అధ్యాపకు లనూ నిర్బంధించారు. ఆ హాలుకు విద్యుత్తు సరఫరా ఆపివేశారు. అక్కడ నిలబడిన పోలీసులు ఈ హింసాకాండనంతా చోద్యం చూస్తూ ఉండిపోయారు గాని అడ్డుకోలేదు. ఈ దాడినీ, పోలీసుల నిర్లక్ష్యాన్ని ఖండిస్తూ మర్నాడు కాలేజి దగ్గరి నుంచి మారిస్ నగర్ పోలీస్ స్టేషన్‌కు ఊరేగింపుగా వెళ్లడానికి విద్యార్థులు, అధ్యాపకులు పోగైనప్పుడు, మళ్లీ ఒకసారి ఎబివిపి గూండాలు వారిమీద దాడిచేసి అధ్యాపకులను, విద్యార్థులను గాయపరిచారు.

ఈ విషప్రచారం, ఈ హింసాకాండ 1930ల జర్మన్ సమాజ స్థితిని గుర్తుకు తెస్తున్నాయి. హిట్లర్ నాజీ, ఫాసిస్టు, మతోన్మాద, జాతీయోన్మాద విష ప్రచారాలు, దాడులు సరిగ్గా ఈ పద్ధతిలోనే ముందుకు సాగాయని గుర్తుకు తెచ్చుకుంటే ఇవాళ దేశంలో ప్రగతిశీల, ప్రజాస్వామిక ఆలోచనాపరుల ముందున్న సవాళ్లు, కర్తవ్యాలు ఎంత తీవ్రమైనవో అర్థమవుతుంది.

### సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# రాచరికం రెండో రాకడ

మన సమాజంలో ఒక భూస్వామ్య వ్యతిరేక, బూర్జువా ప్రజాస్వామిక విప్లవం జరిగి, ప్రజాస్వామిక సమాజం ఆవిర్భవించలేదని, ఇక్కడి పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అంటు కట్టిన బోన్సాయి మొక్క మాత్రమేనని చేసే విశ్లేషణకు ఇవాళ తెలంగాణ అద్దం పడుతున్నది. ఒక పాలనావ్యవస్థ తనను తాను ప్రజాస్వామ్యం అని పిలుచుకోవాలంటే దాని నిర్ణయాలు పారదర్శకంగా ఉండాలి. భిన్న ప్రజా సమూహాలకు ప్రాతినిధ్యం వహించాలి. ఆ సమూహాలలో ఏ ఒక్కటైనా, చివరికి ఒక్క వ్యక్తి అయినా ప్రశ్నించినప్పుడు జవాబుదారీగా ఉండాలి. స్వతంత్ర న్యాయవ్యవస్థ, పత్రికావ్యవస్థల సమీక్షకు అనువుగా ఉండాలి. తెలంగాణలో తాము నడుపుతున్నది ప్రజాస్వామ్య ప్రభుత్వం కాదని తెలంగాణ రాష్ట్ర సమితి అడుగడుగునా రుజువు చేసుకోదలచుకున్నట్టున్నది. రాచరికంలో లాగ రాజుగారే సర్వంసహాధికారి. తనలో తానో, ఒక చిన్న కుటుంబ, ఆశ్రిత కూటమితో సంప్రదింపులతోనో నిర్ణయం తీసుకోవచ్చు. తన ఇష్టం వచ్చిన వారికి మాత్రమే ప్రాతినిధ్యం వహించవచ్చు. ఎవరూ ప్రశ్నించగూడదు. ప్రశ్నించినవారికి అణచివేతే, గొంతు నొక్కడమే, శిరచ్ఛేదమే పరిష్కారం. లేదా వారిమీద బురదజల్లి వారి విశ్వసనీయతను దెబ్బతీయడానికి ప్రయత్నించవచ్చు. న్యాయవ్యవస్థ స్వాతంత్ర్యాన్ని కొల్లగొట్టవచ్చు. పత్రికా వ్యవస్థను కొనివేయవచ్చు. ఈ చర్యలన్నీ కూడ రాచరిక చిహ్నాలు మాత్రమే గాని ప్రజాస్వామిక చిహ్నాలు కావు. కాని రాచరికం రోజుల్లో లేని విశాలమైన మధ్యతరగతి బుద్ధిజీవుల సమూహం, ప్రచారసాధనాలు, అంతకంతకూ ఎక్కువ ప్రశ్నించే గళాలు ఉన్న ఈ రోజుల్లో, ప్రజాస్వామ్యమని చెప్పుకునే పాలన సాగుతున్నప్పుడు ఈ రాచరిక, భూస్వామ్య పోకడలు ఎక్కువకాలం సాగవు. రాచరికంలోనైతే ఎన్నికలు, అధికారం నుంచి దిగిపోవలసిన స్థితి ఉండకపోవచ్చుగాని, ఎంత చెడిన ప్రజాస్వామ్యమైనా, మన సమాజంలో ప్రజాస్వామ్య నటన కోసమైనా ఎన్నికలు ఉన్నాయి. ఈ ఎన్నికలు లేకపోతే ఎంత బాగుండును, కొడుకుకూ మనవడికీ ఈ రాజ్యం అప్పగించగలుగుదుం గదా అని ప్రజాస్వామిక రాజులు అనుకోవచ్చు గాని ఎన్నికలు తప్పవు. ఆ ఎన్నికలు దగ్గరికి వచ్చే కొద్దీ రాజుగారి అసహనం పెరుగుతుంటుంది. దానితో రాచరికపు పోకడలు మరింత నగ్నంగా, బహిరంగంగా బైటపడు తుంటాయి. ప్రజలందరికీ తెలిసిన నిజాన్ని మసిపూసి మారేడుకాయ చేయడం (నరహంతకుడు, భూకబ్జాకోరు నయీంకు రాజకీయ నాయకులతో, పోలీసులతో సంబంధాలు లేవని ప్రకటించడం), ప్రజల నిజమైన, న్యాయమైన సమస్యల మీద కూడ నిరసన గళాలు వినబడగూడదని ఆదేశించడం (నిరుద్యోగుల నిరసన ప్రదర్శన మీద దారుణ దమననీతి అమలు చేయడం), గతంలో శ్రీకృష్ణదేవరాయలు, తదితర రాజులు చేసినట్టుగా తానూ ప్రజాధనాన్ని దేవతలకు అర్పించడం, ప్రజల భావోద్వేగాలను సంతృప్తి పరచడానికి అవి తెలంగాణ కోసం మొక్కులు అని సాకు చెప్పడం, ప్రజల నిరసన ప్రకటించే హక్కును కూడ కాలరాస్తూ, నిరసన స్థలాన్ని తొలగించడం వంటి రాచరిక చర్యలు అమలు చేస్తున్నప్పుడు తనకు తాను సర్వంసహాధికార చక్రవర్తి అని అనిపించవచ్చు గాని, రాచరికం అనేది చరిత్రలో అంతరించిపోయిన జంతువు, పురావస్తుప్రదర్శనశాలలో మాత్రమే ఉండదగిన జంతువు. వీ

### సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# అదే భాగస్వామ్య సదస్సు, అవే అబద్ధాలు

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ప్రపంచ బ్యాంకు ఆదేశాల మేరకు దేశదేశాల సంపన్నులకు, బహుళజాతిసంస్థలకు విహారభూమిగా మార్చిన చంద్రబాబు నాయుడు రాష్ట్ర వనరులను ఆ తోడేళ్ల ముందు ప్రదర్శించడానికి 2001లో భాగస్వామ్య సదస్సు అనే తంతు మొదలు పెట్టారు. భారత పారిశ్రామిక సమాఖ్య (కాన్ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఇండస్ట్రీ – సిఐఐ) అనే బడా పెట్టుబడిదారీ, దళారీ సంస్థ సహకారంతో ప్రారంభమైన ఈ సదస్సు వాగాడంబరానికీ, ఆర్భాటపు వాగ్దానాలకూ నిలయం. రాష్ట్ర వనరులను బహుళజాతిసంస్థలకూ వారి దళారీలకూ అప్పగించడం తప్ప, అది ప్రజలకూ రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకూ ఏమీ సాధించలేదు. 2001లో జరిగిన మొదటి సదస్సులో రు. 37,000 కోట్ల పెట్టుబడులకు ఒప్పందాలు కుదుర్చుకున్నామని, రు. 75,000 కోట్ల పెట్టుబడులు ఆసక్తి ప్రకటించాయని, అంటే మొత్తం రు. 1,12,000 కోట్ల పెట్టుబడులు వస్తాయని, వాటితో ఎన్నో పరిశ్రమలు, ఉద్యోగాలు వస్తాయని, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ పురోగమిస్తుందని భారీ ప్రకటనలు చేశారు. కాని, 2003లో రెండో భాగస్వామ్య సదస్సు జరిగే నాటికి రు. 3,700 కోట్ల పెట్టుబడులు కూడ రాలేదని తేటతెల్లమయింది. మళ్లీ రెండో సదస్సులో రు. 17,204 కోట్ల పెట్టుబడులు వస్తాయని కొత్త భ్రమావాగ్దానాలు ప్రకటించారు. ఆ వాగ్దానాలు కూడ కల్లలయ్యాయి. ఈలోగా చంద్రబాబు అధికారం పోవడం, ఉమ్మడి రాష్ట్రంలో రాష్ట్ర విభజనోద్యమం వంటి పరిణామాలతో భాగస్వామ్య సదస్సులకు ప్రాధాన్యత తగ్గింది. రాష్ట్ర విభజన జరిగి, కొత్త ఆంధ్రప్రదేశ్ కు ముఖ్యమంత్రి కాగానే చంద్రబాబు నాయుడు విశాఖపట్నంలో 2016లో పెద్ద ఎత్తున భాగస్వామ్య సదస్సు మళ్లీ ప్రారంభించి, రు. 4.67 లక్షల కోట్ల విలువైన 328 ఒప్పందాలు కుదిరాయని ప్రకటించారు. ఆ ప్రగల్భాలు కల్లలని తేలిపోతుండగానే, 2017 జనవరి చివరి వారంలో మళ్లీ భాగస్వామ్య సదస్సు నిర్వహించి ఈసారి రు. 10.54 లక్షల కోట్ల విలువైన 665 ఒప్పందాలు కుదిరాయని ప్రకటించారు. ఈ ప్రగల్భాలలో ఏ ఒక్క సంవత్సరం అంకెలు నిజమైనా ఆంధ్రప్రదేశ్ నిండా పరిశ్రమలు నిండి ఉండేవి. ఒక్క నిరుద్యోగి కూడ కనబడి ఉండేవారు కాదు. కాని ఇవన్నీ అబద్ధపు ఒప్పందాలు. ఆ పెట్టుబడులూ లేవు, పరిశ్రమలూ లేవు, ఉద్యోగకల్పనా లేదు. కొన్ని ఒప్పందాలు పచ్చి అబద్ధాలు కాగా, మరికొన్ని కేవలం భూమి, గనులు, ఓడరేవులు, కాంట్రాక్టులు అప్పగించడానికి, రాయితీల పేరుతో ప్రజాధనం దోచిపెట్టడానికి కుదిరిన దొంగల దోపిడీ లావాదేవీలు. నిజంగా పెట్టుబడులు, పరిశ్రమలు వచ్చిన సందర్భంలోనైనా అవి ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థకు చేసే మేలు కన్న, ఆంధ్రప్రదేశ్ నుంచి దోచుకుపోయేది ఎక్కువ. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో అమలు చేసిన వ్యూహాన్నే యథాతథంగా అక్షరం పొల్లుపోకుండా, ఇంకా ఎక్కువగా కూడ, విభజిత ఆంధ్రప్రదేశ్ లో అమలు చేస్తున్నారు. కాకపోతే గతంలో ఆ అబద్ధాలను, అక్రమాలను ప్రశ్నించే, నిలదీసే, ప్రజల్లో వాస్తవాలు ప్రచారం చేసే పౌరసమాజం ఉండింది. ఒకటి రెండు పత్రికలు, ప్రచారసాధనాలైనా ఎప్పుడో ఒకసారైనా నిజాలు ప్రకటించక తప్పేది కాదు. కాని ఇవాళ ఆంధ్రప్రదేశ్ పౌరసమాజపు నిర్లిప్తత, మౌనం, ప్రచార సాధనాల లొంగుబాటు, ప్రశ్నించే గళాల మీద రాష్ట్రమంతటా వ్యాపించిన భయ భీతావహ దమననీతి నిండి ఉన్నాయి. వీ

# అసలు రంగు చూపుతున్న ట్రంప్ విధానాలు

అమెరికా అధ్యక్షుడుగా డొనాల్డ్ ట్రంప్ ఎన్నికైతే ఆంతరంగిక విధానాలలోనూ, విదేశాంగ విధానాలలోనూ ఏయే దుష్పరిణామాలు సంభవిస్తాయని విమర్శకులు, వ్యాఖ్యాతలు అనుమానించారో అవన్నీ అక్షరాలా నిజమవుతున్నాయి. జనవరి 20న పదవీస్వీకారం చేసిన కొన్ని గంటల్లోనే ప్రారంభించి, ఇది రాస్తున్న సమయం దాకా గడిచిన ఐదు వారాలలో ట్రంప్ అమెరికన్ శ్వేత జాతీయోన్మాదాన్ని రెచ్చగొట్టడానికి, కార్పొరేట్లకు వనరులను దోచిపెట్టడానికి, అమెరికాలోని పేదలకు, నల్లజాతి వారికి అందుతున్న సౌకర్యాలు రద్దు చేయడానికి, మెక్సికన్లను, ముస్లింలను, అమెరికాకు వలస వచ్చినవారందరినీ శత్రువులుగా చూపడానికి ఎన్నో చర్యలు తీసుకున్నాడు, తీసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. అధికారం చేపట్టిన కొద్ది గంటల్లోనే, తనకంటె ముందరి ఒబామా ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఆరోగ్య సంరక్షణను, కొత్తగా ఇళ్లు కొనుక్కునే వారికి బీమా రేట్ల తగ్గింపును రద్దు చేశాడు. ఆ తర్వాత ఇతర దేశాల్లో గర్భస్రావాలకు అమెరికా నుంచి అందే సహాయాన్ని రద్దు చేశాడు. ఆసియా దేశాలతో ఉండిన వ్యాపార ఒడంబడిక ట్రాన్స్ పసిఫిక్ పార్ట్‌నర్‌షిప్‌ను ఉపసంహరించాడు. సైనిక, భద్రతా విభాగాలలో తప్ప మిగిలిన అన్ని ప్రభుత్వోద్యోగాల కల్పన మీద ఆంక్షలు విధించాడు. మెక్సికోతో సరిహద్దులో గోడ నిర్మించడానికి ఆదేశాలిచ్చాడు. విదేశాల నుంచి రక్షణ కోసం వచ్చే శరణార్థులకు సౌకర్యాలు కల్పించడాన్ని రద్దు చేశాడు. అమెరికా సైన్యం కొత్త వనరులు, ఆయుధ సంపత్తి సమకూర్చుకోవడానికి అనుమతించాడు. అమెరికాకు వచ్చే విదేశీయుల మీద ఎక్కువ ఆంక్షలు విధించాడు. శరణార్థుల ప్రవేశాన్ని నాలుగు నెలలు రద్దుచేశాడు. 2017లో ఎంతమంది శరణార్థులను తీసుకుంటామో ఆంక్షలు విధించాడు. సిరియా శరణార్థుల ప్రవేశాన్ని నిషేధించాడు. ముస్లిం జనాభా ఎక్కువగా ఉన్న ఏడు దేశాల నుంచి వలసలు నిషేధించాడు. ఈ నిర్ణయాలలో కొన్నిటిని న్యాయస్థానాలు ఆపివేశాయి గాని ట్రంప్ ఉద్దేశాలు బైటపడ్డాయి. న్యాయమూర్తులను విమర్శిస్తూ, తన విధానాన్ని ఎట్లాగైనా కొనసాగిస్తానని ఎన్నికలకు ముందులాగనే అధిక ప్రసంగం చేస్తున్నాడు. పేరుమోసిన ప్రగతి నిరోధకులను, కార్పొరేట్ శక్తులను తన మంత్రివర్గంలో, సలహామండలిలో చేర్చుకున్నాడు. ఇంధన కంపెనీలు తమ ఖాతాలను పారదర్శకంగా ఉంచాలని, బొగ్గు గనుల వ్యర్థ పదార్థాలను నదుల్లో, జలాశయాలలో వదిలి కాలుష్యం సృష్టించ గూడదని ఒబామా ప్రభుత్వం తెచ్చిన నిబంధనలను రద్దు చేశాడు. అధ్యక్ష భవనంలోకి కొన్ని పత్రికల, ప్రచార సాధనాల విలేఖరులను నిషేధించాడు. ఈ చర్యలన్నీ ట్రంప్ అనుకున్నట్టుగా అమలవుతాయా అనేది అనుమానమే. వలసలను నిరోధించే ఉత్తర్వుల ద్వారా అమెరికన్ నిరుద్యోగ యువత భావోద్వేగాలను ఆకర్షించగలడేమో గాని చౌక శ్రామికులను పోగొట్టుకోదలచని కార్పొరేట్ స్వప్రయోజనశక్తులే అందుకు సిద్ధంగా లేవు. అలాగే అమెరికన్ పౌర సమాజం, న్యాయ వ్యవస్థ, ప్రచారమాధ్యమాలు బలంగా ఉన్నాయి. రిపబ్లికన్ భావజాలం నుంచి, ట్రంప్ ఉన్మాదం నుంచి దూరంగా, స్వతంత్రంగా ఉన్నాయి. ఈ అధ్యక్షుడిని మా అధ్యక్షుడిగా గుర్తించం అనే నినాదం దేశవ్యాప్తంగా పెల్లుబుకుతున్నది. కనుక ఈ దూకుడు చర్యలు అనుకున్నట్టుగా జరగకపోవచ్చు. కాని పాలన దిశ ఎటువైపో ఈ చర్యలు చూపుతున్నాయి. వీ





❖ **బోల్షివిక్ పార్టీ చరిత్ర** - అనువాదం: తుమ్మల వెంకట్రామయ్య, సరళీకరణ: సివిఎస్ఆర్ ప్రసాద్, విరసం ప్రచురణ - 519 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 250, ప్రతులకు: డి.వి. రామకృష్ణారావు, ఎంఐజి-14, ఎపిఐఐసి కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి, హైదరాబాద్-500 040; అన్ని ప్రముఖ పుస్తక షాపులు



❖ **నక్సల్బరీ - ఒక ఊరు మాత్రమే కాదు** - అనువాదం: సివిఎస్ఆర్ ప్రసాద్ - విరసం ప్రచురణ - 136 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, ప్రతులకు: పాణి, డోర్ నం. 50-348-1, 19/బి2, సెకండ్ ఫ్లోర్, అరోరా నగర్, బి క్యాంపు (పోస్ట్) కర్నూలు-2; అన్ని ప్రముఖ పుస్తక షాపులు



❖ **సాహిత్యంలో వస్తు రూప శిల్పాలు** - వి. చెంచయ్య - అభినవ ప్రచురణలు - 26 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 40, ప్రతులకు: వి. చెంచయ్య, 10-40-15/ఎ, జనతాపేట నార్త్, కావలి - 524 201; . సెల్: 94406 38035



❖ **తాటక** - నవల - బెజ్జారపు రవీందర్ - పాలపిట్ట బుక్స్ - 144 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ - 500 036; ఫోన్: 040-27678430 ఈమెయిల్: palapittabooks@gmail.com



❖ **సేతువు** - తులనాత్మక సాహిత్య విమర్శ - డా. శిఖామణి - కవిసంధ్య గ్రంథమాల - 96 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 95, ప్రతులకు: కవిసంధ్య గ్రంథమాల, ఫ్లాట్ నం. 61, ఫ్లాట్ నం. 10, సిద్ధార్థ అపార్ట్‌మెంట్స్, సిద్ధార్థనగర్, వెంగళరావు నగర్, హైదరాబాద్-38; సెల్: 9848202526; email:kavisikhamani1956@gmail.com www.sikhamani.com



❖ **తెలంగాణ దర్శిని** - సంకలనం: కోయ చంద్రమోహన్, తంగిరాల చక్రవర్తి - నవ తెలంగాణ పబ్లిషింగ్ హౌస్- 56 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 30, ప్రతులకు: నవ తెలంగాణ పబ్లిషింగ్ హౌస్, ఎంఎచ్ భవన్, ప్లాట్ నం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి భవన్ కళ్యాణ మండపం దగ్గర, హైదరాబాద్ - 20, ఫోన్: 040-27660013; అన్ని ప్రముఖ పుస్తక షాపులు



❖ **శ్రీశ్రీయే ఒక మహాప్రస్థానం** - దివికుమార్ - శ్రీశ్రీ సాహిత్యనిధి - 47 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 40



❖ **శ్రీశ్రీ క్యారికేచర్స్** - శ్రీశ్రీ సాహిత్యనిధి - 31 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 50

పై రెండు ప్రతులకు: శ్రీశ్రీ సాహిత్యనిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతినగర్, విజయవాడ-520 004. ఫోన్: 0866-6617375, సెల్: , 9246277375;



❖ **రైతు ఆత్మహత్యలు - మనం...!?** - సజయ - లిఖిత ప్రెస్ - 266 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 200, ప్రతులకు: వి. రమేశ్‌బాబు, 1-3-183/40/70/501, చంద అపార్ట్‌మెంట్స్, స్ట్రీట్ నం. 9, ఎస్‌బిఐ కాలనీ, గాంధీనగర్, బాకారం, హైదరాబాద్-500080; సెల్: 9505518441 email:likhitapress@gmail.com



❖ **రైతు ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే** - రైతు సేవా సమితి - 296 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: ఎం. శంకర్‌రెడ్డి, ఇ.నం. 3/975/2, సాయినగర్, పరకాల మండలం, వరంగల్-506164; ఫోన్: 9849502681



❖ **కవిత్వంలో ఉన్నంత సేపూ...** - అరణ్య కృష్ణ - నవ్య పబ్లికేషన్స్ - 127 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, ప్రతులకు: నవ్యప్రింటర్స్, దుర్గానగర్ కాలనీ, అంబర్‌పేట్, హైదరాబాద్ - 500 013; సెల్: 9849005343 email:navyaprintershyd@gmail.com అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **అలుగు** - తెలంగాణ కథ - 2015, సంపాదకులు: సంగిశెట్టి శ్రీనివాస్, వెల్దండి శ్రీధర్ - సింగిడి తెలంగాణ రచయితల సంఘం - 112 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60, ప్రతులకు: సంగిశెట్టి శ్రీనివాస్, నందనవనం అపార్ట్‌మెంట్, ఫ్లాట్ నం. 212, అత్తాపూర్, హైదరాబాద్-500048; సెల్: 9849220321; ప్రముఖ వొయ్యిల దుకాండ్లు



❖ **లంద పొద్దు** - తెలంగాణ బహుజన కవిత్వం - గుడిపల్లి నిరంజన్ - పూలే-అంబేద్కర్ అధ్యయన వేదిక ప్రచురణ - 160 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: గుడిపల్లి నిరంజన్, సెల్: 9493319878; email:niranjangudipalli@gmail.com అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **తెలంగాణ విస్మృత వీరుడు కేవల్ కిషన్** - రచన: బెల్లంకొండ సంపత్ కుమార్, సంపాదకులు: సంగిశెట్టి శ్రీనివాస్ - ఫోరమ్ ఫర్ కన్సర్న్‌డ్ బీసీస్ - 48 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 40, ప్రతులకు: ఫోరమ్ ఫర్ కన్సర్న్‌డ్ బీసీస్, ఫ్లాట్ నం. 212, నందనవనం అపార్ట్‌మెంట్, అత్తాపూర్, హైదరాబాద్-500070; సెల్: 9849220321



❖ **చేగువేరా - జీవితం - ఉద్యమం** - కందిమళ్ల ప్రతాపరెడ్డి - నవచేతన పబ్లిషింగ్ హౌస్ - 153 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100



❖ **వీరతెలంగాణ సాయుధ సమరం** - కందిమళ్ల ప్రతాపరెడ్డి - నవచేతన పబ్లిషింగ్ హౌస్ - 237 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 160

పై రెండు పుస్తకాల ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జి.ఎస్.ఐ పోస్టు, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్-500 068, తెలంగాణ ఫోన్ : 040-24224453/54

# నిరుద్యోగుల ఆందోళనపై దమననీతి

***తెలంగాణలో ఉద్యోగకల్పన కోసం ప్రారంభమైన నిరుద్యోగుల ఆందోళన పూర్వాపరాలను, ఆ ఆందోళనపై ప్రభుత్వ నిర్బంధాన్ని వివరిస్తున్నారు ఎన్. వేణుగోపాల్***

ఫిబ్రవరి 22న తెలంగాణ జాయింట్ ఆక్షన్ కమిటీ నేతృత్వంలో తలపెట్టిన నిరుద్యోగ నిరసన ప్రదర్శన తెలంగాణ ప్రజానీకంలో రగులుతున్న ఒక ముఖ్యమైన సమస్యను ఎత్తిపట్టడానికి ప్రయత్నించింది. ప్రభుత్వానికి కనీస ప్రజాస్వామిక దృష్టి ఉండి ఉంటే ఆ ఆందోళనను అర్థం చేసుకుని, ఆందోళనకారులు లేవనెత్తుతున్న సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నించి ఉండేది. కాని ఆ ఆందోళనను అడ్డుకోవడానికి రాష్ట్ర ప్రభుత్వం సామ దాన భేద దండోపాయాలన్నీ ప్రయోగించింది. ఆందోళన ప్రారంభమైన తర్వాత కొన్ని ఉద్యోగ నియామకాల ప్రక్రియ ప్రారంభించి ఎండమావులను ప్రదర్శించి, సమస్యే లేదన్నట్టు ప్రవర్తించింది. సొంత ప్రచార సాధనాలలోనూ, ఇప్పటికే లొంగదీసుకున్న ప్రచారసాధనాలలోనూ, సామాజిక మాధ్యమాలలోనూ ఆందోళనకారుల మీద పచ్చి అబద్ధాలు, దుష్ప్రచారాలు ప్రారంభించింది. ఆందోళనకారులలో కొందరిని కొనివేయడానికి ప్రయత్నించింది.

ప్రభుత్వ విధానాలపై నిరసన తెలిపే పౌరుల ప్రాథమిక హక్కులను కాలరాస్తూ ఆంక్షలు విధించింది. మనుషులు కనబడనిచోట నగర శివార్లలో నిరసన ప్రదర్శన జరుపుకోమని అసాధారణంగా సూచించింది. ప్రదర్శనకు తరలివస్తున్న నిరుద్యోగులను వారి భవిష్యత్తు భగ్నమవుతుందని, కేసుల్లో ఇరుక్కుంటే ఉద్యోగాలు రావని బెదిరించింది. ఇన్ని చేసినా రాష్ట్రవ్యాప్తంగా వేలాది మంది నిరుద్యోగులు, విద్యార్థులు కదులుతున్నారని చూసి జిల్లాలలో నిర్బంధకాండ ప్రయోగించింది. నగరాన్ని చక్రబంధం చేసి, నగరంలో ప్రవేశిస్తున్న వాహనాలన్నిటినీ తనిఖీ చేసి భయోత్పాతం సృష్టించింది. జెఎసి అధ్యక్షుడు కోదండరాం ఇంటిమీద అర్ధరాత్రి దాడిచేసి, తలుపులు పగులగొట్టి, అరెస్టు చేసింది.

నగరంలో ఊరేగింపు జరపతలపెట్టిన సుందరయ్య విజ్ఞాన కేంద్రం నుంచి ఇందిరా పార్క్ వరకూ అడుగడుగునా ఖాకీలమయం చేసి, మూడు కిలోమీటర్ల దారిలో పదిహేనువేల మంది పోలీసులను దింపి, వందలాది మంది ఆందోళన కారులను, చివరికి ఏ సంబంధమూ లేని పాదచారులను కూడ అరెస్టు చేసింది. ఆందోళనను అడ్డుకోవడానికి ఇలా సర్వశక్తులనూ ప్రయోగించిన ప్రభుత్వమూ, దాని వందిమాగధులూ ఆందోళన విఫలమయిందని ఇల్లెక్కి అరవడం క్రూరమైన పరిహాసం. ఈ చర్యలన్నీ కూడ ఒక కఠోర సామాజిక వాస్తవం పట్ల పాలకుల అవగాహనా రాహిత్యానికి, అసహనానికి అద్దం పడుతున్నాయి.

ఒక ప్రజా సమూహం తమ సమస్య మీద ఆందోళన చేయడం, ప్రభుత్వం దృష్టికీ, సమాజం దృష్టికీ ఆ సమస్య తీసుకురావడానికి ఒక ప్రదర్శన నిర్వహించాలనుకోవడం కొత్త విషయం కాదు. ఆ సమస్య న్యాయమైనదైనా కాకపోయినా, ఎక్కువమందికి సంబంధించినదైనా తక్కువమందికి సంబంధించినదైనా పట్టించుకోవడం, దానితో ప్రజాస్వామికంగా వ్యవహరించడం, చర్చ ద్వారా, సంప్రదింపుల ద్వారా పరిష్కారానికి ప్రయత్నించడం ప్రజాస్వామ్య ప్రభుత్వపు బాధ్యత. కాని బలప్రయోగం ద్వారా అన్ని సమస్యలనూ, సమస్యల ప్రస్తావనలనూ, ఆందోళనలనూ అణచిపెట్టి, శ్మశానశాంతిని స్థాపించి అదే అభివృద్ధి అనీ, శాంతి అనీ గొప్పలు చెప్పుకోవడానికే తెలంగాణ ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది.

నిజంగానే తెలంగాణలో నిరుద్యోగ సమస్య లేదా? తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమమే జయశంకర్ మాటల్లో చెప్పాలంటే నీళ్లు, నిధులు, నియామకాల కోసం జరిగినది. అంటే తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షకు మూలభూతమైన మూడు అంశాలలో అది ఒకటి. ఆ ఆకాంక్షతో గద్దెనెక్కిన ప్రభుత్వం ఆ మూడు అంశాలనూ మూడు రకాలుగా పక్కదారి పట్టిస్తున్నది.

నీళ్ల పేరు చెప్పి, నీళ్ల గురించి తెలంగాణ ప్రజల్లో, రైతాంగంలో ఉన్న భావోద్వేగాలను దుర్వినియోగం చేస్తూ, రిడిజైన్ ప్రహసనాలతో అన్ని ప్రాజెక్టుల వ్యయాన్ని రెండు మూడు రెట్లు పెంచి మరొక జలధన యజ్ఞాన్ని తయారు చేస్తున్నది. ఈ జలధనయజ్ఞంలో మళ్లీ పాత ఆంధ్రప్రదేశ్ కాంట్రాక్టర్లే, ఉద్యమకాలంలో విపరీతమైన ఆరోపణలకు లక్ష్యాలుగా ఉండిన కోస్తా, రాయలసీమ కాంట్రాక్టర్లే కొనసాగుతున్నారు. పాలకపార్టీకి 2019 ఎన్నికల నిధులకు ప్రధాన వనరు ఈ రిడిజైనింగ్ వ్యయ అంచనాల పెరుగుదలే అని పుకార్లు చెలరేగుతున్నాయి.

నిధుల విషయంలో పేరుకు లక్ష కోట్ల రూపాయల, లక్షా ఇరవై కోట్ల రూపాయల బడ్జెట్ అని గొప్పలు చెప్పుకుంటున్నప్పటికీ, నిధుల కేటాయింపులలో సగమో పావో ఖర్చు పెట్టని స్థితి ఉంటున్నది. రాష్ట్రం ఏర్పడిన నాడు అరవై వేల కోట్ల రూపాయలు ఉన్న రుణభారం రెండున్నర సంవత్సరాలలోనే రెట్టింపు అయి లక్షా ఇరవై వేల కోట్ల రూపాయలు దాటిపోయింది.

నీళ్లు, నిధుల నిర్వాకం అలా ఉండగా ఆ రెండూ ప్రధానంగా కొద్ది మందికి సంబంధించిన, కొద్దిమందికి తెలిసిన విషయాలుగా ఉండిపోయాయి. నీళ్ల విషయంలో లక్షలాది మంది రైతులకు సంబంధం ఉన్నప్పటికీ వారి భావోద్వేగాలను రెచ్చగొట్టడానికి, ఎప్పుడో నీళ్లువస్తాయనే వాగ్దానాలకు తప్ప నిజంగా వారికి అందులో సంబంధం లేదు.

కాని, మూడో అంశమైన నియామకాలు అటువంటి కొద్దిమందికి సంబంధించిన, నిగూఢమైన వ్యవహారం కాదు. అసలు నియామకాలు, ఉద్యోగకల్పన, నిరుద్యోగం అనే అంశాలే 1952 ముల్కీ ఆందోళన నాటి నుంచి కూడ తెలంగాణ విద్యావంతులను, నిరుద్యోగులను వేధిస్తున్న, ఉద్యమాలవైపు తోసిన, తోస్తున్న అంశాలు. తెలంగాణ ఆంధ్రరాష్ట్రంతో కలిసి ఆంధ్రప్రదేశ్ ఏర్పడడానికి కారణమైన పెద్దమనుషుల ఒప్పందంలో ఉద్యోగాలలో తెలంగాణవారికి న్యాయమైన వాటా ఇవ్వాలని నిబంధనలున్నాయి. ఆ నిబంధనల ఉల్లంఘన

జరిగిందనే కారణం మీదనే 1969 ఉద్యమం వచ్చింది. అప్పుడు ఆ ఉద్యమంలో ప్రధానంగా ఉద్యోగులు, నిరుద్యోగులు, విద్యార్థులు పాల్గొన్నది నియామకాల సమస్య వల్లనే. ఆ తర్వాత రాష్ట్రపతి ఉత్తర్వులు, జైభారత్ రెడ్డి కమిటీ, 610 జీవో, గిర్ గ్లాని కమిషన్ అన్నీ కూడ తెలంగాణ నిరుద్యోగ సమస్య వల్లనే. 1996 నుంచి 2014 దాకా సాగిన ఉద్యమంలో నిరుద్యోగులు ఎక్కువగా పాల్గొన్నది స్వరాష్ట్రంలో నిరుద్యోగ సమస్య పరిష్కారం అవుతుందనే ఆశతోనే.

ఈ సమస్యకు మరొక కోణం కూడ ఉంది. పెద్దమనుషుల ఒప్పందం ఉల్లంఘనతో ప్రారంభించి అప్పటి ఆంధ్రప్రదేశ్ పాలకులు ప్రధానంగా తెలంగాణకు దక్కవలసిన ప్రభుత్వోద్యోగాలలో కోస్తా, రాయలసీమ వాసులను చేర్చుకుంటూ వచ్చారు. రాష్ట్రపతి ఉత్తర్వులలో ఇచ్చిన మినహాయింపులకు వక్రభాష్యాలు చెప్పి తెలంగాణవాసులకు దక్కవలసిన ఉద్యోగాలు కొల్లగొట్టారు. చంద్రబాబు నాయుడు పాలనా కాలం తర్వాత అసలు ప్రభుత్వోద్యోగాల నియామకాల మీద నిషేధం విధించారు. కాంట్రాక్ట్, ఔట్ సోర్సింగ్ పేరిట ఇష్టారాజ్యంగా ప్రభుత్వోద్యోగాల పందారం సాగించారు. ఈ అన్ని అక్రమాల వల్ల అప్పటి పన్నెండు లక్షల రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులలో తెలంగాణకు విస్తీర్ణం రీత్యానైనా, జనాభా రీత్యానైనా దక్కవలసిన ఐదు లక్షల ఉద్యోగాల స్థానంలో రెండు, రెండున్నర లక్షల మంది తెలంగాణ బిడ్డలకు మాత్రమే పాలకులు ఉద్యోగాలు ఇచ్చారు. పన్నెండు లక్షల రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగాలలో తెలంగాణ బిడ్డలు 1,87,000 మంది మాత్రమేనని, అంటే తెలంగాణకు దక్కవలసిన మూడు లక్షల ఉద్యోగాలను పాలకులు ఆంధ్ర ప్రాంతీయులకు కట్టబెట్టారనీ కూడ అప్పటి ఉద్యోగ నాయకులు రాశారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే మన ఉద్యోగాలు మనకు వస్తాయనీ, అంటే రెండు, రెండున్నర, మూడు లక్షల ఉద్యోగాలకు అవకాశం వస్తుందనీ ఉద్యమ నాయకులందరూ అన్నారు.

తెలంగాణ బిడ్డలకు దక్కవలసిన రెండు, రెండున్నర, మూడు లక్షల ప్రభుత్వోద్యోగాలు అని ఉద్యమకాలంలో చెపుతుండిన అంకె రాష్ట్ర విభజన తర్వాత క్రమక్రమంగా కుంచించుకుపోతూ, కనుమరుగవుతూ వచ్చింది. చివరికి 2014 నవంబర్ 24న అధికారికంగా శాసన సభావేదిక మీద ముఖ్యమంత్రి 'రానున్న రెండు సంవత్సరాలలో 1,07,744 ఉద్యోగాలు ఇస్తాం' అని ప్రభుత్వోద్యోగ నియామకాల సంఖ్యను స్థిరపరిచారు. ఆ అంకెనే కాస్త అటూ ఇటూగా ముఖ్యమంత్రి, ఇతర మంత్రులు, అధికారులు ఆ తర్వాత రెండు సంవత్సరాల్లో ఎన్నోసార్లు ప్రకటించారు. కాని కాలక్రమంలో జరిగిన నియామకాల, నోటిఫికేషన్ల వాస్తవ గణాంకాలు పూర్తిగా భిన్నంగా ఉన్నాయి. తెలంగాణ రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ ను ఏర్పాటు చేయడం, అది పరీక్షలకు పాఠ్యాంశాలను తయారు చేసి, ప్రభుత్వం అనుమతించిన ఉద్యోగాలకు నోటిఫికేషన్లు ఇవ్వడం, పరీక్షలు నిర్వహించడం అనే తతంగం సుదీర్ఘంగా సాగుతున్నది. స్పష్టంగా కనబడుతున్న ఖాళీలు నింపడానికి కూడ ప్రభుత్వం అనుమతించడం లేదు. మరొకవైపు ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టం 2014 ప్రకారం రెండు రాష్ట్రాల ఉద్యోగ విభజన చిక్కుముడిగా మారింది. ఉద్యోగుల విభజన కోసం నియామకమైన షీలా భిడే కమిటీ, సి ఆర్ కమలనాథన్ కమిటీలు తమ పని చేయడం కన్న ఎక్కువగా ప్రభుత్వానికి సాకుగా పనికి వచ్చాయి. కేవలం తొమ్మిదో షెడ్యూల్‌లో ఉన్న సంస్థల ఉద్యోగులను విభజించే పని, అంటే దాదాపు కొన్ని వేల ఉద్యోగాలను విభజించే పని చేయవలసిన షీలా భిడే కమిటీ ఇప్పటికి నాలుగు పదవీకాల పొడిగింపులతో ఆ పని చేయనేలేదు. కేవలం 51 వేల రాష్ట్ర స్థాయి ఉద్యోగులను మాత్రమే విభజించవలసిన కమలనాథన్ కమిటీ ఆ పనికి రెండున్నర సంవత్సరాలు తీసుకుంది, నిజానికి ఈ రెండు కమిషన్ల వివాదంలో ఉన్న ఉద్యోగాలు కాక తెలంగాణకు రావలసిన ఉద్యోగాలు కనీసం రెండు లక్షలు ఉంటాయి. వాటి ఊసెత్తకుండా, మాట మాట్లాడితే ఈ కమిషన్ల చిక్కు చూపెడుతూ ప్రభుత్వం పబ్బం గడుపుకుంటూ వచ్చింది.

శాసనసభలో ముఖ్యమంత్రి వాగ్దానం చేసిన ఉద్యోగాలలో కూడ వాస్తవంగా అమలయినవి చాల తక్కువ. తెలంగాణ రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ నియామక ఉత్తర్వులు ఇచ్చినవి 4,295. సింగరేణి, విద్యుత్ వంటి సంస్థలలో కొత్త నియామకాలు గాని, కాంట్రాక్టుల క్రమబద్ధీకరణ గాని జరిగిన ఉద్యోగాలు 7,181. పోలీసు శాఖ పరీక్ష జరిగి చాల కాలం అయ్యాక, ప్రస్తుత ఆందోళన నేపథ్యంలో ఫలితాలు ప్రకటించినవి 10,500. పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఫలితాలు రావలసినవి 1,645. రాష్ట్ర ప్రభుత్వ అనుమతి కోసం ఎదురుచూస్తూ పబ్లిక్ సర్వీస్ కమిషన్ త్వరలో నోటిఫికేషన్ విడుదల చేస్తుందని ఆశిస్తున్న ఉద్యోగాలు 3,400. వివాదంలో పడి, ఆగిపోయిన గురుకులాల ఉపాధ్యాయుల సంఖ్య 7,300. అంటే మొత్తంగా జరిగిన నియామకాలు, చివరిదశలో ఉన్న నియామకాలు అన్నీ కలిపి 22 వేలు. సమీప భవిష్యత్తులో ప్రకటించనున్న ఉద్యోగాలు 12 వేలు.

తెలంగాణలో నిరుద్యోగ సమస్యకు ఉన్న సుదీర్ఘ చారిత్రక నేపథ్యం వల్ల తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వానికి ప్రప్రథమ ప్రాధాన్యత ఉద్యోగ కల్పన మీద ఉండవలసింది. అలా లేకపోగా, నిరుద్యోగ సమస్యను పరిష్కరించ డానికి రెండున్నర సంవత్సరాల పాటు తాత్సారం చేసి, అరకొర పనులు చేసిన ప్రభుత్వం నిరుద్యోగులలో ఆందోళన తలెత్తినప్పుడు కూడ ఆ సమస్య పరిష్కారం వైపు ఆలోచించకుండా, ఆ ఆందోళనను అణచివేయ డానికి ప్రయత్నాలు ప్రారంభించింది. ప్రభుత్వ సమర్థకులు కొందరైతే అసలు నిరుద్యోగ సమస్యే లేదని, తెలంగాణ ప్రభుత్వం ఇబ్బడి ముబ్బడిగా ఉద్యోగాలు కల్పించిందని, ఈ ఆందోళన రాజకీయ నిరుద్యోగుల సృష్టి అని పచ్చి అబద్ధాలు ప్రచారం చేయడం మొదలుపెట్టారు.

తెలంగాణలో ఎందరు నిరుద్యోగులున్నారో, ప్రభుత్వం గత రెండున్నర సంవత్సరాల్లో ఉద్యోగాలు కల్పించిందో, ఎన్ని ప్రైవేటు రంగ ఉద్యోగాల కల్పనకు అవకాశాలు ఇచ్చిందో తేల్చడం అంత కష్టమైన విషయమేమీ కాదు. కాని అంత సులభమైన విషయాలను కూడ ప్రభుత్వం, ప్రభుత్వ సమర్థకులు జటిలంగా మార్చివేశారు. నిజంగానే నిరుద్యోగం సమస్య కాకపోతే, ప్రభుత్వం ఎన్నో ఉద్యోగాలు కల్పించి ఉంటే, ప్రైవేట్ పెట్టుబడులను ఆకర్షించి మరిన్ని ఉద్యోగాలు కల్పించి ఉంటే ఆ లెక్కలను సమాజం ముందుపెట్టి ప్రత్యర్థుల వాదనలను ఓడించవచ్చు. నిజంగానే ప్రత్యర్థులు రాజకీయ నిరుద్యోగంతో తప్పుడు ఆరోపణలు చేస్తూ ఉంటే వాటిని ఖండించవచ్చు. రాష్ట్రమంతా సమగ్ర సామాజిక సర్వే చేసి, మూడున్నర కోట్ల మంది వివరాలు ఒక్కరోజులో సేకరించగలిగిన మహా శక్తిసామర్థ్యాలు ఉన్నాయని గొప్పలు చెప్పుకున్న ప్రభుత్వం తన దగ్గర ఉన్న వనరులతో ఈ లెక్కలు బైటపెట్టి, ప్రత్యర్థుల నోళ్లు కట్టి ఉండవచ్చు. కాని వాస్తవమేమంటే ఆ పని చేస్తే ప్రభుత్వమే అబద్ధాలు చెపుతున్నదని, ప్రభుత్వం నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి చేయవలసినంత చేయలేదని తేలిపోతుంది. అందువల్ల ప్రత్యర్థుల మీద తిట్లూ నిందలూ అబద్ధపు ఆరోపణలూ చేస్తూ, నిరుద్యోగం గురించీ, ఉద్యోగకల్పన గురించీ తప్పుడు లెక్కలు ఇవ్వడం మొదలుపెట్టింది.

రాష్ట్ర ప్రభుత్వపు తాజా స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్ట్ 2014 నాటి, రాష్ట్ర విభజన నాటి గణాంకాలు ఇస్తుంది. కేంద్ర ప్రభుత్వ మంత్రిత్వ శాఖలు కూడ 2014 చివరి గణాంకాలనే ఇస్తున్నాయి. ఆ గణాంకాల ప్రకారం రాష్ట్రంలో ఎంప్లాయిమెంట్ ఎక్స్ చేంజిల్లో నమోదు చేసుకున్న విద్యావంతుల సంఖ్య పది లక్షల పైన. ఎంప్లాయిమెంట్ ఎక్స్ చేంజిల్లో నమోదు చేసుకోని నిరుద్యోగులు కూడ గణనీయంగా ఉంటారు గనుక ఈ అంకె కన్న వాస్తవ నిరుద్యోగుల సంఖ్య చాల ఎక్కువగా ఉండవచ్చు. తెలంగాణ రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఏర్పడి ఉద్యోగ నియామకాల నోటిఫికేషన్లు వెలువరించడం మొదలయ్యాక నిరుద్యోగులు దాని దగ్గర నమోదు చేసుకోవడం ప్రారంభించారు. అలా నమోదు చేసుకున్న నిరుద్యోగుల సంఖ్య పదమూడు లక్షల యాభైవేలు. ఇక్కడ కూడ నమోదు కాని నిరుద్యోగులు, పదో తరగతి పాసయ్యో, ఫెయిలయ్యో చదువు ఆపిన నిరుద్యోగుల సంఖ్య మరెంతో ఉంటుంది. వ్యవసాయ రంగంలో అవసరమైన శ్రామిక జనాభాకన్న ఎక్కువ పనిచేస్తున్నట్టయితే దాన్ని ప్రచ్ఛన్న నిరుద్యోగం అంటారు. అటువంటి నిరుద్యోగులు లక్షలాది మంది ఉంటారు. విద్యార్హతలతో సంబంధం లేకుండా, ఏదో ఒక ఉపాధి ఉంటే చాలుననుకుని చాలీచాలని చిరుద్యోగాలు చేస్తున్నవారిని కూడ నిజానికి నిరుద్యోగుల కిందనే లెక్కకట్టవలసి ఉంటుంది. ఈ అన్ని వర్గాల నిరుద్యోగుల సంఖ్యలనూ కలిపితే తెలంగాణలో కనీసం ముప్పై నుంచి నలభై లక్షల మంది నిరుద్యోగులున్నా ఆశ్చర్యం లేదు. తెలంగాణ జనాభాలో ఉద్యోగం చేయగల వయసులో ఉన్నవారి సంఖ్య రెండు కోట్ల ఇరవైలక్షల మంది కాగా అందులో ఐదోవంతు నిరుద్యోగులు న్నారన్న మాట. అంటే తెలంగాణ సమాజం ముందర నిరుద్యోగ సమస్య చాల తీవ్రమైన, భయానకమైన, విస్ఫోటకమైన స్థాయిలో ఉందని అర్థం.

నిజానికి ఇలా అంకెల్లో కూడ చూడనక్కరలేదు. తెలంగాణ సమాజం కళ్లముందర నిరుద్యోగం కనబడుతున్నది. ప్రతి ఇంట్లో కాకపోయినా, కనీస మూడిళ్లకు రెండు ఇళ్లలో నిరుద్యోగం ఉన్నది. స్వరాష్ట్రం వస్తే ఈ నిరుద్యోగ సమస్య తగ్గుతుందని తెలంగాణ సమాజం భావించింది. తగ్గిస్తామని రాజకీయ నాయకత్వం వాగ్దానాలు చేసింది. అందువల్లనే ఉద్యోగ కల్పన ఎంత జరిగిందనే అంశం ఇవాళ ఇంత చర్చనీయాంశం అవుతున్నది. ఎన్ని ప్రభుత్వోద్యోగాలు కల్పించామో లెక్క చెప్పడం అసాధ్యమైన విషయమేమీ కాదు. పబ్లిక్ సర్వీస్ కమిషన్ నోటిఫికేషన్లు, నియామకాలు, ఆయా శాఖల నియామకాలు అన్నీ బహిరంగంగా, పారదర్శకంగా జరిగినవే, జరగవలసినవే. జరిగినదాన్ని ఎవరూ దాచిపెట్టలేరు, జరగనిదాన్ని ఎవరూ చూపెట్టలేరు. అలా అందరికీ తెలిసిన ప్రభుత్వోద్యోగాలలో అబద్ధాలు చెప్పడం సాధ్యం కాదు గనుక, 'అందరూ ప్రభుత్వోద్యోగాలు కావాలంటే ఎలా' అని ప్రభుత్వ సమర్థకులు నిలదీస్తున్నారు. "ఈ ప్రభుత్వం చేపట్టిన చర్యల వల్ల ఎన్నో పెట్టుబడులు, పరిశ్రమలు, సంస్థలు వచ్చి, ఎన్నో ఉద్యోగాలు వచ్చాయి' అని వాదిస్తున్నారు. ప్రైవేట్ రంగ ఉద్యోగ కల్పన ఒక మాయ. ఎక్కడా కచ్చితమైన గణాంకాలు దొరకవు. "ఇన్ని వందల వేల కోట్ల పెట్టుబడితో పరిశ్రమ, వ్యాపార సంస్థ ఏర్పాటు చేస్తున్నాం, ఇన్ని ఉద్యోగాలు వస్తాయి" అని ప్రైవేట్ కంపెనీలు చేసే ప్రకటనల్లో పావు వంతు కూడ నిజం కావు. ఆ ప్రగల్భాలతో వారు భూములు, రాయితీలు, పన్ను మినహాయింపులు, బ్యాంకు రుణాలు పొందుతారు గాని ఆ ఉద్యోగ కల్పన మాత్రం జరగదు. ఉద్యోగ కల్పన విషయంలో ప్రభుత్వమే తన కర్తవ్యాన్ని ఇంత మహత్తరంగా నిర్వహిస్తున్నప్పుడు, ప్రైవేట్ రంగ ఉద్యోగ కల్పన మరెంత మహత్తరంగా ఉంటుందో ఎవరైనా ఊహించవచ్చు. తమ ప్రోత్సాహం వల్ల తెలంగాణలో ప్రవేశించిన భారీ పెట్టుబడులు రెండు లక్షల యాభై ఎనిమిది వేల ఉద్యోగాలు కల్పించాయని ఒక మంత్రి అన్నారు. కాని నిరుద్యోగుల ఆందోళన తీవ్రతరమయ్యాక ప్రభుత్వ అధికార పత్రిక ప్రైవేటు రంగంలో జరిగిన ఉద్యోగ కల్పన 43 వేలు అని రాసింది. అది 2.58 లక్షలైనా, 43 వేలు అయినా, ప్రైవేటు రంగ పరిశ్రమలు తెలంగాణ నిరుద్యోగ సమస్యను తీర్చడానికి ఎంత ప్రయత్నించాయి అనేది అసలు ప్రశ్న. ఈ అంకెలు నిజమే అనుకున్నా, ప్రభుత్వోద్యోగమూ ప్రైవేట్ ఉద్యోగమూ ఒకటి కావు. ప్రభుత్వోద్యోగంలో ఉన్న ఉద్యోగ భద్రత, గౌరవనీయమైన పనిపరిస్థితులు, విరమణానంతర సదుపాయాలు ప్రైవేట్ ఉద్యోగంలో ఉండవు. ప్రభుత్వోద్యోగాలలో రాజ్యాంగబద్ధంగా మహిళలకు, దళిత, ఆదివాసి, మైనారిటీ, వెనుకబడిన కులాల అభ్యర్థులకు ఉండే ప్రాధాన్యత ప్రైవేట్ ఉద్యోగాలలో ఉండదు. ప్రైవేట్ ఉద్యోగం కల్పించేవారు తమ లాభాల కోసం పరిశ్రమలు, వ్యాపారాలు ఏర్పాటు చేస్తారు గాని సామాజిక శ్రేయస్సు కోసం, ఉద్యోగ కల్పన కోసం కాదు. మరొకచోట లాభాలు ఎక్కువ వస్తాయంటే డేరా ఎత్తుకుని, ఉద్యోగులను గాలికి వదిలి పోతారు. ఇక్కడి వనరులను కొల్లగొట్టి, సొంత లాభాలు చేసుకునే ప్రైవేటు వ్యాపారస్తులు ఇక్కడి భూమిపుత్రులకే ఉద్యోగాలు ఇవ్వాలన్న నిబంధన ఏమీ లేదు. అంటే తెలంగాణ ఉద్యమంలో ప్రజలు, నిరుద్యోగ యువజనులు, విద్యార్థులు ఆకాంక్షించిన ఉద్యోగకల్పన ప్రైవేటు ఉద్యోగాల ద్వారా జరగడం అసాధ్యం.

తెలంగాణలో నిరుద్యోగానికి, నియామకాలకు సంబంధించి మరొక అంశం ఉంది. గత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు తెలంగాణలో మూసివేసిన, కారుచౌకగా ఆశ్రితులకు కట్టబెట్టిన ప్రభుత్వరంగ సంస్థలను, పరిశ్రమలను పునరుద్ధరించి ఆ నిరుద్యోగులకు మళ్లీ ఉద్యోగాలు కల్పించడం, కొత్త ఉద్యోగాలు కల్పించడం జరగాలని ఉద్యమం ఆశించింది. అప్పుడు ఉద్యమనాయకులు ఆ వాగ్దానాలు చేశారు. కాని తెలంగాణ ప్రభుత్వం ఆ మూసివేసిన పరిశ్రమల్లో ఒక్కదాన్నయినా తెరిపించడానికి ప్రయత్నించలేదు. కొత్తగా ఉద్యోగ కల్పన కోసం, రాష్ట్ర ప్రభుత్వ ఆదాయం కోసం, సొంత వనరులతో రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేయడం కోసం కొత్తగా ప్రభుత్వ రంగ పరిశ్రమలు స్థాపించే ఆలోచనలు చేయలేదు. పైగా ఈ రెండు సంవత్సరాలలో కనీసం నాలుగు ప్రైవేటు, సంయుక్త రంగ పరిశ్రమలు మూతపడి, పదివేల మంది ఉద్యోగులు వీధిన పడితే, ఆ కార్మిక సంఘాల నాయకులు మంత్రులు కూడ అయి ఉండి, మూసివేతలకు వ్యతిరేకంగా ప్రభుత్వం వీసమెత్తు ప్రయత్నాలు చేయలేదు.

నిరుద్యోగ సమస్యను తీర్చడానికి, తగ్గించడానికి, తెలంగాణ ఉద్యమ ఆకాంక్షల్లో ప్రధానమైన నియామకాల సమస్యను పరిష్కరించడానికి తాను రెండున్నర సంవత్సరాల్లో ఏమీ చేయలేదని తెలంగాణ ప్రభుత్వానికి పూర్తిగా తెలుసు. అందువల్లనే ఆ సమస్య ప్రస్తావనకు వస్తే దానికి అంతగా ఆగ్రహం, అసహనం కలుగుతున్నాయి. అందువల్లనే ఆ ఆందోళన వినబడగూడదని అంత దౌర్జన్యానికి, దమననీతికి పూనుకుంటున్నది. అయితే ఎంత నల్లని కారు మేఘాలు కప్పినా సూర్యకాంతి లాంటి వాస్తవాన్ని కనబడకుండా చేయడం అసాధ్యం. వీ

*(రచయిత వీక్షణం సంపాదకులు)*

# సంస్కరణల బడ్జెట్ 2017-18

**బడ్జెట్‌లో వ్యవసాయ, గ్రామీణాభివృద్ధికే ప్రాధాన్యమిస్తున్నామని చెప్పినా కేటాయింపులు మాత్రం అంతంత మాత్రంగానే ఉన్నాయని, కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలకే అధిక ప్రాధాన్యత ఇచ్చారని అంటున్నారు ఎ. నర్సింహా రెడ్డి**

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాల అమలు మొదలైన తర్వాత, ప్రణాళికాబద్ధ ఆర్థికాభివృద్ధిని వదిలి కేంద్రబడ్జెట్‌ను ఒక తంతుగా, సంప్రదాయకంగా ప్రవేశపెట్టడం, ప్రతిపక్షాల అభ్యంతరాలు, గందరగోళం మధ్యనే ఆర్థికమంత్రి ప్రసంగం సాగడం, అనంతరం బడ్జెట్ ఆమోదించడం మామూలుగా సాగుతోంది. బడ్జెట్ వల్ల కొన్ని వస్తువుల ధరలు పెరగడం, కొన్ని వస్తువుల ధరలు తగ్గడం కూడా సర్వ సాధారణమే. సామాజికంగా వెనుకబడిన వర్గాల ఉద్ధరణకు గాని, వ్యవసాయరంగ అభివృద్ధికి గాని, రైతాంగ క్షేమం కొరకు గాని, ప్రజల ఆకలి, పేదరికం నిర్మూలించడానికి గాని, ఉపాధి కల్పనకు గాని, అతి ప్రధానమైన విద్యా వైద్య రంగాలకు గాని కేటాయింపులు కంటి తుడుపుగానే ఉంటున్నాయి. ఇన్ని సంవత్సరాలుగా ప్రవేశపెట్టిన బడ్జెట్‌లను పునరావలోకనం చేసుకున్నట్లయితే సంపన్నులకు మాత్రమే ప్రయోజనం చేకూరే విధంగా పాలకులు బడ్జెట్లను రూపొందించిన విషయం మనకు విదితమవుతుంది. కేంద్ర ఆర్థిక మంత్రులుగా ఎవరున్నప్పటికీ ఎంతో కసరత్తు చేసి, అంకెల గారడీ, మాటల దాంబికం ప్రదర్శించడం ఆనవాయితీగా వస్తున్నది.

కేంద్ర ఆర్థికశాఖా మంత్రి అరుణ్‌జైట్లీ 2017-18 ఆర్థిక సంవత్సరానికి ఫిబ్రవరి ఒకటిన పార్లమెంటులో ప్రవేశపెట్టిన కేంద్ర బడ్జెట్ కోట్లాది ప్రజల మౌలిక అవసరాలను విస్మరించి కార్పొరేట్ పెద్దలను, కొద్ది మంది మదుపరుల మనసులను దోచుకునే విధంగా, వారికి మరిన్ని ఆర్థిక ప్రయోజనాలు చేకూర్చే విధంగా ఉంది. దేశ భవితకు బాటలు వేసే బడ్జెట్ అని ప్రధానమంత్రి నరేంద్ర మోడీ వ్యాఖ్యానించినప్పటికీ, వాస్తవానికి అది తేనెపూసిన కత్తిలా ఉంది. సుమారు రు. 21.46 లక్షల కోట్ల కేంద్ర బడ్జెట్ ప్రవేశపెడితే, అందులో ఆమ్ ఆద్మీకి పాతర వేశారని గణాంకాలు చెప్పకనే చెబుతున్నాయి. సామాజిక రంగాలకు బడ్జెట్‌లో కేటాయించింది రు. 4,92,625 కోట్లు. అంటే జిడిపిలో 2.92 శాతం మాత్రమే. 2016-17కు సవరించిన వ్యయం రు. 20.14 లక్షల కోట్లతో పోల్చితే 2017-18 బడ్జెట్లో మొత్తం వ్యయం స్వల్పంగా 6.6 శాతం పెరిగింది.

జిడిపిలో బడ్జెట్ సైజు పెరిగిందా అంటే అదీ లేదు. 2016-17 బడ్జెట్ జిడిపిలో 13.4 శాతం కాగా వచ్చే ఏడాదికి ప్రవేశపెట్టిన బడ్జెట్ 12.7 శాతానికి తగ్గింది. అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ఆదేశించిన స్థాయికి ద్రవ్యలోటును తగ్గించుకొనేందుకు బడ్జెట్ వ్యయాన్ని తగ్గించడంతో అంతిమంగా ప్రజల సంక్షేమానికి కోతలు పడతాయి. ఈ వాస్తవాలకు తన ఆర్భాటపు వాగాడంబరంతో జైట్లీ మసిపూసి మారేడుకాయ చేయజూస్తున్నారు. ద్రవ్యలోటును మూడు శాతానికి మించకుండా చూస్తానని సవాల్ చేసిన అరుణ్‌జైట్లీ ఈ బడ్జెట్‌లో దాన్ని 3.2 శాతంగా సవరించారు. వృద్ధిరేటును రెండేళ్లలో 8 నుంచి 10 శాతానికి తీసుకువెళ్లామని తొలుత ప్రకటించిన మోడీ సర్కారు ఇప్పుడు ఏడు శాతానికి తీసుకెళ్లే స్థితిలో కూడా లేదు. వచ్చే ఏడాది ఇంకెంత తగ్గిస్తుందో వారికే తెలియాలి. బడ్జెట్ కుంచించుకుపోతుంటే వృద్ధిరేటు పెరుగుతుందని చెప్పడం ఒక దగా. మధ్యతరగతి, ఎగువ మధ్య తరగతి ప్రజానీకం నుంచి రకరకాల రూపాల్లో సెస్‌లు, సేవా పన్నులతో 75 వేల కోట్లు పిండుకునే వ్యూహం బడ్జెట్‌లో కనిపిస్తోంది. పెద్దనోట్ల రద్దు తర్వాత తొలి బడ్జెట్ కావడంతో దీనిలో కొన్ని నిర్దిష్ట చర్యలు ఉంటాయని భావించినవారికి పూర్తి నిరాశే మిగిలింది. పెద్ద నోట్ల రద్దు వల్ల ప్రత్యక్షంగా దెబ్బతిన్న వర్గాలకు ఉపశమనం కల్పించక పోవడం శోచనీయం.

**కేంద్ర బడ్జెట్ 2017-18** (రూ.కోట్లలో)

| | 2016-17 బ.ప్రతిపాదన | 2016-17 స.అంచనా | 2017-18 బ.ప్రతిపాదన |
|---|---|---|---|
| రెవెన్యూ జమలు | 13,77022 | 14,23562 | 15,15,771 |
| పెట్టుబడి జమలు | 6,30,964 | 5,90,845 | 6,30,964 |
| మొత్తం జమలు | 19,78,060 | 20,14,407 | 21,46,735 |
| పథకాల వ్యయం | 8,01,966 | 8,69,847 | 9,45,078 |
| ఇతర వ్యయాలు | 1,17,6094 | 11,44,560 | 12,01,657 |
| మొత్తం వ్యయం | 19,78,060, | 20,14,407 | 21,46,735 |
| ఆర్థిక లోటు | 3,54,015 | 3,10,998 | 3,21,163 |
| ద్రవ్య లోటు | 5,33,904 | 5,34,274 | 5,46,532 |
| ప్రాథమిక లోటు | 41,234 | 51,205 | 23,454 |

ఈసారి ప్రవేశపెట్టిన బడ్జెట్‌కు ఒక ప్రత్యేకత ఉంది. మోడీ ప్రభుత్వం ఉనికిలో ఉన్న కీలకమైన సంస్థలను రద్దు చేసి తనకు నచ్చిన విధంగా ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేస్తున్నది. ప్రణాళికా సంఘాన్ని తీసేసి నీతి ఆయోగ్ తీసుకొచ్చింది. ప్రణాళిక, ప్రణాళికేతర వ్యయం విభజనను పక్కనబెట్టడం జరిగింది. ఫిబ్రవరి నెలాఖరుకు బదులు మొదటి తేదీనే బడ్జెట్ సమర్పించడం, ప్రణాళిక - ప్రణాళికేతర వ్యయంగా బడ్జెట్ విభజన బదులు పెట్టుబడి- రెవెన్యూగా మార్చడం ప్రత్యేకత. రైల్వే బడ్జెట్‌ను 92 ఏళ్ల తర్వాత సాధారణ బడ్జెట్‌లో విలీనం చేసింది. రైల్వే ప్రైవేటీకరణ క్రమబద్ధంగా సాగుతున్న నేపథ్యంలో ఇక ప్రత్యేక బడ్జెట్‌ను రద్దు చేసి సాధారణ బడ్జెట్‌లో కలిపివేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. విభాగాల పరంగా, దశలవారీగా ప్రైవేటీకరణ ఇప్పటికే మొదలైంది. అలాగే పెద్దనోట్ల రద్దుతో భారత ఆర్థిక వ్యవస్థ, ప్రజా జీవితాలు

అతలాకుతలమైన నేపథ్యంలో ప్రవేశపెడుతున్న బడ్జెట్ ఇది. అభివృద్ధే తమ ఉచ్ఛ్వాస నిశ్వాసలని వల్లిస్తూ నాల్గవ బడ్జెట్‌లో కూడా అభివృద్ధి పాలు కంటే సామాన్యులను కాల్చుకు తినడమే లక్ష్యంగా చేసుకుంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు, ఆ వెలుగులో వినాశకర సంస్కరణలు, వాటి ఫలితంగా జన బాహుళ్యంపై అధిక భారాలు మోపుతూ గణాంకాల గంధపు పూతగా బడ్జెట్ అంకెలు స్పష్టం చేస్తున్నాయి. ఇదీ స్థూలంగా ఎన్‌డిఎ ప్రభుత్వం బడ్జెట్ సారం.

మోడీ ప్రభుత్వం అవినీతి రహిత, నల్లధన రహిత సమాజం కోసం పెద్ద నోట్లను రద్దు చేసినట్టు చెబుతోంది. నోట్ల రద్దు విజయం వల్ల స్వచ్ఛ భారత్ ఆవిష్కారమవుతోందన్న విశ్వాసాన్ని కూడా ప్రభుత్వం వ్యక్తం చేస్తోంది. ప్రభుత్వానికి కలిగిన నమ్మకం, ప్రజల్లోనూ కలగాలంటే పెద్ద నోట్ల రద్దు వల్ల ఒనగూడిన ప్రయోజనాలను ప్రభుత్వం వెల్లడి చేయాలి. పెద్ద నోట్ల రద్దు వల్ల ఎంత నల్లధనం బయటపడింది, ఆర్థిక రంగానికి ఎంత లాభం జరిగింది, నష్టాలేమైనా జరిగాయా, సర్కారు ఖజానాకు అదనంగా జమ అయిన సొమ్ము ఎంత.. ఈ వివరాలేవీ ఆర్థిక మంత్రి జైట్లీ బయటపెట్టలేదు. పెద్ద నోట్ల రద్దు వల్ల సమాజానికీ, యావత్ ప్రజానీకానికీ అసాధారణమైన మేలు జరుగుతుందని చెబుతున్న ప్రభుత్వం అందుకు కనీసం కొన్ని ఆధారాలైనా చూపాలి కదా! పెద్ద నోట్ల రద్దు అవ్యవస్థీకృత రంగాన్ని పెను సంక్షోభంలో ముంచింది. ఇప్పటికీ ఆ రంగాన్ని ఆశ్రయించుకొని జీవనోపాధి పొందుతున్న కోట్లాది ప్రజలు ఇంకా కోలుకోలేదు. వ్యవసాయం, నిర్మాణ రంగాలపై దాని ప్రభావం ప్రత్యక్షంగానే కనిపిస్తోంది. చిన్నచిన్న వ్యాపారాలు చేసుకునేవారు, స్వయం ఉపాధిపై బతికేవారు బతుకుతెరువు కోల్పోయారు. ఆర్థిక వృద్ధిపై పెద్ద నోట్ల రద్దు ప్రభావం ఏమీ లేదని ఆర్థిక మంత్రి బడ్జెట్ ప్రసంగంలో పేర్కొన్నప్పటికీ జిడిపి వృద్ధిలోని క్షీణతను, రాబడుల తగ్గుదలను అంగీకరించడం ద్వారా ఆ ప్రభావం ఉన్నదని ప్రభుత్వం చెప్పకనే చెప్పినట్టు అయింది. మరోవైపు ప్రభుత్వం ప్రచురించిన జిడిపి గణాంకాలు సందేహానికి తావిస్తున్నాయి. పారిశ్రామిక ఉత్పత్తి సూచి, ఉపాధి కల్పన, పరపతి విస్తరణ, స్థూల స్థిర పెట్టుబడి కల్పనలోని వృద్ధి వంటి సూచికలన్నీ రుణాత్మక వృద్ధిని కనబరుస్తుంటే జిడిపి వృద్ధి 7.1 శాతం ఉందనడం హాస్యాస్పదంగా ఉంది.

2017-18 వార్షిక బడ్జెట్‌ను పరిశీలిస్తే, దానికో ఫిలాసఫీ ఉన్నట్లు కనిపించదు. ప్రభుత్వ ప్రాథమ్యాల్లో మార్పు కంటే రాజకీయ వ్యూహచతురత ఎక్కువగా కనిపిస్తుంది. హితోక్తులు, చలోక్తులు దొర్లించారు. నిరుటి బడ్జెట్‌నే కొంచెం అటూ ఇటూ మార్చి ప్రవేశపెట్టినట్లు స్పష్టమవుతోంది. వాస్తవానికి ఈ బడ్జెట్ కొన్ని ప్రత్యేకతలను మూటగట్టుకుంది. పది కీలక అంశాలపై ఈ బడ్జెట్ దృష్టి పెట్టినట్లు జైట్లీ చెప్పారు. ఆ పది కీలక అంశాల్లో రైతులు, గ్రామీణాభివృద్ధి, యువత, పేదల ఆరోగ్యం, మౌలిక సదుపాయాలు, పారిశ్రామిక వృద్ధికి ఆర్థిక చేయూత, వేగవంతమైన జవాబుదారీతనం, ప్రజా సర్వీసులు, సమర్థమైన ఆర్థిక విధానం, నిజాయితీపరులకు సరళీకృతమైన పన్ను విధానం అంటూ వల్లె వేసినప్పటికీ, అనేక ప్రజా సంక్షేమ రంగాలు ప్రగతికి నోచుకోక చతికిలబడిన పరిస్థితులు ఉంటే తీసుకోబోయే చర్యలపట్ల, నిధుల కేటాయింపు పట్ల చిత్తశుద్ధి లోపించింది.

బడ్జెట్ ప్రసంగంలో ఎంత తిరగేసి మరలేసి అంకెలతో ఆడుకున్నా ప్రజలపై ముమ్ముందు భారాలు తప్పవని తేటతెల్లమైంది. అన్నం ఉడికిందో లేదో తెలుసుకోవడానికి గిన్నెలో చెయ్యి పెట్టనవసరం లేదు. ఒక్క మెతుకు పట్టుకొని చూస్తే చాలు. అలాగే జైట్లీ కాకిలెక్కల మాయాజాలాన్ని పసిగట్టడానికి రెవెన్యూ వసూళ్ల ప్రతిపాదనలు పరిశీలిస్తే సరిపోతుంది. ప్రస్తుత 2016-17 సంవత్సరంలో రెవెన్యూ ఆదాయం (జాతీయ స్థూలోత్పత్తి) (జిడిపి)లో 9.4 శాతం కాగా వచ్చే సంవత్సరం 9 శాతానికి తగ్గుతుందన్నారు. కోల్పోతున్న ఆదాయం రు. 30 వేల కోట్లు. జిడిపిలో 2.1 శాతం. ప్రత్యక్ష పన్నుల్లో కొంత మందికి స్వల్ప ఊరటనిచ్చి, పరోక్ష పన్నుల ద్వారా రు. 75 వేల కోట్ల ఆదాయాన్ని అదనంగా ఆశించారు. పెట్రోలియం ఉత్పత్తులపై సుంకాలు బాది దొడ్డిదారిలో అశేష ప్రజానీకంపై పరోక్షంగా పన్నులు వడ్డించేందుకు జైట్లీ పన్నాగం పన్నారు. మరోపక్క అడ్డగోలుగా కార్పొరేట్లకు దోచిపెట్టే చర్యలన్నీ బడ్జెట్ నిండా పరిచారు. మరోవైపు దేశం నానాటికీ అప్పుల ఊబిలో కూరుకుపోతున్నది. ప్రస్తుతం మనదేశ అప్పు రు. 32 లక్షల కోట్లకు చేరింది. ఇది దేశ జిడిపిలో 25 శాతంగా నమోదైంది. ఈ రుణాలకు వడ్డీ చెల్లించేందుకోసం ప్రతియేటా సుమారు రు. 5 లక్షల కోట్లను ప్రభుత్వం వెచ్చిస్తున్నది.

జైట్లీ బడ్జెట్ ప్రసంగం కంటే ఆర్థిక సర్వే తయారు చేసిన కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సలహాదారు అరవింద్ సుబ్రమణియన్ నివేదిక క్షేత్ర వాస్తవికతకు కొంత దగ్గరగా ఉంది. నోట్ల రద్దు నిర్ణయం వల్ల జాతీయోత్పత్తి రేటు తగ్గినట్టు సుబ్రమణియన్ అంగీకరించారు కానీ నోట్లరద్దు వల్ల కలిగిన నష్టం తాలూకు వివరాలు మాత్రం వెల్లడించలేదు. జైట్లీ మాత్రం దబాయింపు ధోరణినే కొనసాగించారు. ఈ చర్యలవల్ల బ్యాంకులలో జమ అయిన మొత్తాల వివరాలను అధ్యయనం చేసి పన్ను వసూళ్ళ వ్యవస్థను విస్తరించి బలోపేతం చేస్తామంటున్నారు. నగదు రహిత ఆర్థికవ్యవస్థ నిర్మాణానికి దోహదం చేసే దారులు వేస్తామంటున్నారు. అయితే డిజిటలీకరణ సాధించడం మన దేశంలో అంత సులభం కాదు. దీనికి నిరక్షరాస్యత పెద్ద అడ్డంకి. గ్రామీణ ప్రాంతంలో నగదు ద్వారానే లావాదేవీలు ఎక్కువగా సాగుతున్నాయి.

సైబర్ నేరాల మూలంగా చదువుకున్న వారు కూడా ఆన్‌లైన్ లావాదేవీలకు భయపడుతున్నారు. అక్షరాస్యతలో, మానవాభ్యుదయంలో ముందంజలో ఉన్న స్వీడన్, నార్వే వంటి స్కాండినేవియన్ దేశాలు డిజిటల్ లావాదేవీలను సులభంగా ప్రవేశ పెట్టగలిగాయి. అందువల్ల డిజిటలీకరణ అయినా, సంక్షేమమైనా, దేశాభివృద్ధి అయినా పరస్పరం ముడిపడి ఉంటాయి. ఆర్థిక సాంకేతికాభివృద్ధిని సామాజిక వాస్తవికత నుంచి విడదీసి చూడలేమని గ్రహించాలి. క్షేత్ర స్థాయి వాస్తవాలను అంగీకరించడానికి మోడీ సిద్ధపడలేదు. ఆ నిర్ణయానికి తన బడ్జెట్ ప్రతిపాదనలు కొనసాగింపేనని కేంద్ర ఆర్థిక మంత్రి అరుణ్‌జైట్లీ చెప్పడంతో పాటు దానివల్ల నరకయాతన అనుభవించిన సాధారణ ప్రజలకూ, నష్టపోయిన చిన్న వ్యాపారులకూ గ్రామీణ ప్రాంతాలలో ప్రభుత్వ వ్యయాన్ని పెంచబోతున్నట్టు మభ్య పెట్టారు. ఆదాయం పన్నులో రాయితీ కూడా ఈ ఉద్దేశంతో ప్రకటించిందే.

బడ్జెట్ ప్రధానంగా దేశ విదేశీ బడా పారిశ్రామిక వేత్తల ప్రయోజనాల కనుగుణంగానే తీర్చిదిద్దారు. డిజిటల్ ఇండియా పేరుతో బడా సంస్థలు లాభాలు దండుకునేందుకవసరమైన చర్యలే ప్రతిపాదించారు. కాంట్రాక్టు వ్యవసాయం కోసం చట్టం చేయబోతున్నామన్నారు. విదేశీ ప్రత్యక్ష

పెట్టుబడులకు ఆటోమాటిక్ రూట్‌లో దర్జాగా వచ్చే ఏర్పాటు చేస్తున్నారు. రైల్వేలో సైతం ప్రైవేటీకరణకు శ్రీకారం చుట్టుతున్నారు. కేంద్ర ప్రభుత్వ రంగ సంస్థల నుండి పెట్టుబడులు ఉపసంహరించటం ద్వారా ఎప్పుడూ లేనంతగా రు. 72,500 కోట్ల ఆదాయం గడించాలని లక్ష్యం పెట్టుకున్నారు. బ్యాంకులు తదితర ఆర్థిక సంస్థలు నష్టాలపాలు కాకుండా తగిన చట్టపరమైన ప్రతిపాదనలు చేయనున్నట్టు చెప్పారు. బ్యాంకులకు తక్షణం రు. 10 వేల కోట్లు అందజేస్తామన్నారు. బ్యాంకులను డొల్లచేసి పదకొండు లక్షల కోట్లు కాజేసిన బడా సంస్థల నుండి వసూలు చేయడం గురించి మాట్లాడకుండా ఈ ప్రతిపాదన చేయడం విడ్డూరంగా ఉంది.

ప్రభుత్వం కీలకమైన ప్రభుత్వ రంగ సంస్థలను వేగంగా ప్రైవేటు పెత్తనానికి మారుస్తోంది. కార్మికుల ప్రయోజనాలను తోసిరాజని యజమానులకు వీలైనంత ఎక్కువ లాభాలు కట్ట బెట్టడానికి కార్మిక చట్టాలు టోకుగా మార్చేసే పనికి పూనుకున్నది. వాటాలను అమ్మడం ద్వారా ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేటు చేతుల్లో పెట్టే ప్రక్రియ వేగం పుంజుకోవడంతో ఇప్పుడు నేరుగా అమ్మేయడం లేక వ్యూహాత్మక అమ్మకాలకు ప్రాధాన్యం ఇవ్వడం జరుగుతున్నది. ప్రయివేటు పెట్టుబడి, పారిశ్రామికవేత్తల ప్రయోజనాలు నెరవేరేలా, కార్మికులకు, ఉద్యోగులకు వ్యతిరేకంగా తాజాగా తీసుకున్న చర్య బిఐఎఫ్ఆర్ (బోర్డ్ ఆఫ్ ఇండస్ట్రియల్ అండ్ ఫైనాన్షియల్ రీకన్‌స్ట్రక్షన్)ను ఎత్తివేసే నిర్ణయం తీసుకున్నారు. వీటన్నింటినీ మించి కార్మిక చట్టాలను మరింత సరళీకరిస్తామని చెప్పారు. అంటే సంస్కరణల పేరుతో ప్రజల మీద దాడి పెంచి పెద్దల సేవలో తరించే పని వేగవంతం చేస్తున్నారు. ఇదే ఈ బడ్జెట్ సారాంశం.

ఏదేని పబ్లిక్, ప్రైవేటు పరిశ్రమ నష్టాల్లో ఉన్నప్పుడు తన పునరుజ్జీవం లేక పునరుద్ధరణ కోసం బిఐఎఫ్ఆర్ వద్దకు వెళ్లొచ్చు. అక్కడ అన్నిపక్షాల కథనాలు, సూచనలు వింటారు. భవిష్యత్తు గురించి చర్చ జరుగుతుంది. పరిశ్రమ ఖాయిలా అధిగమించడానికి లేక పునరుజ్జీవనానికి తయారైన ప్రణాళిక గురించి కూలంకషంగా చర్చిస్తారు. మూలధనం ఎక్కడ నుండి వస్తుంది. మార్కెట్లో ఉత్పత్తయ్యే సరుకు గిరాకీ ఎలా ఉంది, సరుకు నాణ్యత లేక డిజైన్లో మార్పువంటిది అవసరం ఉందా, ఎక్కడ నుండి రుణాలు దొరుకుతాయి, బాకీలు ఎలా తీరుతాయి, కార్మికుల బాకీలు ఎలా తీరుతాయి, భవిష్యత్తులో కార్మికులను తగ్గించాలా లేదా, విస్తరణ అవసరం ఉందా వగైరా అంశాలు కూలంకషంగా విచారించిన తరువాతనే ఈ పథకాన్ని ఆమోదిస్తారు. ఒకవేళ ఏదేని సందర్భంలో పునరుజ్జీవనానికి ఆస్కారం లేకపోతే ఆ పరిశ్రమ మూసివేతకు నిర్ణయం తీసుకుంటారు. అప్పుడు మాత్రం కార్మికులు వారికి రావల్సినది పొందుతారు. బిఐఎఫ్ఆర్ మూతపడడం అంటే ఖాయిలా పరిశ్రమలు, కార్ఖానాలు పునరుజ్జీవన అవకాశాలు పూర్తిగా అంతరించిపోవడంతో పాటు ప్రభుత్వం, యాజమాన్యం మాటే ఆఖరి మాట అవుతుంది. దానివల్ల కార్మికుల ఉపాధి పోవడమే కాక వారికి రావల్సిన బాకీలు కూడా రాకుండా పోతాయి.

విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు తలుపులు పూర్తిగా బార్లా తెరవడం కొరకు విదేశీ పెట్టుబడుల ప్రోత్సాహక మండలి(ఎఫ్ఐపిబి)నే ఏకంగా ఎత్తివేయాలని నిర్ణయించారు. అవరోధాలను తొలగించడానికి 1990 దశకంలో ఏర్పాటు చేసిన ఈ బోర్డు స్వయం చాలక మార్గంలో లేని రంగాలకు అనుమతిస్తుంది. కానీ ఇప్పటికే తొంభై శాతం ఎఫ్‌డిఐ స్వయంచాలక మార్గంలోనే వస్తున్నది. ఇప్పటికే దేశంలో ఎఫ్‌డిఐ 30 శాతం పెరిగింది. ఈ ఎఫ్‌డిఐ విధానాన్ని మరింత సరళీకరించే లక్ష్యంతో ఈ బోర్డును రద్దు చేస్తున్నట్టు ఆర్థికమంత్రి ప్రకటించారు. విదేశీ పోర్ట్‌ఫోలియో ఇన్వెస్టర్స్‌కు పన్ను మినహాయింపు ఇవ్వడం కోసం పరోక్ష బదిలీ నిబంధనల నుంచి మినహాయింపు ఇవ్వడం గమనార్హం. పౌర విమాన యానం నుంచి ఫార్మాసుటికల్స్ వరకూ విదేశీ పెట్టుబడులను మరింత సులభతరం చేశారు. ఓపెన్ ఆర్థిక వ్యవస్థగా మార్చడమే తమ లక్ష్యమని చాటుకున్నారు. ఆర్థిక రంగాన్ని విదేశీ పెట్టుబడుల ఆధారంగా, ఎగుమతులను పెంచడం ద్వారా నిర్మించాలనుకునే భావన నుంచే బడ్జెట్‌లు రూపుదిద్దుకుంటున్నాయి. అంతర్జాతీయంగా చోటు చేసుకుంటున్న కొత్త పరిణామాలు ఈ నమూనాను, దానిని నమ్ముకున్న దేశాలను ప్రమాదంలో పడవేశాయి. ఉపాధి అవకాశాలు లేని అభివృద్ధి అంకెల్లో ఎంత ఘనంగా ఉన్నా ప్రజలందరికీ అన్నం పెట్టదు. 125 కోట్ల మంది ప్రజలను బలోపేతం చేసే విధానాలు, ఆర్థిక లక్ష్యాలు, వీటికి అనుగుణమైన బడ్జెట్లే మనకు కావాలి.

రు. 21,47,000 కోట్ల బడ్జెట్‌లో గ్రామీణ వ్యవసాయ రంగాలకు అత్యధికంగా నిధులు కేటాయించామని గొప్పగా చెప్పుకుంటున్నారు. బడ్జెట్‌లో రైల్వేలకు రు. 1,31 లక్షల కోట్లు ప్రతిపాదించారు. రైలు, రోడ్డు, నౌకాయానం సహా మొత్తంగా రవాణా రంగానికి రు. 2,41,387 కోట్లు కేటాయించారు. వ్యవసాయ అనుబంధ రంగాలకు 1,87,023 కోట్లు, గ్రామీణాభివృద్ధికి 1.86 లక్షల కోట్లు, రక్షణ రంగానికి 2.74 లక్షల కోట్లు, ఉపాధి హామీ రంగానికి 48 వేల కోట్లు, పారిశ్రామిక రంగానికి 2.44 లక్షల కోట్లు, శిశు, మహిళా సంక్షేమ రంగానికి 1.86 లక్షల కోట్లు, మౌలిక సదుపాయాల రంగానికి 3,96,135 కోట్లు, విద్యా రంగానికి 79,687 కోట్లు, వైద్య రంగానికి 47,352 కోట్లు. ముద్రయోజన రుణాలకు 2.41 లక్షల కోట్లు, విద్యుత్ రంగానికి 1.26 లక్షల కోట్లు. హోంశాఖకు 83 వేల కోట్లు కేటాయించారు.

మొత్తం ఉద్యోగ జనాభా 47 కోట్ల మందిలో 95 శాతానికి ప్రాతినిధ్యం వహిస్తున్న బలహీనమైన అసంఘటిత రంగంలో పరిస్థితులు దారుణంగా ఉన్నాయి. వ్యవసాయం, నిర్మాణ రంగం వంటి అసంఘటిత రంగ సంస్థలు 30 కోట్ల మందికి ఉపాధి కల్పిస్తున్నాయి. అసంఘటిత సంస్థలలో ఉద్యోగ నష్టాల గురించి ప్రధాని మోడీ, ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ ఊసెత్తలేదు. నూతన ఉద్యోగాల కల్పన గురించి గానీ, సామాన్య ప్రజలకు విద్య, ఆరోగ్య సంరక్షణ వంటి మౌలిక సౌకర్యాల గురించి గానీ బడ్జెట్‌లో ఎక్కడా ప్రస్తావించలేదు. గత రెండున్నర ఏళ్లలో ఉపాధి కల్పన పెద్దగా లేకపోవడంతో మునుపెన్నడూ లేనంత స్థాయికి నిరుద్యోగుల సంఖ్య పెరిగింది. బడ్జెట్ పరోక్షపన్ను జోలికి వెళ్లలేదు గనుక ధరల పెరుగుదల ఉండదని కూడా కార్పొరేట్ మీడియా ఊదరగొడుతున్నది. ఇది పచ్చి మోసం, రేపు జూలైలో ప్రవేశపెట్టనున్న జిఎస్‌టి సామాన్య ప్రజలను తీవ్రంగా దెబ్బతీస్తుంది. అంతేకాకుండా, ఈ ఏడాది ద్రవ్యోల్బణం 5 శాతం పెరుగుదల కొనసాగుతుందని కూడా ఆర్థిక సర్వే చెప్పింది. ధరల పెరుగుదల భారాన్ని ప్రజలు భరించవలసి ఉంటుంది.

దేశంలో ఆరోగ్య వ్యవస్థ రుణగ్రస్థమైంది. దీనికి చికిత్స బడ్జెట్‌లో కనిపించలేదు. ప్రజారోగ్య భద్రతకు రకరకాల పథకాలు, చర్యలు చేపడుతున్నట్లు పాలకుల మాటలు కోటలు దాటుతున్నాయే తప్ప చేతలు కడప దాటడం లేదు. ప్రజారోగ్య వ్యవస్థను బలహీనం చేసి ప్రైవేట్‌పరం

చేయడమే లక్ష్యంగా పాలకుల విధానాలు సాగుతున్నాయి. మన దేశంలో పేదవారి ఆరోగ్య రక్షణ పెద్ద సమస్యగా ఉంది. ఆరోగ్య బీమా, పేదలలో అన్ని వర్గాలకు వర్తించే వైద్య చికిత్సా సౌకర్యాల గురించి అధికారంలోని నాయకుల స్థాయిలో చాలా చర్చలు సాగుతున్నాయి. ఒక నమూనా ఆరోగ్య బీమా రూపొందించారు. దేశంలోని ప్రముఖ ఆర్థిక వేత్తలందరూ ఈ ఆరోగ్య బీమా కార్యక్రమాన్ని ఉచితంగా ప్రవేశపెట్టాలని సూచిస్తున్నారు. అయినప్పటికీ తాజా బడ్జెట్‌లో దీని ఊసే లేదు. పేదలకు చౌక ధరలకే ఔషధాలను సరఫరా చేయడానికి ప్రభుత్వ సంస్థలను నిమగ్నం చేసే ప్రయత్నం మోడీ ప్రభుత్వం ఆచరణకు తేలేదు. ఔషధాలు ఉచితంగా ఇస్తే ఆరోగ్య రక్షణ రంగానికి సమూల పరివర్తన చేకూరేది.

సంక్షోభంలో ఉన్న వ్యవసాయరంగాన్ని పూర్తిగా విస్మరించింది. రైతుల ఆత్మహత్యలను, దారుణంగా పడిపోతున్న అన్నదాతల ఆదాయాలను కనీసం ప్రస్తావించలేదు. రైతుల గిట్టుబాటు ధర కల్పన ఊసే లేదు. పైగా కార్పొరేటీకరణకు పక్కా స్కెచ్ వేసింది. వ్యవసాయ రంగ బడ్జెట్ జిడిపిలో 1.98 శాతం నుంచి 1.95 శాతానికి తగ్గింది. సవరించిన బడ్జెట్‌తో సరిచూస్తే ఉపాధి హామీ నిధుల పెంపు బహు స్వల్పం. కరువు నేపథ్యంలో అదనపు పనులు కల్పించాలంటే ఆ నిధులు ఏ మూలకూ చాలవు.

జైట్లీ బడ్జెట్ సామాజిక రంగాలకు తీరని అన్యాయం చేసింది. మోడీ ప్రభుత్వం సంక్షేమ కార్యక్రమాలను సరియైన సంకల్ప బలం లేకుండా రూపొందించింది. ఎస్‌సి, ఎస్‌టి, బిసి, మైనారిటీ, మహిళలకు కేటాయింపులు వారి జనాభాకు అనుగుణంగా లేవు. ఎస్‌సిలకు 2.44 శాతం, ఎస్‌టిలకు 1.48 శాతం, మహిళలకు 5.3 శాతం ప్రతిపాదించడం దారుణం. విద్య, ఆరోగ్యం, అక్షరాస్యత వంటి రంగాలకు పెరిగింది స్వల్పమే. వ్యక్తిగత ఆదాయ పన్ను మినహాయింపు రెండున్నర లక్షల నుంచి ఐదు లక్షల లోపు ఆదాయం పొందుతున్న వారికి 10 నుంచి 5 శాతానికి పన్ను తగ్గింపు వంటి అరకొర ఉపశమనాలు తప్ప సామాన్యులకు ఒరగబెట్టిందేమీ లేదు. పౌరులందరికి తక్కువ ఖర్చుతో ఇళ్లు నిర్మించి ఇస్తానని ప్రధాని చేసిన మరో వాగ్దానం కూడా చాలీ చాలని నిధులతో మూలన పడింది. బ్యాంక్ గృహ రుణాలపై కొంతమేరకు వడ్డీ సబ్సిడీని మాత్రమే ప్రస్తుతానికి ఇవ్వగలమని ప్రభుత్వం చెబుతోంది. నోట్ల రద్దు తెచ్చిన ఉపాధి నష్టాన్ని పూరించే ఉపాయాలు ఆర్థికమంత్రి బడ్జెట్‌లో చోటు చేసుకోలేదు.

దేశంలో పంటలు పండగల భూమిలో 57 శాతానికి సాగునీటి సౌకర్యం కల్పిస్తానని మోడీ హామీ ఇచ్చినా 'హర్ ఖేత్‌మే పానీ' కార్యక్రమం మాటలలో కోటలు దాటినా చేతలలో వెనుకబడింది. ఈ పథకం సరిగ్గా అమలు చేస్తే వ్యవసాయ రంగంలో ఉత్పత్తిని, ఉపాధి కల్పనను అద్భుతంగా పెంచుతాయని వ్యవసాయ ఆర్థికవేత్త అశోక్ గులాటి స్పష్టం చేశారు. ఏడాదికి రు. 75,000 కోట్ల నిధులను ఆ పథకానికి కేంద్రం కల్పించాలని ఆయన సూచించారు. అలా వరుసగా మూడు, నాలుగేళ్లపాటు సాగాలి. అయితే ఆర్థిక మంత్రి ఆ పథకానికి 2016-17 సంవత్సరానికి రు. 6000 కోట్లనే బడ్జెట్‌లో సమకూర్చారు. 2017-18 బడ్జెట్‌లో అన్నింటికి కలిపి రు. 40 వేలు కేటాయించింది ఎంత మాత్రం చాలదు. వ్యవసాయ రంగానికి రు. 1,87,33 కోట్లు కేటాయించామని గొప్పగా చెప్పారు. కానీ గత సంవత్సరం కేటాయింపులలో మూడోవంతు కూడా ఖర్చు చేయని విషయం ప్రస్తావించలేదు. పైగా ఇప్పుడు కేటాయించిన మొత్తం కూడా బడ్జెట్ సైజుతో పోల్చితే గత సంవత్సరం కన్నా తగ్గింది.

పేద, మధ్యతరగతి రైతులకు అవసరమైన పంట రుణాల సంగతి చెప్పలేదు. రైతుల ఆత్మహత్యలు పెరుగుతూ, కునారిల్లిపోతున్న వ్యవసాయ రంగాన్ని గట్టెక్కించేందుకు తీసుకోవల్సిన చర్యలను మాత్రం బడ్జెట్ విస్మరించింది. స్వామినాథన్ సిఫార్సుల ప్రకారం మద్దతు ధర నిర్ణయిస్తామని బిజెపి ఎన్నికల మేనిఫెస్టోలో చెప్పిన విషయాన్ని పూర్తిగా వదిలేశారు. వడ్డీలేని రుణాలు, పెట్టుబడి ఖర్చుల తగ్గించడం వంటి చర్యల ఊసేలేదు. ప్రధానంగా రైతుల పరిస్థితి మెరుగుపర్చేందుకు ఆశించిన అవసరం మేరకు నిధుల కేటాయింపు జరగలేదు. కార్పొరేట్ వ్యవసాయ వాణిజ్యానికి ఉపకరించే సంస్కరణలు బడ్జెట్‌లో పొందుపరచడం అన్యాయం. సంస్కరణలు సగటు రైతు బతుకు మార్చేందుకు కాక, కార్పొరేట్ వ్యవసాయానికి మాత్రమే ఉపకరిస్తాయి. రుణాల ఊబిలో కూరుకున్న రైతుల జీవితాలకు బడ్జెట్ వల్ల ఒనగూడిన లాభమేమీ లేదు. పైగా ఐదేళ్లలో వ్యవసాయ ఆదాయాలు రెండింతలవుతాయని ప్రకటించిన బడ్జెట్ రూపకర్తలు, అదెలా సాధ్యమో స్థూలంగా నైనా ప్రకటించకపోవడం విచారకరం.

వ్యవసాయ, గ్రామీణాభివృద్ధికి లక్ష 87వేల కోట్లు కేటాయింపులు చేశారు. పేదరిక నిర్మూలనే తమ ప్రధాన లక్ష్యంగా గ్రామీణ ప్రాంతాలకు పెద్ద ఎత్తున నిధులు కేటాయించినట్లు చెప్పుకున్నా కేటాయింపులు మాత్రం అంతంత మాత్రమే ఉన్నాయి. వచ్చే ఐదేళ్లల్లో రైతుల ఆదాయం రెట్టింపయ్యేలా చర్యలు తీసుకుంటామని ప్రకటించినా అందుకు అవసరమైన నిధులు ఏ మాత్రం కేటాయించారో, ఎలాంటి పథకాలు ప్రవేశపెట్టబోతున్నారో వివరించలేదు. 60 రోజుల్లోపు రుణాలు చెల్లిస్తే రైతులకు పూర్తి వడ్డీ రాయితీ ఇస్తామని ప్రకటించినా రైతుల వద్ద నుంచి పెద్ద స్పందన కన్పించడం లేదు. దేశ వ్యాప్తంగా 10 లక్షల కోట్ల వ్యవసాయ రుణాలు ఇచ్చేందుకు సంసిద్ధతను వ్యక్తంచేస్తూ నాబార్డుకు వ్యవసాయ సహకార సంఘాలను అనుసంధానం చేయనున్నట్లు ప్రకటించారు. గత పాలకులు కూడా రైతు రుణాలు ఇస్తామంటూ ప్రకటించినా అమలులో మాత్రం అంతంత మాత్రమే ఉంది. నిజానికి రుణాలు ఇచ్చేది బ్యాంకులు, ఇది బడ్జెట్‌తో సంబంధంలేని అంశం.

వ్యవసాయ సంక్షోభం, పారిశ్రామిక ఉత్పత్తిలో క్షీణత, నిరుద్యోగం, పేదరికం, అనారోగ్యం వంటి ప్రధాన సవాళ్లను ఎదుర్కొనే చర్యలు బడ్జెట్‌లో ఎక్కడా కనిపించవు. బడ్జెట్ సారాన్ని మొత్తంగా చూసినప్పుడు మోడీ ప్రభుత్వం స్వదేశీ విదేశీ కార్పొరేట్ శక్తుల ప్రయోజనం కోసమే 2017-18 సంవత్సరపు బడ్జెట్‌ను వండి వార్చినట్లు విదితమవుతోంది. మన పాలకులు చేస్తున్నది చేయడంలేదన్నట్లుగా, చెయ్యని పని చేస్తున్నట్లుగా భ్రమింపజేయడం, ప్రజల గొంతు నులుముతూ సేవలు అందిస్తున్నామనడం, పెట్టుబడులకు దాసోహమంటూ వీరిని అడ్డుకుంటున్నామనడం ఒక కళగా ప్రదర్శిస్తున్నారు. అందువల్లనే దేశ ఆర్థిక వ్యవస్థకు, సామాన్య ప్రజానీకానికి నష్టదాయకంగా చేతల దాక రాని మాటలతో, అంకెల గారడితో మసిపూసి మారేడుకాయ చేస్తున్నారు. మొత్తంగా ఇది ప్రజా వ్యతిరేక కార్పొరేటు అనుకూల బడ్జెట్ అన్నది నిస్సందేహం. మీడియాలో వ్యవసాయ గ్రామీణ రంగాలకు ప్రభుత్వం నిధులు పెంచిందని జరుగుతున్న ప్రచారం వట్టి బూటకం. వీ

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)*

# ప్రజల ఆకాంక్షలు ప్రతిబింబించని బడ్జెట్

**ప్రతి ఏడాది లాగే ఈ బడ్జెట్ కూడా సామాన్య ప్రజల ఆకాంక్షలకు ఏ మాత్రం అవకాశం ఇవ్వకపోగా, అది కేవలం ప్రభుత్వ ప్రచార ఆర్భాటాలతో, అర్థంకాని గణాంకాల కూర్పు మాత్రమేనని అంటున్నారు ఎ. పున్నయ్య**

సుమారు 130 కోట్ల జనాభా పునరుజ్జీవనానికి పునాదిగా అభివర్ణిస్తూ 'ఫ్యూచర్' పేరుతో ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ ప్రవేశపెట్టిన బడ్జెట్ అంకెల రూపంలో రు. 21,46,735 కోట్లు. భారీ బడ్జెట్‌గా కనిపించినా గత బడ్జెట్‌తో పోలిస్తే కేవలం రు. 1,68,675 కోట్ల పెంపుదలతో దేశవ్యాప్త సమగ్ర రంగాలు ప్రగతిబాట పడతాయని ప్రవచించిన జైట్లీ అంకెల గారడీని నాల్గవసారి కూడా అద్భుతంగా ఆవిష్కరించారు. పెంపుదల కేవలం 8 శాతం మాత్రమే.

నిజానికి ఇటీవల ప్రభుత్వం సృష్టించిన పెద్ద నోట్ల రద్దు పెను తుపానుతో అతలాకుతలమైన ఆర్థిక వ్యవస్థ మళ్లీ ఊపిరి పోసుకోవడానికి అత్యంత దారుణంగా కుదేలైన సామాజిక, అల్పదాయ వర్గాల ఆశలకు, ఊసులకు ఊతమిస్తుందన్న తరుణంలో చారిత్రక మార్పుగా ప్రవేశపెట్టిన ఈ బడ్జెట్ ఐదు ప్రధాన మార్పులతో చరిత్ర పుటలో నిలవాలనుకున్నారు.

సాధారణ సంప్రదాయ బడ్జెట్‌కన్నా భిన్నంగా డిజిటల్ దృక్పథాలతో కాగితాలకు చెల్లుచీటి రాసిన బడ్జెట్ ఇది. స్వతంత్ర భారత బడ్జెట్ విధానంలో దశాబ్దాల ఆనవాయితికి భిన్నంగా ఫిబ్రవరి 28కి బదులు ఫిబ్రవరి 1న ప్రవేశపెట్టారు. ప్రణాళికా సంఘాన్ని రద్దు చేసి ప్రణాళిక, ప్రణాళికేతర వ్యయ ప్రస్తావన లేకుండా చేశారు. అత్యంత ఆదాయ వనరైన రైల్వే బడ్జెట్‌ను ప్రత్యేక బడ్జెట్‌గా కాకుండా, ఒక పద్దుగా ప్రవేశ పెట్టారు. పథకాల అమలులో నేరుగా, రాష్ట్రాల వెనుక ఉండి నడిపించే విధంగా రూపొందించడం, జిఎస్‌టి అమలు నేపథ్యంలో సేవా పన్ను, ఎక్సైజ్ పన్ను మొదలగు పన్నులను చూపినా చివరి బడ్జెట్‌గా భౌతిక మార్పుకు తొలి ఆనవాలుగా ఈ బడ్జెట్ నిలుస్తుంది తప్ప అంతర్గతంగా అభివృద్ధికి యథాలాపంగా ఆమడ దూరంలోనే ఉంది అనడంలో ఎటువంటి సందేహం లేదు.

**గత బడ్జెట్ ప్రస్తుత బడ్జెట్ కేటాయింపులు - లక్ష్యాల సాధన**

ప్రస్తుత బడ్జెట్‌ను ఆహ్వానించే ముందు గతంలో ప్రభుత్వం నిర్దేశించుకున్న ఆర్థిక ప్రణాళిక ప్రకారం తాను రూపొందించిన బడ్జెట్ కేటాయింపులు అమలు నిర్దేశిత లక్ష్యాలు ఎంత వరకు చేరుకున్నాయో కూడా పరిశీలించాల్సిన అవసరముంది.

స్థూల జాతీయోత్పత్తి (జిడిపి) వృద్ధిరేటు 2016-17లో 7.9 శాతం నుంచి 7.0 శాతానికి పడిపోయిన నేపథ్యంలో వృద్ధిరేటు సాధనలో ప్రభుత్వం పిల్లిగంతులేస్తూ తిరిగి 2017-18 ఆర్థిక సంవత్సరానికి 3.2 ద్రవ్యలోటు, 11.75 శాతం వృద్ధిరేటును నిర్దేశించుకోవడం నేల విడిచి సాము చేయడమే అవుతుంది.

**వ్యవసాయ రంగాన్ని పెద్దదిగా చూపించి తక్కువ నిధులతో సరిపెట్టింది**

2017-18 వ్యవసాయ వృద్ధిరేటు 4.1 శాతం అంచనాతో రైతుల ఆదాయాలు రెట్టింపు అవుతాయనుకున్న లక్ష్యం నీరుగారింది. కాగా ప్రస్తుత బడ్జెట్‌లో ప్రధాన ప్రతిపాదన రెండేళ్లలో రైతుల ఆదాయం రెట్టింపు చేయడానికి కట్టుబడి ఉన్నట్లు చెప్పుకుంటూ గతం కంటే వ్యవసాయ ఉపాధి రంగాలకు 24 శాతం అధికంగా కేటాయింపులు చేశామని చెప్పినప్పటికీ, వ్యవసాయ రంగానికి కేటాయించిన అదనపు మొత్తం 2016-17 సవరించిన అంచనాలతో పోలిస్తే రు. 3,186 కోట్లు మాత్రమే, ఇది కేవలం ఆరు శాతం. ఈ పెంపుతో రెండేళ్ల కాలంలో రైతును రెట్టింపు ఆదాయదారుగా చూడాలనుకోవడం సత్య దూరం అవుతుంది. రైతులకు వ్యవసాయ రంగంలో పెరిగిన యాంత్రీకరణ వలన అనివార్యంగా వాడవలసిన ట్రాక్టర్లు, టిల్లర్లు, స్ప్రెయర్లు, వరికోత యంత్రాల వంటి వాటిని రైతు సంక్షేమం, దేశ వ్యవసాయరంగ పురోభివృద్ధి దృష్ట్యా ఉచిత పంపిణీకి బదులు నామ మాత్రపు రాయితీలతో విత్తనాలు, ఎరువులు తదితర వ్యవసాయ రంగ అవసరాలకు రైతులకు స్వల్పకాలిక రుణాల పేరిట అందిస్తూ, రైతును ఒకవైపు రుణగ్రస్థున్ని చేస్తూ, సకాలంలో రుణం చెల్లించిన రైతుకు 3 శాతం వడ్డీ తిరిగి అతని ఖాతాలో జమచేస్తున్నట్లు చెప్పడం రైతుల్ని మభ్యపెట్టినట్లే అవుతుంది.

విద్యుత్ శక్తి, ఇంధనం, ఎరువులు, పురుగు మందులు, విత్తనాల ధరలను నియంత్రించకుండా, విత్తన ఉత్పత్తి సంస్థలపై ప్రభుత్వ నియంత్రణ లేకుండా రైతుల ఆదాయాలు పెరుగుతాయనడం మోసపూరితమే. గత బడ్జెట్‌లో ఎరువుల రాయితీకి రు. 70 వేల కోట్లు కేటాయించగా, ఈ బడ్జెట్‌లో కనీసంగానైనా పెంచకపోవడం దేనికి అద్దం పడుతుందో ఆలోచించాలి. వ్యవసాయ రంగానికి దండిగా సాయం చేస్తామన్న ప్రభుత్వం 2016-17లో పంటల బీమా కోసం ప్రవేశపెట్టిన 'ఫసల్ బీమా' పథకాలకు మొదట్లో 5,500 కోట్లు కేటాయించి దానిని రు. 13,240 కోట్లకు పెంచి సవరించినారు.

కాగా ఈ బడ్జెట్‌లో వచ్చే ఏడాదికి సాగయ్యే విస్తీర్ణంలో కనీసం 40 శాతం విస్తీర్ణం పంటలకు బీమా చేయించేలా రైతుల్లో చైతన్యం తెస్తామని చెప్పింది. ఇదే నిజమైతే 13,240 కోట్లకు అదనంగా మరో రు. 5,000 కోట్లు అవసరం కాగా, సగానికి సగం తగ్గించి బీమా పథకాలకు రు. 9,000 కోట్లు కేటాయించడం ఏ మూలకు సరిపోవు. ఎలక్ట్రానిక్ జాతీయ వ్యవసాయ మార్కెట్ (ఈ-నామ్) వ్యవస్థ 250 మార్కెట్లలో నేడు అందుబాటులో ఉంది. మరో 585 మార్కెట్లకు విస్తరించేందుకు చర్యలుంటాయని భారీగా ప్రకటించి ఒక్కో మార్కెట్‌కు రు. 75 లక్షలు

కేటాయించాలనుకోవడం చాలా దారుణం. ఈ 75 లక్షలతో మార్కెట్ మౌలిక వసతుల కల్పన సాధ్యమా?

### గ్రామీణాభివృద్ధి రంగం

గ్రామీణాభివృద్ధి రంగానికి 2016-17లో రు. 1,14,947 కోట్లు కేటాయించగా, ఈ బడ్జెట్‌లో కేవలం రు. 13,613 కోట్లు పెంచి రు. 1,28,560 కోట్లుగా ప్రకటించారు. ఈ పెరుగుదల కేవలం 9 శాతం మాత్రమే. ఉపాధి హామీకి గతం కంటే కేవలం 10 వేల కోట్లు పెంచి 48,000 కోట్లతో భారీ బీమాగా ప్రకటించారు. అయినప్పటికీ కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ నియమించిన 'సుమిత్ బోస్ కమిటీ' ప్రకటించినట్లు దేశంలో అత్యంత వెనుకబడిన 40 శాతం జిల్లాలకు గ్రామీణాభివృద్ధి కార్యక్రమాల కింద కేటాయించిన నిధుల్లో కేవలం 29 శాతం మాత్రమే అందుతుందని ఆందోళన వ్యక్తం చేసిన క్రమంలో ఈ గ్రామీణాభివృద్ధి కేటాయింపులతో కనీసం 50 శాతం అభివృద్ధికి ఈ పాలకులకు మరో దశాబ్దకాలం అవసరమౌతుందేమో!

### సామాజిక రంగం

సామాజిక రంగానికి ఈ బడ్జెట్‌లో గత బడ్జెట్ కంటే రు. 5,647 కోట్లను మాత్రమే కేటాయించి ప్రాధాన్యతా రంగంగా గుర్తించకపోవడం నిరాశ కలిగించే విషయం. దేశ జిడిపి వృద్ధి రేటుతో పోల్చుకున్నప్పుడు సామాజికాభివృద్ధి తీవ్ర మందకోడిగా ఉందన్నది యథార్థం. 2015 నాటి మానవాభివృద్ధి సూచిలో 188 దేశాల జాబితాలో భారత్ 136వ స్థానంలో నిలిచిన వాస్తవాన్ని ఈ ప్రభుత్వం విస్మరించింది. విద్యా, వైద్యరంగాల నాణ్యతమీదే సుస్థిర ఆర్థికాభివృద్ధి ఆధారపడుతుంటే అత్యధిక జనాభా కలిగిన ఈ దేశంలో మానవాభివృద్ధి మీద సంపూర్ణ దృష్టి కేంద్రీకరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. అత్యధిక మానవ వనరులున్న ఈ దేశంలో కునారిల్లుతున్న దేశ ఆరోగ్య సూచీలకు జవ సత్వాలు కల్పించుటకు తీవ్ర ప్రయత్నం చేస్తున్నట్లుగా ఈ బడ్జెట్‌లో ప్రస్తావించి, 2019 నాటికి శిశు మరణాల రేటును 1,000కి 39 నుంచి 28కి తగ్గించేందుకు, తల్లుల మరణాల రేటును 167 నుంచి 100కు తగ్గించాలని, 1.5 లక్షల ఆరోగ్య ఉపకేంద్రాలను ఆరోగ్య సంక్షేమ కేంద్రాలుగా మార్చాలని, పేదలకు చవకగా మందులు అందుబాటులోకి తేవడానికి జనరిక్ మందుల వాడకాన్ని ప్రోత్సహించడానికి కార్యాచరణ ప్రణాళిక రూపొందించినట్లు ఈ బడ్జెట్‌లో వెల్లడించారు. కేటాయింపుల్లో వివిధ మంత్రిత్వ శాఖల పరిధిలోని పథకాల కింద మహిళలు, పిల్లల సంక్షేమానికి కేటాయించిన నిధుల మొత్తం రు. 1,84,632 కోట్లు అయినప్పటికీ ఆరోగ్య రంగంపై భారత్ చేస్తున్న వ్యయం కేవలం 1.4 శాతం మాత్రమే. ఈ నిధులతో దీర్ఘకాలిక జబ్బులు, కాలా అజార్, బోధకాలు, కుష్టు, తట్టు, క్షయ మొదలగు వాటితో పాటు దేశంలో ఏటా సరైన వైద్య సేవలు లేక మరణిస్తున్న సుమారు 10 లక్షల మందితో పాటు, ఈ దేశ జనాభాలో ప్రత్యేక వైద్య నిపుణుల సేవలు అందుబాటులో లేని సుమారు 70 కోట్ల మంది జనాభాకు ఈ కేటాయింపులు ఏ చికిత్సను అందించగలవు?

మానవ వనరుల వికాసానికి అభివృద్ధికి, విద్యకు మించిన సాధనం మరొకటి లేదు. 1964 నాటి కేంద్ర ప్రభుత్వం నియమించిన కొఠారీ కమిషన్ సూచించినట్లు విద్యకు స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన బోర్డు ఏర్పాటు చేయాలని, బడ్జెట్ కేటాయింపులో 10 శాతం నిధుల కంటే అధికంగా ఉండాలన్నారు. అయినప్పటికీ నేటి వరకు 3 శాతం కూడా కేటాయించకపోవడం విచారకరం. గత బడ్జెట్‌లో రు. 73,599 కోట్లు ఖర్చు చేయగా నేడు రు. 79,686 కోట్లు అనగా గత సంవత్సరం కంటే 3.7 శాతం మాత్రమే పెంచారు. గుజరాత్, జార్ఖండ్‌లలో ఆల్ ఇండియా మెడికల్ సైన్సెస్ (ఎయిమ్స్) విద్యాలయాలు తప్ప కొత్తగా సాంకేతిక సంస్థల గురించి గాని, ప్రతి ఏటా చదువు పూర్తి చేసుకుని బయటకు వస్తున్న 2.6 కోట్ల మంది గురించి గాని, ఇందులో కనీసం నైపుణ్యం లేని 65 శాతం గురించి కనీస చర్చ లేదు.

2020 నాటికి పట్టభద్రుల సంఖ్యలో ప్రపంచంలో 2వ స్థానంలో నిలవనున్న క్రమంలో వృత్తి విద్యా కోర్సుల ప్రాధాన్యతను గుర్తించక పోవడంతో అదే స్థానంలో నిరుద్యోగిత పెరిగే అవకాశాలు లేకపోలేదు. మాధ్యమిక విద్యా వ్యవస్థను బలోపేతం చేసేందుకు వినూత్న పద్ధతులకు కేటాయింపులు లేవు. విశ్వవిద్యాలయాల గ్రాంట్స్ కమిషన్ నిధుల కొరత వలన విశ్వవిద్యాలయాలన్నింటిలో బోధన, బోధనేతర సిబ్బంది 30 శాతం మాత్రమే ఉన్నారు. అధిక శాతం విశ్వవిద్యాలయాల్లో సామాజిక శాస్త్రాల ప్రాధాన్యత లేదు. అరకొర వసతులతో సైన్స్ అండ్ టెక్నాలజీ పరిశోధనలు కొనసాగిస్తున్నప్పటికీ సరైన నిధులు లేక విశ్వవిద్యాలయాలు మసకబారుతున్నాయి. ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత విద్యాలయాల స్థాయి నుంచి విశ్వవిద్యాలయాల వరకు స్థూల నమోదు నిష్పత్తి (జిఇఆర్) అనుపాతంలో నిధుల కేటాయింపు లేదు. అంతర్జాతీయ స్థాయి నిపుణులను తయారు చేయాలనే లక్ష్యంలో భాగంగా ప్రతి రాష్ట్రంలోను ఐఐటి, ఐఐఎం, ఎఐఎస్ఇ, ఎన్ఐటిల వంటి ప్రతిష్టాత్మక విద్యా సంస్థలను ఏర్పాటు చేసినప్పటికీ, 50 శాతం కొరతగా ఉన్న సిబ్బంది గురించి చర్చ రాలేదు.

### రైల్వే బడ్జెట్

సుమారు 13 లక్షల శాశ్వత ఉద్యోగులతో పాటు లక్షల సంఖ్యలో కాంట్రాక్టు, దినసరి కూలీలను కలిగి, ప్రతిరోజు 23 లక్షల పైబడి ప్రయాణికులను వివిధ ప్రాంతాలకు చేరవేస్తూ, దాదాపుగా 13 వేల రైళ్లతో, ఏడున్నర వేల గూడ్సు బండ్లతో, ఏడు వేలకు పైగా స్టేషన్స్‌తో దేశంలోనే అతిపెద్ద ప్రభుత్వరంగ సంస్థగా ఉన్నది రైల్వే మాత్రమే. అత్యంత ఆదాయ వనరైన రైల్వే వ్యవస్థను అక్వర్తు కమిటీ సూచన మేరకు 1924 నుండి రైల్వే బడ్జెట్‌ను విడిగా సమర్పించగా 92 సంవత్సరాల అనంతరం రైల్వే బడ్జెట్‌ను సాధారణ బడ్జెట్‌లో కలిపి ప్రవేశపెట్టుటలో చరిత్ర కోసమే తప్ప ప్రయోజనాలేమి లేవన్నది వాస్తవం. భారతీయ రైల్వేను అభివృద్ధి పట్టాలపైకి ఎక్కించేందుకు కీలక నిర్ణయమని చెపుతూనే, 2016-17 రైల్వే బడ్జెట్ కంటే రు. 10 వేల కోట్లు అదనంగా కలిపి ఈ బడ్జెట్ రు. 1,31,000 కోట్లుగా ప్రతిపాదించినారు. ఇందులో 55 వేల కోట్లు మాత్రమే ప్రభుత్వం బడ్జెట్ నుండి సమకూరుస్తుంది. ఆన్‌లైన్ ఐఆర్‌సిటిసి ద్వారా రైలు టికెట్స్‌ను కొనుగోలు చేసేవారికి సర్వీస్ చార్జీ ఉండదని ప్రకటించింది. ప్రస్తుతం స్లీపర్ టికెట్ బుక్ చేస్తే రు. 20, ఎసి టికెట్ బుక్ చేస్తే 40 రుపాయల సర్వీసు చార్జీ ఉండేది. ఈ రద్దువల్ల 500 కోట్ల ఆదాయాన్ని ప్రభుత్వం కోల్పోగా, ఈ చర్య పేదలకు, మధ్యతరగతికి ఏమాత్రం ప్రయోజనకరమైనది కాకపోగా, ఇందులో ఎవరి ప్రయోజనా లను కాపాడిందో అర్థం చేసుకోవాలి. కకోద్కర్ కమిటీ సూచించినట్లు

భద్రతలేని బ్రాడ్‌గేజ్ లైన్లలో ప్రస్తుతం 11,563 కాపలాలేని లేవల్ క్రాసింగ్‌లను సెక్యూరిటీలతో ఈ బడ్జెట్‌లోనైనా పూరించాలంటే దానిని 2020 పేర దాటవేసినారు. కాపలాలేని లేవల్ క్రాసింగ్‌లు, పట్టాలు తప్పడం వంటి ప్రమాదాల వల్లే 90 శాతం రైల్వే మరణాలు సంభవిస్తున్నాయన్న వాస్తవాన్ని గ్రహిస్తే, ఈ మేరకు నూతనంగా సాధారణ బడ్జెట్‌తో కలిపినందుకైనా మరిన్ని నిధులు కేటాయించి రైల్వే వ్యవస్థ పరిపుష్టికి కృషి చేయాల్సిన అవసరం ఉంది.

**పన్నులు - ఆదాయాలు**

పన్ను వసూలు చేయడంలో ఎలాంటి హేతుబద్ధత ఈ బడ్జెట్‌లోను కన్పించలేదు. దేశం మొత్తంలో 13.14 లక్షల కంపెనీలు రిజిస్టర్ అయి ఉండగా, అందులో కేవలం 5.97 లక్షల కంపెనీలు మాత్రమే ఆదాయ పత్రాలు దాఖలు చేస్తున్నాయి. ఇందులో పన్ను పరిధిలోకి వచ్చేవి సగానికి తక్కువే. పన్ను పత్రాలు దాఖలు చేయని కంపెనీలపై ఎలాంటి ఆంక్షలు లేకపోవడం విడ్డూరమే. దేశంలో ప్రత్యక్ష పన్నుల వసూలు, పరోక్ష పన్నుల వసూలు అనుపాతంలో వసూలు జరగడం లేదనేది వాస్తవం. వ్యక్తిగతంగా పన్ను చెల్లింపు దారుల్లో 2.5 లక్షల కంటే తక్కువ ఆదాయం గలవారు కేవలం 99 లక్షలు, 1.95 కోట్ల మంది వ్యక్తిగత ఆదాయాలు 2.5 లక్షల నుండి 5 లక్షలుగా ఆదాయ పన్ను శాఖ గుర్తించగా, అందులో అధిక సంఖ్యలో ఉద్యోగులే ఉన్నారు. తాజా లెక్కల ప్రకారంగా 76 లక్షల మంది వ్యక్తిగత ఆదాయం 5 లక్షలకు పైగా ఉంటే, ఆదాయపన్ను శాఖకు రిటర్న్ దాఖలా చేస్తే అందులో 56 లక్షల మంది వేతనజీవులే.

భారతదేశంలో 10 లక్షల కంటే ఎక్కువ ఆదాయం గలవారు 24 లక్షల మంది మాత్రమే. కేవలం 1.72 లక్షల మందికి మాత్రమే సంవత్సర ఆదాయం 50 లక్షలకు పైగా ఉన్నట్లు నమోదు చేసుకున్నారు. పన్ను కట్టేవారు తక్కువ, ఎగవేతదారులు ఎక్కువ. నేటికి మనదేశంలోని సంపాదనపరుల్లో కేవలం 5.5 శాతం మాత్రమే ఆదాయ పన్ను చెల్లిస్తున్నారు. నిజానికి మన దేశ ఆదాయాల స్థాయిని బట్టి గణాంకాల ఆధారంగా సంపన్నులు 23 శాతం ఆదాయ పన్ను చెల్లించాల్సి ఉంటుంది. కాని లక్షల విలువైన కార్లు కొనుగోలు చేసేవారు, విహారం కోసం ప్రతి సంవత్సరం విదేశాలకు వెళ్లే 2 కోట్ల మంది భారతీయులు, సినిమా పరిశ్రమలో, క్రికెట్ ఆటలల్లో ఆర్జించిన భారీ ఆదాయ వర్గాలు చేసే పన్ను చెల్లింపు నామ మాత్రమే. పన్ను చెల్లించే కొద్దిమందిలోను అత్యధికులు వేతన జీవులే ఉంటున్నారు.

మన స్థూల జాతీయోత్పత్తిలో పన్నుల వాటా కేవలం 16.6 శాతం మాత్రమే. అగ్ర దేశాలను వదిలేసి కనీసం మన స్థాయి దేశాలతో పోల్చుకున్నా ఇది చాలా తక్కువ. వ్యక్తిగత ఆదాయ పరిమితిని పెంచకుండా, పన్ను రేటును కాస్త సవరించి స్వల్ప ఆదాయ జీవులకు భారీ డిస్కౌంట్ అందజేశామని ప్రకటించింది. అయితే రు. రెండు లక్షల యాభై వేల నుండి ఐదు లక్షల వరకు గతంలో ఉన్న 10 శాతం పన్ను రేటును 5 శాతానికి తగ్గించారు. దీని వలన ఏ స్థాయి శ్లాబుల్లో ఉన్న వారికైనా గరిష్టంగా రు. 12,500 ప్రయోజనం మాత్రమే. 5 లక్షల నుండి 10 లక్షల వరకు 20 శాతం పన్ను పరిధి యథావిధిగా ఉంచినారు. దీని వలన ఈ పరిధిలోని వారిపై తీవ్ర భారాన్ని మోపినట్లే. చెల్లించే వారిపై అధిక భారాన్ని మోపి, ఎగవేతదారులకు కళ్లెమెక్కడ లేదు.

**వస్తు సేవల పన్ను (జిఎస్‌టి)**

ఏడు దశాబ్దాల స్వాతంత్ర్య భారతంలో పన్ను సంస్కరణల్లో వస్తు సేవల పన్ను, కేంద్రం వేసే ఎక్సైజ్ పన్ను, రాష్ట్రాలు విధించే అమ్మకం పన్ను, వ్యాట్, సర్‌చార్జీల వంటి పన్నుల స్థానంలో ఒకే పన్ను విధానాన్ని అమలు చేయడానికి ఉద్దేశించిందే వస్తు సేవల పన్ను. ఇది ఈ సంవత్సరం జూలై మాసం నుండి ఆచరణాత్మకంగా అమల్లోకి రానుంది. దీని అమలు ద్వారా పన్ను పరిధి విస్తృతం కానుంది. దీనితో కేంద్ర, రాష్ట్రాలకు భారీ మొత్తంలో ఆదాయాలను సమకూర్చుకునే అవకాశముంది. వస్తు సేవల పన్నుకు సంబంధించిన వివిధ అంశాలను సమగ్రంగా చర్చించి పన్ను రేట్లను, కేంద్ర, రాష్ట్రాల వాటాలను నిర్ధారించుకోవడానికి కౌన్సిల్ సుదీర్ఘంగా 9 సార్లు సమావేశమైన తర్వాత చట్ట రూపం దాల్చింది. ఈ వస్తు సేవల పన్నులో క్రియాశీలక భాగస్వాములైన వర్తక, పారిశ్రామిక వర్గాల్లో మరింత అవగాహన ప్రభుత్వం కల్పించాల్సిన అవసరముంది. ఈ చట్టం ప్రకారం దేశంలో గుర్తించిన అన్ని రకాల వస్తు సేవలపై పన్ను కట్టాల్సిందే. అయితే సంపద అంతా కేవలం ఒక శాతం మంది చేతిలో ఉన్న ఈ దేశంలో వస్తు సేవల పన్ను నిత్యావసరాలపై తక్కువగా, విలాస వస్తు సేవలపై అధికంగా ఉండేలా చర్యలుండాలి. అంకుర పరిశ్రమలకు మినిమం ఆల్టర్‌నేటివ్ ట్యాక్స్‌ను తొలగించాలని కోరినా ప్రభుత్వం అంగీకరించలేదు. కాని 50 కోట్ల టర్నోవర్ ఉన్న కంపెనీలకు పన్నును 30 శాతం నుంచి 25 శాతానికి తగ్గించారు. ఈ ఆర్థిక సంవత్సరంలో ప్రభుత్వ రంగ సంస్థల్లో వాటాలా ఉప సంహరణ ద్వారా 72,500 కోట్లు భారీగా సమీకరిస్తున్నట్లు ప్రకటించడమంటే ఆర్థిక వ్యవస్థను మరింత వేగంగా ప్రైవేట్ పరం చేస్తున్నట్లుగా అర్థం చేసుకోవాలి.

**స్టాక్ మార్కెట్లు**

ద్రవ్యలోటుకు సంబంధించి క్రమశిక్షణ విదేశీ ఇన్వెస్టర్లపై పన్ను మినహాయింపు వ్యవసాయ రంగ వృద్ధిరేటు 4.1 శాతం నిర్ధారించి రైతుల ఆదాయాలను రెండింతలు చేస్తామని, మధ్యతరగతికి అందుబాటు ధరలో జనరిక్ మందుల వాడకాన్ని పెంచే ప్రకటనలతో బడ్జెట్ ప్రకటించిన రోజు స్టాక్ మార్కెట్ అత్యధికంగా ప్రభావితం అయి ఎరువులు, పురుగు మందుల కంపెనీలు, వ్యవసాయ యంత్రాలతో పాటు ఫార్మా కంపెనీల షేర్లు లాభాల బాట పట్టాయి. షేర్ల బదిలీ సంబంధిత పన్నుల నుంచి మొదటి రెండవ కేటగిరి విదేశీ ఇన్వెస్టర్లను మినహాయించడం మదుపరులను ఆకర్షించినప్పటికీ రెండు, మూడు రోజుల్లోనే మదుపరులకు బడ్జెట్ సారం అర్థంకావడంతో నిరాశతో స్టాక్ మార్కెట్ పూర్వ స్థితికి చేరింది.

**ముగింపు**

సంప్రదాయానికి భిన్నంగా ప్రవేశపెట్టే తేదీలు ముందుకు జరిగినంత మాత్రాన బడ్జెట్ చరిత్ర సృష్టించదు. బడ్జెట్ కేటాయింపుల అనంతరం ప్రజా జీవన ప్రమాణంలో ఆశించిన మార్పు రాదు. కనీస మార్పు అయినా కనిపించినపుడు నేడు అది ఆదర్శ బడ్జెట్ అవుతుంది. పిడికెడు మంది పారిశ్రామిక వర్గాల ప్రయోజనాల కోసం కోట్ల రాయితీలివ్వడమే కాదు. కోట్ల గ్రామీణ జనాభా గల ఈ దేశంలో ప్రభుత్వ గణంకాల ప్రకారం ప్రత్యక్షంగా పరోక్షంగా అధిక ఉపాధి ఉద్యోగితను కల్పిస్తున్న వ్యవసాయ రంగానికి భారీ నిధులను కేటాయించి, ఈ రంగాన్ని

# మోడీ గారడీ బడ్జెట్

**ఈ బడ్జెట్‌లో కూడా మౌలిక రంగాలైన వ్యవసాయం, విద్య, ఆరోగ్యం, సంక్షేమానికి, అతి పెద్దపబ్లిక్ రంగమైన రైల్వేలకు కేటాయింపులు కుదించబడ్డాయనీ, కార్పొరేట్, రాజకీయ ప్రయోజనాలకు పెద్ద పీటవేశారనీ అంటున్నారు షేక్ కరిముల్లా**

స్థూలంగా ఒక ఆర్థిక సంవత్సరంలో ప్రభుత్వ ఆదాయ, వ్యయ పట్టిక, సర్కారు ఆర్థిక విధాన పత్రం, దేశ వార్షిక ఆర్థిక నివేదికే కేంద్ర బడ్జెట్. ఆర్థిక సంవత్సరం ఏప్రిల్ 1 నుంచి మొదలై మార్చ్ 31తో ముగుస్తుంది. ఈ సంవత్సర కాలంలో ప్రభుత్వం చేసే ఆదాయ వ్యయాల వివరాలు బడ్జెట్‌లో ఉంటాయి. ప్రభుత్వం ప్రజల నుంచి పన్నుల రూపంలో వసూలు చేసిన ధనాన్ని వారి కోసం ఎలా వినియోగించబోతున్నదో వివరించే కార్యాచరణ ప్రణాళిక. ఇందులో ప్రధాన అంశాలు.

**ప్రణాళికా వ్యయం:** ప్రభుత్వం ఆదాయ వనరులను, ఆస్తులను సృష్టించుకునేందుకు చేసే వ్యయం ఇది. రాష్ట్రాల, కేంద్ర పాలిత ప్రాంతాల ప్రణాళికలకు చేసే కేటాయింపులు ఈ ఖాతాలలో ఉంటాయి.

**ప్రణాళికేతర వ్యయం:** ప్రభుత్వ ఉద్యోగుల జీత భత్యాల చెల్లింపులు, రక్షణ, పోలీసు వ్యవస్థల నిర్వహణ, ఎన్నికల నిర్వహణ, కళలు, క్రీడలు, కుటుంబ సంక్షేమం, సమాచార ప్రసార, పర్యాటక రంగాలు, విదేశీ వ్యవహారాలు, కార్మిక సంక్షేమం, వ్యవసాయ రంగాలకు వెచ్చించే నిధులు, వడ్డీలు, రుణచెల్లింపులు ప్రణాళికేతర ఖాతాలోకి వస్తాయి. రాష్ట్ర ప్రభుత్వాలకు ఇచ్చే ప్రణాళికేతర గ్రాంటులు కూడా ఈ ఖాతాలోనే ఉంటాయి.

**రెవెన్యు వ్యయం:** ప్రభుత్వ నిర్వాహణ, ప్రభుత్వ ఉద్యోగుల జీత భత్యాలు, వడ్డీ చెల్లింపులు, సబ్సిడీలు, బదిలీలపై చేసే ఖర్చును రెవెన్యు వ్యయంగా పేర్కొంటారు. ఇది ప్రభుత్వానికి ఎలాంటి ఆస్తులను సృష్టించదు.

**రెవెన్యు లోటు:** రెవెన్యు వసూళ్లు, వ్యయానికి మధ్య తేడా.

**ప్రత్యక్ష పన్నులు:** ప్రభుత్వానికి నేరుగా చెల్లించే పన్నులు ఆదాయ పన్ను, సంపద పన్ను, ఫ్రింజ్ బెనిఫిట్ ట్యాక్స్ మొదలైనవన్నీ ఈ కోవలోకే వస్తాయి.

**పరోక్ష పన్నులు:** మనం చేసే వ్యయాలపై పరోక్షంగా విధించే పన్ను. కస్టమ్స్, ఎక్సైజ్, సర్వీస్ ట్యాక్స్‌లన్నీ దీని పరిధిలోకే వస్తాయి.

ఈ ఆర్థిక సంవత్సరం అనేక ఒడిదుడుకులు నెలకొని ఉన్నాయి. నోట్ల రద్దు నిర్ణయం అనేక రంగాలపై తీవ్ర ప్రతికూల ప్రభావం చూపింది. జిడిపి ఒక్కసారిగా కుప్పకూలింది. మన ఆర్థిక వ్యవస్థకు వెన్నెముక అయిన వ్యవసాయ రంగం, మిగతా అసంఘటిత రంగాలు కోలుకోలేని విధంగా దెబ్బతిన్నాయి. భారత ఆర్థిక వ్యవస్థ ఈ ఏడాది కోలుకోవడం కష్టం అని డచ్ బ్యాంకు పేర్కొంది. 6.5 శాతం మించి వృద్ధి ఉండక పోవచ్చని ఆ బ్యాంకు పేర్కొంది. ముంబాయికి చెందిన అంబిత్ కేపిటల్ అంచనా ప్రకారం 3.5 శాతం వృద్ధినే ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో భారత్ సాధించే అవకాశం ఉందని తేల్చి చెప్పింది.

అభివృద్ధి పథంలో పరుగులెత్తుతున్నదని మన పాలకులు ఎన్ని గొప్పలు చెప్పుకుంటున్నా భారత్ అనేక రంగాలలో ఇతర దేశాలతో పోలిస్తే వెనుకబడి ఉంది.

ఆర్థికంగా ఎదుగుతున్న 73 దేశాలతో పోలిస్తే సమ్మిళితవృద్ధి సూచీలో భారత్‌కు 61వ స్థానం, ప్రతిభా పాటవాల్లో 92వ స్థానం దక్కాయి. ప్రపంచ నగరాల్లో ఒక్క ముంబాయికి మాత్రమే చోటు దక్కింది. ఇవిగాక ప్రపంచ దేశాల్లో మానవ మూలధనం విలువలో 105వ స్థానంలోనూ, విద్యా వ్యవస్థ నాణ్యతలో 39వ స్థానంలోనూ, యువత అక్షరాస్యత విషయంలో 103వ స్థానంలోనూ, అత్యంత ఆనంద దాయకంగా జీవించే ప్రజలున్న దేశాలలో 118వ స్థానంలోనూ, యాచకుల సంఖ్యలో ప్రథమ స్థానంలోనూ, సుస్థిర అభివృద్ధి సాధనలో 153వ స్థానంలోనూ, ఆకలి సూచిలో 97వ స్థానంలోనూ, ఆరోగ్య రంగంలో 143వ స్థానంలోనూ భారతదేశం ఉండడం విచారకరం. 75 శాతం గ్రామీణ ప్రజల నెలసరి

సాంకేతికంగా అభివృద్ధి చేసి, ఆచరణాత్మకంగా ముందుకు నడిపించాలి. పరిశ్రమలకు ఇచ్చినట్లుగానే అనేక రాయితీలను వ్యవసాయానికి కూడా వర్తింప చేసి, ఉపాధి హామీ లాంటి పథకాల కేటాయింపులు మరింతగా పెంచి, వ్యవసాయ అనుబంధ రంగాలకు ఉపయోగపడేలా చర్యలుండాలి. ప్రపంచంలోనే అత్యధికంగా యువత ఉన్న దేశంలో విస్తృతమైన ఆరోగ్యకరమైన మానవ వనరుల అభివృద్ధికి అధిక నిధులు కేటాయించి, నైపుణ్యం గల మనుషులను పనిముట్లుగా, సమాజాభివృద్ధి సాధనాలుగా ఉపయోగించాలి. ఆదాయ పన్ను శాఖను మరింత బలోపేతం చేసి, పన్ను పరిధిలోకి వచ్చే అసెస్సీలందరిని గుర్తించి, ఎగవేత దారుల నుండి రావలసిన పన్ను మొత్తాలను వసూలు చేసి, ప్రభుత్వ రాబడిని గరిష్టం చేసుకున్నప్పుడు మాత్రమే కేటాయింపులు అత్యధికంగా ఉంటాయి.

నల్లధనం వెలికితీత పేరుతో పెద్ద నోట్ల రద్దు అనంతరం మొత్తం పౌర సమాజాన్ని ప్రభావితం చేసే దిశగా ఈ బడ్జెట్ రూపుదిద్దుకుంటుందని భావించారు. కాని ప్రభుత్వం పబ్బం గడపడానికే ప్రతి సంవత్సరం లాగే ఈ బడ్జెట్‌ను ప్రవేశపెట్టింది. సామాన్య మానవునికి గతంలాగే చేయూత ఇవ్వకపోగా, రిక్తహస్తాన్ని అందించింది. మాటల గారడితో ప్రతిపక్షాల గొంతును కట్టడి చేసి, అధికార బలంతో మీడియాల్లో గొప్పగా ప్రచారం చేయించుకున్న ప్రభుత్వం అర్థం కాని గణాంకాల కూర్పు, అర్థమేలేని వృద్ధి కోసం కాకుండా, ప్రజల ఆకాంక్షల సమగ్ర విస్తరణ భవిష్యత్ బడ్జెట్ లక్ష్యం కావాలి.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ అప్లైడ్ ఎకనామిక్స్, తెలంగాణ విశ్వవిద్యాలయం)*

ఆదాయం రు. 5 వేల కన్నా తక్కువే. వీటన్నింటిని సరిదిద్దే ప్రతిపాదనలు కొత్త బడ్జెట్‌లో లేవు.

స్వాతంత్ర్యానంతరం ప్రతి సంవత్సరం బడ్జెట్ చిట్టా పద్దులు వస్తున్నాయి, పోతున్నాయి. ఈ పద్దులేవీ సామాన్య ప్రజల జీవితాలలో వెలుగును నింపలేకపోతున్నాయి. ప్రపంచ బ్యాంకు ప్రతినిధులు, అదానీలు, అంబానీలు తయారు చేసి ఇచ్చే బడ్జెట్ చిట్టా పద్దులు వారి ప్రయోజనాలు కాపాడుతున్నాయి గాని, బడుగు జీవుల జీవితాలలో వెలుగు ఎందుకు నింపుతాయి? ఈ పరిస్థితుల్లో ఆర్థిక రంగంలో అసాధారణ మందగమనం నెలకొని ఉన్నవేళ 'అచ్ఛేదిన్' వారి 2017-18 కేంద్ర సాధారణ బడ్జెట్‌ను ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ ఫిబ్రవరి 1న పార్లమెంట్‌కు సమర్పించారు. ముచ్చటగా మూడోసారి ప్రవేశపెట్టిన బడ్జెట్‌లో మంత్రి అనేక జిమ్మిక్కులు, టక్కుటమారా విద్యలను ప్రదర్శించారు.

కార్పొరేట్ల కోసం రూపొందించిన బడ్జెట్‌ను ఐదు రాష్ట్రాల ఎన్నికల నేపథ్యంలో సామాన్యుల కోసమే అన్నట్లు మసిపూసి మారేడుకాయ చేసే ప్రయత్నం చేశారు. పరోక్ష పన్నులను అదనంగా రు. 75 వేల కోట్ల మేర వసూలు చేయాలంటూ నిర్దేశించుకున్న లక్ష్యం భవిష్యత్తులో సామాన్యులకు శాపంగా మారనుంది. అదే సమయంలో కార్పొరేట్లకు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ పలు రాయితీలు కల్పించారు. 92 సంవత్సరాల తర్వాత సాధారణ బడ్జెట్‌లో భాగంగా ప్రవేశపెట్టిన రైల్వే బడ్జెట్‌లో భద్రతను పూర్తిగా విస్మరించారు. రైలుఛార్జీల పెంపునకు తలుపులు తెరిచారు. వ్యవసాయం, ప్రాథమిక సదుపాయాలకు కేటాయింపుల శాతం గత బడ్జెట్‌తో పోలిస్తే తగ్గిపోయింది. బడ్జెట్‌లో ఎస్‌సి, ఎస్‌టిల సంక్షేమానికి కేటాయించిన మొత్తం వారి జనాభాతో పోల్చిన మొత్తం బడ్జెట్‌తో సరితూచిన కంటి తుడుపునకు సరికాదు. రైతులకు ఊరటనిచ్చే రుణాల రద్దు, గిట్టుబాటు ధరల వంటి అంశాల ప్రస్తావన కూడా లేకపోగా వారి సబ్సిడీలకు కేటాయించిన నిధులలోనూ కోత పెట్టారు. ఉపాధి హామీ పనులది ఇదే స్థితి! మహిళా సంక్షేమానికి నామ మాత్రపు కేటాయింపులే! నోట్ల రద్దు వల్ల ఏర్పడిన మాంద్యం, ప్రపంచ వ్యాప్తంగా నెలకొన్న ఆర్థిక సంక్షోభం నేపథ్యంలో నూతన ఉద్యోగ ఉపాధి అవకాశాలను కల్పించడానికి బదులుగా ఉన్నవి ఊడగొట్టే దిశలో అడుగులు వేశారు. ఇలా దేశానికి వెన్నెముక అయిన అన్నదాతకు అరచేతిలో వైకుంఠం. ఉద్యోగ వర్గాలకు ఊరట అంతంతే. వ్యాపార వర్గాలకు నిరాశ. విద్య, వైద్య రంగాలపై శీతకన్ను, సాంఘిక సంక్షేమం, మహిళ, శిశు సంక్షేమానికి కంటి తుడుపు కేటాయింపులతో కేంద్ర బడ్జెట్ 2017-18 ఈసారీ ఉసూరుమనిపించింది. మొత్తం మీద జైట్లీ తాజా బడ్జెట్ కార్పొరేట్లకు ఖుషీ చేయగా, సామాన్యులకు కష్టాలను మిగల్చనుంది.

### వ్యవసాయ రంగం

జైట్లీ బడ్జెట్ సామాజిక రంగాలకు తీరని అన్యాయం చేసింది. సంక్షోభంలో ఉన్న వ్యవసాయ రంగాన్ని పూర్తిగా విస్మరించింది. 1998 నుంచి దేశంలో రైతులు ఆర్థికంగా చితికిపోయి, అప్పుల ఊబిలో దిగబడి, దిక్కుతోచక లక్షల సంఖ్యలో ఆత్మహత్యలు చేసుకున్నారు. మొదట ఈ దుస్థితి మహారాష్ట్రలోని విదర్భ, తెలంగాణ వంటి వెనుకబడిన ప్రాంతాలలోనే ఉండేది. ఇప్పుడు కోస్తాంధ్ర, పంజాబ్ వంటి సాగునీటి లభ్యత ఉన్న ప్రాంతాలలో కూడా సర్వ సాధారణం అయిపోయింది. శక్తికి మించి పెట్టుబడులు పెరిగిపోయాయి. వ్యవసాయం గిట్టుబాటు కాక, రైతులు బలవన్మరణం చెందుతున్నారు. వీరిని ఆదుకోవడానికి జైట్లీ చేసిందేమీ లేదు. రైతుల గిట్టుబాటు ధరల ఊసే లేదు.

### గ్రామీణాభివృద్ధి

గ్రామీణాభివృద్ధి రంగానికి ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయ కార్మికులకు సంవత్సరంలో కనీసం వంద రోజులు పని కల్పించేందుకు ఉద్దేశించిన మహాత్మగాంధీ ఉపాధి హామీ పథకం అమలులో కేంద్ర ప్రభుత్వం కాకి లెక్కలు, అంకెల గారడికి పాల్పడుతుంది. ఈ బడ్జెట్‌లో గ్రామీణాభివృద్ధికి కేటాయింపులే అందుకు నిదర్శనం. మొత్తం రు. 1,28,560 కోట్లు కేటాయించారు. వరుసగా 3 ఏళ్ల నుంచి దేశంలో పలు ప్రాంతాలలో కరువు తాండవిస్తున్న తరుణంలో ఈ నిధులు ఏ మూలకు చాలవు. 2019 నాటికి 50 వేల పంచాయితీల్లో పేదరిక నిర్మూలన లక్ష్యంగా కోటి మందిని దారిద్ర్యం నుంచి బయటకు తేవాలని నిర్ణయించారు. 2017-18 నాటికి ఉపాధి హామీ నిధులతో రైతుల పొలాల్లో 20 లక్షల నీటి కుంటల నిర్మాణం, 2018 మే నాటికి 100 శాతం గ్రామాల విద్యుద్దీకరణ, రక్షిత మంచి నీటి పరఫరాకు ప్రాధాన్యం. 2022 నాటికి గ్రామాల్లో 5 లక్షల మందికి నైపుణ్యంలో శిక్షణ. పంచాయితీరాజ్ సంస్థలో మానవ వనరుల అభివృద్ధి లక్ష్యాలుగా పెట్టుకున్నారు. ఇవి సాధించడానికి ఈ నిధులు సరిపోవు.

### విద్యా రంగం

జైట్లీ విద్యా రంగాన్ని చిన్న చూపు చూశారు. బడ్జెట్ కేటాయింపులు గత ఏడాది కంటే (రు. 73,599 కోట్లు) పెద్దగా పెంచిందేమీ లేదు. కేవలం రు. 79,686 కోట్లు మాత్రమే కేటాయించి చేతులు దులుపుకున్నారు. ఎప్పటిలాగే ఈ సారి కూడా బడ్జెట్‌లో ప్రాథమిక విద్యా రంగానికి అన్యాయమే జరిగింది. వేదిక దొరికితే చాలు 2030 నాటికి ప్రపంచంలోనే ఎదురులేని యువ శక్తిగా భారత్ వెలిగిపోనుందని ఊదరగొట్టే మోడీ మానవ వనరుల అభివృద్ధికి చేసిందేమీ లేదు. ప్రాథమిక విద్యలో చేరిన వారిలో 34 శాతం మంది మాధ్యమిక విద్యలోకి, 20 శాతం మంది మాత్రమే ఉన్నత విద్యలోకి చేరుకుంటున్నారు. మిగిలిన వారు మధ్యలోనే విద్యకు దూరమవుతున్నారు. అందరూ చదువుకోవడానికి కావలసిన సౌకర్యాలు, ప్రోత్సాహం అందించేలా ఈ రంగానికి కేటాయింపులు లేవు. ఫలితంగా దేశాభివృద్ధిలో కీలక భూమిక వహించే యువత నైపుణ్యం అందక దేశ భవిష్యత్తు అంధకారమైపోతోంది.

### ఆరోగ్య రంగం

ఆరోగ్యకరమైన భారతావనిని నిర్మించాలంటే జిడిపిలో 6 శాతం కేటాయించాలి. ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకుంటే ఆరోగ్యంపై బడ్జెట్ పెంపుదల 30-40 శాతం ఉండాలి. ఇది ఎన్నడూ జరగలేదు. జైట్లీ ఈ బడ్జెట్‌లో ఆరోగ్య, సంబంధ లక్ష్యాలు ఎన్నో ప్రకటించారు. 2017 సంవత్సరం లోగా కాలా అజార్, ఫైలేరియా నిర్మూలన, 2018 లోగా కుష్టువ్యాధి, 2020 లోగా తట్టు, 2025 లోగా క్షయ వ్యాధులను

నిర్మూలిస్తామని ప్రకటించారు. కానీ ఇన్ని లక్ష్యాలు సాధించడానికి కావలసిన నిధులు కేటాయించలేదు. కేవలం రు. 48,880 కోట్లు కేటాయించి చేతులు దులుపుకున్నారు. ఇవి ఏ మూలకు సరిపోతాయో అర్థం కాదు. పోనీ గత బడ్జెట్ కేటాయింపుల కంటే భారీగా పెంచారా అదీ లేదు. ఈ మాత్రం కేటాయింపులతో భయంకర వ్యాధులను మన దేశం నుంచి పారదోలడం సాధ్యమేనా? దేశం ఎదుర్కొంటున్న వ్యాధుల జాబితాను రూపొందించి, కేటాయింపులు పెంచి ప్రణాళికా బద్ధంగా వ్యవహరించకుంటే ప్రజారోగ్యం అందని ద్రాక్షే అవుతుంది. ఈ బడ్జెట్ జాతీయ ఆరోగ్య విధానం గురించి ఒక్కమాట మాట్లాడలేదు. ఈ కంటి తుడుపు కేటాయింపులు ప్రజారోగ్యాన్ని ఏమాత్రం రక్షించలేవు.

**సాంఘిక సంక్షేమం**

అణగారిన ప్రజల సంక్షేమం కోసం 1979-80 సంవత్సరం నుంచి ఎస్‌సి, ఎస్‌టిలకు ప్రత్యేక ఉప ప్రణాళికలు అమలు చేస్తున్నారు. ఈ వర్గాలకు బడ్జెట్ కేటాయింపులు ప్రత్యేకంగా పేర్కొనాలి. నిబంధనల ప్రకారం ప్రణాళిక బడ్జెట్ మొత్తంలో ఎస్‌సిలకు 16.6 శాతం, ఎస్‌టిలకు 8.6 శాతం చొప్పున కేటాయింపులు జరగాలి. ఈ వర్గాల సంక్షేమం పట్టని జైట్లీ అంకెల గారడీలో నిధులు పెంచినట్లు చూపినప్పటికీ, అది వాస్తవం కాదు. సవరించిన అంచనాలతో మొత్తం రు. 40,920 కోట్లు చూపారు. ఈ అంకెలను చూపుతూ కేంద్ర ప్రభుత్వం కేటాయింపులు పెంచినట్లు చెప్పుకున్నారు. వాస్తవానికి మొత్తం బడ్జెట్ పరిమాణంలో ఇది 2.4 శాతం మాత్రమే. నిబంధనల ప్రకారం కేటాయించాల్సిన ఎస్‌సి, ఎస్‌టి జనాభా నిష్పత్తితో పోలిస్తే చాలా తక్కువ కేటాయించారు. అలాగే మహిళ శిశు సంక్షేమం, మైనార్టీల సంక్షేమం విషయంలో కూడా ఇలాగే వ్యవహరించి రిక్తహస్తం చూపారు.

**వేతన జీవుల ఆశలపై నీళ్లు**

ప్రభుత్వ ఉద్యోగులకు మార్చ్ నెల వస్తుంటే గుండెల్లో రైళ్లు పరుగెడుతున్నాయి. భారీ మొత్తంలో చెల్లించాల్సిన ఆదాయ పన్ను చూసి హడలిపోతున్నారు. రు. 2.5 లక్షల పైన వార్షిక ఆదాయం ఉన్న ప్రతి ప్రభుత్వ ఉద్యోగి ఆదాయ పన్ను పరిధిలోకి వస్తారు. కొద్దిపాటి సర్వీసు ఉన్న అటెండర్ స్థాయి ఉద్యోగి సహితం ఆదాయం పన్ను చెల్లించాల్సి ఉంటుంది. వాస్తవానికి 12 నెలలు పనిచేస్తున్న 2 నెలల వేతనం పన్నులకే కట్టాల్సి వస్తుందని ఉద్యోగులు వాపోతున్నారు. సరాసరి నెలకు రు. 80 వేలు నెలవారి ఆదాయం కలిగిన ఓ జిల్లా స్థాయి అధికారి రు. 1.30 లక్షలు ఆదాయ పన్నుగా చెల్లించాల్సి వస్తుంది. ఈ స్లాబులో ఈ బడ్జెట్‌లో పెద్దగా మార్పు ఏమీ లేదు. ఈ విధంగా ఈ చేత్తో ఇచ్చి ఆ చేత్తో లాక్కోవడం దుర్మార్గం కాదా? ఇలా పన్ను పోటుతో సామాన్యుల బతుకు భారం కాదా? 5 లక్షల వరకు ఆదాయం కలిగిన వారికి పన్ను మినహాయింపు ఉంటుందని భావించిన వారికి నిరాశే మిగిలింది. అయితే రు. 2.5 లక్షల నుంచి 5 లక్షల లోపు ఆదాయం కలిగిన వారికి పన్ను రేటును తగ్గించడం (10 శాతం నుండి 5 శాతంకు) కొంత ఊరట కల్పించింది. అయితే ఈ వార రిబేట్‌లో రు. 5 వేల నుంచి 2,500కు తగ్గించి కోత వేశారు. మిగతా బేసిక్ లిమిట్‌లో మాత్రం ఎటువంటి మార్పులు చేయకపోవడంతో వేతన జీవులకు నిరాశ మిగిలింది.

**రక్షణ రంగానికి 10 శాతం పెరిగిన బడ్జెట్**

అనుత్పాధక రంగమైన రక్షణ రంగానికి 2017-18 బడ్జెట్‌లో రు. 2.74 లక్షల కోట్లు కేటాయించారు. మొత్తం బడ్జెట్‌లో ఇది 12.77 శాతం. ఈ రంగానికి బడ్జెట్‌లో ఈ ఏడాది నిధులు దాదాపు 10 శాతం పెంచారు. అలాగే కేంద్ర హోం శాఖకు భారీగా కేటాయింపులు చేశారు. పోలీసు బలగాలను ఆధునీకరించడంపై దృష్టి పెట్టి ఈసారి రు. 83 వేల కోట్లు కేటాయించారు.

2016-17లో ఇచ్చిన దానికంటే ఇది 11.24 శాతం ఎక్కువ. పెద్ద నోట్ల రద్దుతో దేశంలో ఆర్థిక మందగమనం నెలకొని ఉన్నవేళ అనుత్పాధక రంగమైన ఈ రంగానికి పెద్దపీట వేయడం ఎవరి ప్రయోజనాలు కాపాడడానికి?

నేడు ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక మాంద్యం నెలకొని ఉన్న కారణంగా దేశాలు కోలుకోలేని స్థితిలో ఉన్నాయి. ఫలితంగా మన ఆర్థిక వ్యవస్థ కూడా ఒడిదుడుకులను ఎదుర్కొంటుంది. మరోపక్క నోట్ల రద్దుతో పలు రాష్ట్రాల ఆదాయానికి భారీగా గండి పడింది. రెండు తెలుగు రాష్ట్రాల లోనూ, ముఖ్యంగా కొత్తగా ఏర్పడ్డ ఆంధ్రప్రదేశ్‌పై దీని ప్రతికూల ప్రభావం పడింది. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ 1.80 లక్షల కోట్ల అప్పుల ఊబిలో కూరుకుపోయి ఉందని ఆర్‌బిఐ వెల్లడించింది.

ప్రస్తుతం రాష్ట్రం ఏడాదికి వడ్డీ కింద రు. 15,895 కోట్లు చెల్లిస్తుందని చెప్పింది. ఈ పరిస్థితిని చక్కదిద్దాల్సిన భారం బాధ్యత కేంద్రంపై ఉండగా, కేంద్ర బడ్జెట్ రాష్ట్ర ప్రజలకు ఎలాంటి ఊరట కల్పించక రిక్తహస్తం చూపింది. ఇది ఇలా ఉంటే మన బడ్జెట్ మొత్తం ఖర్చులతో 26 శాతం కేవలం వడ్డీ చెల్లింపులకే సరిపోతుంది. ఇంకా అభివృద్ధికి నిధులు ఎక్కడి నుంచి వస్తాయి? ఎప్పటికి మన ఆర్థిక వ్యవస్థ స్వయం పోషకమవుతుంది. ఇకనైనా ప్రభుత్వాలు ఎవరో పెట్టే పెట్టుబడుల కోసం దేబరించకుండా దేశీయ వనరులను అభివృద్ధి చేసుకోవాలి.

ప్రతి సంవత్సరం వార్షిక బడ్జెట్‌ను ప్రవేశపెట్టే మన ప్రభుత్వాల వెనుక మాయాజాలం టక్కుటమార గారడి విద్యలు ఏమిటంటే ఏయే రంగాలకి ఎంత మొత్తాలను కేటాయిస్తారో చెబుతారే తప్పా, నిజంగా అందులో ఎంత మొత్తం ఖర్చు చేశారో, చేస్తున్నారో, నిజంగా ఎంత మొత్తం క్షేత్ర స్థాయిలో లబ్ధీదారులకు చేరిందో చెప్పే జవాబుదారీ తనం లేదు. ఇవన్ని కాకి లెక్కల చిట్టా పద్దుల కింద తేలిపోవాల్సిందే. ఇన్ని లొసుగులుంటే ఈ దేశం బాగుపడమంటే ఎలా బాగుపడుతుంది. రోజులు గడుస్తున్న కొద్దీ దేశ ప్రజలకు 'అచ్చేదిన్'లు సరే, 'చచ్చేదిన్'లు రాబోతున్నాయని అర్థమవుతుంది.

ప్రస్తుతం జరుగుతున్న 5 రాష్ట్రాల ఎన్నికలను దృష్టిలో పెట్టుకొన్ని ఒక నెల ముందే ప్రకటించిన ఈ బడ్జెట్ సామాన్యులకు అర్థం కాని అంకెల గారడీ తప్పితే ఏమిలేదు. ఉపాధిలేమి, ద్రవ్యోల్బణం, పేదరికం లాంటి ప్రధాన సమస్యలకు పరిష్కారం చూపడంలో బడ్జెట్ విఫలమైంది. అణగారిన ప్రజలు మరోమారు వంచనకు గురైనారు. బడ్జెట్ కేటాయింపులో దాగిన మోడీ సర్కార్ సంపన్న సేవా తత్పరత మరోమారు రుజువైంది. ఈ బడ్జెట్ 'ఫెయిర్ అండ్ లవ్లీ వాడిన' 'సంతూర్ కార్పొరేట్ సుందరి' అని స్పష్టమైంది.

*(రచయిత ఆర్థిక శాస్త్ర విద్యార్థి, సామాజిక విశ్లేషకులు)* వీ

# ఐదు రాష్ట్రాల్లో ఎన్నికలు

**ఎన్నికలు జరుగుతున్న ఐదు రాష్ట్రాల్లో ఆయా పార్టీల పాలనలో జరిగిన అవినీతి, హత్యలు, అత్యాచారాలు, మతకల్లోలాల వల్ల ప్రజలు ఏ పార్టీకి కూడా పూర్తి మెజారిటీ ఇచ్చే పరిస్థితి లేదని అంటున్నారు వై. రామచంద్రం**

ఐదు రాష్ట్రాల్లోని 690 అసెంబ్లీ స్థానాలకు జరుగుతున్న సాధారణ ఎన్నికలు కేంద్రంలో బిజెపి అధికారంలోకి వచ్చాక రాష్ట్రాలకు జరుగుతున్న మూడో దఫా ఎన్నికలు. కేంద్ర సాధారణ ఎన్నికలు-2014 తరువాత జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో బిజెపి అస్సాం తప్ప మిగతా ఏ రాష్ట్రంలో కూడా అధికారంలోకి రాలేదు. బిజెపి మూడు సంవత్సరాల పాలన తీరును పరిశీలిస్తే దేశ వ్యాప్తంగా ఆదివాసులపై, దళితులపై, ముస్లింలపై పెరిగిన హత్యాకాండ, పాలక పార్టీ కారణంగా జరిగిన రోహిత్ వేముల ఆత్మహత్య ఘటన, సర్జికల్ స్ట్రైక్స్, ఉనా ఘటన, పెద్ద నోట్ల రద్దు నేపథ్యంలో రెండు సంవత్సరాల్లో పార్లమెంట్ ఎన్నికలు జరుగనున్న సందర్భంలో ఐదు రాష్ట్రాల్లో ఎన్నికలు జరుగుతున్నాయి.

ఎన్నికలు జరుగుతున్న రాష్ట్రాల్లోని పరిస్థితులను పరిశీలిస్తే 403 అసెంబ్లీ స్థానాలతో, 20 కోట్ల జనాభా కలిగిన ఉత్తరప్రదేశ్(యుపి)లో సమాజ్‌వాదీ పార్టీ అధికారంలో ఉంది. ఈ ఐదు సంవత్సరాల పాలనలో ప్రధానంగా ప్రజా పక్షం నుంచి చూస్తే ముజఫర్‌నగర్‌లో జరిగిన మత ఘర్షణలు, నిత్యం అత్యాచారాలు, హత్యలు కొనసాగుతూనే ఉన్నాయి. ఇక అవినీతికి ఈ పార్టీ అతీతం ఏమీకాదు. అంతర్గత కలహాలు రగులుతూనే ఉన్నాయి. వీటన్నింటి నేపథ్యంలోనే సమాజ్‌వాదీ పార్టీ కాంగ్రెస్‌తో పొత్తుపెట్టుకుంది. యుపిలో ప్రధాన పార్టీలైన సమాజ్‌వాదీ, బి.ఎస్.పి, బి.జె.పి, కాంగ్రెస్‌లకు దేనికి కూడా సొంతంగా అధికారంలోకి వచ్చే పరిస్థితి లేదు.

పంజాబ్‌లో బిజెపి మద్దతుతో అధికారంలో ఉన్న శిరోమణి అకాలీదళ్ అవినీతిలో కూరుకుపోయి ఉంది. ఇక్కడ ఆమ్ ఆద్మీ పార్టీ, కాంగ్రెస్, బిజెపిలకు సొంతంగా అధికారంలోకి వస్తామన్న విశ్వాసం లేదు.

మణిపూర్‌లో 15 సంవత్సరాలుగా అధికారంలో ఉన్న కాంగ్రెస్ అధికారాన్ని నిలుపుకునేందుకు, ఎట్లయినా అధికారంలోకి రావాలని విపక్ష బిజెపిలు కోట్ల రూపాయలు వెదజల్లుతూ భారీ కటౌట్లతో నిర్వహిస్తున్నాయి. ఇక్కడే ఇరోం షర్మిల నేతృత్వంలోని పీపుల్స్ రిసర్జెన్స్ అండ్ జస్టిస్ అలయన్స్ (పిఆర్‌జెఎ) చాలా తక్కువ ఖర్చుతో ఇంటింటి ప్రచారంతో, సోషల్ మీడియా ప్రచారంతో ముందుకు వెళుతోంది.

గోవాలో అధికారంలో ఉన్న బి.జె.పి పరిస్థితి అంతంత మాత్రంగానే ఉంది. ఉత్తరాఖండ్‌లో అధికారంలో ఉన్న కాంగ్రెస్ కేంద్రంలో అధికారాన్ని అడ్డం బెట్టుకొని బి.జె.పి చేస్తున్న కుట్రలకు పడుతూలేస్తూ సాగుతున్న పరిస్థితి ఉంది. మొత్తంగా ఏ పార్టీకి కూడా అధికారంలోకి వస్తామన్న పూర్తి విశ్వాసం లేదు.

ఎన్నికల్లో పార్టీలు ప్రజలకు ఇస్తున్న వాగ్దానాలను చూస్తే రాజకీయ నాయకులు అధికారం కోసం, పెట్టుబడిదారులు మార్కెట్ కోసం ఎటువంటి వ్యూహాలను పన్నుతున్నారో వారి హామీల ద్వారా అర్థమవుతోంది. వారు అధికారంలోకి వస్తే చేతికి సెల్ ఫోన్, ల్యాప్‌ట్యాప్ ఇలా రకరకాల ప్రలోభాలతో ముందుకు వస్తున్నారు. ప్రజల మౌలిక అవసరాలైన కూడు, గూడు, గుడ్డ, విద్య, వైద్యం, ఉపాధి రంగాల గురించి మాటెత్తడం లేదు. అన్ని పార్టీల నాయకులు ఇతర పార్టీల పేర్లను, నాయకుల పేర్లను హేళన చేస్తూ ప్రచారం చేస్తున్నారు. బిజెపి అధ్యక్షుడు అమిత్ షా ఉత్తరప్రదేశ్ ఎన్నికల ప్రచారంలో భాగంగా కాంగ్రెస్, సమాజ్‌వాదీ, బిఎస్‌పిలను 'కసబ్' పార్టీలుగా చెపుతున్నారు. దీన్నిబట్టి పార్టీలకు ప్రజా సమస్యలు అప్రధానమై మత విద్వేషాలను రెచ్చగొట్టడానికి, వ్యక్తిగత విమర్శలకు ప్రాధాన్యతనిస్తున్నాయి. ఎన్నికల్లో పోటీపడుతున్న వాళ్లలో అత్యధికులు నేరస్తులు, కోటీశ్వరులే అనే విషయాన్ని వివిధ సంస్థలు తమ సర్వేల ద్వారా ప్రకటించాయి.

కేంద్రం ఐదు రాష్ట్రాల ఎన్నికల ముందు ప్రకటించిన పెద్దనోట్ల రద్దువల్ల ప్రజల్లో కోల్పోయిన విశ్వాసాన్ని పొందడానికి మార్చ్‌లో ప్రవేశ పెట్టాల్సిన బడ్జెట్‌ను ఫిబ్రవరి మొదటి వారంలోనే ప్రవేశ పెట్టింది. పాలకులు ప్రజల విశ్వాసం కోల్పోయి ఎప్పటికప్పుడు ప్రజలను ఆకర్షించే ప్రయత్నంలో భాగంగానే బడ్జెట్‌ను ముందు ప్రవేశపెట్టారు.

భారతదేశం రాష్ట్రాలతో కూడిన సమాఖ్య అంటూనే కేంద్రం అధికారాన్ని అడ్డంబెట్టుకొని రాజకీయ అస్థిరత ఏర్పడిన ప్రతిచోట రాష్ట్రపతి పాలన గాని, లేదా వక్రమార్గంలో అధికారంలోకి రావడానికి గాని ప్రయత్నిస్తోంది. గతంలో ఉత్తరాఖండ్‌లో కాంగ్రెస్‌ను అధికారం నుంచి తప్పించడానికి రకరకాల ప్రయత్నాలు చేసింది. ఈ మధ్యే తమిళనాడులో కేంద్రం పన్నీర్‌సెల్వం వెనక ఉండి ఆడించిన నాటకాన్ని బట్టి తెలుస్తుంది. తమిళనాడులో మెజారిటీ ఎంఎల్ఎల మద్దతు ఉన్న శశికళను ముఖ్యమంత్రిగా ఆహ్వానించకుండా తాత్సారంచేసి పెండింగ్‌లో ఉన్న అక్రమాస్తుల కేసును తెరపైకి తెచ్చి శశికళను జైలుకు పంపడంలో ప్రదర్శించిన అత్యుత్సాహాన్ని చూస్తే అర్థమవుతుంది. ప్రజల ఆచార సంప్రదాయాలను, వెనుకబాటుతనాన్ని రాజకీయ పార్టీలు తమకు అనుకూలంగా ఎలా మలుచుకుంటాయో తమిళనాడులో జల్లికట్టు క్రీడపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కూడబలుక్కొని తెచ్చిన ఆర్డినెన్స్‌తో ప్రజల్ని మరింత చీకటిలోకి నెట్టాయి.

పాలకులు ప్రజలను ఓటర్లుగా మాత్రమే చూస్తున్నారనడానికి ఈ మధ్య కేంద్ర మంత్రి వెంకయ్యనాయుడు ఓటు హక్కు ఉన్న ప్రతివ్యక్తిని ఎన్నికల్లో నిర్బంధంగానైనా ఓటు వేయించేలా రాజ్యాంగ సవరణ చేయాల్సిన అవసరముందన్నారు. రాజ్యాంగంలో ఓటు హక్కు ఉన్న ప్రతి వ్యక్తి ఓటు వేసే హక్కుతో పాటు తనకు నచ్చకపోతే వేయకుండా ఉండే హక్కు కూడా ఉంది. ఈ హక్కును పాలకులు రద్దుచేయాలని అనుకుంటున్నారు. మరోపక్క ఇటీవల న్యాయస్థానాలు కూడా ఓటు వేయకపోతే, ప్రభుత్వ విధానాలను విమర్శించే హక్కు లేదనడం గమనార్హం. పాలకులు ఓట్లు రాబట్టుకోవడానికి ప్రవేశపెడుతున్న

పథకాలు, మోహరిస్తున్న లక్షలాది సైన్యం, విచ్చల విడిగా పంచిపెట్టే సందర్భంలో పట్టుబడుతున్న కోట్లాది డబ్బు, కోట్ల రూపాయల విలువచేసే మద్యం కూడా ఈ వ్యవస్థ మీద ప్రజలకు విశ్వాసాన్ని కలిగించలేని పరిస్థితిని తెలుపుతున్నాయి.

ఉత్తరప్రదేశ్‌లోని ముజఫర్‌నగర్‌లో ఆగస్టు నుండి సెప్టెంబర్ 2013లో మైనారిటీ మతస్తులపై దాడులు చేశారు. 2014లో జరిగిన పార్లమెంట్ ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని హిందూ మతతత్వ శక్తులు ఈ దాడులకు పాల్పడ్డాయి. ఈ దాడుల్లో 62 మంది మరణించగా 93 మంది తీవ్రంగా గాయపడినట్లు ప్రభుత్వ లెక్కలు చెపుతున్నాయి. ఈ కారణంగా 50 వేలకు పైగా నిర్వాసితులయ్యారు. ఆ ఘటన మైనారిటీల మనసుల నుంచి తొలిగిపోలేదు. అది ఇంకా పచ్చి పుండుగానే ఉందనడానికి బాధితులు ఇంకా శరణార్థి శిబిరాల్లోనే ఉన్నారు. లౌకిక ప్రజాస్వామ్య దేశమని చెప్పుకుంటున్న ఈ దేశంలో మైనారిటీలు ఎంత అభద్రతతో జీవిస్తున్నారో దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.

ఈ దేశంలో ఎన్నికలే ప్రజాభిప్రాయానికి సూచికలు కావాలి. ప్రజాస్వామ్య దేశంగా చెప్పుకుంటున్న దేశంలో ప్రజలు ఎన్నికల్లో ఓటు వేయడానికే ప్రజాస్వామ్యం తప్ప మిగతా ప్రభుత్వ నిర్ణయాల్లో ఎక్కడా ప్రజలకు భాగస్వామ్యం లేదు, అలాంటప్పుడు దీన్ని ప్రజాస్వామ్యం అని ఎలా అనగలం? పాలకులు అధికారంలోకి రావడానికి ఎన్నికల్లో డబ్బు, మద్యం విచ్చలవిడిగా పంచుతున్నారు. కుల, మతాల ప్రాతిపదికన ప్రజలను విభజించి ఓట్లు అడుగుతున్నారు. ఇదే విషయాన్ని సుప్రీం కోర్టు కూడా వెల్లడించింది. అభ్యర్థి మతం, కులం, భాష, ప్రాంతం ఆధారంగా ఓటు వేయాలని విజ్ఞప్తి చేయడం రాజ్యాంగ విరుద్ధమేనని, అది అవినీతి కిందికే వస్తుందని తెలిపింది. కులం, మత సంబంధ అంశాలను రాజ్యం ప్రభుత్వ కార్యకలాపాల నుంచి వేరు చేయాలని తీర్పులో పేర్కొంది.

ప్రధాని నవంబర్ 8న ప్రకటించిన పెద్దనోట్ల రద్దు మూలాల్లోకి వెళ్లి చూస్తే విస్తుగొలిపే దుర్మార్గాలు ఒక్కొక్కటి బయటికి వస్తున్నాయి. బిజెపి ప్రభుత్వం చెప్పిన కారణాలు నల్లధనం నిర్మూలన, అవినీతిని అరికట్టడం, తీవ్రవాదులు, మావోయిస్టుల వద్ద ఉన్న డబ్బు పనికిరాకుండా చేయాలనే ఉద్దేశంతో చేపట్టామని చెప్పింది. పెద్దనోట్ల రద్దు ఐదు రాష్ట్రాల్లో జరుగుతున్న అసెంబ్లీ ఎన్నికలకు ముందు ప్రకటించి బిజెపి రెండు ప్రయోజనాలను సాధించింది. ఎన్నికలు జరిగే రాష్ట్రాల్లోని పార్టీల వద్ద ఉన్న అక్రమ సంపదను పనికి రాకుండా చేసి తమ పార్టీ వారందరికీ ముందే జాగ్రత్తపడేలా చేసి, మిగతా పార్టీలపై పైచేయి సాధించే పనిచేసింది. తమ వద్ద ఉన్న అక్రమ సంపదను మార్చుకొని ఎన్నికల్లో విచ్చలవిడిగా ఖర్చుచేసి అధికారంలోకి రావాలనుకునే ప్రయోజనం ఒక మేరకు నెరవేరింది. అది ఓట్లుగా ఏమేరకు మారుతుందో చూడాల్సే ఉంది. ఇక రెండోది తమను అధికారంలోకి తెచ్చిన స్వదేశీ, విదేశీ కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలు నెరవేర్చడానికి పెద్దనోట్ల రద్దు ఉపయోగ పడింది. ఎలా అంటే పేటిఎం లాంటి విదేశీ సంస్థలకు, అట్లాగే స్వైపింగ్ మిషన్ సంస్థలకు, సెల్‌ఫోన్ కంపెనీలకు అట్లాగే పెద్ద ఎత్తున ఏర్పాటు చేసిన మాల్స్‌కు దీని వల్ల ప్రయోజనం చేకూరిందనేది వాస్తవం. చేతిలో నగదు లేదు కాబట్టి బ్యాంకుల్లో ఉన్న డబ్బును వాడుకోవాలంటే క్రెడిట్, డెబిట్ కార్డులు, పేటిఎం కోసం సెల్ ఫోన్‌లు, స్వైపింగ్ మిషన్‌లు కోట్ల సంఖ్యలో కొనాల్సిన అవసరం కల్పించింది. ఇవన్నీ కూడా కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలు నెరవేర్చడానికే అన్నది నగ్నసత్యం.

పెద్దనోట్ల రద్దు ఇప్పుడే అమలుచేయడం వెనక మరో కారణం కూడా ఉంది. ఒకవేళ పార్లమెంట్ ఎన్నికలకు ముందు ఈ నిర్ణయం తీసుకుంటే గనుక అది బిజెపికి నష్టం చేసే అవకాశం ఉంది. ఈ నిర్ణయం ఇప్పుడు తీసుకోవడం వల్ల వచ్చే నష్టాన్ని పూడ్చుకోవడానికి పార్లమెంట్ ఎన్నికలకు ఇంకా సమయం ఉంది కాబట్టే పెద్దనోట్ల రద్దు నిర్ణయం ఇప్పుడే తీసుకున్నారు. అంతర్జాతీయంగా కార్పొరేట్ సంస్థల ఒత్తిడికి తలొగ్గే ఈ నిర్ణయం తీసుకున్నారనేది ఈ క్రమంలో జరిగిన పరిణామాలను బట్టి అర్థమవుతోంది.

అసలు పెద్దనోట్ల రద్దు నిర్ణయానికి ముందే నోట్ల ముద్రణ ప్రారంభమైంది. ఆగస్టు 21న ఆర్‌బిఐ తదుపరి గవర్నర్‌గా ఉర్జిత్ పటేల్‌ను కేంద్రం ప్రకటించింది. సెప్టెంబర్ 4న రఘురామరాజన్ నుంచి ఉర్జిత్ పటేల్ అధికారికంగా బాధ్యతలు చేపట్టారు. ఈ లెక్కన ఆ నోట్లపై రఘురామరాజన్ సంతకం ఉండాలి! కాని ప్రస్తుత గవర్నర్ ఉర్జిత్ పటేల్ సంతకం ఎలా వచ్చిందనే ప్రశ్నకు ఆర్.బి.ఐ. నుంచి గాని, కేంద్రం నుంచి గాని, ఉర్జిత్ పటేల్ నుంచి ఎలాంటి సమాధానం లేదు. ఇది పాలకులకు ప్రజల పట్ల ఉన్న జవాబుదారీతనం. ఈ నిర్ణయంవల్ల దేశ ప్రజలు నానా ఇబ్బందులను ఎదుర్కొంటున్నారు. ప్రజల ఇబ్బందులను కప్పిపుచ్చడానికి దేశ సరిహద్దుల్లో సైనికుల సమస్యలను ముందుకు తెచ్చారు. ఇక్కడ ఎవరి ప్రయోజనాల కోసం ఎవరు ఇబ్బందులను ఎదుర్కోవలసి వస్తుందో అర్థం చేసుకోవాలి. పెద్దనోట్ల రద్దు వల్ల మొత్తంగా ప్రాంతీయ పార్టీల వద్ద ఉన్న డబ్బు పనికిరాకుండా చేసి దేశభక్తి పేరుతో బిజెపి ప్రజలను మోసం చేసి ఎన్నికల ప్రయోజనాల కోసం వాడుకుంది.

బిజెపి అధికారంలోకి వచ్చాక అధికారాన్ని అడ్డంబెట్టుకుని చేస్తున్న దాడులను, విధ్వంసాలను, హక్కుల హననాన్ని ప్రశ్నిస్తున్న గొంతులను నొక్కడానికి పోలీసులను ఉపయోగిస్తోంది. అంతమాత్రమే కాకుండా ప్రజా వ్యతిరేకమైన సంస్థలను, బృందాలను ఏర్పాటు చేసి ప్రజల పక్షం వహించి మాట్లాడుతున్న వారిని అణచివేయడం ప్రారంభించింది. దీనినంతా దేశభక్తి పేరుమీద, ప్రజాస్వామ్యం పేరుమీద ఒక ఉద్యమం రూపంలో నిర్మించడం మొదలుపెట్టింది. అయితే ఇది చివరకు చత్తీస్‌గడ్‌లో ప్రజాస్వామిక వాదుల నుంచి ప్రతిఘటనకు దారితీసింది. దానితో చివరకు కల్లూరి లాంటి వాళ్లకు కూడా ప్రజాప్రతిఘటన ఒత్తిడికి తలవంచక తప్పని స్థితిని కల్పించింది. అందులో భాగంగానే మరో సల్వాజుడుం లాంటి సంస్థలయిన అగ్ని లాంటి సంస్థలను రద్దు చేసుకుంటున్నట్లు ప్రకటించవలసి వచ్చింది. కనీస ప్రజాస్వామిక పోరాటాలను సైతం ప్రభుత్వాలు రకరకాల పద్ధతుల్లో అడ్డుకునే ప్రయత్నం చేస్తున్నాయి. కాబట్టి ప్రజలు పెద్ద సంఖ్యలో కదిలి ప్రభుత్వం నిర్మించుకున్న పోలీసు స్టేషన్లు, జైళ్లు కూడా సరిపోనంత స్థాయిలో ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలను నిలువరిస్తే తప్ప పాలకులు ఆగే పరిస్థితిలో లేరు.

సారాంశంలో అన్ని పార్లమెంట్ పార్టీలు ఒక్కటే అయినప్పటికీ గుజరాత్ లాంటి వేలాది మంది హననానికి పాల్పడి, బిజెపి దేశభక్తి గురించి పైకి మాట్లాడుతూ చేతల్లో దేశ సంపదను విదేశీ సంస్థలకు తాకట్టుబెడుతోంది. ఇంత ప్రమాదకరమైన ఫాసిస్టు పార్టీకి ప్రతిపక్షం అనేది లేకుండా పోతే ప్రజలకు ఊపిరి సలపని పరిస్థితి నెలకొంటుంది. కాబట్టి ఆ దృష్టితోనే ఈ ఎన్నికల జయాపజయాలను విశ్లేషించుకోవాలి. 2014 సాధారణ ఎన్నికల్లోనూ కార్పొరేట్లు తమ ప్రయోజనాలకోసం లక్షల కోట్లు ఖర్చుపెట్టి బిజెపి అధికారంలోకి రావడానికి కృషి చేసిన విషయం కూడా గుర్తుంచుకోవాలి.

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)* వీ

# తమిళనాడులో కుర్చీ కొట్లాట

***మాజీ ముఖ్యమంత్రి జయలలిత మరణం తరువాత తమిళనాడులో ముఖ్యమంత్రి పదవి కోసం అధికార పక్షంలో కుమ్ములాటలు, ప్రతిపక్ష పార్టీ, కేంద్ర ప్రభుత్వ బిజెపి అవకాశవాదం బయటపడ్డాయని అంటున్నారు*** **వై.ఎచ్.కె. మోహన్‌రావు**

చెప్పుడు మాటలతో చెడిపోయాడు పన్నీర్‌సెల్వం. నాల్గవ మారు కూడా ఆయాచితంగా, చెమట చుక్క రాలకుండా చేజిక్కే సి.ఎం. పదవిని కాలదన్నుకున్నాడు. పరాన్నజీవి సెల్వం కేంద్రం దన్నుతో నేలబారు పోరాటం చేసి విఫలమయ్యాడని సర్వత్రా వినిపిస్తుంది. క్రితంలో వలే విశ్వాసంగా ఉంటే చిన్నమ్మ శశికళ కోర్టు తీర్పుతో జైలుకు వెళుతూ ముఖ్యమంత్రి పదవిని పువ్వుల్లో పెట్టి తిరిగి పన్నీర్‌కే అప్పగించేది. తమిళనాడు రాష్ట్ర ప్రభుత్వ ఏర్పాటు వైకుంఠపాళిలో బిజెపి సెల్వాన్ని పావుగా వినియోగించుకుందని పెద్ద ఎత్తున విమర్శలు వచ్చాయి. ఈ విమర్శలకు బాసటగా బిజెపి ప్రముఖ ఎంపి సుబ్రమణ్య స్వామి వ్యాఖ్యలు నిలుస్తున్నాయి.

ఈ ఎపిసోడ్ వెనుక ఇద్దరు కేంద్ర మంత్రుల ఆసక్తి ఉందని ఆయన స్పష్టం చేశారు. స్వంత పార్టీపైనే ఆయన చేసిన ఆరోపణలు నిక్కచ్చిగా నమ్మవచ్చు. ఎంత పెద్ద ఆట ఎన్నిరోజులు ఆడినా ఆ రాష్ట్రంలో బిజెపికి ఒనగూడేది పెద్ద గుండుసున్నానే అని రాజకీయ విశ్లేషకుల నమ్మకం. వీధి రాజకీయాల ఒరవడితో కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం తమిళ రాజకీయాలలో చోటుచేసుకున్న అన్నాడిఎంకె పార్టీలోని అంతర్గత పోరును చోద్యంగా తిలకిస్తూ వికృతానందం అనుభవించింది.

జయలలిత మరణానంతరం కూడా సాఫీగా సాగుతున్న అన్నాడిఎంకె పార్టీ మనుగడ పన్నీర్‌సెల్వం ఢిల్లీ ప్రయాణంతో సంక్షోభంలోకి వెళ్లింది. పన్నీర్ మార్గంలోనే డిఎంకె వర్కింగ్ ప్రెసిడెంట్ స్టాలిన్ కూడా ఢిల్లీ చేరిన నేపథ్యంలో ఆ పార్టీ రాజకీయాలు మరింత జటిలంగా మారాయి. ముఖ్యమంత్రిగా జయ తప్పుకున్న ప్రతి పర్యాయం ఇప్పటివరకూ ఆ స్థానంలో పన్నీర్‌కే అవకాశం వచ్చింది. జయ మరణానంతరం కూడా ఆ పదవిని ఆయనే స్వీకరించారు. ఎవరూ ఎలాంటి అభ్యంతరాలు కానీ, అలజడి కానీ చేయనేలేదు.

ఈ పరిణామాలలో ఆ పార్టీ సమావేశం చిన్నమ్మ శశికళను తాత్కాలిక ప్రధాన కార్యదర్శిగా ఆమోదించిన తీర్మానం కాపీని పన్నీరే స్వయంగా పట్టుకెళ్లి పోయెస్ గార్డెన్ నట్టింట్లో ఆమెకు ఆకుల్లో పెట్టి సమర్పించుకుని సాష్టాంగపడి బతిమాలుకున్నట్లు మీడియా ద్వారా తెలుసుకున్నాం. ఆపైన తను ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేసి ఇన్‌చార్జి గవర్నర్ విద్యాసాగర్ రావుకు ఆఘమేఘాల మీద పంపి తను ఇన్‌చార్జి అయ్యాడు పన్నీర్. శాసనసభా సమావేశం జరిగి చిన్నమ్మను నాయకురాలిగా ఎంపిక చేసుకుని ఆమె ముఖ్యమంత్రి పదవిలోకి రావడానికి మార్గం సుగమం అయింది. చిన్నమ్మ ప్రమాణ స్వీకారానికి ఏర్పాట్లు పూర్తయ్యాయి. చిన్నమ్మను శాసనసభాపక్ష నేతగా ప్రతిపాదించిందీ పన్నీరే.

ఇక్కడే పన్నీర్ యూటర్న్. అమ్మ (జయ) ఆత్మ చెప్పిందంటూ తిరుగుబాటు బావుటా ఎత్తాడు. పన్నీర్ అడుగులు మలుపు తిరగడానికి వెనుకున్న శక్తులు ఎవరనేది బిజెపి యేతరపార్టీలూ, అనేక ప్రజాసంస్థలూ వరుసపెట్టి కేంద్ర ప్రభుత్వ అధికారంలోని పెద్దల వైపు వేలెత్తి చూపాయి. ఘాటుగా చెప్పాలంటే దుమ్మెత్తిపోశాయి. శాసనసభ్యుల సంఖ్యాబలం ఉన్న శశికళను ప్రభుత్వ ఏర్పాటుకు గవర్నర్ ఆహ్వానించకపోవడాన్ని మూకుమ్మడిగా తప్పుపట్టాయి. సుప్రీంకోర్టులో శశికళపై రిజర్వులో ఉన్న అక్రమాస్తుల కేసుకు సంబంధించి వారం రోజుల్లో రానున్న తీర్పును అడ్డుపెట్టుకుని ఆమెను గవర్నర్ ఆహ్వానించకపోవడం రాజ్యాంగ విరుద్ధమని విమర్శించాయి. అయితే ఆ సంగతిని కూడా గవర్నర్ చెప్పలేదనుకోండి!

ఏ గవర్నర్ల వ్యవస్థ అయితే రాజ్యాంగాన్నీ, ప్రజాస్వామిక విలువలనూ తూట్లు పొడుస్తుందనీ, ప్రజా ప్రభుత్వాలను ఒక్క కలం పోటుతో తుడిచి పెడుతుందనీ విపక్షంగా ఉన్నప్పుడు గగ్గోలు పెట్టిన కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం ఇప్పుడు తమిళనాడులో అదే ఆయుధాన్ని వినియోగించు కోవడం విస్మరించలేని ఒక రాజకీయ వాస్తవం.

అయితే బిజెపి అక్కడ ఆశించిన లక్ష్యం నెరవేరలేదు. తమిళ తంబిలు తమ స్టైల్ వేరని మొఖం మీద అచ్చువేసి చెప్పారు. పరిశీలనల నెపంతో, దీర్ఘాలోచన సాకుతో, న్యాయకోవిదులు, రాజ్యాంగ నిష్ణాతుల సలహాలంటూ గవర్నర్ చేసిన కాలయాపనలు అన్నాడిఎంకె పార్టీ ఐకమత్యాన్ని ఆవగింజంత కూడా దెబ్బతీయలేకపోయాయి. అన్నాడిఎంకెని చీల్చడం ద్వారా ఏదో ప్రయోజనాన్ని పొందాలనుకున్న బిజెపి పెద్ద ఆశలు అడియాశలుగానే మిగిలాయి.

127 మంది శాసనసభ్యుల మద్దతు ఉందని చిన్నమ్మ గవర్నర్‌కు విన్నవించి రుజువు చేసుకుంటానని అభ్యర్థించినా 10 రోజులపాటు సాగిన గవర్నర్ మౌనముద్ర పన్నీర్ వెనుకకు పట్టుమని పది మందిని చేర్చలేకపోయింది. చిన్నమ్మపై నేరం రుజువై కోర్టుతీర్పుతో జైలుకు వెళ్లిన తదుపరి కూడా పరిస్థితిలో ఏ మార్పు రాకపోవడం తంబీల కట్టుబాటును ప్రపంచానికి తెలిపింది. అరుణాచల్‌ప్రదేశ్, ఉత్తరాఖండ్‌లో బిజెపి ఆడిన ఆట తమిళ రాజకీయాలకు పొసగలేదన్నది చారిత్రక సత్యం.

తమిళనాడు హైకోర్టులో దాఖలైన పిల్‌తో న్యాయమూర్తి ఆదేశం మేరకు రిసార్ట్సుకు వెళ్లిన రెవెన్యూ, పోలీసు అధికారులు విడివిడిగా, వ్యక్తిగతంగా, రాతపూర్వకంగా ఒక్కో శాసనసభ్యుని నుండి సేకరించిన అభిప్రాయాల సంఖ్య 119. ఈ 119 మంది శాసనసభ్యుల అభిప్రాయాలను న్యాయమూర్తికి అందించిన పూర్వరంగంలో శశికళ

వర్గంలో ఎంతమంది సభ్యులున్నారో తేటతెల్లమైంది. ఇదేమీ రహస్యం కాదు.

శశికళ మరికొంత మంది సభ్యులను మరో రహస్య ప్రదేశంలో ఉంచిందని వినికిడి. బహుశా వీరు 8 మంది గావచ్చు. గవర్నర్ శశికళకు మద్దతు ఇస్తున్న శాసనసభ్యుల సంఖ్యను తెలుసుకోవడానికి ఇది ఒక నిర్దిష్టమైన రుజువు. ఈ విషయాన్ని అటుంచితే ప్రభుత్వానికి ఇంటలిజెన్స్ శాఖ ఉంటుంది. ఆ మార్గం నుండి కూడా ఆయనకు స్పష్టమైన సమాచారం లభిస్తుంది. ఇంకా చెప్పుకోవాలంటే ఆయనకు మీడియా కూడా ఒక సాధనం.

శశికళ బృందంతో ఉన్న ఎంఎల్యేల సంఖ్యను మీడియా మొత్తం కూడా 127కు కొంచెం అటు ఇటుగానే పేర్కొనడం వాస్తవం. అయితే ఏ ఒక్క మీడియా సంస్థ కూడా పన్నీర్ వెనుక 10 మందికి మించి శాసనసభ్యులున్నట్లు చెప్పలేదన్నదీ వాస్తవమే. బలాబలాలను తెలుసుకోవడానికి ఉన్న అన్ని మార్గాలను గవర్నర్ విద్యాసాగర్‌రావు పరిగణనలోకి తీసుకోకపోవడాన్ని ప్రజాస్వామ్య అభిలాషులు ఆమోదించలేకపోయారు. ఇరు నేతలనూ గవర్నర్ పిలవడం మినహా పెదవి విప్పకపోవడం పలు అనుమానాలకు తావిచ్చింది.

ఈలోగా చిన్నమ్మపై సుప్రీంలో రిజర్వులో ఉన్న అక్రమాస్తుల కేసు తీర్పు చెప్పాలంటూ అడ్వకేట్ జనరల్ వేసిన పిటీషన్ గవర్నర్‌కు ఉపయోగపడి ఉండవచ్చు. ఈ విషయం కూడా మీడియా, ప్రజలూ ఊహలలో పంచుకోవడమే మినహా గవర్నర్ మాత్రం పెదవులకు పని చెప్పలేదు.

కోర్టు వారంరోజుల్లో తీర్పు వెల్లడిస్తానని తెలిపినా శాసనసభ్యుల సంఖ్యాబలం కలిగిన శశికళనే గవర్నర్ ఆహ్వానించి ఉండాల్సిందని మేథోవర్గాలు తమ గళాన్ని బలంగా వినిపించాయి.

ప్రధానిగా వాజ్‌పేయి బల నిరూపితం కాక ఏడు రోజులకే ఆయన ఆ పదవి నుండి వైదొలిగారనీ, ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో అంజయ్య ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు మంత్రి మండలిలోకి తీసుకున్న చంద్రబాబు నాయుడు, కాసు కృష్ణారెడ్డి పదవులు ప్రమాణ స్వీకారోత్సవానికి నోచుకోకుండానే ఊడిపోయాయని రాజ్యాంగ నిబంధనలకు ఉదాహరణలుగా చెప్పుకొచ్చాయి.

అదే విధంగా శశికళకు సుప్రీంకోర్టు శిక్ష ఖరారు చేసినచో ఆమె తప్పనిసరిగా ముఖ్యమంత్రి పదవి నుండి వైదొలగు తుందనీ, అంతేగాని ఊహలననుసరించి శశికళను పిలవకపోవడం ఆక్షేపణీయమని రాజ్యాంగ నిపుణులు విమర్శించారు. పోనీ శశికళ కోర్టు తీర్పు అడ్డంకి అనుకుంటే అదే విషయాన్ని గవర్నర్ ఆమెకు తెలియజేయ కపోవడం సరికాదని తప్పుపట్టారు. ఒకానొక దశలో శశికళ వర్గమే తమంత తాముగా సదరు విషయాన్ని ఆకళింపు జేసుకుని ఆమెకు ప్రత్యామ్నాయంగా ఆ పార్టీ సీనియర్ శాసనసభ్యుడు, అప్పటికి మంత్రివర్గ సభ్యుడు అయిన సెంగొట్టియన్ పేరును తెరపైకి తెచ్చుకుంది. అయితే ఈ ప్రతిపాదనను రిసార్ట్స్‌లోని ఎంఎల్యేలంతా తోసిపుచ్చారనీ, చిన్నమ్మ తప్పుకోవడానికి తాము అంగీకరించబోమనీ, కేసు తీర్పు అనంతర పరిణామాలలోనే ఇతరత్రా మార్పుచేర్పులంటూ శశికళకే జైకొట్టడంతో, ఆ ప్రతిపాదన ఆదిలోనే నిలిచిపోయింది.

అయితే చిన్నమ్మకు సహకారం అందకపోవడంపై ఒక కథనం బాగా ప్రచారం చేసింది. గుజరాత్ ముఖ్యమంత్రిగా ఉన్న మోడీ అప్పటికి తమిళనాడు ముఖ్యమంత్రిగా ఉన్న జయలలితకు శశికళపై పితూరీలు చెప్పాడని మీడియా వల్లెవేసింది. శశికళ జయలలితకు ద్రోహం తలపెట్టి కుట్ర ప్రణాళికలు వేస్తుందని, జాగ్రత్తగా ఉండమంటూ మోడీ అభియోగాలు మోపారని కథాంశం.

ఈ కథా కలకలమే జయనూ, శశికళనూ కొంతకాలం పాటు ఎడబాటుకు గురి చేసిందనీ, అప్పటినుండీ శశికళ అంటే మోడీకి సదాభిప్రాయం లేదనీ, ఈ క్రమమే ఆమె సిఎం కాకుండా నిలువరించిందని పుకార్లు షికార్లు చేశాయి.

సుప్రీంకోర్టు తీర్పువచ్చిన దరిమిలా చిన్నమ్మకు శిక్ష ఖరారైన తరువాత సిఎం అభ్యర్థిగా పళనిస్వామిని బయటకు తెచ్చింది శశికళ. అయితే ఎన్ని పరిణామాలు చోటు చేసుకున్నా చిన్నమ్మ బలగం చెదరక పోవడం, బెదరకపోవడం బట్టి శశి'కళ'ను అర్థం చేసుకోవచ్చు. శాసనసభ్యులపై ఆమె అదుపు, ఐక్యతపై ఆమె పట్టును తెలియజేస్తుంది.

ఆమె జైలు బాటపట్టినా సభ్యులంతా గోల్డెన్ బే రిసార్ట్స్‌లో ఏకతాటిపై నిలిచిన వైనం శశికళ ఈవెంట్ మేనేజ్‌మెంట్స్ నిర్వాహణా సామర్థ్యాన్ని వెల్లడి చేస్తున్నాయి. ఆమె జైలుగోడలు దాటి లోపలికి వెళ్లినా తమ సమక్షంలోనే ఉందన్న భావంతో శాసనసభ్యులంతా మెలిగారు. కాగా శశికళను కారాగారానికి పంపడం ద్వారా ఆమె టీమ్‌ను చికాకు పెట్టాలనుకున్న వారి ఎత్తులన్నీ పళనిస్వామి ప్రమాణ స్వీకారంతో చిత్తయ్యాయి.

ఎట్టకేలకు గవర్నర్ పళనిని ఆహ్వానించడంతోనే శశి ప్రత్యర్థులంతా హతాశులయ్యారు. ఎన్ని అవకాశాలు అందివచ్చినా పన్నీర్ బలపడక పోవడంతో అతను అత్యంత బలహీనుడైన నాయకుడని తేటతెల్లమైంది. పన్నీర్ పక్షానికి చేరినవారు కూడా అతని నాయకత్వంపై ఉన్న నమ్మకంతో కాకుండా, చిన్నమ్మతోనో, చిన్నమ్మ బృందంలోని మరొకరితోనో ఉన్న వైరుధ్యంతోనో ఈ గూటికి నడిచారని రాజకీయ విశ్లేషకుల ముక్తాయింపు. ఇంత బలహీనుడైన నాయకుని ఆసరా జేసుకుని ఏమి పొందాలను కున్నారోగాని, అంచనా వేయడంలోనే గణాంకాలు తప్పయ్యాయని కేంద్ర పెద్దల తీరును మూల్యాంకనం చేసిన మేధావులు చెప్పుకొచ్చారు. అతని పక్షానికి చేరిన 13 మంది ఎంపిల కూడా కేంద్ర ప్రభుత్వ పెద్దల చూపుడు వేలు కదలికలతోనే పన్నీర్ బాట పట్టారని వెల్లడిస్తున్నారు. ఇది నిజమని నమ్మడానికి కూడా ప్రమాణాలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి.

మీడియా వెల్లడిచేసిన సమాచారం ఈ నమ్మకాలకు బలం చేకూర్చింది. ఒకటేమిటంటే కేంద్ర ఆర్థికమంత్రి అరుణ్‌జైట్లీతో ఎంతో కాలంగా సంబంధాలు కొనసాగిస్తున్న పాండ్యరాజన్ అనే ఎంఎల్ఏ సదరు మంత్రి ఫోన్ ఆదేశాల మేరకే పన్నీర్ గూటికి వెళ్లినట్లు పెద్దక్షరాలతో చదివి తెలుసుకున్నాం.

అదే విధంగా కేంద్రంలోని ఇరువురు మంత్రులకు తమిళ రాజకీయాలలో అమితాసక్తి ఉందని సాక్షాత్తు బిజెపి ఎంపి, సీనియర్ న్యాయవాది అయిన సుబ్రమణ్యస్వామి పేర్కొనడం కూడా తమిళ రాజకీయాలలో కేంద్ర బిజెపి జోక్యాన్ని ధృవపరుస్తుంది.

ఏది ఏమైనా శశికళ నుండి పిలుపురాగానే పరిగెత్తుకెళ్లి, ఒంగిదండం

పెట్టి, ఒకమూలన నిలబడే పన్నీర్ సెల్వాన్ని నమ్ముకుని ఏమి బావుకుందా మనుకున్నారో పెద్దలు. గొప్ప నాయకుడుగా అంచనాగట్టి రంగంలోకి దింపిన అదృశ్య శక్తులు బొక్కబోర్లా పడ్డాయి. మొత్తంగా 10 రోజులు పోరాడి, అన్ని శక్తియుక్తులనూ ప్రయోగించినప్పటికీ ఆశావాదులకు ఫలితం శూన్యశేషమే మిగిలింది. ఎవరి అభయంతోనో వంకర నడవడితో సాగిన పన్నీర్ పోరు ఆయనను అటు పార్టీకి, ఇటు ప్రభుత్వానికి గాకుండా రెంటికి చెడ్డ రేవడిలా మార్చింది.

మొత్తం మీద పన్నీర్ ఉభయ భ్రష్టత్వం అయ్యాడు. బహుశా బండి గుర్రాన్ని లాగడమంటే ఇదేనేమో! ఏదైతే ఏమి! పోతే శశికళ, కాకపోతే పన్నీర్ మనది పోయేదేముందిలే అంటూ లోలోపల సర్ది చెప్పుకుంటూ సంతృప్తి చెందుతున్నాయి పన్నీర్‌ను పావుగా ఆడించిన క్షుద్రశక్తులు. కొసమెరుపేమిటంటే! అవినీతికి పాల్పడి అక్రమాస్తులను కూడబెట్టిన శశికళ కారాగారానికి వెళ్లడం ఎంత రాజ్యాంగబద్ధ హర్షదాయకమో, శశికళను ప్రభుత్వ ఏర్పాటుకు గవర్నర్ ఆహ్వానించకపోవడం అంతే రాజ్యాంగ నిరపేక్షదాయకం. గవర్నర్ల విచక్షణాధికారం విచక్షణా రాహిత్యానికి దారితీయడం ఆహ్వానించదగిన పరిణామం కాదు సుమా!

తమిళనాడు ముఖ్యమంత్రి పదవి కోసం అన్నాడిఎంకెలో చోటు చేసుకున్న సిగపట్ల మలుపుల్లో ప్రతిపక్ష డిఎంకె పార్టీ వేసిన పిల్లిమొగ్గలు, కుప్పిగంతులు, కప్పదాట్లు అన్నీయిన్నీ కావు. తొలుత పన్నీర్‌కు మద్దతు తెలుపుతామని డిఎంకె వర్కింగ్ ప్రెసిడెంట్ ప్రకటించి, ఆపై తటస్థంగా ఉంటామని మరోమారు, తీరా బలప్రదర్శనకు ముందురోజు రాత్రి జరిగిన శాసనసభాపక్ష సమావేశంలో పళనికి వ్యతిరేకంగా ఓటు వేస్తామని ముక్తాయింపు నిర్ణయం. ఈ నిర్ణయాల లోతుల వెనుక అతిపెద్ద కుట్రకోణం, పదవీ వ్యామోహం, అధికారంలోకి ఏ విధంగానైనా వచ్చేయాలనే స్వార్థపూరిత కాంక్ష కనిపిస్తాయి. అదేవిధంగా పళనిస్వామి బలనిరూపణ సందర్భంలో శాసనసభలో పన్నీర్‌కు అనుకూలంగా డిఎంకె సభ్యులు చేసిన నినాదాలు కూడా ఈ కోవలోకే వస్తాయి.

ఇక్కడ డిఎంకె యోచన ఒకే ఒకటి. పన్నీర్‌కేదో సహకరిస్తున్నట్లుగా ప్రవర్తించి, పన్నీర్ బలగాన్ని తనకు అనుకూలంగా మలుచుకునే మాయోపాయమే డిఎంకె కుట్రలో భాగం. ఇకపోతే శాసనసభను డిఎంకె పెద్ద రణరంగంగా మార్చిన తీరు కూడా ఆ పార్టీ నైతిక నడవడిని ఆవిష్కరించింది. ఒక దశలో కరుణానిధి కుమార్తె ఎంపి కనిమొని కూడా మీడియా ముందుకు వచ్చి తమ శాసనసభ్యులు తటస్థంగా ఉంటారని ప్రకటించిన నేపథ్యంలో వ్యతిరేక ఓటు వేయాలని తీసుకున్న నిర్ణయం ఆ పార్టీ కుత్సిత రాజకీయాలను వెల్లడి చేసింది.

విశ్వాస నిరూపణలో బలగాలను లెక్కించే విధానాన్ని అనుసరించడం లో శాసనసభ స్పీకర్‌కు స్వేచ్ఛ ఉంది. రహస్య బ్యాలెట్ విధానాన్ని స్టాలిన్, పన్నీర్‌సెల్వం కోరడంలో తప్పులేదు. అయితే దీనిపై నిర్ణయం తీసుకునే అధికారం స్పీకర్‌కే ఉంది. అంతమాత్రాన శాసనసభను కురుక్షేత్రంగా మార్చి స్పీకర్‌ను సైతం లాగి పడేసే ప్రయత్నం చేయడం సదాచారం కాదనిపిస్తుంది.

స్పీకర్ చొక్కా చించివేసి, ఆయన ముందున్న ఫర్నీచర్‌ను ధ్వంసం చేసి, కాగితాలను ముక్కలు ముక్కలుగా చేసేసి, పెద్ద విధ్వంసమే సృష్టించారు డిఎంకె సభ్యులు. ఇంత రభస సృష్టించి సభను స్తంభింపజేసిన డిఎంకె సభ్యులను సస్పెండ్ చేస్తే తగుదునమ్మా అంటూ బయటకు వచ్చిన స్టాలిన్ తన చొక్కా చించివేశారని మీడియా వద్ద వాపోయి పెద్ద ఫోజే పెట్టారు. స్పీకర్ స్థానంలో కూర్చున్న డిఎంకె సభ్యులు, గందరగోళం సృష్టించిన డిఎంకె బలగాలు అమాయకుల్లా బయటకు వచ్చి నటించారు.

ఈ మొత్తం ఘర్షణ ఎపిసోడ్ వెనుక పదవీకాంక్ష బలంగా కనిపిస్తుంది. సీక్రెట్ బ్యాలెట్‌లో పళనివర్గంలోని కొందరు ఆయనకు వ్యతిరేకంగా ఓటు వేస్తారని, బలనిరూపణ చేసుకోలేని పళని దిగిపోతే ఆ తదుపరి గవర్నర్ సంఖ్యా బలం ప్రకారం తమనే పిలుస్తారని స్టాలిన్ పెద్ద దురాలోచనతో అడుగులు వేశాడు.

ఈ క్రమంలో పన్నీర్ వెంట ఉన్న సభ్యులు, పళని పట్ల అసంతృప్తి ఎంఎల్ఎల సహకారంతో అధికారం హస్తగతం చేసుకోవచ్చని దుష్టప్రణాళికే వేశాడు.

అయితే స్పీకర్ పళని పక్షాన నిలవడంతో స్టాలిన్ పాచిక పారలేదు. ఏతావాతా మూడు పర్యాయాలు వాయిదాలతో బల నిరూపణ కథనానికి స్పీకర్ ముగింపు నిచ్చారు. ముందు రానున్న కాలంలో విప్‌ను ధిక్కరించి పళనికి వ్యతిరేకంగా నిలిచిన పన్నీర్‌తో 11 మంది శాసనసభ్యుల సభ్యత్వాలను స్పీకర్ రద్దు పరచే అవకాశం లేకపోలేదు.

అంతేగాకుండా శాసనసభ నిబంధనలకు విరుద్ధంగా యుద్ధ వాతావరణం సృష్టించిన డిఎంకె సభ్యులపైనను, స్పీకర్ స్థానాన్ని ఆక్రమించుకున్న వారిపైనా, స్పీకర్‌ను లాగేసిన వారిపైనా, చొక్కా చించిన వారిపైననూ తీవ్రమైన క్రమశిక్షణా చర్యలు చేపట్టవచ్చని రూఢీగా నమ్మవచ్చు.

ఈ చర్యలు చేపట్టడం ద్వారా విపక్షాలను అదుపులో పెట్టి పళని ప్రభుత్వాన్ని నెట్టుకొస్తాడని ఒక అంచనా. ఏది ఏమైనా పళని ప్రయాణం ముళ్లబాటపైనే అనేది నమ్మదగిన సత్యం.

*(రచయిత అధ్యక్షుడు, పల్నాడు రచయితల సంఘం)* వీ

## వచ్చే సంచికలలో...

- **కాపిటల్‌కు 150 ఏళ్లు - ఎన్. వేణుగోపాల్**
- **మళ్లీ మార్క్స్ - ఇ.ఎస్. బ్రహ్మచారి**
- **కార్ల్ మార్క్స్ తాత్విక బోధనలు - డా. కత్తి పద్మారావు**
- **రెండున్నర సంవత్సరాలు - రెండు సర్జికల్ దాడులు - లంకా పాపిరెడ్డి**
- **తూర్పు కనుమల పరిరక్షణ - బి. శ్రీనివాసరావు**

# జల్లికట్టు పోరాటంలో దాచేస్తే దాగని కోణం

***తమిళనాడులో జల్లికట్టు క్రీడను కేంద్రం నిషేధించడంతో దాన్ని తమ అస్తిత్వ పోరాటంగా చేసుకున్న తమిళ ప్రజలు ఐక్యంగా ఉద్యమించి నిషేధాన్ని రద్దు చేయించారని అంటున్నారు రాజేంద్రబాబు అర్విణి***

ఈ దశాబ్దపు ప్రారంభంలో అరబ్ దేశాలలో కొత్త గాలికెరటం ఒకటి వీచింది. ప్రజలంతా మూకుమ్మడిగా రోడ్లమీదకు వచ్చి తమ ప్రజాస్వామ్య ఆకాంక్షలు నెరవేరాలని నినదించారు. ఓ రెండు సంవత్సరాల కాలం అరబ్ దేశాలను ఊపేసిన ఆ సంచలనానికి 'అరబ్ వసంతం' అని నామకరణం చేశారు. అది మతాధికారులకు అరబ్ దేశాలలోని ప్రజాస్వామ్య ప్రియులయిన ప్రజానీకానికి మధ్య జరిగిన సంఘర్షణ. ఇటీవల తమిళనాడులో జరిగిన 'జల్లికట్టు' జగడానికి తమిళ మేధావులు కొంతమంది అరబ్ వసంతం మాదిరి ఇది 'తమిళ వసంతం' అని ముద్దుగా పిలుచుకున్నారు.

అయితే ఇది జాతీయేతర రంగు పులుముకున్న కొన్ని కులాల సాంప్రదాయానికి న్యాయవ్యవస్థ వెలువరించిన తీర్పులకు మధ్య జరిగిన ఘర్షణ. మరో రకమయిన ఘర్షణకు తమిళనాడే వేదిక అయ్యింది. అది చిన్నమ్మగా పేర్గాంచిన శశికళ విషయంలో రాజ్యాంగానికి నైతికతకు మధ్య ఘర్షణ. మీడియా ఫోకస్‌కు నోచుకోని మరొక ముఖ్యమైన ఘర్షణ నాగాలాండ్‌లో ఇటీవల జరిగింది. సుప్రీంకోర్టు ఆదేశాల ప్రకారం స్థానిక సంస్థల ఎన్నికలలో స్త్రీలకు 33 శాతం రిజర్వేషన్లు కల్పించడానికి రాష్ట్ర ప్రభుత్వం ప్రయత్నిస్తే నాగాలాండ్‌లోని తెగల పురుష సమాజం తీవ్రంగా అడ్డుకుంది. ఆ సందర్భంగా జరిగిన పోలీసు కాల్పులలో ఇద్దరు నాగా యువకులు మరణించారు. తెగపెద్దలను ఒప్పించలేక ముఖ్యమంత్రి జెలియాంగ్ చివరికి పదవి నుండి తప్పుకోవాల్సి వచ్చింది. ఇది పురుషాధిక్య సమాజానికి ఆధునిక రాజ్యభావనకు మధ్య ఘర్షణ.

తమ అస్థిత్వ ప్రకటనకు ఆవులను ఎద్దులను ఆసరాగా చేసుకుంటున్నాయి మన దేశంలో కొన్ని సమూహాలు. తమ అస్థిత్వాన్ని ప్రకటించుకునేందుకు ఉత్తరప్రదేశ్‌లో అఖ్లాఖ్ ఆవును చంపి దాని మాంసం తిన్నాడన్న నెపం మోపి రాళ్లతో, కర్రలతో కొట్టి చంపింది హిందూ సమాజం. ఢిల్లీలోని జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీలోని కొంత మంది విద్యార్థులు, ప్రొఫెసర్లు దసరా పండుగను గేదె రూపంలో ఉన్న దళిత దేవుడు మహిషాసురుణ్ణి అగ్రకుల ప్రతినిధి అయిన దుర్గాదేవి కుట్రపూరిత పద్ధతులలో చంపివేసిన దుర్దినంగా జరుపుకున్నారు. దానికి వ్యతిరేకంగా (2016లో) బిజెపి అనుబంధ సంస్థ అయిన అఖిల భారత విద్యార్థి పరిషత్ సభ్యులు ఆ విద్యార్థులపై, అధ్యాపకులపై భౌతికదాడులకు దిగారు. దానిని నిరసిస్తూ దళిత మేధావులు ఆవుకు ప్రత్యామ్నాయంగా గేదెను జాతీయ చిహ్నంగా గుర్తించాలని పిలుపునిచ్చారు.

పైన ఉదహరించిన సంఘటనలు భారత సమాజంలో తీవ్రతరమవుతున్న వైరుధ్యాలను సూచిస్తున్నాయి. కాని, జల్లికట్టు ఉదంతంలో వేరొక ఆశాజనకమైన కోణం ఆవిష్కరణ జరిగిందని ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీలో కలయరసన్ పేర్కొన్నాడు. పిఇటిఎ-పెటా (పీపుల్ ఫర్ ఎథికల్ ట్రీట్‌మెంట్ ఆఫ్ ఎనిమల్స్) అన్నది ఒక స్వచ్ఛంద సంస్థ. పేరుకు స్వచ్ఛంద సంస్థ కాని అది పూర్తిగా విదేశీ కార్పొరేట్ కంపెనీల ఆర్థిక ప్రయోజనాలను కాపాడడానికి పని చేస్తున్నది. పెటా వేసిన పిటిషన్ వల్లనే న్యాయస్థానాలు జల్లికట్టు ఆటను నిషేధించాయి. మెరినా బీచ్‌లో జరిగిన జల్లికట్టు పోరాటంలో పెటా కార్పొరేట్ లాబీ జల్లికట్టు నిషేధం కార్పొరేట్ కుట్ర అన్న ప్లకార్డులు ప్రదర్శించారు.

తమిళనాడు వ్యాప్తంగా జరిగిన నిరసన ప్రదర్శనలలో కార్పొరేట్ బ్రాండులకు వ్యతిరేకంగా నినాదాలు మిన్నుముట్టాయి. ముఖ్యంగా శీతల పానీయాలలో అంతర్జాతీయ బ్రాండులైన కోక్, పెప్సీలు ఆరోగ్యానికి హానికరమని పలువురు వక్తలు నొక్కి వక్కాణించారు. ఆ తర్వాత తమిళనాడులోని చాలా దుకాణాలలో కోక్, పెప్సీలు కనిపించకుండా పోయాయి. తమిళ ప్రజల ఆరోగ్యంతో కార్పొరేట్ సంస్థలు ఆడుకుంటున్నాయని, వాటి లాభాల కోసం ఆ కంపెనీలు పురుగుల ద్రావకాన్ని మార్కెటింగ్ చేస్తున్నాయని నినదిస్తూ పలుచోట్ల కోక్, పెప్సీ సీసాలను ప్రజలు పగులగొట్టారు. కార్పొరేట్ సంస్థల కుట్రలను పలు రీతులలో ఎండగట్టారు.

ఉష అన్న సాధారణ గృహిణి చెప్పిన మాటలు ఈ విధంగా ఉన్నాయి. 'కార్పొరేట్ సంస్థలు బహుముఖాలుగా విస్తరిస్తున్నాయి. ఇప్పుడు మనం వాడుతున్న ప్రతి వస్తువు కార్పొరేట్ సంస్థల నియంత్రణలోనే ఉన్నాయి. ఇవన్నీ నా వంటగదిని ఆక్రమిస్తున్నవన్న వాస్తవం నన్ను బాగా కుంగదీస్తున్నది. నా పిల్లలు జంక్‌ఫుడ్, నూడుల్స్, కోక్, పెప్సి లాంటి శీతాల పానీయాలను ఇష్టపడుతున్నారు. ఇప్పుడు బహుళజాతి సంస్థలు నాసిరకం పాలను మార్కెట్లోకి తెస్తున్నాయి. ఈ పాల వల్ల నా పిల్లలు బలవంతులుగా ఎదగలేరు. స్థానిక ఆవులు ఇచ్చే పాలే ఆరోగ్యవంతంగా ఉంటాయి. అందుకే విద్యార్థులు చేపట్టిన ఈ పోరాటంలో పాల్గొంటున్నాను' అని అందామె. కార్పొరేట్ ప్రపంచం తమ జీవితాలను హరించివేస్తున్నదని ఆమె భావన.

జల్లికట్టు పోరాటంలో పాల్గొన్న ప్రజలు ఈ విషయాన్ని నమ్మారు. ఆ నమ్మకమే ఆమె మాటల్లో ప్రతిఫలించింది. కంగాయం, పులికులం అన్నవి మేలిరకం ఎద్దులు. అవి ఆవులతో జతకడితే బలవర్ధకమైన పాలు ఇచ్చే ఆవులు వాటికి పుడుతాయి. ఆవులు ఎక్కువ పరిమాణం పాలు ఇస్తాయి. ఎక్కువకాలం జీవిస్తాయి కూడా. ఈ మేలిరకం ఎద్దులను జల్లికట్టు ఆటలో పాల్గొనడం కోసం ప్రత్యేకంగా పెంచుతారు. జల్లికట్టును నిషేధించినట్లయితే ఆ ఎద్దుల పెంపకం మెల్లమెల్లగా అడుగంటిపోతుందని, తద్వారా తమ పాల వ్యాపారానికి ఢోకా ఉండదని బహుళజాతి సంస్థలు కుట్ర పన్నాయని ఆ ప్రజలు నమ్మారు.

పశుసంపద కోల్పోవడమంటే పాల ఉత్పత్తిలో స్వయం పోషకత్వం

హరించుకుపోవడమే అని తమిళ మహిళలు భావించారు. కార్పొరేట్ సంస్థలు పెంచే సంకరజాతి ఆవులు కొద్దికాలమే జీవిస్తాయి, కాని చాలా ఎక్కువగా పాలు ఇస్తాయి. ఆ పాలు తాగిన శిశువులు అజీర్తితో, అలెర్జీలతో బాధ పడ్డారు.

తమిళ గ్రామీణ మహిళలలో ఈ ప్రచారం బాగా జరిగింది. ఈ ప్రచారం స్థానికత భావన రగిలించి ప్రజలలో కార్పొరేట్ వ్యతిరేక వాతావరణం పాదుకోవడానికి తోడ్పడింది. దాంతోపాటు కార్పొరేట్ వర్గాలకు సహజ మిత్రులైన కేంద్ర ప్రభుత్వానికి, బిజెపి వర్గాలకు ప్రజలలో ప్రతికూల పరిస్థితి ఏర్పడింది.

జల్లికట్టు కోసం చేసిన నిరసన దీక్షకు అంత పెద్ద ఎత్తున మద్దతు రావడానికి మరొక కారణం కూడా విశ్లేషకులు పేర్కొంటున్నారు. కావేరీ నదీ జలాల విషయంలో తమిళనాడు రాష్ట్రం తీవ్ర ఇబ్బందులకు గురయ్యింది. కావేరీ నదీ జలాలను తమిళ ప్రాంతాలకు తరలించాలన్న సుప్రీం కోర్టు ఆదేశాలను కర్నాటక రాష్ట్రం లెక్కచేయలేదు. నీళ్లు లేక పంటలు ఎండిపోయాయి: ఫలసాయం దెబ్బతింది. రైతులు తీవ్రమైన కష్టాలలోకి నెట్టబడ్డారు. పర్యవసానంగా 2016లో 100 మంది రైతులు ఆత్మహత్యలకు పాల్పడ్డారు. ఈ విషయంలో తమిళుల పట్ల కేంద్రం నిర్లక్ష్యంగా వ్యవహరించిందని ప్రజలు బలంగా విశ్వసించారు. నిజానికి కావేరీ నదీ జలాల విషయంలో సుప్రీంకోర్టు ఆదేశాలకు వ్యతిరేకంగా కర్నాటక ప్రభుత్వం వ్యవహిస్తూ ఉంటే కేంద్రం ప్రేక్షక పాత్ర వహించింది. అదేదో తమ సమస్య కాదన్నట్టుగా తనకు పట్టనట్టుగా ఉండిపోయింది. 2009లో శ్రీలంక చేతిలో ఊచకోతకు గురైన తమిళ జాలర్ల సందర్భం కూడా వారి మనస్సుల్లో తాజాగా ఉంది. ఇటీవల సుప్రీంకోర్టు దేశవ్యాప్తంగా వైద్య విద్యనభ్యసించడానికి నీట్ ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణత సాధించడం తప్పనిసరి చేసింది. దీంతో తమిళనాడులో ఎన్నో ఏళ్లుగా పోరాడి సాధించుకున్న రిజర్వేషన్లు మెడికల్ కోర్సులకు పనికి రాకుండా పోయాయి. ఈ విషయంలో కేంద్రం విధానాల వలన తమిళులకు అన్యాయం జరిగిందని ప్రజలు భావించారు.

ఈ విషయాలన్నీ జల్లికట్టు ఉద్యమ సందర్భంగా ఉపన్యాసాలలో వక్తలు ఆవేశపూరితంగా ప్రస్తావించారు. ఊరేగింపులలో, మెరినా బీచ్‌లో నరేంద్రమోడి వ్యంగ్య చిత్రాలను ప్రదర్శించి కేంద్రంపట్ల తమ అసహనాన్ని చాటుకున్నారు. కావేరీ నదీ జలాలలకు సంబంధించి తన ఆదేశాలను కర్నాటక ప్రభుత్వంతో అమలు చేయించే సత్తా లేని సుప్రీం కోర్టును తామెందుకు గౌరవించాలని ప్లకార్డులు ప్రదర్శించారు. అనేక పరిణామాల వల్ల గూడుకట్టుకున్న అసంతృప్తి ఒక్కసారిగా జల్లికట్టు విషయంలో దావానలంలా బయటపడింది. జల్లికట్టు క్రీడకు అవకాశమివ్వకపోతే దేశాన్నుండి విడిపోవడానికి కూడా సంశయించమన్న సంకేతాలు ఇవ్వడానికి ఉద్యమకారులు సంకోచించలేదు.

జల్లికట్టు అంటే అందరూ అనుకుంటున్నట్టు ఎద్దులను నియంత్రించడం కాదు, వాటిని హింసించడం కాదు. వాటిని గట్టిగా కౌగిలించుకోవడం అంటున్నారు జల్లికట్టు సమర్థకులు. తమిళజాతి చిహ్నంగా ఇటీవలి కాలంలో ప్రసిద్ధిగాంచిన జల్లికట్టు క్రీడ నిజానికి దక్షిణ తమిళనాడులోని కొన్ని జిల్లాలలో (ముఖ్యంగా మధురై, తిరుచినాపల్లి, తంజావూర్) సాంప్రదాయకంగా వస్తున్న క్రీడ. ఇందులో కేవలం రెండు కులాలకు చెందిన యువకులే పాల్గొంటారు. బాగా బలిసిన మేలిరకం కంపేయం జాతి ఎద్దులకు ఉత్ప్రేరకాలు (మద్యం, కారప్పొడి మొదలైనవి) ప్రయోగించి మైదానంలో వదులుతారు. యువతులు నడుముకు చుట్టుకునే ఒక బట్టలో కొన్ని నాణేలు మూటగట్టి ఆ ఎద్దుల మూపురాలకు చుట్టుతారు. ఉత్ప్రేరకాల ప్రభావంలో బాగా మత్తెక్కి ఉన్న ఆ ఎద్దు మూపురం పట్టుకొని మెడలు వంచి ఆ మూటలోని నాణేలను స్వంతం చేసుకోవడం ఈ ఆటలో ముఖ్యమైన అంశం. అది సాధించిన యువకునికి సంఘంలో గుర్తింపు, హోదా ఉంటుంది. ఆ కులంలో తనకు నచ్చిన అమ్మాయిని పెళ్లి చేసుకునే అర్హత, స్వేచ్ఛ కూడా ఉంటుంది.

అలాంటి కోడె ఎద్దులను పెంచే పోషకులు మాత్రం రాష్ట్రం మొత్తం మీద 300 మంది ఉంటారు. ఆ ఆటలో ఎవరికీ లొంగకుండా నిలిచిన ఎద్దులను నిజమైన అంబోతులుగా గుర్తించి వదులుతారు. ఆ చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు లోకల్ ఆవులను వాటితో సంగమింపజేయడానికి ఆరాట పడతారు. దానివల్ల మేలిరకపు ఆవుల సంతతి వృద్ధి అవుతుందని వారి నమ్మకం. ఆ ఆటలో బలమయిన ఎద్దులను లోబరుచుకోవాలను కున్న కొంత మంది యువకులు ప్రాణాలను కూడా పోగొట్టుకుంటారు. కొన్నిసార్లు ఆ మదించిన ఎద్దుల ముళ్లు కంచెలను దాటి, నిలబడి వినోదం తిలకిస్తున్న ప్రేక్షకుల పైబడి వారిని కుమ్మి, తొక్కివేసిన సంఘటనలు కూడా జరుగుతుంటాయి. తొక్కిసలాటలో మరణాలు కూడా సంభవం. అయితే సంప్రదాయంలో భాగంగా జరిగిందని ఓదార్పు చేసుకుంటారు.

అసలు జల్లికట్టు అంటే అర్థం – జల్లి/సల్లి అంటే నాణేలు, కట్టు అంటే కట్టివేయబడిన. కట్టివేయబడిన నాణేలు అని అర్థం. ఈ ఆటలో దళితులకు ప్రవేశం లేదు. ఎన్నోసార్లు మదమెక్కిన, బెదిరిపోయిన ఆ ఎద్దులు చేసిన అఘాయిత్యాల వల్ల కుల పోరాటాలు, ఘర్షణలు జరిగిన ఉదంతాలు కూడా ఉన్నాయి.

కొన్ని జిల్లాలకు, కులాలకు మాత్రమే ప్రత్యేకమైన, పరిమితమైన జల్లికట్టు క్రీడ ఇటీవల జరిగిన పరిణామాలతో తమిళ ఐక్యతకు, తమిళ జాతి ఉనికికి ప్రతీకగా నిలిచింది. అలా జరగడానికి కారణం ఏ రాజకీయ పార్టీగాని ఈ ఉద్యమానికి నాయకత్వం వహించక పోవడమే. కొద్దిమంది విద్యార్థుల నిరసనతో ప్రారంభమైన ఈ ఉద్యమం ప్రభుత్వ పోకడలు, విధానాల వల్ల పేరుకుపోయిన అసంతృప్తి వల్ల, కొన్ని చారిత్రక, సామాజిక కారణాల వల్ల స్వతః సిద్ధంగా ఉద్భవించి ఉధృతమై మొత్తం దేశాన్ని కుదిపివేసింది. పక్క రాష్ట్రమైన కర్నాటకలో కూడా జల్లికట్టు ప్రకంపనలు చోటు చేసుకున్నాయి. ప్రజా ఉద్యమానికి తావివ్వకుండా కర్నాటక ప్రభుత్వం హడావిడిగా అసెంబ్లీని సమావేశపరచి తమ రాష్ట్రంలోని కంబాళ అన్న సాంప్రదాయక క్రీడను ఎలాంటి షరతులు లేకుండా ఆడుకోవచ్చని చట్టాన్ని ఆమోదించింది. ఆంధ్రప్రదేశ్‌లోనైతే విచిత్రమైన పరిస్థితి. సుప్రీంకోర్టు ఆదేశాలను బేఖాతరు చేస్తూ సంక్రాంతి రోజున కోళ్ల పందేలను యధేచ్ఛగా జరుపుకున్నారు. సుప్రీంకోర్టు ఆదేశాలను అటు ప్రభుత్వం, రాజకీయ నాయకులు, ఇటు మీడియా ఎవరూ పట్టించుకోలేదు.

ఏది ఏమైనా భారత రాజకీయాలలో 'ఆవు–ఎద్దు–దున్న'లు చర్చించ వలసిన విషయాలుగా రూపుదిద్దుకొన్నాయి. ఆవు – హిందుత్వానికి ప్రతీకగా, ఎద్దు – తమిళ ఉనికి చిహ్నంగా, దున్న (మహిషాసురుడు) దళిత ప్రత్యేకతను ఎత్తిపడుతూ ఆయా సమూహాల గురుతుగా ముందు కొచ్చాయి. జంతువులకు భాష లేకపోవచ్చు. కాని బాధపడే గుణం ఉంది. మనుషులకు, జంతువులకు కొన్ని తేడాలతో శరీర నిర్మాణం ఒక్కటే. జంతువులకు, మానవులకు సంబంధాలు ఏ రీతిలో ఉండాలో, సంప్రదాయాల గురించి, ప్రతీకల గురించి పౌర సమాజం, మేధావులు చర్చించాల్సిన సమయమిది!

*(రచయిత జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపల్)* వీ

# బస్తర్‌లో హక్కుల హననం

**దేశ ఖనిజ సంపద విదేశీ కార్పొరేట్ సంస్థల పరం కాకుండా రక్షణగా నిలుస్తూ ఉద్యమిస్తున్న ఆదివాసులను, వారికి అండగా నిలిచిన ఉద్యమకారుల, ప్రజాస్వామికవాదుల, జర్నలిస్టుల హక్కులను ప్రభుత్వాలు కాలరాస్తున్నాయని అంటున్నారు బి. రామకృష్ణ**

తనపై పోలీస్ స్టేషన్‌లో అత్యాచారం జరిగిందని వివస్త్రను చేసి హింసించారని, జైల్లో విపరీతంగా శారీరక, మానసిక హింసను ప్రయోగించారని విన్నవించుకున్న ఆదివాసి మహిళా ఉపాధ్యాయురాలు సోనిసోరి ఆర్తనాదాన్ని పట్టించుకోని నికృష్ట వ్యవస్థ ఇది. ఆమెను అక్రమ కేసులో అరెస్టు చేసి 2011 అక్టోబర్ 8,9ల మధ్య రాత్రి దంతెవాడ పోలీస్ స్టేషన్‌లో అప్పటి ఎస్.పి. అంకిత్ గార్గ్ హింసించాడని తెలిపింది. ఆ తరువాత బెయిల్ నిరాకరించబడుతూ రెండేళ్లకు పైగా జైల్లోనే మగ్గిపోయింది. సుప్రీంకోర్టు ఆదేశాల మేరకు కలకత్తాలోని మెడికల్ కాలేజీ హాస్పిటల్ నిర్వహించిన వైద్య పరీక్షల్లో ఆమె మర్మావయవాల్లో రాళ్లు దూర్చారని తేలింది. కనీసం ఈ విషయం నిర్ధారణ అయ్యాక కూడా పోలీస్ అధికారులపై ఏ చర్యలు లేవు. పైగా ఆ అధికారికి 62వ రిపబ్లిక్ డే సందర్భంగా రాష్ట్రపతి చేతుల మీదుగా మెడల్ ఇస్తారా అని నిలదీస్తున్న మహిళకు ఈ వ్యవస్థ నుండి సమాధానమే లేదు.

చత్తీస్‌గడ్, బస్తర్‌లో మహిళలపై జరుగుతున్న అకృత్యాలను గమనిస్తే అధికార యంత్రాంగం ఎంత విచ్చలవిడితనానికి పాల్పడుతున్నదో మాటలకు అందదు. మావోయిస్టులను అణచివేసే పేరుమీద అమాయక ఆదివాసీ మహిళలను ఎంతగా హింసిస్తున్నారో సోనిసోరి స్వీయ అనుభవం, జైల్లో, బయట ఆమె కలిసిన మహిళల అనుభవాలను వింటుంటే కంపించిపోతుంటాం. సున్నిత మనస్కులకు కళ్ల వెంబడి నీళ్లే కాదు రక్తమే కారుతున్నట్లుంటుంది. ఆదివాసులను రోజుల తరబడి పోలీస్ స్టేషన్ల చుట్టూ తిప్పడం, తప్పుడు కేసులతో జైల్లో ఏళ్లకేళ్లు నిర్బంధిస్తున్నారు. ఇదే క్రమంలో ఆడవాళ్ల స్తనాలు, చనుమొనలు కోసేయడం, వాటికి ఎలక్ట్రిక్ షాక్‌లు ఇవ్వడం, లైంగిక అత్యాచారాలు చేయడం మామూలు విషయాలుగా మారాయి. ఈ మహిళలకు కోర్టులు, కేసులు, న్యాయ వ్యవహారాలు, ఏం తెలుస్తాయి. అమాయకత్వం నిరక్షరాస్యత, ఆసరాగా రాజ్య యంత్రాంగం ఎంతటి హింసను ప్రయోగిస్తున్నదో అధ్యయనం చేస్తే తెలుస్తుంది.

నక్సలైటు ఉద్యమానికి వ్యతిరేకంగా ఒకప్పటి కాంగ్రెస్ నాయకుడు మహేంద్రకర్మ జానజాగకర్ అభియాన్ సమీకరించాడు. ఇది అనేక చోట్ల అరాచకాలను సాగించింది. ఈ అభియాన్ కార్యక్రమంలో పోలీసుల అండదండలతో సల్వాజుడుంగా రూపుదిద్దుకున్నది. చట్ట వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడుతున్న సల్వాజుడుంను పోలీసులే నడిపించడం, తక్కువ వేతనాలతో స్పెషల్ పోలీస్ ఆఫీసర్లని (ఎస్‌పిఓ) నియమించి వారికి విచ్చలవిడి అధికారాలిచ్చారు. వారు గ్రామాలపై దాడులు చేయడం, బలవంతంగా సరెండర్ చేయించడం, ఆదివాసీ ప్రజలను ప్రభుత్వం లేదా సల్వాజుడుం నడుపుతున్న క్యాంపులకు తరలించడం చేశారు. పరిశోధక విద్యార్థి దశనుండి బస్తర్ ఆదివాసీ ప్రాంత పరిస్థితులను అక్కడి పరిణామాలను ప్రొఫెసర్ నందిని సుందర్ అధ్యయనం చేస్తున్నది. చట్ట వ్యతిరేక చర్యలకు పాల్పడుతున్న సల్వాజుడుంపై నందిని సుప్రీంకోర్టులో ప్రజా ప్రయోజనాల కేసు వేసి ఇది చట్ట విరుద్ధమైనదని తీర్పును పొందింది. ఈ తీర్పు 2011లో వచ్చింది. సల్వాజుడుం అనేది చట్టవ్యతిరేకం అని సుప్రీంకోర్టు అన్నదే కాని, అది అన్ని రోజులుగా చేస్తూ వచ్చిన దారుణాలపై విచారణ కాని, తగిన శిక్షలను గాని ప్రస్తావించలేదు. 2011లో తాడిమెట్ల, మొర్పల్లి, తిమ్మాపురం గ్రామాల్లో పోలీసులు, సల్వాజుడుం కలిసి చేసిన గృహ దహనాలు, హత్యలు, దాడులు, బూటకపు ఎన్‌కౌంటర్లపై నందిని సుందర్ కృషి వలన సిబిఐ విచారణకు ఆదేశించారు. ఇలాంటి కృషి వలన చత్తీస్‌గడ్ పోలీస్ యంత్రాంగం సాగిస్తున్న రాజ్యాంగ వ్యతిరేక చర్యలు వెలుగులోకి వస్తున్నాయి. ఫలితంగా పోలీసు వ్యవస్థ అపఖ్యాతి పాలు కావడం, కొంతమేరకైనా వారి చర్యలకు ఆటంకం ఏర్పడుతున్నట్లు భావించడం వలన నందిని సుందర్, అర్చన ప్రసాద్ వంటి ప్రొఫెసర్‌లు మరికొందరి పై నవంబర్ 2016లో చత్తీస్‌గడ్ పోలీసులు తప్పుడు హత్యానేరం కేసు నమోదు చేశారు.

2016 ఫిబ్రవరిలో జర్నలిస్టు మాలిని సుబ్రహ్మణియమ్‌ను జగ్‌దల్ పూర్ నుండి వెళ్లగొట్టారు. ఆమె స్క్రోల్ అనే వెబ్ పత్రికకు బస్తర్‌లో జరుగుతున్న పరిణామాలు, సంఘటనలపై ఎప్పటికప్పుడు రిపోర్ట్ చేసేది. ఈ ప్రాంతంలో రాజ్య యంత్రాంగం ఏది చెబితే అదే రాయకుండా నిజాలను రిపోర్ట్ చేయడం అనేది కష్టతరమైనట్టిది. మావోయిస్టుల అణచివేత పేరుతో అమాయక ఆదివాసులను తప్పుడు కేసుల్లో ఇరికించి పోలీస్ స్టేషన్ల చుట్టూ, తిప్పుతూ జైళ్లలో తోసేస్తూ వారికి న్యాయ సహాయం అందకుండా వారి జీవితాలను దుర్భరం చేస్తున్న తీరును బయటకు చెప్పే పని మాలిని చేస్తుండేది. సర్కారీ ప్రేరేపిత సైన్యాలు సామాజిక్ ఎక్తా మంచ్, యాక్షన్ గ్రూప్ ఫర్ నేషనల్ ఇంటిగ్రిటి (ఎజిఎన్ఐ), నక్సల్ పీడిత్ సంఘర్ష్ సమితి అనే రకరకాల పేర్లతో బస్తర్‌లో పనిచేస్తున్న హక్కుల కార్యకర్తలు, లాయర్లు, జర్నలిస్టుల పై దాడులు చేస్తుంటాయి. భయపెడుతుంటాయి. వీరికి వ్యతిరేకంగా ర్యాలీలు నిర్వహించడం, వారి దిష్టిబొమ్మలను కాల్చివేయడం చేస్తుంటారు. వీరికి స్థానిక పోలీసులు ఆపై ఉన్నత స్థాయి అధికారుల మార్గదర్శకత్వం ఉంటుంది. ఓ రకంగా వీరు, పోలీసులు ఒకటేనన్నమాట. ఈ అన్ని సంస్థల్లోని వారు చాలావరకు ఒకప్పుడు సల్వాజుడుంలో ఉన్నవారే. ఈ సంస్థలను పోలీసు వ్యవస్థ పెంచి పోషిస్తున్నది. 2014 నుండి మొన్నటివరకు బస్తర్ ఐజీగా చేసిన ఎస్ఆర్‌పి కల్లూరి మీడియాతో మాట్లాడుతూ ఈ సంస్థలు మంచివేనని వాటిని సమర్థించుకొచ్చాడు. అగ్ని సంస్థ వాళ్లు తనను కలిసి సహాయ సహకారాలు అడిగారని చెప్పాడు. ఈ మాటలను ఇంటర్ నెట్‌లో

చూడవచ్చు. ఈ సంస్థలకు పోలీసుల మధ్యనున్న సంబంధాలు బయట పడేసరికి అవి రద్దవుతుంటాయి. ఈ సంస్థల్లోని మనుషులే మరో పేరుతో మళ్లీ అవే పద్ధతులతో ముందుకొస్తారు.

బస్తర్‌లో 2013 నుండి జగ్దల్‌పూర్ లీగల్ ఎయిడ్ గ్రూప్ (జెఎజి ఎల్ఎజి) పనిచేస్తుంది. ఇందులో పనిచేస్తున్న లాయర్లను భయపెట్టి, బెదిరించి, వేధించి జగ్దల్‌పూర్‌లో ఉండకుండా చేశారు. ఈ న్యాయ సహాయక బృందంలో న్యాయవాదులైన షాలినీగెరా, ఇషా ఖండేవాల్ జైళ్లలో మగ్గిపోతున్న ఆదివాసులకు అలాగే పోలీస్ వేధింపులకు గురవుతున్న వారికి న్యాయ సహాయం అందించే ప్రయత్నం చేస్తున్నారు. నిజానికి పేదలకు, ఫీజులు చెల్లించుకోవడానికి స్థోమత లేనివారి కోసం కోర్టుల్లోనే లీగల్ ఎయిడ్‌లు ఉంటాయి, ఉండాలి. వాటి ద్వారా తగిన న్యాయ సలహాలు, సహాయాలు అందించబడాలి. అదే పనిని జగ్‌లాగ్ చేస్తుంటే రాజ్యయంత్రాంగం ప్రత్యేకించి పోలీసులు భరించలేక పోతున్నారు. కేంబ్రిడ్జి యూనివర్సిటీ నుండి పిఎచ్.డి చేసిన పరిశోధకురాలు బేలా భాటియా బస్తర్‌లో గత రెండు సంవత్సరాలుగా నివసిస్తున్నది. ఆమె టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్‌లో దళిత, ఆదివాసీ అధ్యయన శాఖలో బోధించేవారు. ఆదివాసుల మధ్య నివసిస్తూ వారికి సహాయకారిగా ఉంటూ, వారిపై జరుగుతున్న రకరకాల వేధింపులు, హింసలకు వ్యతిరేకంగా రాజ్యాంగ యంత్రాంగాలకు తెలియజేస్తూ ఉంటుంది. ఆమెను గత సంవత్సరం జగ్దల్‌పూర్‌లో నివసించకుండా రకరకాల ఒత్తిళ్లు తెచ్చారు. దాంతో ఆమె జగ్దల్‌పూర్ నుండి దగ్గర్లోని పర్ప గ్రామానికి నివాసం మార్చుకుంది. 2017 జనవరి 19,20 తేదీలలో పెదగెల్లూర్, బెల్లం నెంద్రా గ్రామాల్లో పోలీసుల అత్యాచారాలకు గురైన 14 మంది ఆదివాసీ మహిళల వాఙ్మూలాలను జాతీయ మానవ హక్కుల కమిషన్ సేకరించడంలో బేలా భాటియా సహకరించింది. ఆ తరువాత రోజే అంటే 21.01.2017న భాటియా తనుంటున్న పర్ప గ్రామానికి వచ్చింది. ఆ రోజు రాత్రి అనగా జనవరి 21/22 ల మధ్యరాత్రి అలాగే 23.01.17న ఆమె ఇంటిపై అగ్నివారు దాడికి దిగారు. వెంటనే ఖాళీ చేయమని బెదిరించారు. అక్కడి కొచ్చిన వారి ఫోటోలు, వారు ఉపయోగించిన వాహనం నంబర్‌ను బేలాభాటియా పోలీసులకు అందజేసింది. కాని వారిపై చర్యలేమి లేవు.

బేలాభాటియా, విమెన్ ఎగినెస్ట్ స్టేట్ వయొలెన్స్ అండ్ సెక్స్‌వల్ అసాల్ట్ (డబ్లుఎస్ఎస్), జగ్‌దల్‌పూర్ లీగల్ ఎయిడ్ గ్రూప్ (జగ్‌లాగ్), సోనిసోరీల కృషి ఫలితంగా బస్తర్ ప్రాంతంలోని బీజాపూర్ జిల్లా పెదగెల్లూర్, బెల్లంనెంద్ర, చిన్న గెల్లూర్ గ్రామాల్లో పోలీసులు, భద్రతా దళాలు మహిళలపై జరిపిన సామూహిక అత్యాచారాలు వెలుగు చూశాయి. బాధితులతో కలిసి వీటిపై భద్రతా దళాలకు వ్యతిరేకంగా 2015, నవంబర్1న అలాగే 2016 జనవరి 21న ఎఫ్ఐఆర్‌లను నమోదు చేయించారు. ఇలా ఐపిసి సెక్షన్ 376(2)(సి) ప్రకారం భద్రతాదళాలపై మహిళలపై సామూహిక అత్యాచారానికి సంబంధించి కేసు నమోదు చేయించడం మొట్టమొదటిసారి. భద్రతా దళాల ఆకృత్యాలను బయటపెట్టడంతో వీరందరికి వ్యతిరేకంగా సర్కారీ ప్రేరేపిత గ్రూపులు ర్యాలీలు నిర్వహించాయి. దిష్టిబొమ్మలు కాల్చివేశాయి. జగ్దల్‌పూర్ నుండి ఖాళీ చేయమని మాలిని సుబ్రహ్మణియం, ఇషా ఖండేవాల్, బేలా భాటియాలను బెదిరించారు. వేధించారు. ఈ వేధింపుల్లో పోలీసులు సర్కారీ ప్రేరేపిత ప్రైవేట్ సంస్థలు పాల్గొన్నాయి. వీరు నివసిస్తున్న ఇంటి యజమానులను పోలీసులు పిలిపించుకుని బెదిరించడం జరిగింది. ఖాళీ చేయించమని వత్తిడి తెచ్చారు.

అంతకుముందే గాంధేయవాది హిమాంషుకుమార్‌ను బెదిరించి వెళ్లగొట్టారు. ఆయన నిర్వహిస్తున్న ఆశ్రమాన్ని ధ్వంసం చేశారు. జగ్‌దల్‌పూర్ న్యాయ సహాయక బృందంలోని షాలినిగెరా పై కూడా 2016 డిసెంబర్‌లో తప్పుడు కేసు బనాయించారు. వీరందరూ కూడా రాజ్యాంగ బద్దంగానే ప్రజాస్వామికంగానే, చట్టాల ప్రకారమే రాజ్యాంగ యంత్రాంగాలైన కోర్టులకు, మానవహక్కుల కమిషన్‌లకు, మహిళా కమిషన్లకు, ఎస్‌సి, ఎస్‌టి కమిషన్‌లకు, ముఖ్యమంత్రులు, ప్రధానమంత్రులకు విన్నపాలను, విజ్ఞప్తులను చేస్తున్నారు.

2016, డిసెంబర్ 25న తెలంగాణ డెమొక్రటిక్ ఫోరమ్ (టిడిఎఫ్) సభ్యులు ఏడుగురిని ఛత్తీస్‌గఢ్ పోలీసులు అక్రమంగా అరెస్ట్ చేశారు. వీరిపై ఛత్తీస్‌గఢ్ స్పెషల్ పబ్లిక్ సెక్యూరిటీ యాక్ట్ కింద కేసు పెట్టి జైలుకు పంపించారు. అరెస్ట్ చేయబడి జైల్లో మగ్గుతున్న ఈ ఏడుగురూ బహిరంగంగా ప్రజల మధ్య పనిచేస్తున్న వారే. చిక్కుడు ప్రభాకర్, బల్లా రవీంద్రనాథ్‌లు లాయర్లుగా కోర్టుల్లో ప్రాక్టీస్ చేస్తున్నారు. హిందూ మతోన్మాదం, కుల వివక్షతలకు వ్యతిరేకంగా సుదీర్ఘ కాలంగా పనిచేస్తున్న దుడ్డు ప్రభాకర్, తుడుందెబ్బ నాయకుడు రమణాల లక్ష్మయ్య, జర్నలిస్ట్ దుర్గాప్రసాద్, విద్యార్థులు నజీర్, రాజేంద్రప్రసాద్‌లు అందరూ బహిరంగంగా తాము నమ్మిన ఆశయాల కోసం చట్టబద్ధంగానే పనిచేస్తున్నారు. వీరిని అరెస్టు చేయడమే సరైంది కాదు. ఆ పైన బెయిల్ నిరాకరించడం మరింత దారుణం.

గతంలో సాయిబాబా, బినాయక్ సేన్‌లు సుదీర్ఘకాలం పాటు బెయిల్ నిరాకరించబడుతూ జైల్లో మగ్గిపోయారు. ఢిల్లీ యూనివర్సిటీలో నిత్యం పాఠాలు చెప్పే వ్యక్తి అందులోనూ 90 శాతం అంగ వైకల్యమున్న మనిషిని ఎప్పుడంటే అప్పుడు విచారించడానికి అందుబాటులో ఉండే వ్యక్తిని కూడా జైల్లో నిర్బంధించి సరైన వైద్య సదుపాయం అందించలేదు. ప్రముఖ పిల్లల వైద్యుడు బినాయక్‌సేన్‌పై అక్రమకేసు పెట్టి చాలాకాలం జైల్లో నిర్బంధించి సరైన సాక్ష్యాలు లేకుండానే ఉరిశిక్ష వేశారు. పాటలు పాడే జీతన్ మరాండిని అక్రమ కేసులో ఇరికించి సరైన ఆధారాలు లేకున్నప్పటికీ ఉరిశిక్ష విధించారు. అంతర్జాతీయంగా, దేశవ్యాప్తంగా వచ్చిన నిరసనల నేపథ్యంలో పై కోర్టుల్లో ఈ ఉరిశిక్షలు రద్దు చేయబడ్డాయి. ఈ నేపథ్యంలో హక్కులకున్న గౌరవం, విలువ ఏది?

బస్తర్ ప్రాంతంలో పనిచేస్తూ అక్కడి దారుణాలను బయటపెడుతున్న హక్కుల కార్యకర్తలు, న్యాయవాదులు, జర్నలిస్టులు, సామాజిక కార్యకర్తలను ఆ ప్రాంతం నుండి తరిమేయడానికి అనేక బెదిరింపులు, వేధింపులకు గురిచేయడం, వీరికి ఇళ్లు ఇచ్చిన యజమానులను బెదిరించడం జరుగుతున్న సంఘటనల్లో కలెక్టర్లు, న్యాయస్థానాలు, మానవహక్కుల కమీషన్లు కల్పించుకుని బాధితులకు తగు రక్షణ, భద్రతను కల్పించాలి. అలా జరగనప్పుడు ఈ వ్యవస్థను గౌరవించడం, నమ్మడం సాధ్యమవుతుందా? రాజ్యం చేసే అసలు పని హక్కులకు గ్యారంటీ ఇవ్వడమే కదా! కాని ఇక్కడ రాజ్యమే నేరమైంది. నేరమే అధికారమైంది. ఇక నేరాలు ఎలా ఆపబడతాయి. అన్యాయమే రాజ్య యంత్రాంగం అయింది. న్యాయం అడిగే వారిపై అన్యాయం కన్నెర్ర చేస్తున్నది. ఇక ప్రజలకు మిగిలిందేమీ పోరాటం తప్ప.

ఆదివాసి ప్రాంతాలలో రాజ్య యంత్రాంగం చేస్తున్న ప్రజాస్వామ్య

వ్యతిరేక, రాజ్యాంగ ఉల్లంఘనలను బయటకు చెబుతున్న న్యాయవాదులు, జర్నలిస్టులు, పరిశోధకులు, ప్రొఫెసర్లు అందరిని కూడా నక్సల్ సమర్థకులని ముద్రలు వేసి టార్గెట్ చేస్తున్నారు. వెంటాడుతున్నారు, బెదిరిస్తున్నారు, అక్రమ కేసులు పెడుతున్నారు. వీరిని జాతి వ్యతిరేకులని, దేశద్రోహులని, శత్రువులని, దేశ సార్వభౌమత్వానికి ప్రమాదకారులని బస్తర్ రేంజి ఇన్‌స్పెక్టర్ జనరల్ ఎస్ఆర్‌పి కల్లూరి చేత చెప్పిస్తున్నారు.

అధికార పాలక పార్టీల చేతుల్లో పావులైన పోలీసుల అదుపాజ్ఞల్లో నడిచిన ఒకప్పటి సల్వాజుడుం ఆ తరువాత వేర్వేరు పేర్లతో పుట్టుకొచ్చిన సంస్థలను నడపడం చట్ట వ్యతిరేకం కాదా? ఈ విషయాన్ని 2011లో సుప్రీంకోర్టు సహితం చెప్పింది. ఇలా చట్టవ్యతిరేక, రాజ్యాంగ వ్యతిరేక కార్యకలాపాలు చేపడుతున్న పోలీసు యంత్రాంగం చేస్తున్నది దేశద్రోహం కాదా? వారు జాతి వ్యతిరేకులు కారా? ఇది లైసెన్స్‌డ్ గుండాగిరి అంటే తప్పేముంటుంది!

సామూహిక అత్యాచారాలను, హత్యలను, గృహదహనాలను ప్రోత్సహిస్తున్న, చేయిస్తున్న రాజ్య యంత్రాంగం దాని అధినేతలు, అధికార పాలకపార్టీలు దేశద్రోహులు కాదా? అసలు దేశద్రోహం అంటే ఏమిటి? కార్పొరేట్ పెట్టుబడిదారులకు అడవులను అప్పగిస్తూ, అన్నిరకాల ప్రజాస్వామిక, ప్రజానుకూల చట్టాలను, న్యాయాలను, రాజ్యాంగ నియమాలను హరించివేస్తూ ఆదివాసుల జీవితాలను చిన్నాభిన్నం చేస్తున్నవారి నేమనాలి? టాటా, ఎస్సార్, వేదాంత తదితర మరెన్నో మైనింగ్ కంపెనీలకు వేలాదిగా ఆదివాసీ గ్రామాలను అప్పజెప్పుతూ,, లక్షలాదిగా నిర్వాసితులను చేస్తున్న వారినేమనాలి?

రకరకాల ప్రాజెక్టులు, అభివృద్ధి పేరుతో నిర్వాసితులైన వారిలో అధికంగా ఆదివాసులే. వారికి న్యాయబద్ధమైన నష్ట పరిహారం కాని పునరావాసం కాని అందించబడలేదు. అందుకు తగిన చట్టాలే లేవు. ఇందుకు కొంతమేరకు భూసేకరణ చట్టం 2013 మినహాయింపు. అమలులో ఉన్న 5వ షెడ్యూల్‌కు, 1/70 చట్టానికి, అటవీహక్కుల చట్టం, పంచాయతి ఎక్స్‌టెన్షన్ షెడ్యూల్ యాక్ట్(పిఇఎస్ఎ), పర్యావరణ చట్టాలకు దిక్కేలేదు. ఇంతలా దౌర్జన్య పూరితంగా మారిన రాజ్యం, దాన్ని నడిపిస్తున్న పాలక వర్గ పార్టీలు జాతి వ్యతిరేకులు, దేశద్రోహులు కాకుండా పోతారా?

చట్టాలను సక్రమంగా అమలు చేయాల్సిన దాని నుండి తప్పుకుని వాటి అండతో, అధికారంతో మైనింగ్ మాఫియాకు వత్తాసు పలకడం సరికాదని అనడం, తప్పు అవుతున్నది. రాజ్యాంగంను అమలు చేయమని, చట్ట ప్రకారం నడుచుకొమ్మని, హక్కులను అమలు చేయమని అడగడం, ప్రజలు తమ భావాలను రాజ్యాంగబద్ధంగానే వ్యక్తీకరించడం నేరం అవుతున్నది. సరైన రాజ్యమే అయితే హక్కుల కార్యకర్తలు వెతికి తీస్తున్న నిజాలను ఆహ్వానిస్తుంది. దాన్ని ఒక సామాజిక కర్తవ్యంగా చూస్తుంది. తప్పులు జరిగితే సరిదిద్దే ప్రయత్నం చేస్తుంది. రాజ్యాంగాన్ని అమలు చేస్తుంది. అభివృద్ధి ఫలాలను అందరికి అందేలా చేస్తది. సామాజిక, ఆర్థిక సమానత్వాన్ని సాధించే చర్యలు తీసుకుంటుంది. రాజ్యాంగబద్ధమైన వాటికి అడ్డుగా ఉండే అన్నిరకాల ఆధిపత్యాలను అడ్డుకుంటుంది. నిర్మూలిస్తది.

ఇది కదా! రాజ్యం చేయవల్సింది. వీటికి వ్యతిరేకంగా చేస్తున్నప్పుడు ఈ రాజ్యం ప్రజలందరిది కాదని కొందరిదేనని అనుకోవడంలో తప్పేమున్నది. కొన్ని వర్గాల ప్రయోజనాల కోసమే ఇది పనిచేస్తున్నదనేది నిజం కాకుండా పోతుందా. అలా అని ఎవరైనా విశ్లేషిస్తే, మాట్లాడితే, అది తప్పని అంటే జాతివ్యతిరేకులుగా, దేశద్రోహులుగా, నక్సల్ సమర్థకులుగా, మావోయిస్టులుగా, మావోయిస్టు సానుభూతిపరులుగా ముద్రలు వేయడం అధికారంలో ఉన్న బిజెపి పాలకులకు మంచినీళ్లప్రాయమైంది.

మావోయిస్టుల అణచివేత పేరుతో కూంబింగ్‌లు, వెదకడాల సందర్భంగా భద్రతా దళాలు చేస్తున్న మాటలకందని దారుణాలు, దుర్మార్గాలు అన్నింటిని కాకున్నా శక్తిమేరకు కొన్నైనా సరే వెలుగులోకి తేవడం సాహసమే. ఈ క్రమంలోనే మహిళలపై జరిగిన సామూహిక అత్యాచారాలను జాతీయ మానవహక్కుల కమిషన్ దృష్టికి తేబడ్డాయి. వాటిపై విచారణ జరిపిన హక్కుల కమిషన్ 16 మంది మహిళలపై లైంగిక అత్యాచారాలు జరిగాయని, దీనికి భద్రతా దళాలు కారణమని జనవరి 2017లో ఒక ఆర్డర్‌ను విడుదల చేసింది. తద్వారా మావోయిస్టులకు వ్యతిరేకంగా రాజ్యం చేస్తున్న యుద్ధంలో ఆదివాసి మహిళలపై లైంగిక హింసను ఆయుధంగా వాడుతున్నారని బస్తర్‌లో పనిచేస్తున్న హక్కుల, సామాజిక కార్యకర్తలు చెప్పిన విషయం ధృవపరచబడింది.

పాలిచ్చే తల్లులైన ఆదివాసీ మహిళలు మావోయిస్టులు కాదని వారిని పరీక్షించేందుకు భద్రతా దళాలు, పోలీసులు, వారి ప్రైవేటు సంస్థలు ఆడవారి రొమ్ముల నుండి పాలు వస్తున్నాయా లేదా అని పరీక్షలు చేస్తారని ఈ కార్యకర్తలు ప్రజలతో సంబంధాల్లో ఉండడం ద్వారా బయటకు తెలియజేశారు. పోలీస్ స్టేషన్లలో అత్యాచారాలకు గురైన మహిళలు జైళ్లలో గర్భవతులై పిల్లలు ప్రసవించిన సందర్భాలున్నాయి. బస్తర్‌లో ఎంతోకాలంగా జరుగుతున్న సర్కారీ ప్రేరేపిత దుర్మర్గాలు కొన్నైనా సామాజిక కార్యకర్తల కృషి వలన బయటపడుతున్నాయి. దీన్ని కూడా ఆపడం పోలీసుల ఉద్దేశం. తద్వారా అక్కడ ఏం చేసినా ఎవరికీ తెలియదు. ఒకవేళ తెలిసినా బాధితులకు చేయగలిగింది తక్కువేనేమో. ఎందుకంటే ఏ రాజ్య యంత్రాంగం వీటిపై స్పందించి బాధితులకు అండగా నిలిచే పరిస్థితి లేదు. పోలీస్‌స్టేషన్లు, జైళ్లు నిర్బంధాలకు, హక్కుల నులిమివేతకు చిహ్నాలు అవుతున్నాయి.

రాజ్యాంగాన్ని ఉల్లంఘించి భయానక రాజ్యాన్ని నడిపిస్తున్నారు. అన్ని రకాల మానవ, ప్రజాస్వామిక విలువలను ధ్వంసం చేస్తున్నారు. అక్కడి ఆదివాసులను రాజ్యాంగ లక్ష్యాలు, ఆశయాలు దరిచేరవు. ఏ ఒక్క ప్రజాస్వామిక వ్యవస్థ వారిని పలకరించదు. కాని పోలీసులు, భద్రతా దళాలు ప్రవేశిస్తుంటాయి. మావోయిస్టులకు సహకరిస్తున్నారనే నెపంతో ఆదివాసీ ప్రజలపై ఈ బలగాలు చేయని నేరాలు, ఘోరాలు లేవు. ఇష్టారీతిన హింసను ప్రయోగిస్తాయి. దీనికి ప్రతిగా ప్రజలు తిరగబడితే అది చట్టాలు, రాజ్యాంగాల ఉల్లంఘన అవుతుంది. బహుళ జాతి కంపెనీలు బస్తర్‌లోని ఖనిజ సంపదలను సొమ్ము చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాయి. వీటికి అండగా చట్ట సభలైన అసెంబ్లీ, పార్లమెంట్‌లు, న్యాయవ్యవస్థలు, పోలీసు, భద్రత వ్యవస్థలు ఆదివాసులపై దండయాత్రలు చేస్తున్నాయి. బస్తర్‌లో చత్తీస్‌గడ్ పాలకపార్టీ, దానికి వెన్నుదన్నుగా ఉన్న కేంద్రంలోని పాలకపార్టీ చేస్తున్న అధర్మ దాడి అవతార్ సినిమాను గుర్తుకు తెస్తుంది. అవతార్ సినిమాలో ప్రకృతి సంపదలను కొల్లగొట్టడం కోసం ఆదివాసులపై అనైతిక దాడి జరుగుతుంది. తమ సర్వశక్తులు ఒడ్డి ఆదివాసులు తమ ప్రాంతాన్ని, అందులోని ప్రకృతి సంపదలను పరి రక్షించుకోవడానికి జీవన్మరణ పోరాటం చేస్తారు. చివరకు పెట్టుబడిదారీ శక్తులను, వారి అత్యాధునిక సాంకేతిక యుద్ధ పరికరాలను ఓడిస్తారు. బస్తర్‌లో కూడా ఈ అనుభవమే చివరకు మిగులుతుందని ఆశిద్దాం.

*(రచయిత ఉపాధ్యాయులు)*

# రాజకీయ హక్కులు - నాగాలాండ్ మహిళలు

***నాగాలాండ్ మునిసిపల్ ఎన్నికల్లో మహిళలకు రిజర్వేషన్ కల్పించడాన్ని వ్యతిరేకిస్తూ నాగా సంప్రదాయం పేరిట మహిళల హక్కులను అడ్డుకున్న పురుషాధిపత్యాన్ని, దానికి అండగా నిలిచిన పాలకుల తీరును వివరిస్తున్నారు డా. కె. సుభాషిణి***

గిరిజనేతర ప్రాంత స్త్రీల కంటే కొన్ని వివక్షతలకు దూరంగా, అంతో ఇంతో స్వేచ్ఛగా మునుగడ సాగిస్తున్న నాగాలాండ్ మహిళల రాజకీయ రంగ ప్రవేశాన్నీ, ఎన్నికలలో పోటీ చేయడాన్నీ అక్కడి గిరిజన పురుష శక్తులు అడ్డుకుంటున్నాయి. సమాజంలో అన్నీ ప్రాంతాలలో ఉన్నట్లే నాగాలాండ్ సమాజంలో కూడా పురుషాధిపత్యమే అన్నిరకాల అధికారాలను చెలాయిస్తోంది. అయితే మిగిలిన ప్రాంతాలలో లాగా కట్నం కోసం కోడళ్లను హింసించే, చంపే అత్తింటి ఆరళ్లు లేవు. గర్భస్థ ఆడ శిశువులను పిండ దశలోనే చిదిమి వేయడం, పుట్టిన బిడ్డ ఆడపిల్ల అయితే నోట్లో వడ్లగింజ వేసి చంపివేయడాలు, కుటుంబ పరువు, ప్రతిష్టల పేరిట తమ కుటుంబ స్త్రీలను హత్య చేయడాలు, ఆడపిల్లలను అమ్ముకోవడం లాంటి అమానుష చర్యలు నాగాలాండ్ గిరిజన ప్రజల జీవన విధానంలో లేవని తెలుస్తోంది.

ముఖ్యంగా ఒంటరి మహిళలు స్వేచ్ఛగా, నిర్భయంగా జీవనం కొనసాగించే పరిస్థితులు నాగాలాండ్‌లో ఉన్నట్టు అర్థమవుతోంది. తెలిసో తెలియకో, అమాయకత్వం తోనో లేదా మోసగించబడో, పిన్న వయస్సు లోనో, వివాహానికి ముందే తల్లులయ్యే నాగాలాండ్ గిరిజన మహిళలను వారి సమాజం వెలివేయదని, తల్లిదండ్రులు అండగా ఉంటారని, పిల్లలు తల్లితోనే ఉంటారన్న విషయం తెలిసినప్పుడు ఆశ్చర్యం కలగక మానదు.

భారతదేశంలో మహిళలకు అత్యంత సురక్షితమైన ప్రాంతం నాగాలాండ్ అనే అభిప్రాయం ప్రచారంలో ఉంది. ఈ ప్రచారానికి బలం చేకూర్చేట్టుగా, భారతదేశంలో స్త్రీలపై జరిగే సగటు క్రైమ్ రేట్ కంటే నాగాలాండ్‌లో చాలా తక్కువ అని, అది సింగిల్ డిజిట్‌లోనే ఉందని అనేక స్వచ్ఛంద సంస్థల గణాంకాలు చెబుతున్నాయి.

అయితే గణాంకాలకు, వాస్తవ సంఘటనలకు తేడా ఉంటుంది. నాగాలాండ్‌లో కూడా ఆడపిల్లలను ఎత్తుకుపోవడం, ఎర వేసి మాయ చేయడం, అరుదుగా అయినా అక్కడి మహిళలపై అత్యాచారాలు జరుగుతున్నాయి అని వార్తల ద్వారా తెలుస్తోంది.

నాగాలాండ్‌లో పదిహేడుకు పైగా గిరిజన తెగలు ఉన్నాయి. ఈ తెగలకు ఉమ్మడిగా ఉన్న అంశాలు ఏవైనా ఉన్నాయి అంటే అవి ఆంగ్ల భాష, క్రిస్టియానిటీయే. మెజారిటీ ప్రజలు క్రిస్టియన్ మతాన్నే ఆచరిస్తున్నారు. ఆంగ్లమే అధికార భాషగా ఉంది. విద్యా వ్యవస్థలో కూడా ఆంగ్ల మాధ్యమమే చలామణిలో ఉంది. సంగీతంపైన మక్కువ ఎక్కువ. ప్రతి ఇంట్లోనూ సంగీత వాయిద్యాలను సమకూర్చుకుంటారు. గిరిజన సాంప్రదాయ నృత్యాలను జీవితంలో భాగం చేసుకోవడం అందరికి తెలిసిన విషయమే. భారతదేశంలో ఇతర మహిళలు వేసుకునే తరహా దుస్తులు కాకుండా, పాశ్చాత్య ఫ్యాషన్ దుస్తులు వేసుకోడానికే ఎక్కువ ఇష్టపడతారు. తమ గిరిజన సాంప్రదాయ దుస్తులు, నగలు వేసుకోడానికి చాలా ప్రాధాన్యం ఇస్తారు. స్త్రీ పురుషులు ఇరువురు గిరిజన సాంప్రదాయాల పట్ల అపార గౌరవం కలిగి ఉంటారు. సాంప్రదాయాలు వారి మనసుల్లో చాలా లోతుగా నాటుకుపోయి ఉన్నాయి. తమ సొంత గిరిజన తెగపట్ల వారికి ప్రేమాభిమానాలు ఎక్కువ.

నాగాలాండ్ గిరిజన తెగలకు సంబంధించిన ప్రత్యేక సాంప్రదాయ చట్టాలు, పరిపాలన ఉంటాయి. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో సంభవించే వివాదాలకు, నేరాలకు ఆ గ్రామ పెద్దనే విచారణ జరిపి శిక్షలు ఖరారు చేస్తుంటారు. గిరిజన తెగల కుటుంబాల్లో పురుషుడే యజమానిగా ఉంటాడు. వంశపారపర్యంగా వచ్చే ఆస్తుల మీద గిరిజన స్త్రీలకు ఎలాంటి హక్కును గిరిజన సాంప్రదాయ చట్టాలు ఇవ్వలేదు. కాకపోతే జీవిత భాగస్వామిని ఎన్నుకోవడంలో నాగాలాండ్ గిరిజన స్త్రీలకు పూర్తి స్వేచ్ఛ ఉంది. ఇది వేరే ప్రాంతాల స్త్రీలతో పోల్చుకుంటే చాలా మెరుగ్గానూ, ఆహ్వానించదగినదిగానూ అనిపిస్తుంది.

బయట సమాజంలో ఎవరైనా స్త్రీలను హింసిస్తుంటే, అతడిని దండించి, ఆ స్త్రీ గౌరవాన్ని కాపాడడం తన విధిగా భావిస్తాడు నాగాలాండ్ గిరిజన పురుషుడు. అదే పురుషుడు తన ఇంటిలోని ఆడవాళ్లను తల్లీ, భార్యా, కూతుర్లపై చేయి చేసుకుంటూ అజమాయిషి చేస్తుంటాడని 'నాగాలాండ్ పేజ్' పత్రిక సంపాదకురాలు, ప్రముఖ కవయిత్రి మోనాలిసా చాంగ్కిజా ఒక పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో వెల్లడించారు. ఇది ఒక పెద్ద విషాదంతో కూడుకున్న వైరుధ్యమని ఆమె అభివర్ణించారు. భర్త మరణించిన తర్వాత, పిల్లలు చిన్నవాళ్లుగా ఉంటేనే ఇంటి మీద, ఆస్తి వ్యవహారాల మీద స్త్రీకి అధికారం ఉంటుంది. లేకపోతే పెద్దకొడుకు చేతిలో పూర్తి అజమాయిషి ఉంటుంది. ఇక నిర్ణయాధికారం అన్నది నాగాలాండ్ గిరిజన మహిళల దరిదాపుల్లో లేదు. బయట ప్రపంచంలో ఆధునిక భావాలతో మెదిలే గిరిజన పురుషులు తమ ఇంటి లోపలా, తమ ఇంట్లోని స్త్రీలతో వ్యవహరించినప్పుడు మాత్రం పురుషాధిపత్య భావజాలంతోనే ఉంటారనేది తిరుగులేని సత్యం.

విద్యా, వ్యాపారం బ్యూరోక్రసీలో ఉన్నత స్థానాలలో పెద్ద సంఖ్యలో ఉన్న నాగాలాండ్ మహిళలు రాజకీయరంగంలో లేకపోవడం పెద్ద లోపంగా కనిపిస్తుంది. గత యాభై సంవత్సరాలుగా కేవలం 25 మంది మహిళలు మాత్రమే శాసనసభ ఎన్నికలకు పోటీ చేశారని శాసనసభ ఎన్నికల గణాంకాలు చూస్తే తెలుస్తోంది. ప్రస్తుతం ఒకే ఒక్క మహిళా ఎంఎల్ఏ ఉండడం చూస్తే నాగాలాండ్ రాజకీయాలలో స్త్రీల ప్రాతినిధ్యం ఏపాటిదో అర్థమవుతోంది.

నాగాలాండ్ మున్సిపాలిటి సంఘాల ఎన్నికలల్లో 33 శాతం మహిళా రిజర్వేషన్‌ను అమలు చేయాలని నాగాలాండ్ ప్రభుత్వం చట్టం తీసుకొచ్చిన మరుక్షణం నుండే నాగాలాండ్ పురుషులు ఈ చట్టాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. ఈ చట్టాన్ని అమలు చేయడమంటే అది నాగా జాతి సంస్కృతి, సాంప్రదాయ ఆచారాలకు విరుద్ధమని పెద్ద ఎత్తున నిరసన తెలిపారు. నాగాలాండ్ రాష్ట్రం ప్రత్యేకత కొరకు రాజ్యాంగంలో పొందుపరిచిన ఆర్టికల్ 371(ఎ) ను ఉల్లంఘించడం అవుతుందనీ, గిరిజన సాంప్రదాయాలకు తూట్లు పొడిచే ప్రభుత్వ ప్రయత్నాన్ని ఎట్టి పరిస్థితులల్లోనూ కొనసాగించమనీ ఆర్టికల్ 371(ఎ) ను రంగం మీదకు తీసుకొచ్చి, తమ స్త్రీ వ్యతిరేకతను ఛాటుకున్నారు.

అంతే కాకుండా గిరిజన సాంప్రదాయం, ఆచారాల పేరిట గిరిజన తెగల మద్దతు కూడగట్టుకుంటూ నాగాలాండ్ గిరిజన మహిళల నోళ్లు నొక్కేస్తూ, వారి హక్కులను కాలరాసే ప్రయత్నం చేశారు. అందులో భాగంగానే నాగాలాండ్ మున్సిపాలిటీ ఎన్నికలను అడ్డుకున్నారు. ఈ తీవ్ర వ్యతిరేకతకు జడిసే నాగాలాండ్ ప్రభుత్వం అక్కడ పది సంవత్సరాలకు పైగా స్థానిక సంస్థలకు ఎన్నికలు నిర్వహించలేదు.

నాగాలాండ్ మహిళల రాజకీయ అధికార నిర్ణయాలకు అడ్డుతగిలిన గిరిజన పురుష శక్తులను కట్టడి చేయాల్సింది పోయి శాళ్లకు తలవొగ్గి మీనవేషాలు లెక్కవేసిన నాగాలాండ్ ప్రభుత్వ ద్వంద్వ వైఖరిని మహిళలు అర్థం చేసుకున్నారు. నాగా మదర్స్ అసోసియేషన్ (ఎన్.ఎం.ఎ) ఆధ్వర్యంలో ప్రభుత్వ వైఖరిని సవాలు చేస్తూ గౌహతి హైకోర్టు కొహిమ బెంచ్‌కు 2011 జూన్‌లో ఒక రిట్ పిటీషన్ దాఖలు చేశారు. సింగిల్ జడ్జి బెంచ్ ఎన్.ఎం.ఎ రిట్‌ను సమర్థిస్తూ, 2012 జనవరిలోగా మున్సిపాలిటికి ఎన్నికలు నిర్వహించాలని నాగాలాండ్ ప్రభుత్వాన్ని ఆదేశించింది. ఈ చట్టాన్ని నాగాలాండ్‌లో అమలు చేస్తే రాష్ట్రంలో శాంతికి విఘాతం కలుగుతుందనే వాదనతో గౌహతి హైకోర్టు డివిజన్ బెంచ్‌కు నాగాలాండ్ ప్రభుత్వం అప్పీల్ చేసుకొని సింగిల్ జడ్జి బెంచ్ ఆదేశం పై స్టే తెచ్చుకుంది. అంతటితో ఆగలేదు నాగాలాండ్ ప్రభుత్వం. స్థానిక సంస్థలల్లో మహిళా రిజర్వేషన్‌ను అమలు పరచడమంటే అది నాగాజాతి సాంప్రదాయ, ఆచార వ్యవహారాలను పేర్కొన్న ఆర్టికల్ 371(ఎ)ను ఉల్లంఘించడమవుతుందనే నెపంతో మహిళా రిజర్వేషన్ చట్టాన్ని తిరస్కరిస్తూ రాష్ట్ర అసెంబ్లీలో ఒక తీర్మానం చేసింది.

నాగాలాండ్ ప్రభుత్వ వైఖరి నగ్నంగా బయట పడడంతో నాగాలాండ్ మహిళలు సంఘటితమై మహిళా రిజర్వేషన్ చట్టసాధన కొరకు ఒక ఐక్యకార్యాచరణ కమిటీని ఏర్పాటు చేసుకొని 2012లో సుప్రీం కోర్టును ఆశ్రయించారు. సింగిల్ జడ్జ్ ఇచ్చిన రూలింగ్‌ను సమర్థిస్తూ 2016లో సుప్రీంకోర్టు తీర్పును ఇచ్చింది. దీంతో నాగాలాండ్ మున్సిపాలిటి ఎన్నికల్లో మహిళా రిజర్వేషన్‌ను అమలు చేయడానికి మార్గం సుగమం అయింది. 2017 ఫిబ్రవరి 1న స్థానిక సంస్థలకు ఎన్నికలు నిర్వహిస్తామని 2017 జనవరిలో నాగాలాండ్ ప్రభుత్వం ప్రకటించింది. ప్రకటన వెలువడిన వెంటనే తమ తీవ్ర నిరసనను వెల్లడిస్తూ ఈ ఎన్నికలల్లో పాల్గొనే అభ్యర్థులను వారి తెగల నుండి బహిష్కరిస్తామని నాగాలాండ్ ట్రైబల్ యాక్షన్ కమిటీ (ఎన్.టి.ఎ.సి) సభ్యులు బెదిరింపులకు పాల్పడ్డారు. నామినేషన్స్ వేయడానికే భయపడి కొందరు మహిళా అభ్యర్థులు వెనక్కు తగ్గితే మరి కొందరు ఒత్తిడికి గురయ్యి వేసిన నామినేషన్స్ ఉపసంహ రించుకున్నారు. ధైర్యంతో బరిలో నిలబడిన వారిని పది నుండి ముప్పై సంవత్సరాల పాటు తెగ నుండి వెలి వేశారు. ప్రభుత్వాన్ని కూడా ఎన్నికలు ఆపమని డిమాండ్ చేశారు. అయితే వీరి డిమాండ్‌ను ప్రభుత్వం తిరస్కరించి స్థానిక సంస్థలకు ఎన్నికలు జరపడానికే నిర్ణయం తీసుకుంది.

దీంతో మహిళా రిజర్వేషన్‌ను వ్యతిరేకిస్తున్న శక్తులు జనవరి 28 నుండి ఫిబ్రవరి 1 వరకు నాలుగు రోజుల పాటు నాగాలాండ్ బంద్‌కు పిలుపునిచ్చాయి. పెద్దఎత్తున ప్రభుత్వ ఆస్తులు అగ్నికి ఆహుతి అయ్యాయి. పోలీసుల కాల్పులలో ఇద్దరు నాగాలాండ్ పౌరుల మరణానికి దారి తీసింది. ఆందోళనకారులు ముఖ్యమంత్రి, ఆయన మంత్రి వర్గం రాజీనామాలను డిమాండ్ చేసింది ఎన్.టి.ఎ.సి . రాజీనామా చేసేవరకు కాల్పులలో మరణించిన వారికి అంత్యక్రియలు చేయమని తేల్చి చెప్పారు. చర్చలు, బుజ్జగింపులు, రాజీల ఫలితంగా చివరకు అంత్యక్రియలు జరిగాయి. కాని నాగాలాండ్ రాష్ట్రంలో పరిస్థితి చేయి దాటి పోవడంతో జరిగిన కాసిన్ని ఎన్నికలను కూడా రద్దు చేస్తున్నట్టు ప్రభుత్వం ప్రకటించింది. బెదిరింపులు, బంద్‌లు, విధ్వంసాల మధ్యలో కూడా కొన్ని పట్టణాల్లో అయినా ఎన్నికలు జరిగాయి అంటే మహిళా రిజర్వేషన్‌ను అడ్డుకుంటున్న వారిని వ్యతిరేకించారు అన్న విషయం స్పష్టమవుతుంది.

స్థానిక సంస్థల ఎన్నికలల్లో మహిళా రిజర్వేషన్ అమలుపై శాసనసభలో అన్ని పార్టీలూ వీలైనంత త్వరలో ఏకాభిప్రాయానికి రాని పక్షంలో రాష్ట్రంలో అశాంతికి, అపోహలకు, వివాదాలకు కారణమైన ఆర్టికల్ 243 (టి) (మున్సిపాలిటీ ఎన్నికలల్లో 33 శాతం మహిళా రిజర్వేషన్ అమలు గురించి చెప్పిన రాజ్యాంగంలోని తొమ్మిదవ అధ్యాయం ఆర్టికల్) నుండి నాగాలాండ్ రాష్ట్రానికి మినహాయింపు కోరడం తప్ప వేరే గత్యంతరం లేదనే అభిప్రాయంతో నాగాలాండ్ ముఖ్యమంత్రి చేతులు దులుపుకునే ప్రయత్నం చేశారు. దీనిని ముందుకు తీసుకు వెళ్లే ప్రయత్నాన్ని వేగవంతం చేశారు. వెంటనే రాజ్యాంగంలోని తొమ్మిదవ అధ్యాయం నుండి నాగాలాండ్ రాష్ట్రాన్ని మినహాయించాలని కేంద్ర ప్రభుత్వానికి ఒక లేఖ రాయాడానికి నాగాలాండ్ ప్రభుత్వం నిర్ణయించుకుంది. అన్నిటికంటే ఆందోళన కలిగించే విషయం ఇదే.

నాగాలాండ్ మహిళల హక్కులను తుంగలో తొక్కి, గిరిజన సాంప్రదాయ, ఆచార వ్యవహారాలకు భంగం వాటిల్లకుండా చేస్తామనే తప్పుడు ప్రచారంతో పురుషాధిపత్య భావజాలానికి దాసోహం అయింది నాగాలాండ్ ప్రభుత్వం. మీ ప్రజలకు ఏదో విధంగా నచ్చచెప్పండి అని కేంద్ర హోంమంత్రి సన్నాయి నొక్కులతో కూడుకున్న సలహాలు నాగాలాండ్ ప్రభుత్వానికి ఇస్తున్నారు కానీ, కప్పదాటు వ్యవహారంతో కూడిన రాష్ట్ర ప్రభుత్వానికి స్పష్టమైన ఆదేశాలు ఇవ్వకపోవడం కేంద్ర ప్రభుత్వ చిత్తశుద్ధి ఏమిటో స్పష్టమవుతున్నది. బి.జె.పి మిత్రపక్షమైన నాగా పీపుల్స్ ఫ్రంట్ పార్టీయే నాగాలాండ్‌లో అధికార స్థానంలో ఉంది. ఈ రెండు పార్టీల మధ్య నలిగిపోయేది నాగా స్త్రీలే.

ఆర్టికల్ 243 (టి) నుండి నాగాలాండ్ రాష్ట్రాన్ని మినహాయించాలని శాసనసభలో తీర్మానం చేసి పంపితే, వాస్తవ పరిస్థితులు, మహిళల ఆకాంక్షలు పరిగణనలోకి తీసుకోకుండా ఈ ప్రతిపాదనను పార్లమెంట్ కనుక ఆమోదిస్తే, నాగాలాండ్ స్త్రీలు రాజకీయాలకు, పదవులకు,

నిర్ణయాధికారాలకు శాశ్వతంగా దూరం కావలసి వస్తుంది. ఇక పురుషాధిపత్య శక్తులకు అడ్డు అదుపు లేకుండా పోతుంది. నాగాలాండ్‌లో మొదలైన ఈ మహిళా రిజర్వేషన్ వ్యతిరేక ఉద్యమం పక్క రాష్ట్రాలకు పాకి, దేశమంతటా వ్యాపించే ప్రమాదం కూడా పొంచి ఉంది. దీన్ని కాదనలేని పరిస్థితులు ప్రస్తుతం దేశంలో నెలకొని ఉన్నాయి. ఎన్నో పోరాటాలు, త్యాగాలు చేసి, హక్కులు సాధించుకొన్న మహిళా ఉద్యమాలకు నాగాలాండ్ అంశం ఒక పెద్ద సవాలుగా నిలబడి ఉంది. నాగాలాండ్‌లో 33 శాతం మహిళా రిజర్వేషన్ అమలు కొరకు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల మీద తీవ్రమైన ఒత్తిడి తీసుకొని రావడం ప్రజా ఉద్యమాల బాధ్యత.

నాగాలాండ్‌లో స్థానిక సంస్థలల్లో 33 శాతం మహిళా రిజర్వేషన్ చట్టాన్ని అమలు చేయాడాన్ని వ్యతిరేకిస్తూ, పెద్దఎత్తున హింసకు పాల్పడుతూ, ప్రభుత్వ ఆస్తులను ధ్వంసం చేస్తున్న పురుషాధిపత్య వైఖరి గురించి భారతదేశంలోని మిగిలిన ప్రపంచానికి తెలిసింది చాలా తక్కువ. ఆంగ్ల పత్రికలల్లో కొద్దిపాటిగా అయినా వ్యాసాలు వచ్చాయి కాని తెలుగు పత్రికలు ఆ మాత్రం స్థలాన్ని కూడా తమ పత్రికలల్లో కేటాయించక పోవడం అత్యంత విచారకరం.

విజయవాడలో ఫిబ్రవరి 10 నుండి 12వ తేది వరకు మూడురోజుల పాటు జరిగిన మహిళా పార్లమెంట్ సదస్సులో మహిళలకు పట్టాభిషేకం చేస్తాం, స్త్రీలకు నీరాజనం పలుకుతాం, అమ్మకు పాద పూజ చేస్తాం, చట్ట సభలల్లో 33 శాతం మహిళా రిజర్వేషన్ అమలుకు కృషి చేస్తాం అని అరచేతిలో స్వర్గం చూపిస్తూ, కల్లబొల్లి కబుర్లు చెప్పిన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, లోకసభ స్పీకర్, కేంద్ర, రాష్ట్ర మంత్రులు, పార్లమెంట్ సభ్యులు మొదలైన భజనపరులకు నాగాలాండ్‌లో జరుగుతున్న ఉదంతం గురించి చర్చించాలన్న స్పృహ మచ్చుకు కూడా కనిపించలేదు. పైగా విజయవంతమైంది అని వెగటు కలిగించే ప్రకటనలకు మాత్రం కొదవ ఉండదు. దేశంలోని ఒక ప్రాంతంలో మహిళా సాధికారతను అడ్డుకుంటున్న వైనాన్ని గుర్తించలేనంతగా మహిళా పార్లమెంట్ సదస్సు అనే నిషాలో మునిగి తేలిపోయారు. ఈ వైఖరిని ఆ సదస్సులో పాల్గొన్న విద్యార్థినులు అందరూ తెలుసుకోవలసిన అవసరం ఉంది.

ఈశాన్య రాష్ట్రాల గురించి, అక్కడ ఏమి జరుగుతోంది లాంటి విషయాలు భారతదేశంలోని మిగిలిన ప్రాంత ప్రజలకు అరకొర సమాచారం మాత్రమే తెలుస్తోంది. ముఖ్యంగా అక్కడి స్త్రీలు, వారి అలవాట్లు, లైంగిక స్వేచ్ఛ గురించి మిగతా ప్రాంతం వారికి అపోహలు కూడా ఎక్కువగానే ఉన్నాయి. ఇలాంటి అభిప్రాయాలు వారి ముందర వ్యక్తం చెసినప్పుడంతా వారు చాలా అసహనానికి గురవుతుంటారు. 'మీ ఇండియన్ గవర్నమెంట్' అని, 'మా కల్చర్ మీ ఇండియన్ కల్చర్ లాగా కాదు' లాంటి విసుర్లు వాళ్ల నోటి నుండి రావడానికి కారణం ఈ అసహనమే అని అర్థమవుతుంది.

అంతేకాకుండా శాంతి స్థాపన, ఉగ్రవాద నిర్మూలన పేరిట ఈశాన్య రాష్ట్రాలల్లో దీర్ఘకాలం పాటు తిష్టవేసుకొని ఉండిపోయిన మిలిటరీ, వారి విచ్చలవిడి అరాచకాలకు ఆ ప్రాంత ప్రజలు పడిన కష్టాలు అన్నీ, ఇన్నీ కావు. వారిలో భారత ప్రభుత్వాల పట్ల విశ్వాసం కలిగించే ప్రయత్నం కూడా పెద్దగా జరగకపోవడం వారి ఆగ్రహాన్ని మరింతగా పెంచింది. ఈశాన్య రాష్ట్ర ప్రజలకు మిగిలిన ప్రాంత ప్రజలకు మధ్య ఆరోగ్యకరమైన వాతావరణం, రాకపోకలు అభివృద్ధి కాకపోవడానికి కారణం కేంద్ర ప్రభుత్వం ఆ ప్రాంతం పట్ల నిర్లక్ష్యం వహించడమే అని చాలా కాలం నుండి విమర్శలు వినిపిస్తూనే ఉన్నాయి.

స్థానిక సంస్థల ఎన్నికలలో 33 శాతం మహిళా రిజర్వేషన్‌ను అడ్డుకుంటున్న వారి వైఖరిని గమనిస్తే కొన్ని విషయాలు అర్థమవు తున్నాయి. మొదటిది తమ సొంత అస్థిత్వాన్ని కాపాడుకోవాలనే ఆరాటం తో పాటు వారిలో బలంగా పాతుకుపోయిన గిరిజన సాంప్రదాయాల నుండి బయటకు రాలేకపోవడం. రెండవది అంతవరకు స్థానిక సంస్థలల్లో అధికారాన్ని అనుభవించిన పురుషులు ఉన్నట్టుండి తమ అధికారాన్ని స్వయంగా తమ చేతులతోనే స్త్రీలకు అప్పగించడం తమతో పాటు స్త్రీలకు కూడా సమాన హోదా ఇవ్వాల్సి వస్తుంది అనే విషయాన్ని జీర్ణించు కోలేకపోవడం. భారత ప్రభుత్వ వైఖరికి విసిగిపోయి, భారత ప్రభుత్వం అమలు చేసే ఏ చట్టాలనయినా సరే తమ ప్రాంతాలలో అమలు కాకుండా అడ్డుకోవాలనే మొండివైఖరి బాగా కనిపించడం. ఏదేమైనా దీనివలన నాగాలాండ్ స్త్రీలే అధికంగా నష్టపోతున్నారు. ఇంతవరకు క్రియాశీలంగా పనిచేసిన నాగాలాండ్ మదర్స్ అసోసియేషన్ ఇలాంటి సంక్షోభ సమయాల్లో మౌనంగా ఉండిపోవడం అన్నిటికంటే పెద్ద విషాదం. ఏ శక్తులు వీళ్ల నోళ్లను నొక్కేసాయో ఊహించడం పెద్ద కష్టం కాదు.

ఫిబ్రవరి 19న నాగాలాండ్ ముఖ్యమంత్రి టి.ఆర్.జెలియాంగ్ తన పదవికి రాజీనామా చేశారు. మా డిమాండ్ నెరవేరింది కాబట్టి బంద్‌ను విరమిస్తున్నామని ఎన్.టి.ఎ.సి ప్రకటించింది. నాగాలాండ్‌లో భూమి క్రయవిక్రయాలు కేవలం అక్కడి గిరిజన ప్రజల మధ్య మాత్రమే జరుగుతాయి. మహిళా రిజర్వేషన్‌కు వ్యతిరేకంగా మొదలైన ఎన్నికల బహిష్కరణ పిలుపుకంటే ముందే అసలు అంశం పక్కకుమళ్లింది. పన్నులు, భూమిపైన హక్కులు లాంటివి రంగం మీదకు వచ్చాయి. అసలు బంద్‌కు పిలుపును ఇచ్చింది నాగాలాండ్ గిరిజన పురుష సంస్థలేనా లేక తమ స్వార్థంకోసం వాళ్లను అడ్డం పెట్టుకొని తెరవెనుక ఉండి నడిపిస్తున్న గిరిజనేతర శక్తులా అన్న అనుమానాలు కలుగుతున్నాయి. అధికారం కోసం మహిళా రిజర్వేషన్ వ్యతిరేక ముసుగు వేసుకొని విధ్వంసాలు సృష్టించారా అన్న అనుమానాలు మరింత బలపడుతున్నాయి.

మహిళా రిజర్వేషన్ సౌకర్యాన్ని ఉపయోగించుకొని నిర్ణయాధికార స్థానాలలో కూర్చున్న మహిళలు సొంతంగా నిర్ణయాలు తీసుకునే స్థాయిలో ఉన్నారా అనే ప్రశ్నకు అవును అని బలంగా చెప్పే పరిస్థితులు లేవు. మహిళ తరుపున ఆమె భర్తో, తండ్రో, కొడుకో లేదా సోదరుడో పరిపాలన సంబంధమైన నిర్ణయాలు తీసుకొని, ఆమెచేత కేవలం సంతకం చేయించు కునే సంఘటనలే ఎక్కువగా కనిపిస్తున్నాయి. తమ కుటుంబ పురుషుల నీడ నుండి స్త్రీలు బయటపడి స్వయం నిర్ణయాధికార శక్తిని పెంపొందించు కున్నప్పుడే 33 శాతం మహిళా రిజర్వేషన్ ఉద్దేశం నెరవేరుతుంది. మత సాంప్రదాయాలు, ఆచారాలు స్త్రీలను ఎప్పుడూ కట్టడి చేయాలనే చూస్తుంటాయి అన్న స్పృహ స్త్రీలకు అత్యంత అవసరం. కట్టడి నుండి బయట పడేయగల చైతన్యాన్ని నిరంతరం పెంచుకుంటూనే ఉండాలి.

*(హిందూ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, మొరంగ్ (MORUNG) ఎక్స్‌ప్రెస్, నాగాలాండ్ పేజ్ ఆంగ్ల పత్రికల సౌజన్యంతో)*

*(రచయిత అసోసియేట్ ప్రొఫెసర్, జి.పుల్లారెడ్డి ఇంజనీరింగ్ కళాశాల, కర్నూలు)*

వీ

# ఆంధ్రప్రదేశ్‌కి ప్రత్యేక హోదా

***ఎపికి ప్రత్యేక హోదా కల్పిస్తామంటూ కేంద్రంలో ఉన్న బిజెపి, రాష్ట్రంలో టిడిపి ప్రభుత్వం ఎన్నికల హామీలు గుప్పించి అధికారంలోకి వచ్చాక ఆ మాటను దాటవేస్తున్నాయనీ, ప్రజలు ఐక్యంగా ఉద్యమించి సాధించాలనీ అంటున్నారు డా. గోవాడ వీర్రాజు***

ఇటీవల తమిళనాడులో జల్లికట్టు నిర్వహించుకొనే అనుమతి కోసం మెరీనా బీచ్ వేదికగా ఆందోళనలు జరిపి విజయం సాధించిన స్ఫూర్తితో విశాఖ సాగరతీరం కేంద్రంగా ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేక హోదా కోసం ఆందోళనలు నిర్వహిస్తామని అట్టహాసంగా ప్రకటించిన వేదికలు, ప్రతిపక్ష పార్టీ, ట్వీట్ల వీరుడు పవన్‌కళ్యాణ్‌లు మీడియా మోత తప్ప ప్రజల అవసరాలు ఆకాంక్షలకు అనుగుణంగా ఆంధ్ర ప్రాంతంలో నిర్మాణాత్మక ఉద్యమాలు చేసే నాయకత్వం లేదని మరోమారు ఋజువు చేశారు.

ప్రత్యేక హోదా ఏమన్నా సంజీవినా.. అది వస్తే సమస్యలు తీరిపోతాయా.. అని సాక్షాత్తు ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు అన్న మాటలకి ఆయన నైజం తెలిసినవారెవ్వరూ ఆశ్చర్యపోరు. రాష్ట్ర విభజన నేపథ్యంలో పార్లమెంటు సాక్షిగా ఆంధ్రాకు ప్రత్యేక హోదా ఐదు సంవత్సరాలు కాదు పది సంవత్సరాలు కావాలని, కాదుకాదు పదిహేను సంవత్సరాలు కావాలని వాదించిన వెంకయ్యనాయుడు మా ప్రభుత్వం వస్తుంది, మేమే ప్రత్యేక హోదా ఇస్తామని నమ్మబలికాడు. అప్పుడు చంద్రబాబునాయుడుది అదే మాట. మరి ఇప్పుడు ఈ ఇద్దరు నాయుడులు స్వయంగా అధికారంలో ఉన్నారు. ప్రత్యేక హోదా ఇచ్చే సంగతటుంచి కనీసం దాని గురించి మాట్లాడలేని బేలతనానికి ఏ శక్తి వీరిని దిగజార్చింది. ప్రత్యేక హోదాను అడగటం మానేసి ప్రత్యేక ప్యాకేజీని సమర్థించుకోవాల్సిన దుస్థితిలో వీరెందుకున్నారు. కోడలు మగబిడ్డను కంటానంటే అత్త వద్దంటుందా అనే ఒక నాటు పోలికతో ప్రత్యేక ప్యాకేజీని సమర్థిస్తూ బాహాటంగానే చంద్రబాబు మాట్లాడారు. అసలు ప్రత్యేక హోదా మంచిదా ప్యాకేజీ మంచిదా అనే విషయం చర్చకే పనికిరాని విషయం. మరి ప్రత్యేక హోదాకు విలువ లేకపోతే తెలుగుదేశం పార్టీ నుండి బిజెపి ప్రభుత్వంలో కేంద్ర మంత్రిగా ఉన్న సుజనాచౌదరిలాంటి వారు ప్రత్యేక హోదా ఉన్న రాష్ట్రాలలోనే పెట్టుబడులు ఎందుకు పెడుతున్నట్లు. ప్రత్యేక హోదాకి ప్యాకేజీ సమానం లేదా, అంతకంటే ఎక్కువ అనే వాదనలలో నిజం లేదనేది నిర్వివాదాంశం. నాన్చినాన్చి కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం మేం ప్రత్యేక హోదాయివ్వం, ప్యాకేజీ ఇస్తామని ప్రకటించడం అర్థరాత్రి చంద్రబాబు దానిని అంగీకరిస్తున్నట్లు ప్రకటించడం దేనికి నిదర్శనం. ఒక ప్రేమికురాలిని తన ఇంటి నుండి బయటకు తీసుకొచ్చేటప్పుడు పెళ్లిచేసుకొంటానని నమ్మబలికి తరువాత భార్యకంటే బాగా చూసుకుంటా, మంచి హోదా ఇస్తా, నువ్వెందుకు పెళ్లిచేసుకోమని పట్టుపడతావు అని మోసం చేసి బయటకు తీసుకొచ్చిన ప్రేమికుడి మాదిరిగా ఉన్నాయి వీరి మాటలు. కానీ ఇక్కడ అన్యాయం ఏమిటంటే పెళ్లి కూతురికి తండ్రి ఆ మాట అనకూడదు కదా. రాష్ట్రానికి తండ్రిలాంటి ముఖ్యమంత్రే స్వయంగా అలా మాట్లాడితే దానినెలా అర్థం చేసుకోవాలి. ప్రత్యేక హోదా కోసం ప్రతిపక్షం మరియు వామపక్షాలు కలిసి బందుకు పిలుపునిస్తే పోలీసు పహారాలో బస్సులు నడిపించి, ప్రత్యేక హోదా ఆందోళనలలో పాల్గొన్నవారిపై కేసులు పెట్టిన వైనం చూసిన వారెవ్వరికైనా చంద్రబాబు వైఖరి అర్థం చేసుకోవడం కష్టమైన పనేమీకాదు.

దీనికి ఆయన వ్యక్తిగత, రాజకీయ కారణాలు ఉంటే ఉండవచ్చు కానీ అది ప్రజల అభిప్రాయం లేదా కోరిక కాదు. మరి అసలు ప్రజాభిప్రాయం ఆంధ్రప్రాంతంలో రాజకీయ పార్టీలు, ప్రచార సాధనాలలో ఎందుకు ప్రతిఫలించదు. ఎందుకంటే ఈ ప్రాంతంలో ప్రజాభిప్రాయానికి విలువ ఉండదు. ఒక నిర్మాణాత్మకమైన ప్రజా ఉద్యమాన్ని నిర్మించే పౌర సమాజం మరియు మేధావర్గం లేరు. ఒక వేళ ఉన్నా అది సంపన్న పాలకవర్గాల కనుసన్నలలో మెలగడం లేదంటే తగిన గుర్తింపు ప్రాధాన్యత లేకుండా చేసే సంస్కృతి ఆంధ్రప్రాంత పాలక వర్గానికుంది. ఇదే ఇప్పుడు ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేక హోదా సాధించడానికి తగిన ప్రజాభిప్రాయాన్ని నిర్మించి ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోయే శక్తి ఏదీ తయారు కాకుండా చేసింది.

ఇక ఉద్యమం అంటే పాలక పక్షాల ప్రోత్సాహంతోనే జరుగుతుంది. విద్యార్థి ఉద్యమం అంటే పాలకపక్షం వారు పిలుపునిచ్చినా, ప్రతిపక్షం వారు పిలుపునిచ్చినా వారి అనుబంధంగా ఉన్న విద్యాసంస్థల నుండి యూనిఫార్మ్ విద్యార్థులను రోడ్డుపైకి తెచ్చి ఫొటోలు, వీడియోలు తీసి వారి ప్రచార సాధనాలలో దానిని ఉద్యమంగా చూపే సంస్కృతి వీరిది. ఆంధ్ర విశ్వవిద్యాలయం, శ్రీ వెంకటేశ్వరా విశ్వవిద్యాలయంలాంటి పోరాట పటిమన ఉన్న విశ్వవిద్యాలయాలు ఉన్నప్పటికీ ఇక్కడి విద్యార్థి శక్తిని, మేధావి వర్గాన్ని లేదా మరే ఇతర వర్గాలనుగానీ ఉద్యమానికి సన్నద్ధం చేసి ఉపయోగించుకొనే విధానమే ఈ ప్రాంత నాయకత్వానికి లేదు. విస్తృత సామాజిక ప్రయోజనానికి ప్రాధాన్యతనివ్వకుండా వ్యక్తిగత ప్రయోజనాలే పరమావధిగా వారి నిర్ణయాలుంటాయి. ఆ నిర్ణయాలను సమర్థించుకోవడానికి అన్ని ప్రయత్నాలు చేస్తారు. ఇప్పుడు ప్రత్యేక హోదా విషయంలో జరుగుతున్నది అదే. చంద్రబాబు ప్రత్యేక ప్యాకేజీని సమర్థించుకోవాల్సిన స్థితికి నెట్టబడ్డాక మొత్తంగా రాష్ట్ర పార్టీ, ప్రభుత్వ యంత్రాంగం, ప్రసార సాధనాలన్నీ ప్రత్యేక హోదా అనేది ప్యాకేజీకంటే పనికిరానిదిగా చూపించే ప్రయత్నంలో తలమునకలై ఉన్నాయి. ఇక ప్రతిపక్షానిది, పవన్‌కళ్యాణ్‌ది ఈవెంట్ మేనేజ్‌మెంటు తప్ప ఉద్యమం కాదు. ఉన్నట్టుండి ఎక్కడో ఒక సభను ప్రకటించి కార్పొరేట్ కల్చర్,

# ట్రంప్ చర్యలు - ప్రపంచ పరిణామాలు

***అమెరికా అధ్యక్షుడు ట్రంప్ తీసుకుంటున్న నిర్ణయాలు జాతి విద్వేషాన్ని రెచ్చగొడుతున్నాయనీ, అటు అమెరికాలోనూ, ఇటు అంతర్జాతీయంగానూ తీవ్ర నిరసనలు వ్యక్తమవుతున్నాయనీ అంటున్నారు బి. సతీష్***

**2016**లో అంతర్జాతీయ సమాజాన్ని ఆశ్చర్యానికి, విస్మయానికి గురిచేసిన పరిణామాలు బ్రెక్సిట్ (యూరోపియన్ యూనియన్ నుండి బ్రిటన్ నిష్క్రమణ) రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి అయిన డోనాల్డ్ ట్రంప్ అమెరికా అధ్యక్షుడిగా గెలవడం. మొదటిది ఆశ్చర్యపరిస్తే రెండవది విస్మయానికి గురిచేసింది. అసలు రిపబ్లికన్ పార్టీ అభ్యర్థిత్వమే లభించే స్థితిలో కూడా లేకుండా మొదలై, ఏ సర్వేలోనూ గెలుస్తాడని గానీ, తీవ్రమైన పోటీ ఇస్తాడని గానీ అంతగా బయటికి రాకుండానే ఏకంగా శ్వేతసౌధాన్ని ఎగరేసుకపోయాడు ట్రంప్. ప్రపంచాధిపత్యం నెరపుతున్న అమెరికాకు మొదటి మహిళా అధ్యక్షురాలిగా ఎన్నికవుతుందనుకున్న హిల్లరీకి దిమ్మ తిరిగే, దిగ్భ్రమకు గురిచేసిన అనుభవమే ఎదురయింది.

సహజంగానే అమెరికా అధ్యక్ష ఎన్నికలు అంతర్జాతీయంగా ప్రాచుర్యాన్ని, ప్రాధాన్యతను పొందుతాయి. మరీ 2016 ఎన్నికలు గతంలో ఏ అధ్యక్ష ఎన్నికలు పొందనంత ప్రచారం, ప్రాచుర్యం పొందడమే కాకుండా ఎన్నికల ప్రచారపర్వం ఆసాంతం సంచలనంగా, ఉత్కంఠతను రేకెత్తించేలా కొనసాగింది. హిల్లరీ క్లింటన్‌కి ఉన్న రాజకీయ, పరిపాలనానుభవమే కాకుండా మహిళగా అన్ని వర్గాల మద్దతుతో సునాయాసంగా గెలుస్తుందని 'పండితులు' పదేపదే ప్రకటించారు. ఈ అభిప్రాయానికి బలం చేకూరేలా, నిజమనిపించేలా డోనాల్డ్ ట్రంప్ వ్యవహారశైలి వ్యక్తిగత నేపథ్యం ఉండింది. పార్టీ టికెట్‌ను ధృవీకరించుకొనే క్రమంలోనే ఆయన చేసిన అనేక చవకబారు ప్రకటనలు సంచలనాత్మకమైన విధానపరమైన అంశాలు అనేకం వెగటుపుట్టించాయి. మహిళల పట్ల అసభ్యంగా ప్రవర్తించినట్టు, వికృతమైన వ్యాఖ్యలు చేసినట్లు ప్రధాన మీడియా స్రవంతిలోనూ, సామాజిక మాధ్యమాల్లోనూ పుంఖాను పుంఖాలుగా కథనాలు వెలువడినాయి.

నిజానికి ఏ మాటకు ఆమాటే చెప్పుకోవాలంటే డోనాల్డ్ ట్రంప్‌ది తొణకని విశ్వాసం. అత్యంత ప్రభావమంతమైన మీడియాతో కూడా గొడవపెట్టుకొని మరీ నెగ్గుకురావడం, చిత్తం వచ్చినట్టు మాట్లాడుతూ ఓటర్లను 'మెప్పించ'గల్గడం ఆయన ప్రత్యేకత! ట్రంప్ సాధారణ అమెరికన్ పౌరుని నాడీ పట్టుకోవడంలో సఫలమైతే, హిల్లరీ తన రాజకీయ పరిపాలనానుభవాన్ని పదేపదే గొప్పగా ప్రకటించుకున్నా ఫలితం లేకపోయింది. సగటు అమెరికా పౌరుల వాస్తవ జీవిత స్థితిగతుల గురించి చాలా వాస్తవిక ధోరణితో వ్యవహరించడమూ, అమెరికా ఆవల కంటే అమెరికాలో ఏం జరగాలో వాస్తవ దృష్టితో కూడిన పరిష్కారాలను ప్రజల ముందు పెట్టడంతో ట్రంప్‌కి గెలుపు సాధ్యమయింది. ఆ పరిష్కారాలు ఆమోదయోగ్యమైనవా, అది ఇతరుల ప్రయోజనాలను దెబ్బతీస్తాయా లేదా అనేది వేరే విషయం. హిల్లరీ మాత్రం అమెరికాలో అంతా బాగుందని, ప్రపంచమే బాగాలేదని మనమే బాగుచేయాలనే ప్రజా జీవితానికి దూరమైన వాణిని వినిపించడం అమెరికన్స్‌ని ఆకట్టుకోలేకపోయింది. తొలిసారిగా మహిళ అధ్యక్షురాలయ్యే అవకాశం వచ్చిందనే అంశంకూడా అంతగా ఆదరణకు నోచుకోలేదు. అమెరికా

---

సినిమా సెట్టింగులతో హడావుడి చేస్తారు. రెండు మూడు రోజుల ప్రచారం దొరుకుతుంది. తరువాత అది ముగుస్తుంది. వామపక్షాలను అణచివేయడం పౌర సమాజాన్ని నిర్వీర్యం చేయటంతో అవి బలంగా లేకుండా పోయాయి. తాజాగా జగన్ గుంటూరులో నిర్వహించిన యువభేరీలో ఏప్రిల్ తరువాత తమ ఎం.పిలు రాజీనామా చేస్తారని ప్రకటించారు. కానీ ఉద్యమాన్ని నిర్మించి నాయకత్వాన్ని ఇవ్వగలుగుతాడా లేక జగన్‌ను కూడా కేసుల బూచీని చూపించి కేంద్రం కట్టడి చేస్తుందో చూడాలి. ఇక పవన్ కళ్యాణ్ ఈ మధ్య కేంద్రంపై, చంద్రబాబుపైన విమర్శలు చేస్తున్నట్టు కనిపిస్తున్నా ఆయన వాళ్ల సంకలో మనిషే అనేది ఎక్కువ మంది అభిప్రాయం.

మొత్తంగా ఆంధ్రరాష్ట్రం విషయంలో బిజెపి బలపడడానికి ప్రత్యేక హోదా ఇవ్వకపోవడానికి చంద్రబాబే అడ్డంకి. ఇంత పెద్ద ప్రయోజనాన్ని ఆంధ్రాకు ఇస్తే ఆ ఘనత చంద్రబాబు తీసుకుంటాడని బిజెపి నమ్ముతుంది. ఎందుకంటే కేంద్రం ఇస్తున్న నిధులను, చేస్తున్న అభివృద్ధిని చంద్రబాబు ప్రజలకు చెప్పటంలేదనేది బిజెపి వాదన. గతంలో బిజెపి టీడీపీల మధ్య ఈ విషయంపై రగడ కూడా జరిగింది. అందుకే బిజెపి అదును చూసి అదిమిపెట్టింది. అందుకే చంద్రబాబు రాష్ట్ర ప్రగతికి, నిర్మాణానికి అత్యవసరమైన ప్రత్యేక హోదాను అటకెక్కించి రాజధాని నిర్మాణం చుట్టూ కథ మొత్తం తిప్పుతూ, పుష్కరాలూ, పనికిరాని భాగస్వామ్య సదస్సులూ, మహిళా పార్లమెంటులంటూ కాలక్షేపం కార్యక్రమాలతో సరిపెట్టుకొంటున్నాడు. చివరికి పాలక, ప్రతిపక్షాల బలహీనతలు, ఇతరుల స్వప్రయోజనాల పోటీలో ఆంధ్రరాష్ట్ర ప్రజల ప్రయోజనాలు పాతరవుతున్నాయి. అలాగే కేంద్రానికి ఆయుధాలైనాయి. బలమైన ప్రజా ఉద్యమాన్ని నిర్మించే చిత్తశుద్ధి కలిగిన స్వతంత్ర నాయకత్వం రూపుదిద్దుకొంటేనే ప్రత్యేక హోదా అయినా మరేదైనా ప్రజలు సాధింకోగలుగుతారు. ఈ పరిస్థితులలో ప్రత్యేక హోదా ఉద్యమం నిర్మితమవ్వటం కష్టంతో కూడుకున్న పని.

*(రచయిత రాజనీతి శాస్త్ర శాఖాధిపతి, ఏజీఅండ్ఎస్‌జీ సిద్ధార్థ డిగ్రీ కళాశాల)* వీ

మహిళల్లో సైతం అంతగా ఆసక్తిని రేకెత్తించలేకపోయింది. నిజానికి భారత్‌లాంటి దేశంలో అయితే ట్రంప్‌లాంటి వాడిపైన ఉన్న ఆరోపణలు వస్తే కనీసం పోటీచేసే అవకాశం కూడా రాకపోయేది. అయినా అతను ఏకంగా అధ్యక్షుడు అయ్యాడంటే నైతిక విలువల భావనను అర్థం చేసుకోవడంలో, ఆచరించడంలో మౌలిక వ్యత్యాసం ఉందనే విషయం బోధపడుతుంది.

ట్రంప్ అంతర్జాతీయ వ్యవహారాలపట్ల అంతగా ఆసక్తి చూపక పోవడం, దృష్టంతా అమెరికా అంతర్గత వ్యవహారాలపై పెట్టడంతో, సిరియాలో జోక్యంతో అంతర్జాతీయంగా పట్టును పెంచుకొనే వ్యూహంలో భాగంగా డెమొక్రటిక్ అభ్యర్థి హిల్లరీ క్లింటన్‌కి సంబంధించిన రాజకీయ పరమైన అంశాలను, అమెరికన్ పౌరుల దృష్టిలో ఆమెను విశ్వసించదగిన వ్యక్తి కాదన్నట్టుగా రష్యా ఉధృతంగా 'లీక్స్' ఆట ఆడింది. అది అంతిమంగా ట్రంప్ విజయానికి దోహదపడింది. అమెరికాలోను, ప్రపంచవ్యాప్తంగా టెర్రరిజానికి పాల్పడుతున్నది ముస్లింలే అని, వారి ప్రవేశాన్ని అడ్డుకుంటానని ముస్లిం ద్వేషపూరితమైన ప్రకటన కూడా అటువంటి ప్రచారాన్ని నమ్మే అమెరికన్‌లను బాగానే ఆకట్టుకుంది. బుద్ధిజీవుల చర్చలేమున్నా అమెరికన్ వర్కింగ్ క్లాస్, ఆఫ్రో అమెరికన్స్, అమెరికాలో ఆవాసముంటున్న 'హిందూ' మతారాధకులు, గ్రామీణ ప్రాంత ప్రజలు ట్రంప్ పట్ల మొగ్గు చూపారు. హిల్లరీ మధ్యతరగతి, ఎగువ మధ్యతరగతి పట్టణ ప్రాంతాలకే పరిమితమవ్వడంతో వరిస్తుందనుకున్న విజయం చేజారింది.

డోనాల్డ్ ట్రంప్ ఆది నుండే దూకుడుగా వ్యవహరిస్తూనే తను గెలువకపోతే ఎన్నికలు సక్రమంగా జరిగినట్టే కాదని అన్నాడంటే అతని విశ్వాసం ఎంతో అర్థం చేసుకోవచ్చు. నిజానికి ఎన్నికల ప్రచారంలోనే తను అధ్యక్షుడినైనట్టు వ్యవహరించేవాడు. అమెరికా అధ్యక్ష ఎన్నికలకు (నవంబర్-8) పదవీ చేపట్టే నాటికి (జనవరి-20) రెండు నెలలకు పైగా కాలం ఉన్నప్పటికి తన విధాన నిర్ణయాలను ఏలాంటి సంకోచం లేకుండా ప్రకటించాడు. ఎపుడెపుడు సింహాసనంపై కూర్చుంటానా అని ఉవ్విల్లూరుతూ అధికార నిర్ణయాలను అవగాహనలేకున్నా, వాటి పరిణామాలతో సంబంధం లేకుండానే ప్రకటిస్తూ వచ్చాడు. పదవి చేపట్టిన కొన్ని గంటలు, రోజుల వ్యవధిలోనే ఎన్నికల ప్రచారంలో ప్రకటించిన అనేక నిర్ణయాలను ప్రపంచాన్ని నివ్వెరపర్చేలా తీసుకున్నాడు. ఆ నిర్ణయాలల్లో అమెరికా అంతర్గతమైన అంశాలతోపాటు అంతర్జాతీయ వ్యవహారాలకు సంబంధించినవీ కూడా ఉన్నాయి.

మొదటి నుండి జాతి విద్వేషాన్ని రగిలించేలా నోరుపారేసుకున్న ట్రంప్ ప్రచారారంభం నుండే అమెరికాకు ముస్లింల రాకను పూర్తిగా నిషేధించాలని వాదిస్తూ వస్తూ దాంట్లో భాగంగానే అధికార పగ్గాలు చేపట్టగానే ఏడు ముస్లిం దేశాలనుంచి అమెరికా ప్రవేశం నిషేధించేలా ఉత్తర్వులు ఇవ్వడం కోర్టులు స్టే ఇవ్వడం జరిగిపోయింది. ఈ ఉత్తర్వులను కోర్టులు నిలిపివేయడాన్ని కూడా సహించని ట్రంప్ కోర్టులు కూడా రాజకీయం చేస్తున్నాయని వ్యాఖ్యానించాడు. మొత్తం మీద ఈ నిర్ణయం ఆ ఒక్క ఏడు దేశాల వారినే కాకుండా ప్రపంచ వ్యాప్తంగా అమెరికా వెళ్లాలనే వారి ఆశలపై నీళ్లు చల్లినట్టయింది. అక్రమ వలసలేకాదు అసలు మొత్తంగా వలసలపైననే కఠినంగా వ్యవహరించబోతున్నట్టు స్పష్టమైన సంకేతాలనే ఇచ్చాడు ట్రంప్.

మెక్సికోకు అమెరికాకు మధ్య గోడ కట్టేస్తామంటే ఎన్నికల ప్రచార వాగాడంబరం అనుకున్నారంతా కానీ ట్రంప్ అన్నంతపనే చేశాడు. సరిహద్దుల్ని పటిష్టమైన కంచెతో మూసివేయాలనే నిర్ణయించాడు. 20 మిలియన్ల జనాభాకు పైగా ఇప్పటికే మేలుచేసిన ఒబామా కేర్ హెల్త్ ఇన్స్యూరెన్స్ పథకాన్ని వినాశకరమైనదిగా వర్ణిస్తూ మొత్తంగా రద్దు చేసే దిశలోనే చర్యలు చేపట్టాడు. 12 దేశాలతో కూడుకొని ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో 40 శాతం వాటా కలిగిన (యూరోపియన్ యూనియన్ మాదిరిగా) స్వేచ్ఛా వ్యాపార కూటమిగా ఏర్పడిన బహుళ దేశ ఒప్పందం నుండి బయటకు వస్తున్నట్టు అధికారికంగా ప్రకటించాడు. ప్రచార సందర్భంగా చైనా మీద విద్వేషం వెళ్లగక్కినా కూడా వాస్తవ ధోరణితో వ్యవహరించాలనే అభిప్రాయం వచ్చినట్టు అనిపిస్తున్నది.

సాధారణంగా రిపబ్లికన్ పార్టీ విదేశాంగ విధానం దుందుడుకుగా, యుద్ధోన్మాదంతో ఉంటుంది కానీ ఆశ్చర్యకరంగా ట్రంప్ బయటి దేశాల ప్రభుత్వాల మార్పు, అంతర్గత వ్యవహారాల్లో బలప్రయోగంతోనైనా జోక్యం చేసుకొనే గత అధ్యక్షుల మాదిరిగా వ్యవహరిస్తాడనే సంకేతాలు ప్రస్తుతానికైతే రాలేదు. తన మిలిటరీ శక్తియుక్తుల్ని విదేశీగడ్డపై కంటే స్వదేశంలోనే విదేశీ శక్తుల నుండి, టెర్రరిస్టుల నుండి కాపాడుకోవడానికి మరింత శక్తివంతం కావడానికి ఉపయోగించుకోనున్నట్టు బయటికి చెబుతున్నారు. ఇక్కడే గమనించాల్సిన విషయం ఏమిటంటే ఒబామా కాలంలో ఇరాన్‌తో కుదుర్చుకున్న అణుశక్తి ఒప్పందాన్ని రద్దుచేయడమే కాకుండా ఇరాన్‌పై మరిన్ని ఆంక్షలు విధిస్తున్నట్టు ప్రకటించడం అటు ఇజ్రాయిల్‌ను ఇటు సౌదీ అరేబియాను సంతృప్తిపర్చేందుకే అనేది సుస్పష్టం. అదే సమయంలో ఇరాన్‌ను టెర్రరిజాన్ని ఉత్పత్తిచేస్తున్న ఏకైక రాజ్యంగా పదేపదే ప్రకటిస్తూ వచ్చిన మాజీ సైనికాధికారియైన జేమ్స్ నార్మన్ మాటిస్‌ను రక్షణశాఖ కార్యదర్శిగా నియమించుకున్నాడు.

ఒక రక్షణ శాఖే కాకుండా దేశ భద్రతా సలహాదారు నుండి అనేక కీలక పోస్టులకు మాజీ సైనికాధికారులనే నియమించాడు. ఈ సైనిక కూటమి ట్రంప్‌ను దేశీయ అంశాలమీద మాత్రమే దృష్టి నిలిపి అంతర్జాతీయ అంశాలను వదిలివేయనిస్తుందా? ప్రపంచ వ్యాప్తంగా అమెరికా పెత్తనం కొనసాగాలంటే దేశాల మధ్య నిరంతరం వివాదాలుండాలి అవి ముదిరేలా వ్యవహరించి యుద్ధం చేసేలా ప్రేరేపించి చివరికి అమెరికా ఆయుధాలనే వాడే పరిస్థితికి నెట్టివేసి అదే వివాదాన్ని పెద్దన్న పాత్రతో అమెరికానే పరిష్కరించాలి.

యుద్ధంలో శిథిలమైపోయిన దేశాలను పునర్నిర్మించే పనిని కూడా బిలియన్ డాలర్ల వ్యాపారంగా అమెరికా బడా కంపెనీలు మార్చివేస్తాయి. సి.ఐ.ఎ., ఎఫ్.బి.ఐ. మల్టి బిలియన్ డాలర్ల వ్యాపారం చేసే కార్పొరేట్లు, ఆయుధ వ్యాపారులు ట్రంప్‌కు స్వతంత్రంగా వ్యవహరించే అవకాశాన్నయితే అస్సలు ఇవ్వవు. ప్రపంచీకరణకు నాయకత్వ పాత్ర పోషిస్తున్న అమెరికాకు దానికి విరుద్ధమైన ప్రొటెక్షనిస్ట్ విధానాలను అమలు చేయగల్గేలా ట్రంప్ ఉన్నాడని అనుకోలేం. ఎనిమిది మంది సంపన్నుల చేతుల్లోనే సగం ప్రపంచ ప్రజల సంపద కంటే ఎక్కువగా పోగుపడింది. ఈ సూపర్ రిచ్ అంతా ప్రపంచీకరణవల్ల లాభాలు గడించి సంపదను కూడబెట్టినవారే. వీరే నయా ఉదారవాద విధానాలను, మార్కెట్ అనుకూల విధానాలను అవలంబించాలని ప్రపంచ దేశాల ప్రభుత్వాలను లేదా పాలకులను సైనిక జోక్యంతో రక్తపాతం సృష్టించైనా ఆ దేశ వనరులను, మార్కెట్‌ను చేజిక్కించుకోవడం చరిత్రనిండా కనిపిస్తున్నదే.

ఇవాళ ఏ దేశానికి ఆర్థిక సార్వభౌమాధికారం లేదనేది వాస్తవం. ఈ నేపథ్యంలో ట్రంప్ దేశీయ విధానాలు, అంతర్గత అంశాలపై మాత్రమే దృష్టి పెట్టగలడా? మొత్తంగా డోనాల్డ్ ట్రంప్ విదేశాంగ విధానంలో ఒక సానుకూల అంశం రష్యాతో మైత్రికి చొరవగా ఉండడం. ఇప్పటికే ఆఫ్ఘన్, ఇరాక్‌లలో, ఐసిస్‌పైన యుద్ధం కోసం వనరులను భరించడం కూడా అమెరికాకు తలకు మించిన భారమైంది. సిరియాలో రష్యా చాలా దూకుడుగా జోక్యం చేసుకోవడంతో అంతర్జాతీయంగా కూడా దాని పలుకుబడి పెరిగిపోయింది.

బహుశ సమీప కాలంలో అమెరికా సైనిక జోక్యం చేసుకోక పోవచ్చుగాని భవిష్యత్తులో ఆ అవకాశాన్ని తోసిపుచ్చలేం. అదీ ఇరాన్‌పైన్నే ఉండే అవకాశమే ఎక్కువగా ఉన్నది. పాలస్తీనా భూభాగంలో ఇజ్రాయిల్ అక్రమ ఆవాస నిర్మాణాలను, ఇజ్రాయిల్ రాజధానిని జెరూసలెంకు మార్చాలనే ప్రతిపాదనను ట్రంప్ సమర్థించడమూ ఏ మాత్రమూ ఆమోదనీయమైనది కాదు. పాలస్తీనా ఇజ్రాయిల్ రెండు రాజ్యాల మనుగడ సిద్ధాంతంను కూడా ఆయన సీరియస్‌గా తీసుకోవట్లేదు. ఒబామా కొంత సూత్రబద్ధంగా వ్యవహరించి అమెరికాలోని యూదు లాబీని నిలువరించే ప్రయత్నం చేసినా ట్రంప్‌కి ఆ నిబద్ధత ఉందని ఏ మాత్రమూ అనుకోలేము. ట్రంప్ స్వతహాగా వ్యాపారస్తుడవ్వడం వల్ల ఆర్థిక వ్యవహారాలు, ఇతర దేశాలతో ద్వైపాక్షిక ఒప్పందాలకు ప్రాధాన్యత ఇచ్చి 'అమెరికా ఫస్ట్' అనే విధానానికే ప్రస్తుతానికి ఎక్కువ కట్టుబడే అవకాశం ఉన్నది.

రిపబ్లికన్ పార్టీ అభ్యర్థిత్వం ఖరారైన నాటినుండే విద్వేషపూరితమైన ప్రకటనలు చేయడం వల్ల అమెరికాను అత్యంత సంపన్న దేశంగా శక్తివంతంగా తీర్చిదిద్దిన ప్రవాస దేశీయులందరిపైనా ద్వేషభావన మొదలవడమే కాకుండా పలుచోట్ల దాడులు, సామాజిక మాధ్యమాల్లో ఇతర జాతీయులపైన విద్వేష ప్రచారం కూడా పెరిగింది. ప్రత్యేకించి ముస్లిం మతస్తులపై ఇది మరింత ఎక్కువ మోతాదులోనే ఉంది. ట్రంప్ రాకతో స్థానిక అమెరికన్‌లలో జాత్యంహకార భావన పెరగడం ఆందోళనకరం.

నిజానికి అమెరికన్‌లు ఒకజాతి కానే కాదు. 400 ఏళ్ల చరిత్ర ఉన్న నానా జాతుల దేశమది. 50 వలస రాజ్యాల కలయికే అమెరికా సంయుక్త రాష్ట్రాలు. విస్తారమైన వనరులు, విశాలమైన భూభాగం ఉన్నా కూడా జనాభా తక్కువ కావడంతో వలసలు ఆ దేశ ప్రయోజనాల దృష్ట్యానే అనివార్యం. ఈ అనివార్యతను గుర్తించకుండా 'అమెరికనిజం', 'ట్రంపిజం' అంటే దీర్ఘకాలికంలో కుదరదు. వలసలు లేకుండా 'మేక్ అమెరికా గ్రేట్ అగైన్' అనేది ఒట్టి ఎన్నికల నినాదంగానే మిగిలిపోతుంది.

**ట్రంప్ - ఇండియా**

అమెరికా అధ్యక్ష ఎన్నికల క్రమంలో డాలర్ కలల్ని కంటున్నవారు పెద్దగా ఆందోళన పడకపోయినా, ట్రంప్ అధికారం చేపట్టిన తొలిరోజుల్లోనే అమెరికాలో దశాబ్దాల తరబడి జీవిస్తున్న వారు సైతం బెంగపడేలా వ్యవహరించాడు. బహుశ వలసవాదుల్ని కట్టడిచేయాలన్న నిర్ణయం భారతీయుల్ని ఆందోళనపర్చినంతగా మరెవ్వర్ని కలవరపర్చ లేదు. హెచ్-1బి వీసా విధానం లోపభూయిష్టంగా ఉందని, దీని కారణంగా భారత్‌కి తరలిపోయిన (భారతీయులు దక్కించుకున్న) ఉద్యోగాలను తిరిగి రాబట్టాలని, స్థానికులకు ఉద్యోగ అవకాశాలు పెంచాలనే పిలుపు సాఫ్ట్‌వేర్ ఉద్యోగులను కలవరపాటుకు గురిచేస్తున్నది. గ్రీన్ కార్డులు పొందిన వారు సైతం భయపడి పోవడమే కాకుండా పెళ్లిళ్లు అత్యవసర ప్రయాణాలను సైతం వాయిదా వేసుకున్నారు. చివరికి తమ సమీప బంధువులు స్వంత తల్లిదండ్రులు చనిపోయినా కూడా ఇండియాకు రాలేని విషాదకర పరిస్థితి. అమెరికాలో ఉన్నవాళ్లకు, ఇండియాకు వచ్చిన వాళ్లకు అమెరికాకు వెళ్లాలని ఉవ్విళ్లూరుతున్న వాళ్లందరిలోను భవిష్యత్తు పట్ల ఒకటే ఆందోళన. విమానాశ్రయాలలో గంటల తరబడి చెకింగ్ పెరిగిపోవడం, అమెరికాకు వెళ్లే, అమెరికా నుండి వచ్చే విమానాల్లో కొన్నిరోజుల పాటు సగం ఖాళీ సీట్లే ఉంటున్నాయి. ఉన్నత విద్యకై అమెరికా వెళ్లాలనుకునేవారు సైతం పునరాలోచనలో పడ్డారు.

వలసలను క్రమబద్ధీకరించాలనే నిర్ణయాన్ని కఠినంగా అమలు పరిస్తే భారతీయులు భారీగానే నష్టపోయే ప్రమాదం ఉంది. రిఫార్మింగ్ అమెరికన్ ఇమ్మిగ్రేషన్ ఫర్ స్ట్రాంగ్ ఎంప్లాయిమెంట్ పేరుతో అమెరికా చట్ట సభల్లో ప్రవేశపెట్టబడిన బిల్లు ఆమోదం పొందితే హెచ్-1బి వీసాల సంఖ్య సగానికి తగ్గిపోవడమే కాకుండా గ్రీన్ కార్డు పొందే ప్రస్తుత ఏడు నుండి పది సంవత్సరాల కాలం ఇరవై ఏళ్ల వరకు పెరగవచ్చు. ఇదే జరిగితే కొన్ని లక్షల ప్రవాస భారతీయులపై తీవ్ర ప్రభావం పడుతుంది. అమెరికాలో స్థిరపడిన నాలుగు కోట్ల విదేశీయులలో 4.7 శాతం భారతీయులే. 1960లలో పన్నెండువేల మంది భారతీయులు అమెరికాలో ఉంటే ఇవాళ ఆ సంఖ్య 28 లక్షలకు పైగా ఉన్నది. అత్యంత నిపుణులైన వారికి మాత్రమే అవకాశం ఇవ్వాలని, వారి వార్షికవేతం కనీసం లక్షాముప్పైవేల డాలర్లు ఉండాలనే ప్రతిపాదనలు వాస్తవ రూపుదాలిస్తే దాదాపు పదిలక్షల మంది భారతీయులు ఇంటిముఖం పట్టాల్సి ఉంటుంది.

ఇప్పటికిపుడే అది జరిగే అవకాశం లేకపోయినా ఆ సాధ్యతను భవిష్యత్తులో కొట్టిపడెయ్యలేము. అయితే అన్ని లక్షల మంది తమ ఉద్యోగాలను వదిలివేయాల్సివస్తే అంత పెద్ద మొత్తంలో ఆ ఉద్యోగాలను అమెరికన్‌లతో భర్తీ చేయడం అసాధ్యం. అమెరికన్‌లలో కేవలం 32 శాతం మాత్రమే డిగ్రీ పట్టా పొందినవారున్నారు. నిపుణులైన వారి సంఖ్య చాలాతక్కువ. దాని ప్రభావం కేవలం ఉద్యోగరంగం పైననేకాదు, 10 లక్షల మంది వారు కొనుకున్న ఇళ్లను తిరిగి బ్యాంకులకు అప్పగించాల్సివస్తే అమెరికాలో మరో సబ్‌ప్రైం సంక్షోభం తప్పదు. దీన్ని భరించేస్థితిలో ఇప్పుడు అమెరికా లేదు. వ్యాపారవేత్త అయిన ట్రంప్‌కి ఇది సులభంగానే అర్థమవుతుంది. అదే భారతీయులకు పెద్ద ఊరట.

ఏది ఏమైనా డోనాల్డ్ ట్రంప్ తాను చెప్పింది చేస్తాననే సంకేతాలను తన తొలి చర్యల ద్వారా బలంగానే పంపాడు. ఈ పరిణామాలతోనైనా ఆంగ్ల మాధ్యమంపైన మోజు, అమెరికా చదువులు ఉద్యోగాలపైన వ్యామోహం తగ్గి వేలకోట్ల రూపాయల ప్రజల సొమ్ముతో ఇక్కడ చదివి అక్కడ సేవచేసే వారిలో ఏమైనా జ్ఞానోదయం కలుగుతుందో చూడాలి. మరోవైపు భారత ప్రస్తుత పాలక వర్గాలు ఆశిస్తున్న 'టెర్రరిజం' పాకిస్తాన్‌ను కట్టడి చేసే అంశం పైన తమకనుకూలమైన నిర్ణయాన్ని ట్రంప్ తీసుకోకపోగా తన దేశ ప్రయోజనాలకు అనుగుణమైన విధానాన్నే కొనసాగించే అవకాశం ఉంది.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)*

# ఆటోమేషన్‌తో ఉద్యోగాలు గల్లంతు

***యాంత్రీకరణ వల్ల మూడవ ప్రపంచ దేశాల్లోని సేవా, పారిశ్రామిక, వ్యవసాయ రంగాల్లో లక్షలాది మంది నిరుద్యోగులుగా మారే ప్రమాదం ఉందని సాంకేతికరంగ నిపుణులే ఆందోళన వ్యక్తం చేస్తున్నారని అంటున్నారు సంతోష్***

మానవాళి జీవనం గత కొన్నేళ్లలో విప్లవాత్మకంగా మారిపోతోంది. మునుముందు మరెన్నో గుణాత్మక మార్పులు చోటు చేసుకోనున్నాయి. ఇప్పటివరకు జరిగిన పారిశ్రామిక విప్లవాలు ప్రపంచ ముఖచిత్రాన్ని గణనీయంగా మార్చి వేశాయి. ఇప్పుడు సంభవించబోయే సాంకేతిక పారిశ్రామిక విప్లవం గతంతో పోలిస్తే ఎంతో శక్తివంతమైనది. 'ఆవిరి యంత్రం' ప్రాతిపదికగా తొలి పారిశ్రామిక విప్లవం 1750లో మొగ్గ తొడగడంతో రవాణా, పరిశ్రమలు వంటి రంగాల్లో కీలక మార్పులు సంభవించాయి. ద్వితీయ పారిశ్రామిక విప్లవం 1850లో విద్యుచ్ఛక్తిని ఆధారంగా చేసుకుని వెల్లివిరియడంతో పరిశ్రమల్లో భారీ ఉత్పత్తులకు మార్గం సుగమమైంది. ప్రపంచవ్యాప్తంగా ఎలక్ట్రానిక్స్, ఐటి రంగాల వృద్ధి కారణంగా 1970 నుంచి మూడో పారిశ్రామిక విప్లవానికి అంకురార్పణ జరిగింది. గడిచిన యాభయ్యేళ్ల కాలంలో సాంకేతిక రంగంలో పొడగడుతున్న మార్పుల వల్ల జీవ, భౌతిక, డిజిటల్ రంగాల మధ్య హద్దులు చెరిగిపోయాయి. ఈ రంగాల్లో మౌలిక మార్పుల ద్వారా నూతన నాలుగో పారిశ్రామిక విప్లవానికి నాందీ ప్రస్తావన జరిగింది.

అంతర్జాల విజ్ఞానం ఆధారంగా పనిచేసే పరికరాల (ఇంటర్నెట్ ఆఫ్ థింగ్స్-ఐఓటి), 3డి ప్రింటింగ్, నానో టెక్నాలజీ, బిగ్-డేటా, బయోటెక్నాలజీ, మానవుని మెదడు, నాడీ వ్యవస్థల వల్ల పొడచూపుతున్న విప్లవం మూడో పారిశ్రామిక విప్లవానికి పొడగింపే అనుకుంటే పొరపాటు పడినట్లే. ఇది విస్తరిస్తున్న వేగాన్ని, ప్రభావాన్ని, సృష్టించబోయే అవకాశాలను మిగిలిన విప్లవాలతో సరిపోల్చలేం! ఎందువల్లనంటే జన్యుశాస్త్ర పరిశోధనలు, వైద్య, ఆరోగ్య రంగాల్లో ఇటువంటి టెక్నాలజీలను ఇంకా ఎక్కువగా వాడడం -విస్తృత పరిశోధనలు, ఇవీ నాలుగో పారిశ్రామిక విప్లవానికి దోహదం చేసే అంశాలు. దీంతో మానవాళి భవితకు కృత్రిమ మేధ అనేది కీలకం కానుంది. దీంతో జరిగితే అత్యంత మేలు, లేకపోతే అతి పెద్ద కీడు తప్పకపోవచ్చు. సజీవమైన మెదడుకూ, కంప్యూటర్‌కూ మధ్య వ్యత్యాసం ఇప్పుడు చెప్పుకోవాల్సినంత స్థాయిలో లేదు. కంప్యూటర్లు మన మేధను అనుకరించడమే కాదు... మనకంటే మెరుగైన ప్రజ్ఞాపాటవాలు ప్రదర్శించే స్థాయికి వచ్చేశాయి.

చరాచర జగత్తులో మేదస్సు మానవులకే ఉందనీ, మేదస్సు మనిషి సొంతమని భావించే రోజులు ముగియనున్నాయి. కృత్రిమ మేధ... దాంతో పనిచేసే కంప్యూటర్లు, రోబోలు ప్రపంచాన్ని శాసించబోతున్నాయి. 'కృత్రిమ మేధ' చాలా రంగాల్లో ఇప్పటికే దాదాపు మనుషులతో పోటీ పడే స్థాయికి చేరుకుంది. మనుషులు చేసే చాలా పనులను... ఇంకా చెప్పాలంటే మనుషులు చేయలేని చాలా పనులను కూడా చేసి పెట్టే స్థాయికి నూతన సాంకేతిక జ్ఞానం చేరుకుంటోంది ఆధునిక సాంకేతిక ప్రతిభ. అయితే దీంతో వినాశం కూడా పొంచి ఉందా? అంటే, ఆర్థిక అసమానతలు మరింత పెరిగి శ్రామికవర్గం అతలాకుతలం కానుందని సామాజిక ఆర్థిక శాస్త్రవేత్తలు భయాందోళనలు వ్యక్తం చేస్తున్నారు. ఇవాళ సైన్స్, సాంకేతిక పరిజ్ఞానం పెట్టుబడి ప్రయోజనాలకే తోడ్పడుతుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థలో అన్ని రకాల ఉత్పత్తి, వాణిజ్య కార్యకలాపాలలో లాభం కోసం జరిగే అనివార్య ప్రయత్నమే సాంకేతిక అభివృద్ధికి మౌలిక చోదకంగా పనిచేస్తుంది. యాంత్రీకరణవల్ల తక్కువ ఖర్చుతో ఎక్కువ ఉత్పత్తి సాధిస్తాయి. శ్రామికుల శ్రమశక్తి అత్యధికంగా దోపిడీకి గురవుతుంది. ఫలితంగా యాజమాన్యాలు అధిక లాభాలు గడిస్తాయేగాని కార్మికులకు న్యాయం జరుగదు. ఇటీవల వెలువడిన ఆక్స్‌ఫాం నివేదిక ఎనిమిది మంది గుత్తా పెట్టుబడిదారీ చేతుల్లో సగం ప్రపంచ సంపద పేరుకుపోయిందని పేర్కొనడం గమనార్హం. మనదేశంలో ఒక శాతం మంది వద్ద 58 శాతం సంపద ఉండడం పెరుగుతున్న ఆర్థిక అంతరాలకు నిదర్శనం. ఆటోమేషన్ వల్ల కొత్త ఉద్యోగాలు రాకపోగా ఉన్న ఉద్యోగాలు ఊడే ప్రమాదముందన్నది వాస్తవం. కృత్రిమ మేధ మూలంగా మానవాళికి విశేషమో, వినాశమో.. త్వరలో ఏదో ఒకటి మాత్రం తథ్యమని ఇటీవలే విఖ్యాత శాస్త్రవేత్త స్టీఫెన్ హాకింగ్ వ్యాఖ్యానించడం ప్రపంచవ్యాప్తంగా పెద్ద చర్చనే రేపుతోంది.

ప్రపంచ ఆర్థిక వేదిక (డబ్ల్యుఇఎఫ్) వార్షిక సదస్సు స్విట్జర్లాండ్‌లోని దావోస్‌లో ఏటా జరుగుతుంది. 2016 జనవరి 20-23 మధ్య జరిగిన 46వ సదస్సులో స్వయంగా ఈ వేదిక వ్యవస్థాపకుడు, జర్మనీకి చెందిన ఆర్థికవేత్త, ఎగ్జిక్యూటివ్ చైర్మన్ క్లాస్ స్క్వాబ్ "నాల్గవ పారిశ్రామిక విప్లవం" గురించిన నివేదికను ప్రవేశపెట్టారు. పన్నులు ఎగ్గొట్టి సంపాదించిన అక్రమార్జన కోట్లాది డాలర్లను యథేచ్ఛగా నల్లడబ్బు రూపంలో దాచుకోవడానికి అనుమతించే బ్యాంకులకు ప్రసిద్ధిగాంచిన స్విట్జర్లాండ్ ప్రపంచ పెట్టుబడిదారుల సమావేశానికి వేదికగా నిలుస్తుండడం కాకతాళీయమూ, యాదృచ్ఛికమూ కాదు. ఇక్కడ అసలు నాల్గవ పారిశ్రామిక విప్లవం అంటే ఏమిటి, దాని గురించి ఎలా స్పందించాలి. ఎలా సంసిద్ధులం కావాలనే అంశాలను వివరిస్తూ ఒక పుస్తకాన్ని కూడా ఈ సందర్భంగా విడుదల చేశారు. అందులో స్పష్టంగా ఆటోమేషన్‌తో ఉద్యోగాలు గల్లంతు అవుతాయని, మనుషులు సృష్టించిన యంత్రాలు ఉద్యోగాలను సృష్టించలేవు. కానీ ఆ మనుషులు మాత్రం ఉద్యోగాలు కోల్పోతారని హెచ్చరించింది.

ప్రపంచ బిలియనీర్లంత కలిసి ప్రపంచ మానవాళి ఉద్ధరణకు చేస్తున్న కృషిలో భాగంగా ఈ విధమైన నాల్గవ పారిశ్రామిక విప్లవ సాధనకు పూనుకొన్నట్లు, ఆ విప్లవ ఫలాలు అందిపుచ్చుకోవడానికి సిద్ధంగా ఉండాలని పిలుపునివ్వడం ఆశ్చర్యకరం. ఈ భూగోళంలో ఉన్న ప్రతి ఒక్కరూ భాగస్వాములు కావాలనీ, అప్పుడే అద్భుతమైన సాంకేతిక ఆవిష్కరణల ద్వారా మానవాళి జీవన విధానమే అనూహ్యంగా మారిపోతుందనీ ఈ సమావేశాల వేదికగా ఊదరగొట్టారు. ఇటీవలే స్విట్జర్లాండ్‌లోని దావోస్‌లో ఈ జనవరి 17 నుంచి 20 వరకు ప్రపంచ ఆర్థిక వేదిక (డబ్ల్యుఇఎఫ్) 47వ వార్షిక సదస్సులు జరిగాయి. 80 దేశాలకు పైగా మూడు వేల వరకూ ప్రతినిధులు వీటికి హాజరయ్యారు. విలాసవంతమైన సమావేశాలకు బడా పారిశ్రామికవేత్తలు, సిఇఒలు, రాజకీయ ప్రముఖులు, పరిశోధన, సాంస్కృతిక రంగాలకు చెందినవారు హాజరయ్యారు. 50 దేశాల ప్రభుత్వ ప్రతినిధి వర్గాలు కూడా హాజరయ్యారు. ఈ సదస్సులో సమ్మిళిత అభివృద్ధి అంటూనే నాల్గవ పారిశ్రామిక విప్లవ ప్రయోజనాలను అందివుచ్చుకోవాలని తీర్మానించుకోవడం శోచనీయం.

గడిచిన మూడు పారిశ్రామిక విప్లవాలు బాగా అభివృద్ధి చెందిన దేశాలకు ఉపయోగపడ్డాయనీ, అభివృద్ధి చెందిన దేశాలు అభివృద్ధి చేసిన టెక్నాలజీని, తమ ఉత్పత్తులను తృతీయ ప్రపంచ దేశాలకు, అభివృద్ధి చెందని దేశాలకు తరలించడం ద్వారా అవి బాగా లాభపడ్డాయనీ, స్విట్జర్లాండ్ (యుబిఎస్) నివేదిక తెల్పింది. ఆధునిక సాంకేతికత ద్వారా తృతీయ ప్రపంచ దేశాలు కొంత అభివృద్ధిని సాధించినప్పటికీ, స్థూలంగా అసమానతలు పెరగడానికీ, నయా వలసవాద అభివృద్ధి పంథాను అనుసరించడానికి పై మూడు పారిశ్రామిక విప్లవాలు దోహదం చేశాయి. ఈ సదస్సులో చర్చించిన రోబోటిక్స్, ఆర్టిఫిషియల్ ఇంటిలిజెన్స్ వల్ల చౌకగా లభించే మానవ శ్రమశక్తికి పోటీ వస్తుందనీ, తద్వారా యాజమాన్యాలకు విపరీతమైన లాభాలు పెరిగి అసమానతలు తీవ్రతరం అవుతాయని కూడా నివేదిక పేర్కొంది. మానవాళి అద్భుతమైన ఆవిష్కరణలు ధనార్జన దృష్టితో కాకుండా పేదరిక నిర్మూలన దిశగా ఉండాలని కూడా ఈ నివేదిక సూచించింది.

విశృంఖలమైన ఆటోమేషన్ వల్ల అసమానతలు తీవ్రతరమవుతాయని బ్యాంక్ ఆఫ్ అమెరికా - మెరిల్ లించ్ గత సంవత్సరం విడుదల చేసిన ఒక నివేదికలో పేర్కొంది. బ్రిటన్ కార్మికుల్లో 35 శాతం మంది, అమెరికా కార్మికుల్లో 47 శాతం మంది టెక్నాలజీ దాటికి రాబోయే రెండు దశాబ్దాల్లో ఉద్యోగాలు కోల్పోయే ప్రమాదముందని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ పరిశోధనల్లో వెల్లడైంది. ప్రపంచ ఆర్థిక వేదిక నిర్వాహకులు కూడా రాబోయే ఐదేళ్లలో 70 లక్షల ఉద్యోగాలు ఊడతాయనీ, ముఖ్యంగా మహిళా ఉద్యోగులు అధిక శాతం తమ ఉపాధి పోగొట్టుకుంటారనీ అంచనా వేస్తోంది. భారత మాజీ ఆర్‌బిఐ గవర్నర్ రఘురాం రాజన్ కూడా టెక్నాలజీ పెరుగుతున్న కొద్దీ ఉద్యోగాలు తగ్గుతాయని ఇటీవల అభిప్రాయపడ్డారు. ఉద్యోగాలు ఊడబెరికే టెక్నాలజీ మనకెందుకనీ, కార్మికుల కడుపునిండే విధానాలు కావాలనీ నిజమైన అభివృద్ధి కోసం పాటుబడే అభివృద్ధి కాముకులూ, సామాజిక మేధావులూ ఘోషిస్తున్నారు.

60 శాతం మంది ఆధారపడ్డ వ్యవసాయరంగం మన స్థూల జాతీయోత్పత్తికి (జిడిపి) 14 శాతం సమకూర్చుతుంటే, 20 శాతం లోపు పనిచేసే సేవారంగం వాటా జిడిపిలో 60 శాతం ఉండడం వలన, తక్కువ మంది దగ్గరే సంపద పోగుపడడం, అసమానతలు ఎక్కువవుతున్నాయి. సాఫ్ట్‌వేర్ ఉద్యోగాల మోజులో ఎక్కువ మంది ఇంజనీర్లుగా తయారవడం, వారందరికీ ఉద్యోగాలు లభించకపోవడం మనం చూస్తున్నాం. నాల్గవ పారిశ్రామిక విప్లవానికి మనిషిని రోబోగా మార్చే శక్తి ఉందనీ, మనుషుల స్థానంలో హృదయం లేని, ఆత్మలేని యంత్రాలను ప్రవేశపెట్టడం వల్ల మానవజాతికి ముప్పు వాటిల్లనుందనీ, అందుకని మానవ విలువలను కాపాడుతూ, అద్భుతమైన మానవ మేధను ఉపయోగించుకునే ప్రయత్నం జరగాలనీ సమాజం ఆశిస్తుంది. పోప్ ఫ్రాన్సిస్ 'ఈ భూగ్రహాన్ని పూలు, పండ్లూ, చెట్లూ లేని తోటగా తయారు చేయవద్దనీ, కొద్దిమంది సంతోషం కోసం ఎడారిగా మార్చవద్దనీ, శాస్త్ర సాంకేతిక ఫలాలన్నీ అందరికీ అందేట్లు చూడాలనీ, పేద వారి సాంఘిక భద్రత గురించి ఆలోచించాలనీ' డబ్ల్యుఇఎఫ్‌ను ఉద్దేశించి సందేశమిచ్చారు. విశ్వ సంక్షేమం కాంక్షించే నూతన సమాజంలో విసుగుపుట్టించే, శారీరకంగా కష్టతరమైన, భద్రతలేని, అనారోగ్యకరమైన పనులను తగ్గించడానికీ సాంకేతిక అభివృద్ధి దోహద పడాలి. మొత్తం మీద మౌలిక అవసరాలను సంతృప్తి పరచడానికి, అవసరమైన శ్రమకాలాన్ని తగ్గించడానికి, మానవ శక్తియుక్తులను సంపూర్ణంగా వెలికి తీయడానికి కృషి జరగాలి. అటువంటి నూతన సమాజానికై కృషి చేయాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది.

సాంకేతీకరణ, ఆటోమేషన్, రోబోటిక్ పేరు ఏదైనా మెజార్టీ ప్రజల ఉపాధి కల్పనను దెబ్బతీయడానికే దారితీస్తుంది. ఈ విధానాల వల్ల భవిష్యత్తులో అనేక రంగాల్లో భారీగా ఉద్యోగ నియామకాలు పడిపోనున్నాయి. మరోవైపు ఉన్న ఉద్యోగాలు ఊడే ప్రమాదం పొంచి ఉంది. తాజాగా అమెరికా కేంద్రంగా పనిచేస్తోన్న హెచ్‌ఎఫ్‌ఎస్ రీసెర్చ్ సంస్థ చేసిన సర్వే ప్రకారం ఐటి రంగంలో వచ్చే ఐదేళ్లలో ఇటు భారత్, అటు ప్రపంచ వ్యాప్తంగానూ భారీగా ఉపాధి దెబ్బతిననుందని హెచ్చరించిన విషయం తెలిసిందే. కాగా ఆటోమేషన్ ఐటి రంగానికే కాకుండా అన్ని రంగాలకు ప్రమాదంగానే మారింది. హెచ్‌ఎఫ్‌ఎస్ రీసెర్చ్ అంచనా ప్రకారం భారత్‌లో వచ్చే ఐదేళ్లలో 6.4 లక్షల ఉద్యోగాలకు ఉద్వాసన పలకనున్నారని పేర్కొంది. దేశానికి వెన్నెముఖగా ఉన్న వ్యవసాయ రంగంలో భారీగా ఉపాధి కల్పన దిగజారనుందని విశ్లేషకులు అంచనా వేస్తున్నారు.

భవిష్యత్తులో వ్యవసాయం పూర్తిగా సాంకేతిక పరిజ్ఞానాన్ని సంతరించుకోనుంది. పూర్తిగా రోబోల పరిజ్ఞానంతో పంటలు చేతికి రానున్నాయి. పైర్లను డ్రోన్లతో పరిరక్షించే అవకాశమూ లేకపోలేదు. భూమి, మెషనరీ, రసాయనాలు, విత్తనాల ధరలు మరింత ప్రియం కానున్నాయి. ఈ తరహా హై టెక్నాలజీ పేద రైతులను నష్టాల్లోకి నెట్టేసే ప్రమాదముంది. దీంతో వ్యవసాయం చేయలేక చిన్న, సన్నకారు రైతులు భూములు అమ్ముకునే పరిస్థితి దాపురిస్తుందని భావిస్తున్నారు. నూతన మెషనరీ వచ్చిన ప్రతీసారీ ఆయా పరిశ్రమలు కొంత మంది కార్మికులకు ఎసరు పెడుతున్నాయి. జపాన్ లాంటి దేశాల్లో మనుషుల అవసరం లేకుండానే అనేక పరిశ్రమలు వెలుస్తున్నాయి. తయారీ రంగంలో ఈ

తరహా పరిస్థితి ప్రపంచ వ్యాప్తంగా వేగంగా విస్తరిస్తోంది. దీంతో కార్మికులు తమ ఉద్యోగ భద్రత. జీతాలు, జీవితాలను కోల్పోతున్నారు.

వైద్య రంగంలో ఆటోమేషన్ వల్ల అత్యధిక లబ్ధి పొందుతున్నది ఈ రంగంలోని యాజమాన్యాలే. రిమోట్ ఎలక్ట్రానిక్ పరిశీలన ఉత్పత్తుల వల్ల కింది స్థాయి పనివారికి గొడ్డలి పెట్టుగా మారుతోంది. ఈ పరిణామాలు వైద్య రంగంలోని పనివారిని ఆందోళనకు గురి చేస్తున్నాయి. నూతన టెక్నాలజీ ద్వారా నగదు తీసుకునే (క్యాషర్స్) సాంకేతికత అందుబాటులోకి రావడంతో బ్యాంకింగ్ వంటి ఆర్థిక సేవా రంగంలో కొలువులు భారీగా ఖాళీ అయిపోతున్నాయి. 2001లో తొలుత మెక్‌డొనల్డ్స్ ప్రపంచ వ్యాప్తంగా 7000 ఆటోమెటెడ్ క్యాషర్స్ విధానాన్ని ప్రవేశపెట్టింది. దీంతో కొనుగోలుదారులు స్వయంగా నగదు చెల్లించి ఆహారోత్పత్తులు పొందడానికి వీలు కల్పించింది. దీంతో స్టోర్లు, సూపర్ మార్కెట్లు క్యాషియర్ల నియామకాలకు కోత పెట్టాయి. బ్యాంకులు కూడా ఎటిఎం కేంద్రాల్లో అన్ని లావాదేవీలు అందుబాటులోకి తేవడంతో ఈ విభాగంలో ఉద్యోగుల కల్పన సామర్థ్యం పడిపోతోంది.

బిపిఓలో భారత్‌కు ఉన్న విస్తృత అవకాశాలపై మెల్లమెల్లగా నీలినీడలు కమ్ముకుంటున్నాయి. ఈ రంగంలో ఐపిసాఫ్ట్, అమెలియా, విపిఐ లాంటి కృత్రిమ కాల్ సెంటర్ ఏజెంట్ల రాకతో భారీగా ఉద్యోగ అవకాశాలకు గండి పడుతున్నాయి. ఐటి ఉద్యోగుల్లో ఆటోమేషన్ భయాలు ఇప్పటికే మొదలయ్యాయని ఇన్ఫోసిస్ బిపిఓ ఆసియా పసిఫిక్ వైస్ ప్రెసిడెంట్ మెహ్రా పేర్కొన్నారు. రోబోటిక్ ప్రాసెస్ ఆటోమేషన్ వల్ల రానున్న రెండేళ్లలోనే బిపిఓ పరిశ్రమ పలు సమస్యలను ఎదుర్కోనుందన్నారు. మొత్తం దేశ పరిశ్రమకే ఇది పెద్ద సవాల్‌గా మారనుందన్నారు. 1477 పరిశ్రమ స్టాక్ హోల్డర్లతో హెచ్‌ఎఫ్‌ఎస్ చేసిన సర్వే ఆ రంగంలోని వారిని తీవ్ర ఆందోళనకు గురి చేస్తున్నాయి. ఆ సంస్థ అంచనా ప్రకారం రానున్న ఐదేళ్లలో తక్కువ నైపుణ్యమున్న ఉద్యోగాలు 30 శాతం తగ్గిపోవచ్చు. ఆటోమేషన్ వల్ల దేశంలోని 37 లక్షల ఐటి బిపిఓ ఉద్యోగులపై ప్రభావం చూపుతుంది. ఇప్పటికే పలు టెక్ కంపెనీలు తొలగింపు కసరత్తులో మునిగి ఉన్నాయి.

ప్రపంచ బ్యాంకు పరిశోధన పత్రం విశ్లేషణ ప్రకారం 'ఉద్యోగాల యాంత్రీకరణ' (ఆటోమేషన్) కారణంగా భారత్‌లో భారీ ఎత్తున కొలువుల్లో కోత పడనుందని ప్రపంచ బ్యాంకు అధినేత ఆందోళన వ్యక్తం చేశారు. ప్రపంచంలో తీవ్రతరమవుతున్న పేదరికంపై వాషింగ్టన్‌లోని 'కిమ్ బ్రూకింగ్స్' ఇన్‌స్టిట్యూట్‌లో ఇటీవల జరిగిన చర్చ కార్యక్రమంలో ప్రపంచ బ్యాంకు అధ్యక్షుడు జిమ్ యాంగ్ కిమ్ మాట్లాడుతూ ఆటోమేషన్ అనర్థాలపై పలు వ్యాఖ్యలు చేశారు. భారత్‌లో ఆటోమేషన్ కారణంగా ప్రస్తుతం ఉన్న కొలువుల్లో దాదాపు 69 శాతం ఉద్యోగాలకు ముప్పు వాటిల్లే ప్రమాదం ఉందని బ్యాంక్ విశ్లేషించింది. చైనాలో ఏకంగా 77 శాతం, ఇతియోపియాలో ఏకంగా 85 శాతం మంది ఉద్యోగులు తిప్పలు పడనున్నారని అంచనా వేసింది. ఆటోమేషన్ టెక్నాలజీ అభివృద్ధి చెందుతున్న దేశాల సంప్రదాయ ఆర్థిక వ్యవస్థను అస్థిరపరిచే అవకాశం ఉందని ఆయన హెచ్చరించారు. మణిపాల్ గ్లోబల్ ఎడ్యుకేషన్ లిమిటెడ్ చైర్మన్ టి.వి. మోహన్‌దాస్ పాయ్ మాట్లాడుతూ 2025 నాటికి 21-41 ఏళ్ల వయసు కలిగిన 20 కోట్ల మంది యువతకు ఉపాధి ఉండదన్నారు. వీరంతా ఏమి చేయాలో అర్థంగాని పరిస్థితులు నెలకొన్నాయన్నారు. ప్రభుత్వ విధానమేమిటో అర్థం కావడం లేదన్నారు. నిరుద్యోగ సమస్య భారత్‌లో చాలా ఆందోళనకరంగా పరిణమించనుందని హెచ్చరించారు.

యాంత్రీకరణ, టెక్నాలజీ కారణంగా సంప్రదాయ పారిశ్రామిక ఉత్పత్తి దెబ్బతిందని... మాన్యువల్ ఉద్యోగాలు నష్టపోతున్నామనీ పలువురు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఈ ధోరణి కేవలం అభివృద్ధి చెందిన దేశమైన అమెరికాకు పరిమితం కాదనీ, ప్రపంచ దేశాల్లో ప్రతిచోటా ప్రజలు దీనికి ప్రభావితమవుతున్నారని కిమ్ తెలిపారు. ఆటోమేషన్ వల్ల బ్యాంకింగ్‌తో పాటు ప్రధానంగా టెక్స్‌టైల్ రంగం, పోస్టల్ సర్వీసెస్, కమ్యూనికేషన్స్ పరికరాల తయారీ, పత్రికలు, ఎలక్ట్రానిక్స్ రంగం, గాజు సీసాల తయారీ, కాగితం ఉత్పత్తి, ఆటోమొబైల్ రంగాలపై తీవ్ర ప్రభావం ఉండనుందని విశ్లేషకులు హెచ్చరిస్తున్నారు. అందువలన మనలాంటి వ్యవసాయక దేశంలో ఏ తరహా ఆర్థిక వృద్ధి అవసరమో అర్థం చేసుకొని విధానాలను రూపొందించుకోవలసి ఉంటుంది.

వర్గ సమాజంలో వర్గ దోపిడీ కొనసాగుతుంది. అందుకు రాజ్యం తోడ్పడుతుంది. కాబట్టే, కార్పొరేట్ శక్తులు శ్రామికుల శ్రమను దోచుకోవడమే కాకుండా వారి జీవించే హక్కును కాలరాస్తున్నాయి. మానవాళి మనుగడ, పర్యావరణ పరిరక్షణ ప్రశ్నార్థకంగా మారాయి. పెట్టుబడిదారులు, బహుళజాతి సంస్థలు ప్రపంచవ్యాప్తంగా సహజ వనరులను కొల్లగొడుతూ, శ్రమ దోపిడీ చేస్తూ తమ వ్యాపారాలను విస్తరించుకుంటూ సంపదలు పోగేసుకుంటున్నాయి. వీరి లాభాపేక్షకు శ్రమజీవులు బలవుతున్నారు. మన పాలకులు కూడ సామ్రాజ్యవాద కార్పొరేట్ శక్తులకు ఊడిగం చేస్తున్నారు. పర్యావసానంగా సామాజిక ఆర్థిక అసమానతలు విస్తృతమయి తీవ్ర ఇబ్బందులకు గురవుతున్నారు. వర్గ సమాజంలో ఉత్పత్తి సాధనాలు ఎవరి చేతుల్లో ఉంటాయో వారే అధికారం చలాయిస్తారు. జ్ఞానం కూడ వారి చేతుల్లోనే ఉంటుంది. శ్రమను దోపిడీ చేస్తారు. శ్రమ దోపిడీ రద్దయి శ్రమ ఫలితం శ్రామికులకు దక్కాలంటే ఉత్పత్తి సాధనాలు సమాజపరమవ్వాలి. అప్పుడే జ్ఞానం కూడా సమాజ పరమవుతుంది. అందుకు సోషలిస్టు వ్యవస్థ కొరకు, ప్రత్యామ్నాయ రాజకీయార్థిక విధానాల కొరకు పీడిత ప్రజలందరు సంఘటితమై వ్యవస్థ మార్పు కొరకు పోరాడడం తప్ప మరో మార్గం లేదు. దోపిడీ పీడన లేని సోషలిస్టు ఆర్థిక విధానమే పెట్టుబడిదారీ ఆర్థిక విధానానికి ప్రత్యామ్నాయం.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

*పాఠకులు ఫిర్యాదులు, సమాచారం కోసం వీక్షణం కార్యాలయానికి పనిదినాల్లో ఉదయం 10:30 నుండి సాయంత్రం 6.00 గంటలలోగా స్వయంగా లేదా ఫోన్ ద్వారా సంప్రదించవచ్చు. మిగతా సమయాల్లో ఫోన్ చేస్తే అది ఫ్యాక్స్‌లోకి వెళ్లి మీకు జవాబు రాదు. అప్పుడు మీరు ఫోన్ ఎత్తికూడా మాట్లడడంలేదని అనుకునే అవకాశం ఉంది. ఇది గమనించగలరు. – సం.*

# బోరేవాలా ముస్లింల బతుకుచిత్రం

***ముస్లింలలోనే అంటరానితనాన్ని ఎదుర్కొంటూ అట్టడుగు జీవితాన్ని గడుపుతున్న బోరేవాలాల సంచార బతుకు జీవితాన్ని వివరిస్తున్నారు* షేక్ ఇబ్రహీం**

బోరేవాలాలు ముస్లింలలో ఒక వర్గంవారు. ఫకీర్లు, బొంతలోల్లనే పేర్లతో పిలువబడే వీరు ఆంధ్రప్రదేశ్ అంతటా ఉన్నారు. చిత్తూరు జిల్లాలో వీరిని 'మొండితురకలు' అని, అనంతపురంలో 'మొరటు సాయిబులు' అని పిలుస్తుంటారు. కర్నూలు, కడప జిల్లాలు వీరిని 'బోరేవాలాలు' అని పిలుస్తారు. చిత్తూరు జిల్లాలో గురివిరెడ్డిగారి పల్లె, గజ్జెలవారిపల్లి, తురకపల్లె, భాకరపేట పరిసర ప్రాంతాల్లో బోరేవాలా ముస్లింలున్నారు. అనంతపురంలో తలుపుల, కదిరి, కొండగట్టు, ధర్మవరం, నల్లచెరువు, కదిరి ప్రాంతాల్లో బోరేవాలా ముస్లింలు ఉన్నారు.

కర్నూలులో చాగల మర్రి, నల్ల కాలువ, ఆత్మకూరు, నంద్యాల, ఆదోని పరిసర ప్రాంతాల్లో ఉన్నారు. కడప జిల్లాలో వేంపల్లె, పెద్దకుదాల, లింగాల, రాయచోటి పరిసర ప్రాంతాల్లో వారి జీవనం కనిపిస్తుంది. వీరి మూలాలు కర్నాటక లోని బళ్లారి ప్రాంతంలో కనబడుతాయి. ఆ ప్రాంత ప్రజల్ని వివరాలు, అడగ్గా వీరి మూలాలు మహారాష్ట్ర, గుజరాత్ నుంచి వలస వచ్చి జీవనం కొనసాగిస్తున్నారు. మొట్టమొదట వీరు ఫకీరు వేషం ధరించి జీవనాధారం కొనసాగించేవారు. తలకు ఆకు పచ్చని రంగు తలపాగా కట్టి, అదే రంగుపొడుగాటి చొక్కా ధరించి చేతిలో డప్పు పట్టుకుని వాయిస్తూ పాటలు పాడుకుంటూ వీరి పూర్వీకులు పూర్వం బిక్షాటన చేసేవారు.

బతుకు దెరువుకోసం వీరు తాము నివసించే గ్రామాన్ని వదిలి ఎక్కడ ఉరుసు, ఉత్సవాలు జరుగుతాయో ఆ చోటికి వెల్లుతూ, ఎల్లలు అనే హద్దు లేకుండా దేశ సంచారం చేసేవారు. అలా సంవత్సరాల పాటు తిరిగి తిరిగి సంవత్సరానికి ఒకసారో, రెండుసార్లో ఇంటికి వచ్చేవారు. సంపాదించిన డబ్బు కొద్ది వరకు తాగుడుకు ఖర్చు పేట్టేవారు. తాగుడుకు పోయి మిగిలిన ధనాన్ని కుటుంబానికి ఇచ్చేవారు. ఇంట్లో ఉండే ఆడవారు గ్రామాలకు పోయి బొంతలు కుట్టి (చినిగిన పాతచీరలను దబ్బలతో మెత్తగా పరుపులా కుట్టడం) ఇచ్చేవారు. ఈ పాత చీరలతో బొంతలు తయారు చేయించుకున్నవారు అన్నం బెట్టి, కొద్దిపాటి ధాన్యాన్ని కూడా ఇచ్చేవారు. ఆ విధంగా స్త్రీ, పురుషులు ఇరువురు కుటుంబ జీవనాన్ని నడిపించేవారు. క్రమేణా బొంతల గిరాకీ పోయిన తర్వాత ఆడవాళ్లు ఈతాకులు తెచ్చి, ఈతాకులతో ఈత చాపలు అల్లేవారు. అల్లిన చాపల్ని అమ్మి జీవనాధారం కొనసాగించేవారు. అలా వీరికి బోరేవాలాలు అని ముద్రపడింది.

ముస్లీమేతరులు, ఉన్నత ముస్లింలు ఈ బోరేవాలాలను ఫకీరు సాయిబు, బోరేవాలా సాయిబు, బొంతల సాయిబు, కటిక సాయిబు మొదలైన పేర్లతో పిలుస్తారు. ఉన్నత ముస్లింల ఇళ్లకు వచ్చి బోరేవాలాలు నీళ్లు అడిగినా, నీళ్లు దోసిళ్లల్లో పోసి తాగమనే ఆచారం పూర్వంలో ఉండేది. కానీ ఇప్పుడు లేదు. వివక్ష మాత్రం ఉంది. కొందరు ఉన్నత ముస్లింలు ఈ బోరేవాలాల ముస్లింలని అంటరానివారుగా పరిగణిస్తారు. హిందువులలో ఉన్న మాల, మాదిగ, ఎరుకల వారి మాదిరి. ఈ బోరేవాలాల నివాసాలు గ్రామానికి వెలుపలా ఉన్నాయి. ఒక్క బోరేవాలా ముస్లింలు మాత్రమే కాదు, లఖదేవాలా ముస్లింల పరిస్థితి కూడా అంతే.

ఉదాహరణకు, కడప జిల్లా వేంపల్లె మండల పరిసర ప్రాంతాలను గుర్తిస్తే చాలావరకు ఈ చేదు వాస్తవాలు బయట పడుతాయి.

చిన్న చిన్న గుడారాలు, పూరి గుడిసెల్లో బతుకును వెళమారుస్తున్నారు. ఇప్పుడు వీటి స్థానంలో కొద్దివరకు ఇందిరమ్మ ఇళ్లు వచ్చాయి. లెట్రిన్ సౌకర్యం ఉండదు. కనీసం ఉన్న ఇళ్లకు సొంత పట్టాలు కూడా ఉండవు. దాదాపు ప్రతి ఇంట్లో మాసిన బట్టలతో పిల్లలుంటారు. కటిక దారిద్ర్యంలో జీవితాన్ని ఈడుస్తున్నారు. ఈ బోరేవాలా ముస్లింలలో ఎక్కువ మంది ఎద్దు, ఆవు మాంసం కూడా తినేవారున్నారు. ఈ మాంసం అమ్మి కూడా జీవనాధారం కొనసాగించే వారు లేకపోలేదు. వీరు నిరుపేదలు కావడం వలన ప్రభుత్వం ఇచ్చే రేషన్ పైనే ఆధారపడి ఉంటారు. 2007లో శ్రీకృష్ణ కమిటీ నివేదిక ప్రకారం 96.8 శాతం తెల్ల రేషన్ కార్డులు కలిగి ఉన్నారు.

ఇప్పుడు బోరేవాలాలు అమ్మే ఈత చాపలకు గిరాకీపోయి, వృత్తి మారిపోయి కూలీ పనులకు, వ్యవసాయ పనులకు వెళ్తున్నారు. వీరి వృత్తి మాయమైనప్పటికీ కూడా వీరిని బోరేవాలాలని సంబోధించడం సబబు కాదు. ఇస్లాం పేద, ధనిక అని భేదం లేకుండా సమానత్వాన్ని బోధించిందని ఉన్నత ముస్లింలకు తెలియక కాదు. ఈ అసమానతల్నీ తొలిగించేలా నడుచుకుంటే ఇస్లామీయ విలువల్ని ఆచరిస్తున్నట్టే. బోరేవాలాలను సమానంగా ఆదరించే ముస్లింలు కూడా లేకపోలేదు. ఉన్నత వర్గాల ముస్లింల నుంచి దాదాపు 37.25 శాతం బోరేవాలా ముస్లింలు అణిచివేతకు, బాధలకు లోనవుతున్నారు. 62.75 శాతం మంది బోరేవాలా ముస్లింలు తక్కువ చూపుకు గురికావడం లేదు, వారి వారి వృత్తులపైనే గౌరవంగా బతుకుతున్నారని శ్రీ కృష్ణ కమిటీ నివేదిక తేల్చి చెప్పింది.

దాదాపు 35.29 శాతం ఉన్నత ముస్లింలు బోరేవాలాల మాదిరి అట్టడుగున ఉన్న ముస్లింలను సరి సమానంగా ఆదరించరు. అయితే 64.71 శాతం ఉన్నత వర్గాలకు చెందిన ముస్లింలు బోరేవాలా ముస్లింలందరిని సరిసమానంగానే ఆదరిస్తున్నారు.

స్వాతంత్ర్యం వచ్చి దాదాపు 70 సంవత్సరాలు గడిచినా వీరిలో

చదువు అంతంత మాత్రమే ఉంది. పిల్లలు స్కూలుకు వెళితే ఇంటి దగ్గర ఉండే చిన్న పిల్లల్ని ఆడించేవారు ఉండరని వారిని చూసుకోవడం కోసం పెద్ద పిల్లలు ఇంటి వద్దనే ఉండాల్సిన పరిస్థితి ఏర్పడింది. పిల్లలకు 10 సంవత్సరాలు వస్తే చాలు వారిని కూలీ పనులకు పంపడం, అంగళ్లల్లో గుమస్తాగా పంపడం, బెల్దారు పనికి పంపడం జరుగుతున్నది. టైలర్ షాపుల్లో మెకానిక్ షెడ్డుల్లో పని నేర్చుకోవడానికి కూడా పంపిస్తున్నారు. అయితే రోజువారీ కూలీ పనుల కోసం ఆడ, మగ అని తేడాల్లేకుండా 65.04 శాతం కలిసికట్టుగా పనికి వెళ్లడం జరుగుతున్నది.

వీరికి వ్యవసాయ భూములు చాలా తక్కువ. 1.96 శాతం మాత్రమే బోరేవాలా ముస్లింలకు భూములున్నాయి. అంతే కాదు వారి సంవత్సర ఆదాయం రు. 3,967. గవర్నమెంట్ ప్రతిపాదనల ప్రకారం రు. 25,695 సంవత్సర ఆదాయం ఉండాలి. కానీ ఈ బోరేవాలా ముస్లింల బతుకులు మిగతా అట్టడుగు వర్గాల వారి కన్నా మరుగున పడిన పరిస్థితిని జస్టిస్ రాజేందర్ సచార్ కమిటీ, రంగనాథ్ మిశ్రా కమిటీ, శ్రీ కృష్ణ కమిటీల నివేదికలు తేటతెల్లం చేశాయి.

బోరేవాలా ముస్లింలలో 67.79 శాతం నిరక్ష రాస్యులుగా బతుకును వెళ్ల మారుస్తున్నారు. వీరిలో మగవారు 64.46 శాతం ఉంటే, ఆడవారు 71.74 శాతం నిరక్షరాస్యులుగా ఉన్నారు. అయినా కూడా ప్రభుత్వ ప్రైవేటు ఉద్యోగాల్లో 5.69 శాతం గానే ఉంది. చదివితే ఎక్కడ ఉద్యోగం వస్తాదిలే, చదివితే ఇంట్లో పస్తులుండాల్సి వస్తుందని పిల్లల తల్లి తండ్రులు, పెద్దవాళ్లు బదులిస్తుంటారు.

బోరేవాలాలు పిల్లలను కష్టపడి ఒకవేళ చదివించినా వీరి పేర్లు ఉద్యోగాల దగ్గర తచ్చాడుతూ గిరులు కొడుతుంటాయి. సయ్యద్, పఠాన్, మహమ్మద్, షేక్, ఖాన్ అని ఇంటి పేర్లు తగిలించుకోవడం వలన ఒసిల జాబితాలో చేర్చబడ్డారు. వీరిలో షేక్ అని ఇంటి పేర్లు ఉన్నవారికి బిసి ఈ రిజర్వేషన్లు (4 శాతం) రాష్ట్రం వరకే పరిమితం చేశారు. కేంద్రం మొత్తం మీద ఈ షేక్‌లను ఒసిలుగా పరిగణిస్తున్నారు. ఆ 4 శాతం రిజర్వేషన్స్ కూడా రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగాల్లో జనాభా ప్రాతిపదికనా ఇవ్వడం లేదు.

పఠాన్, ఖాన్, సయ్యద్, మహమ్మద్, షేక్ మొదలైన ఇంటి పేర్లు రాజవంశాలకు చెందినవి కదా! ఎక్కడ మా తాత ముత్తాతలకు కోటలున్నాయని, ఏదీ చూపించమని వ్యంగ్యంగా జవాబు ఇచ్చేవారున్నారు. సాధారణ ముస్లింలు కూడా ఇటువంటి వ్యంగ్యమైన మాటలు బాధతో చేప్పేవారు లేకపోలేదు.

2007 ఏప్రిల్ 4న బి.సి. కులాలు 138గా ప్రభుత్వం ప్రకటించింది. అందులో బి.సి.-ఇ లో 14 కులాలకు 4 శాతం రిజర్వేషన్స్ ఇచ్చారు. అందులో బిసి - ఇలోని 10వ కులంలో ఫకీర్లు, బోరేవాలె, ధీర ఫకీర్లు, బొంతల వాళ్లకు కూడా 4 శాతం ఇవ్వడం జరిగింది. కానీ ప్రభుత్వ మండల కార్యాలయాల్లో ఈ నాలుగు కులాల ఇంటి పేర్లు ఉన్నాయి. అంతేకాదు వీళ్ల వృత్తి కూడా బొంతలు కుట్టడం, రాళ్లు కొట్టడం, ఈత చాపలు అల్లడం మొదలైనవిగా ఉన్నాయి. కానీ ప్రభుత్వం వీరికి 4 శాతం రిజర్వేషన్ ఇచ్చినా కూడా మండల కార్యాలయాల వారు వీరికి కుల ధ్రువీకరణ పత్రాలు ఇవ్వడం లేదు. ఈ విధంగా వారి నిరక్షరాస్యత రోజురోజుకు పెరుగుతున్నది.

నిజానికి ఇక్కడ మరొక వాస్తవమైన అంశాన్ని గమనించాలి. ఈ బోరేవాలాలే తగిలించుకున్న ఇంటిపేర్లు ఉన్నతవర్గాలమని చెబుకుంటున్న ముస్లిలందరికంటే ఉన్నతమైనవి. కానీ పేరుకు ఉన్నత ముస్లింలకు షేకు అని ఉన్నా; వాళ్లు ఉన్నత వర్గం కిందకే. అదే బోరేవాలా ముస్లింలకు పఠాన్, మహమ్మద్, ఖాన్, సయ్యద్, షేక్ అని వారికంటే గొప్పవంశాలకు చెందిన ఇంటిపేర్లు ఉన్నా కూడా వారు అంటరాని వారి కిందకే. చరిత్ర పరంగా దేశ విభజన తర్వాత భారతదేశంలో ఉండిపోయిన 90 శాతం ముస్లింలు మతం మార్చుకోబడ్డ ముస్లింలే. అందుకే మతం మారిన వారి మూలాలు, అస్తిత్వం వారిని వెంటాడుతునే ఉన్నాయి.

ఇప్పుడేమో రాని ఉద్యోగాల కోసం చదవడం ఎందుకని కొంతమంది కువైట్, దుబాయ్, సౌదీ అరేబియా దేశాలకు బతుకు దెరువు కోసం పని మనుషులుగా, వంటమనుషులుగా, డ్రైవర్లుగా పనిచేయడానికి సంవత్సరాల తరబడి వలస వెళ్తున్నారు. వీరిలో కొంతమంది ఆడవాళ్లు కూడా పోతున్నారు. కుటుంబానికి ఆసరాగా ఉండవచ్చుని, పోయేవారు డబ్బులు అప్పుకు తెచ్చుకుని మరి ఇతర దేశాలకు వెళ్తున్నారు. కొందరికి ఒక పనికోసం వీసా పంపిస్తే ఆ పనిని నమ్మి వెళ్తే, అక్కడి సేట్లు వీరితో వేరే పనులు చేయిస్తున్నారు.

ఒకపక్కన ఆ పని భారాన్ని, కష్టాన్ని భరించలేక, మరోపక్క స్వదేశంలో వారి కుటుంబ కష్టాలు తీర్చడానికి దేశం కాని దేశంలో ఈ వలస పక్షులు నానాయాతన అనుభవిస్తున్నారు. కుటుంబ పోషణ కొరకు, కుటుంబాన్ని చక్కదిద్దడం కొరకు కన్నీళ్లతో చేయరాని పనులు సైతం చేస్తున్నారు. ఇక ఆడవారి అవస్థలను, బాధలను మాటల్లో చెప్పలేం. ప్రభుత్వాలు, నాయకులు ఇది అంతా చూస్తున్నప్పటికీ కూడా వీరికి కనీస జీవనోపాధి సౌకర్యాలను కల్పించలేకపోతున్నారు. సంవత్సరాల తరబడి పిల్లల తల్లిదండ్రులు పరదేశంలో ఉండడం వలన ఇంటి దగ్గర వారి పిల్లల భవిష్యత్ చెడిపోతున్నది. వీరిని దగ్గరికి చేరదీసి ప్రేమను పంచేవారు చాలా తక్కువ.

ఈ బోరేవాలాల ఇంటిపేర్లు పరిశోధిస్తే వింతగా ఉంటాయి. వీరి తెగలు గోరికే, సిన్‌కర్, ఫనన్‌కర్, రేంగేలు అని నిర్ధారణ అయింది. వీరు వీరి తెగల్లోనే వివాహం చేసుకుంటారు. హజ్‌యాత్ర చేసి వచ్చిన అగ్రవర్ణాల ముస్లింలు బోరేవాలాలు నివాసం ఉంటున్న చోట మసీదులు కట్టించారు. వీరు కూడా మసీదులకు వెళ్లి నమాజ్ నేర్చుకున్నారు. ఉర్దూ, అరబ్బీ చదవడం నేర్చుకున్నారు. అగ్రవర్ణాల ముస్లింలలో వున్న ఇంటి పేర్లు వీరు ఈ విధంగా తగిలించుకున్నారు - గోరికే - పఠాన్; ఫనన్‌కర్ - సయ్యద్; రేంగే - మహమ్మద్‌లు;. సిన్‌కర్ - షేక్.

అలా వీరు ఇంటిపేర్లు మార్చుకుని ఒసిలు అయ్యారు. కానీ వీరి ఇంటిపేర్లు అయితే మారాయి గానీ జీవన విధానం, వృత్తులు, భాష, వేషధారణ, ఆహారపు అలవాట్లు మారలేదు. మిగతా అట్టడుగు వర్గాల వారి కన్నా ఈ బోరేవాలా ముస్లింలు విద్య, వైద్య, ఉద్యోగ మొదలైన రంగాలలో మరింత వెనుకబడి ఉన్నారు. ప్రభుత్వాలు వీరి సామాజిక వెనుకబాటుతనాన్ని గుర్తించి, జనాభా ప్రాతిపదికన రిజర్వేషన్లు, రాజకీయ, వైద్య, ఉపాధి రంగాలలో చేయూత అందిస్తే వీరి జీవితాలు మెరుగుపడుతాయి.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# నల్లడబ్బు - నరేంద్రమోడీ - ఒక పరిశీలన

**కేంద్ర ప్రభుత్వం తీసుకున్న పెద్దనోట్ల రద్దు నిర్ణయం పెద్ద తప్పిదమనీ, ప్రజా వ్యతిరేకమైనదనీ, ఈ నిర్ణయం వల్ల నల్లడబ్బు నిర్మూలన సాధ్యం కాకపోగా సామాన్య ప్రజలు తీవ్ర ఇక్కట్ల పాలయ్యారనీ అంటున్నారు పి. పోలేశ్వరరావు**

నల్లడబ్బు ఎలా ఉంటుంది? ఎవరి వద్ద ఉంటుంది? ఇది రోజు రోజుకు పెరగడానికి కారణం ఏమిటి? ఈ వ్యవస్థలో దీనిని నిర్మూలించడం సాధ్యమేనా? దీని నిర్మూలన ఏ విధంగా జరుగుతుంది?

ఈ సమాజంలో బడా విదేశీ, స్వదేశీ పెట్టుబడిదారులు, పారిశ్రామిక వేత్తలు, రాజకీయ నాయకులు, భూస్వాములు ప్రభుత్వానికి లెక్కలు చూపకుండా దాచిన డబ్బు. ఇది నోట్ల రూపంలో ఉండవచ్చు. భూమి రూపంలో ఉండవచ్చు, భవంతుల రూపంలో ఉండవచ్చు, బంగారు నగల రూపంలో ఉండవచ్చు, వెండి రూపంలో ఉండవచ్చు, మణి ముత్యాలు, వజ్రవైఢూర్యాల రూపంలో ఉండవచ్చు. ఈ నల్లడబ్బు స్వదేశంలో ఉండవచ్చు. దేశాలు దాటి విదేశాల్లోను ఉండవచ్చు. పెద్ద పెద్ద వ్యాపారస్థులు, పారిశ్రామికవేత్తలు తెలివిగల అకౌంటెంట్లని ఏర్పాటు చేసుకొని ఈ నల్లడబ్బును తెల్లడబ్బుగా చూపవచ్చు.

ఎందుకు ఈ విధంగా ఈ ధనాన్ని పెంచుకుంటున్నారు? తరతరాలు సుఖంగా జీవించాలని, అందరికంటే తామే సుఖంగా ఉండాలని ఆరాటం ఈ నల్లడబ్బుకు, తెల్లడబ్బుకు మూలం. ఈ వ్యవస్థ, ప్రభుత్వాలు, పాలకవర్గాలు ప్రజల కష్టసుఖాలకు, వారి జీవన పరిస్థితులకు బాధ్యత వహించవు. సంపాదన మీద అజమాయిషీ ఉండదు. ఇష్టం వచ్చినట్లు అనేకానేక అవినీతి కార్యక్రమాలలో సంపాదించవచ్చు. ఈ ప్రభుత్వం అవినీతిని నిర్మూలించడానికి, నల్లడబ్బును అరికట్టడానికి అనేక సంస్థలను ఏర్పాటు చేసింది. 1) ఆర్థిక వ్యవహారాల నియంత్రణ సంస్థ - ప్రత్యక్ష పన్నుల కేంద్ర విభాగం (సిబిడిటి); 2) ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ (ఇడి); 3) ఆర్థిక నిఘా విభాగం (ఎఫ్ఐయు); 4) రాష్ట్ర పోలీస్ ఆర్థిక నేర విభాగం (సిబిఐ); 5) తీవ్ర నేరాల విచారణ కార్యాలయం (ఎన్ఎఫ్ఐఒ); 6) జాతీయ దర్యాప్తు ఏజెన్సీ (ఎన్ఐఎ).

ఇంకా సిఐడి శాఖలు, పోలీస్ వ్యవస్థ, మొత్తంగా ఈ అన్ని శాఖలు తమ కార్యాచరణలో విఫలం కావడమే ఈ నల్లడబ్బు పెరుగుదలకు మూలం. ఈ శాఖలు విఫలం కావడానికి కారణాలు అనేకం.

నల్లడబ్బును వెలికితీసి అవినీతిని నిర్మూలిస్తానని ప్రధాని నరేంద్ర మోడీ 2016 నవంబర్ 8న ప్రకటించి ఆ రోజు నుండి వెయ్యి రూపాయల, ఐదు వందల రూపాయల నోట్ల వినియోగాన్ని రద్దు చేశారు. రెండు మూడు రోజులు మురిసిన ప్రజలు ఆ తర్వాత హాహాకారాలు చేశారు. చేస్తున్నారు. నోట్ల వినియోగాన్ని రద్దు చేసి తప్పు చేశానని తెలుసుకున్న నరేంద్ర మోడీ, వారి అనుచర బృందం రకరకాల ప్రకటనలతో తప్పు కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. నరేంద్ర మోడీ కంపెనీకి నోట్ల రద్దు తొందరపాటు చర్య అని ఒప్పుకోవడానికి ఇష్టం లేదు. కనీసం పది రూపాయలు, ఇరవై, యాభై, వంద రూపాయల నోట్లు తగినన్ని ముద్రించి వినియోగంలోకి తీసుకువస్తే ప్రజలకు ఇన్ని కష్టాలు, నష్టాలు ఉండేవి కావు అని తెలిసినా దానిని ఒప్పుకోవడానికి నరేంద్రుల వారికి అహం అడ్డువస్తుంది.

గత రెండు మాసముల పది రోజుల నుండి ప్రజలు పడుతున్న అగచాట్లు, ఇబ్బందులు పూర్తిగా తెలిసినా, ప్రజలు సహనపరులని, ఈ కష్టాల్ని ఓర్చుకుంటారని, ఆ తర్వాత ప్రజలకు అనేక ప్రయోజనాలు చేకూరుతాయని ప్రజల్ని మభ్య పెడుతున్నాడు. అసలు ప్రజలకు ఆ తర్వాత ఎన్ని సంవత్సరాలు, ఏమేమి ప్రయోజనాల్ని కలిగిస్తారని నరేంద్రుల వారు కాని, వారి అనుచర బృందం కాని చెప్పడం లేదు.

కార్మికులు, రైతులు, రైతుకూలీలు, ఉద్యోగులు, ప్రభుత్వ, ప్రైవేట్ రంగ కార్మికులు, చిన్న వర్తకులు, హోటల్, కిరాణా కోట్లు, పాలబూతుల వారు గత-రెండు నెలలకు పైగా పడుతున్న ఇక్కట్లు వారికి తెలియదు. తెలిసినా తెలియనట్లు నటిస్తారు. ఒక్క రోజు కూడా వారు ఈ బాధలు అనుభవించరు. అనుభవిస్తే తాము చేసిన తెలివితక్కువ పని అని కచ్చితంగా తెలుస్తుంది. ఉద్యోగులు, పెన్షన్‌దారులకు ప్రభుత్వ మహా తెలివితేటలుగా వారికి ఉన్న పోస్ట్ ఆఫీసులు, బ్యాంకు ఖాతాలలో మొత్తం రద్దయిన డబ్బులు వేసింది. కాని ఆ వేసిన డబ్బులు తీసుకోవడానికి సరైన అవకాశం కల్పించలేదు. ఇది ఒక పెద్ద తెలివి అనుకుంటుంది. ఖాతాలో జమ చేసిన జీతభత్యాలు పూర్తిగా ఇచ్చినట్లు మభ్యపెడుతుంది. అవసరానికి మన సొంత డబ్బు, మన శ్రమఫలితం అనుభవించడానికి అవకాశం లేకుండా చేసింది. కొత్తగా ముద్రించిన రెండు వేలు, ఐదు వందల నోట్లు కూడా జీతభత్యాలకు చాలలేదు. ఆ నోట్లతో ఎంటిఎంలు పనిచేయలేదు. రోజుకు రు. 2500 అని రు. 4500 అని, వారానికి రు. 10,000 అని, ఆ తర్వాత వారానికి రు. 24,000 అని రోజు ఒక విధమైన ప్రకటన రిజర్వ్ బ్యాంక్ ద్వారా ఇప్పించింది.

ఉద్యోగులు, పెన్షన్‌దారులు ఇప్పటివరకు కూడా చాలామంది జీతాలు, పెన్షన్లు మొత్తంగా తీసుకోలేని పరిస్థితి కల్పించింది. ఈ ప్రభుత్వం ఆ విధంగా దివాళా తీసిన పరిస్థితికి వచ్చింది. ఒక్కమాటలో చెప్పాలంటే దివాళ తీసింది. ఇక ఎటిఎంలు దాదాపు నవంబర్ 8 నుండి ఇరవై రోజుల వరకు పనిచేయలేదు. ఆ తర్వాత కొన్ని పనిచేశాయి. ఇప్పటికీ పూర్తిగా అన్ని ఎటిఎంలు పనిచేయడంలేదు. కొత్త నోట్ల వలన ఎటిఎంలు పని చేయవటా! ఇప్పటి ఎటిఎంల నుండి రు 2500, రు. 4500 తీసుకొనే అవకాశం మాత్రమే ఉంది. పూర్తి జీతం ఒక్కసారిగా తీసుకోవడానికి అవకాశం ఇప్పటివరకు కల్పించలేదు.

రిజర్వ్‌బ్యాంక్ రోజుకొక రూలింగ్ ఇస్తూ ప్రజల్ని, బ్యాంకుల్ని గందరగోళ పరుస్తుంది. ఏటిఎం ద్వారా, బ్యాంక్‌ల ద్వారా చెల్లింపుల విషయంలో ఇప్పటి వరకు 148కి పైగా ఉత్తర్వులు ఇచ్చినట్లు తెలిసింది. మూడు నెలలు దాటినా స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, తెనాలి బ్రాంచ్ ఇప్పటికీ సరిపడా పైకం పోస్టాఫీసు లాంటి సంస్థలకు పంపడం లేదు.

తమ తప్పుడు చర్యను కప్పిపుచ్చుకోవడానికి నగదు రహిత లావాదేవీలు అని విపరీతంగా ప్రచారం చేస్తుంది నరేంద్ర మోడీ ప్రభుత్వం. ఈ నగదు రహిత లావాదేవీలతో అవినీతి పూర్తిగా అంతం చేయవచ్చునని భారీ ఎత్తున ప్రచారం చేస్తుంది. ఈ నగదు రహిత లావాదేవీలు నరేంద్రుల వారికి వారి బృందానికి గత రెండు సంవత్సరాల ఎనిమిది నెలల నుండి తెలియదా? అదే నిజమైతే ఈ లావాదేవీల ప్రచారం అప్పటి నుండి జరుపవచ్చు గదా? ఈ నోట్లరద్దు చేయనవసరమే లేకుండా నల్లడబ్బు సంగతి పక్కన పెట్టి అవినీతి రహితం చేయవచ్చు కదా? ఈ నగదు రహిత లావాదేవీలు క్రెడిట్ కార్డులు, డెబిట్ కార్డులు, పేటిఎంలు, ఈ షాపింగ్ స్వైపింగ్ యంత్రాలు, రకరకాల సెల్‌ఫోన్ యాప్‌ల ద్వారా ఈ నగదు రహిత కార్యక్రమాలు కొనసాగించ వచ్చని ఈ నరేంద్రమోడీ కంపెనీ తమ ప్రచార సాధనాల ద్వారా ఊదర గొడుతోంది. గత 70 సంవత్సరాల నుండి ప్రజల అక్షరాస్యత గురించి పట్టించుకోని ఈ ప్రభుత్వం దాదాపు 40 శాతం నిరక్షరాస్యులుగా ఉన్న ప్రజలు నగదు రహిత లావాదేవీలు చేయాలని చెప్పడం నూటికి నూరు శాతం విడ్డూరమే.

ఈ నరేంద్ర మోడీ చర్యకు గత డెబ్బై రోజుల నుండి అనుకూలంగా కొందరు, ప్రతికూలంగా కొందరు ఇచ్చే ప్రకటనలను పరిశీలించవలసి ఉన్నది. ముఖ్యంగా నరేంద్రమోడీ చర్యను అరుణ్‌జైట్లీ, వెంకయ్య నాయుడు, రాజ్‌నాథ్‌సింగ్, అమిత్‌షాలు తమకున్న పరిజ్ఞానంతో రోజుకు ఒక ప్రకటన చేస్తూ ప్రజల్ని మభ్య పెడుతున్నారు. "మోడీ చర్య దేశానికి మేలు బాట. దేశ ప్రగతికి మోడీ కంకణం. మోడీకి పేరు వస్తే ఓర్వలేని కాంగ్రెస్ నల్లధనంపై పోరాడదండి, నల్లధనం దేశాన్ని నాశనం చేసింది. డిజిటల్ లావాదేవీలకు ప్రజలు తోడ్పడాలి. ప్రస్తుతం నగదు రహిత లావాదేవీలు 34 శాతం. మార్చి నాటికి 70 శాతం. నోట్ల రద్దు ఇబ్బందులు కొన్నాళ్లు. ఇంకో యాభై రోజులు ఆగండి. పెద్ద నోట్ల రద్దు పరిష్కారం వస్తుంది. నగదు రహితం బహుజన ప్రయోజనం. నగదు రహితం సర్వజన నినాదం – బ్యాంకుల్లో వేసిన డబ్బంతా చట్టబద్ధమై పోదు. నగదు రహిత పథకంలో మా ఊరు ఎంటిఎంకు చరవాణి చూపిస్తే డబ్బులొస్తాయి. బొటన వ్రేలే బ్యాంకు. ఆన్‌లైన్‌లో అవినీతి రహితం. పెద్ద నోట్ల రద్దు ఓ విప్లవాత్మకమైన చర్య. పెద్ద నోట్ల రద్దు శుద్ధీకరణ యజ్ఞం. ఈ యుద్ధం ఆగదు. అదిగో డిజిటల్ లోకం. పెద్ద నోట్ల రద్దు అవినీతిపై ఆయుధం. రెండు నెలలు తిరగకముందే ఫలితమిస్తున్న పెద్దనోట్ల రద్దు. నల్లధన ఆరాధకుల నుండే వ్యతిరేకత. నగదు రహిత లావాదేవీలపై అవగాహన అవసరం. పెద్ద నోట్లపై కాసుల వర్షం. ఆర్థిక వ్యవస్థ మందగించలేదు." ఇలా ఇవి అన్ని ప్రచార ఆర్భాటాలు తప్ప దీని వలన ప్రయోజనం శూన్యం. ఇప్పటికైనా చేసిన తప్పు కప్పిపుచ్చ ప్రయత్నించవద్దు. ఒప్పుకోండి.

ఇక ప్రతిపక్షాలు, ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీలు ఈ ప్రజా వ్యతిరేక పరిస్థితిని సరిగా ఉపయోగించుకోలేదు. చిన్న చిన్న ప్రకటనలతో సరిపుచ్చుకున్నారు – "తప్పనిసరి చిల్లర కష్టాలు. పెద్ద నోట్ల రద్దుతో కార్పోరేట్ కంపెనీలకు పెద్ద పీట.. నగదుపై ఇప్పటికీ ఆంక్షలు. నోట్ల జాగు – ఇక్కట్ల సాగు. నగదు రహిత లావాదేవీలపై బాదుడు. నగదు రహిత లావాదేవీలు జరుపుటకు కావలసిన యంత్రాలకు కొన్ని వేల కోట్ల విదేశీ మారక ద్రవ్యం అవసరం. ఇప్పటికీ కొంత ఖర్చు చేశారు". ఇటువంటి ప్రకటనలతోనే సరిపుచ్చుకున్నారు. కనీసం ఊరేగింపులు, బహిరంగ సభలు ఏర్పాటు చేసి వాస్తవాలను ప్రజలకు చెప్పి కనీస పోరాట కార్యక్రమాలు చేపట్టకపోవడం విచారించవలసిన విషయం. ఇప్పటికీ మించిపోయింది లేదు. ఈ నోట్ల రద్దును వ్యతిరేకించే రాజకీయ పార్టీలు, కార్మిక వర్గం, వివిధ సంస్థలు కలిసి ఉద్యమించాలి.

బ్యాంకు ఖాతాల్లో రావలసిన జీతభత్యాలు పూర్తిగా జమ చేసి అవసరానికి కావలసిన డబ్బు ఇవ్వని ఈ ప్రభుత్వ చర్యను ఏమనాలి? ప్రజలు తమ అవసరాల నిమిత్తం బ్యాంకులో వేసుకొని తమకు కావలసినప్పుడు ఆ డబ్బు ఇవ్వని ఈ యంత్రాంగాన్ని ఏమనాలి? బ్యాంకుల వద్ద, ఏటిఎంల వద్ద బారులుతీరి గంటల తరబడి వేచి ఉండి కావలసిన డబ్బు పొందలేక, కొందరు డబ్బు లేక తిరిగి వెళ్లడానికి కారణమైన ఈ చర్యని ఏమనాలి? బ్యాంకుల వద్ద, ఏటిఎంల వద్ద క్యూలలో నిలుచొని, ఎక్కువసేపు నిలబడలేక మరణించిన వారి మరణాలకు కారణమైన ఈ చర్యను ఏమనాలి? రైతు విత్తనాలకు, ఎరువులకు బ్యాంకుల నుండి తాము దాచుకున్న డబ్బు అందక పనులు చేయలేని పరిస్థితికి కారణమైన ఈ చర్యను ఏమనాలి?

వివాహాలకు (ముహూర్తం నిర్ణయించుకున్నవారు) బ్యాంకుల నుండి, పోస్ట్ ఆఫీసుల నుండి తాము దాచుకున్న డబ్బు అందక బాధపడ్డ వారికి కారణమైన ఈ చర్యను ఏమనాలి? సందట్లో సడేమియా అని ఈ అవకాశాన్ని వినియోగించుకొని లక్షలకు లక్షలు ఆర్జించిన వారు ఉండడానికి కారణమైన ఈ చర్యను ఏమనాలి? మరణించినప్పుడు చేయు కర్మకాండలకు బ్యాంకు నుండి డబ్బు అందని పరిస్థితులకు కారణమైన ఈ చర్యను ఏమనాలి?

ముఖ్యంగా తెలుసుకోవలసింది ఇది పెట్టుబడిదారీ వ్యవస్థ. ఈ వ్యవస్థ మనుగడలో ఉన్నంతకాలం నల్లడబ్బు రద్దు చేయడం, రూపుమాపడం నరేంద్ర మోడీ లాంటి వారు వందమంది వచ్చినా, వారు రకరకాల చర్యలు చేపట్టినా సాధ్యం కాదు. నల్లడబ్బు పెట్టుబడిదారుల ముద్దు బిడ్డ. రాజకీయ నాయకుల మానస పుత్రిక. బడా వ్యాపారుల ఆత్మబంధువు. వారితోనే ఈ వ్యవస్థ నడుస్తుంది. వారి కోరలు పీకకుండా నల్లడబ్బు నిర్మూలించబడదు. వారికి, వారి ఉన్నతికి, వారి కార్యక్రమాలకు కొమ్ముకాసే ఈ ప్రభుత్వం చేయు నల్లడబ్బు నిర్మూలనా కార్యక్రమం ఒట్టిమాట. దేశంలో ఉన్న నల్లడబ్బు నిర్మూలనకు నరేంద్రమోడీ చేపట్టిన కార్యక్రమం తమకు పూర్తి వ్యతిరేక ఫలితాన్ని ఇచ్చింది కదా? ఇక ఇతర దేశాలలో ఉన్న నల్లడబ్బును గురించి (దేశంలోని నల్లడబ్బు కంటే నాలుగు రెట్లు ఎక్కువట) ప్రస్తుతం మోడీ, ఆయన కంపెనీ ప్రస్తుతం మాట్లాడకపోవచ్చు. ఈ ప్రభుత్వం, పాలకవర్గాలు, ఈ వ్యవస్థ పూర్తిగా మారి సోషలిస్టు వ్యవస్థ, కమ్యూనిస్టు వ్యవస్థ రానిదే నల్లడబ్బు, అవినీతి అంతం కావు. ప్రజలు నూతన వ్యవస్థ నిర్మాతలు. వ్యవస్థను మార్చి నల్లడబ్బును నిర్మూలించాలి. అవినీతిని అంతం చేయాలి.

*(రచయిత రిటైర్డ్ పోస్ట్ మాస్టర్)* వీ

# నోట్ల రద్దు - కొన్ని రహస్య కోణాలు

***నరేంద్ర మోడీ తీసుకున్న నోట్ల రద్దు నిర్ణయం వెనుక ప్రకటించని రహస్య లక్ష్యాలు ఉన్నాయంటూ, వాటిలో కొన్నింటిని ఆధారాలతో సహా వివరిస్తున్నారు* లోక సంచారి**

నోట్ల రద్దు తర్వాత రోజున (నవంబర్ 9న) దేశ వ్యాప్తంగా అన్ని ఆంగ్ల పత్రికలలో మొదటి పేజీ మొత్తం 'పేటిఎం' కంపెనీ ప్రకటన వెలువడింది. ఈ ప్రకటనలో కేవలం ప్రధాన మంత్రి ఫోటో, దాని కింద ఒక వాక్యం ఉంది. 'నోట్ల రద్దు ద్వారా స్వతంత్ర భారత చరిత్రలో అతి గొప్ప నిర్ణయం తీసుకున్న మీకు జేజేలు' అని ఆ వాక్యం. ఈ ప్రకటన చూడగానే నాలో రకరకాల ప్రశ్నలు మొదలయ్యాయి.

పేటిఎం అనే ఒక స్టార్టప్ కంపెనీ కనీసంగా 50 కోట్లు ఖర్చు చేస్తూ మోడీని, నోట్ల రద్దు నిర్ణయాన్ని పొగుడుతూ ప్రకటన ఇవ్వడం వలన ఆ కంపెనీకి ఏమి ప్రయోజనం? పేటిఎం కంపెనీకి నోట్ల రద్దు వలన ఏదైనా లాభం ఉందా?

ప్రధాన మంత్రి నోట్ల రద్దును ప్రకటిస్తూ చేసిన ప్రసంగం రాత్రి 9 గంటలకు ముగిసింది. పత్రికలు రాత్రి ఒంటిగంట ప్రాంతంలో ముద్రించబడుతాయి. ముద్రణకు కనీసం గంట ముందు పత్రిక ఫైనల్ డిజైన్ తయారవుతుంది. అంటే కేవలం మూడు గంటలలోనే యాభై కోట్లు పైబడి ఖర్చు అయ్యే ప్రకటనను ఇవ్వడానికి ఒక స్టార్టప్ కంపెనీ అయిన పేటిఎం ఎలా నిర్ణయం తీసుకోగలిగింది? తమ ఫుల్‌పేజీ ప్రకటనను ఎప్పుడు డిజైన్ చేశారు? ప్రైవేట్ కంపెనీలు ప్రధానమంత్రి ఫోటోను ప్రకటనలో వాడుకోవాలంటే ఏకంగా ప్రధానమంత్రి కార్యాలయం నుండి అనుమతి రావాలి. ఈ మూడు గంటల్లోనే ఒక మామూలు స్టార్టప్ కంపెనీ ఆ అనుమతిని ఎలా సాధించింది? ఒకవేళ అనుమతి ఇచ్చి ఉంటే, అంత ఆఘమేఘాల మీద ఒక స్టార్టప్ కంపెనీకి ప్రధాన మంత్రి ఫోటోను వాడుకోవడానికి అనుమతి ఎందుకు ఇచ్చారు? (ఒకవేళ అనుమతి ఇవ్వకపోతే, తర్వాత రోజుల్లో ఆ కంపెనీపై చట్ట ఉల్లంఘన చర్యలు ఎందుకు తీసుకోలేదు?) ఈ మూడు, నాలుగు గంటలలోనే ఇన్ని సంక్లిష్ట పనులు జరగడం అసంభవం. ఆ కంపెనీకి నోట్ల రద్దు జరగబోతుందనే విషయం ముందస్తుగా తెలిసి ఉంటేనే ఇన్ని రకాల పనులు జరుగుతాయి అని అనుమానం నాకు కలిగింది. దాంతో, అసలు పేటిఎం కంపెనీ చరిత్ర తెలుసుకోవాలనే ఆసక్తి కలిగింది. విజయ్ శర్మ అనే భారతీయుడు ఈ స్టార్టప్ కంపెనీ స్థాపించినప్పటికీ, పెట్టుబడి అవసరాల రీత్యా అతను కంపెనీ వాటాను విదేశీ ద్రవ్య పెట్టుబడిదారులకు విడతలుగా అమ్ముతూ వస్తూ, ఇప్పుడు తానే ఒక మైనార్టీ షేర్ హోల్డర్‌గా మారాడు. పేటిఎం కంపెనీ డిజిటల్ పేమెంట్స్ రంగంలో ఉంది. అంటే పేటిఎం యాప్‌ను డౌన్‌లోడ్ చేసుకొని మొబైల్ ద్వారా మనం చెల్లింపులు చేయవచ్చు. దాన్ని 'డిజిటల్ మనీ' అని అనవచ్చు. అంటే నోట్ల రద్దు జరిగింది ప్రధాన మంత్రి ప్రకటించిన ఆ మూడు కారణాల కొరకు కాదు, ఆ నిర్ణయం డిజిటల్ పేమెంట్స్ వైపు ప్రజలను నెట్టడానికి అని అర్థం అయింది. మరి అరిగిపోయిన గ్రామ్‌ఫోన్ రికార్డ్‌లా ఆ మూడు కారణాలు (నల్లధనం, దొంగ నోట్లను అరికట్టడం, ఉగ్రవాదుల ఆర్థిక వనరులను దెబ్బ కొట్టడం) మాత్రమే పాలక వర్గం అంతగా ఎందుకు ప్రచారం చేసింది? అదో ఎత్తుగడ. తాము సాధించాలనుకుంటున్న రహస్య లక్ష్యాలు ప్రజలకు అర్థం కాకుండా ఉండాలంటే, ప్రజల దృష్టిని ఈ రహస్య లక్ష్యాలకు ఏమాత్రం సంబంధం లేని అంశాలను సృష్టించి అటువైపు మరల్చాలి. ఇది కొత్తగా కనిపెట్టబడ్డ ఎత్తుగడ ఏమీ కాదు. 1990 - 91 లల్లో విదేశీ ద్రవ్య నిలువల (బ్యాలెన్స్ ఆఫ్ పేమెంట్స్) సంక్షోభం అని సృష్టించి ప్రజల దృష్టిని అటు మరల్చి, విదేశీ పాలకులు వెళ్లిపోయారని 1947 నుండి నమ్ముతూ వస్తున్న భారత ప్రజలపై ప్రపంచీకరణ పేరుతో మళ్లీ విదేశీ పాలనను (ఈ సారి పరోక్షంగా) మన మీద రుద్దారు. రహస్య లక్ష్యాలను సాధించడానికి, శత్రువు దృష్టిని ఏమాత్రం సంబంధం లేని అంశాల వైపు దృష్టి మరల్చడం రాజకీయాల్లో, మిలటరీలో, వ్యాపారాల్లో ఉంది. వ్యాపారంలో దీన్ని 'రెడ్ హెర్రింగ్' అంటారు. మిలటరీలో దీన్ని 'డి కాయ్' అంటారు.

మార్క్సిస్ట్ దృక్కోణం ఉన్న ఎవరికైనా పాలక వర్గాలు తమ శత్రువులైన ప్రజల పట్ల ఇలాంటి 'డి కాయ్ ఆపరేషన్స్' తరుచుగా ప్రయోగిస్తుంటారని స్పష్టంగా తెలుసు. అందుకే నోట్ల రద్దు ప్రకటించినప్పుడు భారత ప్రభుత్వం చెప్పిన మూడు కారణాలు కేవలం దృష్టి మరల్చడానికి మాత్రమేనని, అసలు రహస్య కారణాలు వేరే ఉన్నాయని, మార్క్సిస్టు దృక్కోణంతో ఆలోచించే వారికి నోట్ల రద్దు ప్రకటించిన మొదటి గంటలోనే అర్థం అయింది. కాకపోతే, ఆ రహస్య లక్ష్యాలు ఏమిటి అనే విషయం అర్థం కావడానికి కొంత సమయం పడుతుంది. ఎందుకంటే, దానికి సూక్ష్మ వివరాలు అవసరమవుతాయి. అయితే, భారత పాలక వర్గాలు ఎంత తెలివిమాలిన పాలక వర్గాలంటే (పాశ్చాత్య పాలక వర్గాలతో పోల్చినప్పుడు) చాలా తొందరగానే వారు తమ రహస్య లక్ష్యాలు పరిశోధకులకు అర్థం అయ్యేట్టుగా ప్రవర్తించారు. పెట్టుబడిదారీ వ్యవస్థలున్న దేశాల్లో పాలక వర్గాలు ఇంత దద్దమ్మల్లా ప్రవర్తించరు. ఇది కేవలం ఫ్యూడల్ వ్యవస్థ ఉన్న భారతదేశ పాలక వర్గాలకే సాధ్యం. నవంబర్ 9 నాటి పేటిఎం ప్రకటన చూడగానే మొదలైన పరిశోధనతో అదే రోజు నాకు అర్థం అయింది ఏమంటే నోట్ల రద్దు రహస్య లక్ష్యం అశేష భారత ప్రజానీకాన్ని 'డిజిటల్ పేమెంట్స్' (నగదుతో కాకుండా ఎలక్ట్రానిక్‌గా చెల్లింపులు చేయడం) వైపు నెట్టడానికొరకు. అయితే, ఈ రహస్య లక్ష్యం ఇంత అకస్మాత్తుగా, ఇంత క్రూరంగా ఎందుకు అమలు

చేయాలనుకుంటున్నారని నాలో ప్రశ్నలు కలిగి, దానిపై పరిశోధన మొదలు పెట్టాను. నగదు – ఆధారిత లావాదేవీలకు బదులుగా 'డిజిటల్ –చెల్లింపుల' వైపు ప్రజలను నెట్టడం వలన కార్పొరేట్ కంపెనీలకు మాత్రమే లాభం, ప్రజలకు కాదు. మరీ ముఖ్యంగా బహుళజాతి ద్రవ్య పెట్టుబడి సంస్థలకు మరింత లాభం, ఎందుకంటే డిజిటల్ చెల్లింపుల రంగంలో ఉన్న అన్ని బడా కంపెనీలను, స్టార్టప్ కంపెనీలను ఇవి తమ పెట్టుబడుల ద్వారా తమ ఆధీనంలోకి తీసుకున్నాయి. డిజిటల్ చెల్లింపుల రంగంలోని అత్యంత లాభదాయకమైన 'మొబైల్ వ్యాలెట్' అనే ఉప రంగంలో 95 శాతం భారత మార్కెట్‌ను కేవలం మూడు కంపెనీలు ఆక్రమించుకున్నాయి. ఇందులో అతి పెద్దది పేటీఎం. దీనికంటే చిన్నది ఫ్రీచార్జ్. 3వ స్థానంలో మోబీక్విక్. ఈ మూడింటి వ్యవస్థాపకులు భారతీయులే అయినప్పటికీ, పెట్టుబడి అవసరాల రీత్యా విడతలుగా వారు తమ వాటాను అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడిదారీ సంస్థలకు (వీటిని వెంచర్ క్యాపిటల్ సంస్థలని, పెద్ద స్థాయి పెట్టుబడులు పెట్టే వాటిని ప్రైవేట్ ఈక్విటీ సంస్థలని అంటారు) అమ్మేశారు. బయటకు భారతీయుల పేర్లే కనబడుతాయి కాని వారి వాటా ఐదు నుండి ఇరవై శాతంకు మించదు. అందుకే విదేశీ వాటా దారులు ఒకవేళ ఏదైనా స్టార్టప్ కంపెనీ (భారత) వ్యవస్థాపకుడు తమ అంచనాలకు అనుగుణంగా పని చేయడం లేదనుకుంటే అతన్ని సిఇఒ పదవి నుండి తీసివేసి తమకు ఇష్టమైన వాన్ని ఆ స్థానంలో పెడతారు.

అంటే, భారత డిజిటల్ పేమెంట్స్ రంగం విదేశీ ద్రవ్య పెట్టుబడి దారుల చేతుల్లోకి దాదాపుగా వెళ్లిపోయినట్లే. అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడిదారులలో ప్రముఖుడైన 'రోత్‌షిల్డ్' గతంలో ఒక మాట అన్నాడు. 'ఒక దేశ ద్రవ్య చలామణి నా కంట్రోల్‌లో ఉంటే, చట్టాలు ఎవరు చేస్తారు అనేది నాకు అనవసరం.' అంటే, ఇప్పుడు భారతదేశ పరిస్థితి నోట్ల రద్దు తర్వాత ఏ స్థాయికి వచ్చిందంటే, 'ప్రజాస్వామ్యం', 'ప్రజా ప్రతినిధుల' పేరు మీద అసెంబ్లీ, పార్లమెంట్ భవనాలు ఉంటాయి. చట్టాలు చేస్తుంటారు. ఆర్‌బిఐ కూడా అలానే ఉంటుంది. దానికి గవర్నర్‌గా ఒక 'భారతీయుడు' ఉంటాడు. ఆర్‌బిఐ ప్రతి సంవత్సరం ఎంత ద్రవ్య చలామణి అవసరమో అంత ద్రవ్యంను మార్కెట్లోకి వదులుతుంది. కాని ఈ ద్రవ్యం అంతా విదేశీ ద్రవ్య పెట్టుబడిదారుల గుప్పిట్లో ఉన్న కార్పొరేట్ కంపెనీల ద్వారా మార్కెట్లో చలామణి అవుతూ, అప్పనంగా వారికి వేలాది కోట్ల లాభాలు చేకూరుస్తూ ఉంటుంది. ప్రభుత్వంలో కాంగ్రెస్ ఉందా బిజెపి ఉందా, కమ్యూనిస్ట్ పార్టీ ఉందా వారికి అనవసరం. ద్రవ్య చలామణి తమ కంట్రోల్‌లో ఉందా, లేదా అనేదే వారికి ముఖ్యం.

'భారతీయత', 'స్వదేశీ'ల గురించి ప్రచారం చేసే ఆర్‌ఎస్‌ఎస్, దాని పుత్రిక అయిన బిజెపి, ఆర్థిక వ్యవస్థకు గుండెకాయ లాంటి ద్రవ్య చలామణిని విదేశీ ద్రవ్య పెట్టుబడిదారుల చేతుల్లో పెట్టాయి.

### నోట్ల రద్దుకు-అప్పు ఎగవేతదారులకు సంబంధం ఏమిటి?

నా పరిశోధన ఇలా నడుస్తుండగానే, 2016 డిసెంబర్ 13న 'ఎకనామిక్ టైమ్స్' అనే ఆంగ్ల బిజినెస్ దిన పత్రికలో కె.వి. కామత్ ఇంటర్వ్యూ వచ్చింది. ఇంటర్వ్యూ చేసిన జర్నలిస్ట్ నోట్ల రద్దు వలన ప్రయోజనాలు ఏమిటో చెప్పమని అడిగిన ప్రశ్నకు అతను ఇచ్చిన సమాధానం రహస్య లక్ష్యాలల్లో ఒక దాన్ని చాలా స్పష్టంగా చూపుతుంది. 'బ్యాంకుల రిక్యాపిటలైజేషన్ సమస్యను ఎలా తీర్చాలనే ప్రశ్నకు నోట్ల రద్దు చర్య శాశ్వతంగా సమాధానం ఇస్తుంది' అని అతని సమాధానం చదవగానే ఆశ్చర్యానికి గురయ్యాను. కె.వి. కామత్ అల్లాటప్పా వ్యక్తి కాదు. ఐసిఐసిఐ బ్యాంక్ వ్యవస్థాపకుడు. భారత ప్రైవేట్ బ్యాంకింగ్ రంగంలో దిగ్గజం. ఎన్నో బడా కార్పొరేట్ కంపెనీలకు డైరెక్టర్, సలహదారు. బ్రిక్స్ దేశాలన్ని కలిసి 'న్యూ డెవలప్‌మెంట్ బ్యాంక్'ను స్థాపించుకున్నప్పుడు, దాని అధిపతిని నియమించే అవకాశం మొదటగా భారతదేశానికి లభిస్తే, భారత ప్రభుత్వం కె.వి. కామత్‌ను దానికి అధిపతిగా పంపించింది. అంత ప్రాముఖ్యత కలిగిన వ్యక్తి, భారత ప్రభుత్వం నోట్ల రద్దుకు చూపిన మూడు కారణాలకు ఏ మాత్రం సంబంధం లేని కోణాన్ని నోట్ల రద్దు వలన కలిగే ప్రయోజనంగా చూపడం అత్యంత ప్రాముఖ్యత కలిగిన అంశంగా పరిగణించాలి. అందుకే వెంటనే, బ్యాంకుల రిక్యాపిటలైజేషన్ సమస్యకు నోట్ల రద్దుకు సంబంధంపై పరిశోధన మొదలు పెట్టాను.

### బ్యాంకుల రిక్యాపిటలైజేషన్

రిక్యాపిటలైజేషన్ అంటే పునర్ పెట్టుబడీకరణ. బ్యాంకుల పునర్ పెట్టుబడీకరణ అంటే బ్యాంకుల వద్ద భవిష్యత్ వ్యాపారానికి (బ్యాంకుల వ్యాపారం అప్పులు ఇవ్వడం) కావలసిన పెట్టబడులు లేవు. కావున బ్యాంకులకు తిరిగి పెట్టుబడి సమకూర్చడంను బ్యాంకుల పునర్ పెట్టుబడీకరణ అంటారు. మరి బ్యాంకుల వద్ద పెట్టుబడి ఎందుకు లేదు? ఎందుకంటే, బ్యాంకుల వద్ద అప్పులు తీసుకున్న టాటా, బిర్లా, అంబానీ, ఆదానీ, విజయ్ మాల్యా, ఎస్సార్ లాంటి బడా కార్పొరేట్ కంపెనీలు గడువు దాటినా తమ బాకీని తీర్చడం లేదు. కనీసం వడ్డీ కూడా కట్టడం ఆపివేసిన కంపెనీలు కూడా ఉన్నాయి. మొత్తం కార్పొరేట్ కంపెనీలు ఎగవేసిన అప్పులు కనీసంగా పదకొండు లక్షల కోట్ల రూపాయలుగా ఉంటుందని అంచనా. కార్పొరేట్ కంపెనీల మొండి బకాయిలు (ఎన్‌పిఎలు) మొత్తం అన్ని బ్యాంకులవి కలిపి ఎన్ని ఉంటాయో చెప్పమని సుప్రీంకోర్టు అడిగితే, ఆర్‌బిఐ ప్రతినిధి సుప్రీంకోర్టులో నిలబడి 'ఈ విషయం చెపితే ప్రజలకు బ్యాంకింగ్ వ్యవస్థపై నమ్మకం పోతుంది' అని అన్నాడంటే మొండి బకాయిల (ఎగ్గొట్టిన అప్పులు అంటే బాగుంటుంది) పరిమాణం ఏ స్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు.

అన్ని రాజకీయ పార్టీలకు వేల కోట్ల నిధులు ఇస్తూ వాటిని పోషించే వారు ఈ కార్పొరేట్ కంపెనీల యజమానులే కాబట్టి వారిపై చర్యలు తీసుకునే ధైర్యం భారత ప్రభుత్వానికి లేదు. అంటే పేద, మధ్యతరగతి ప్రజలు తమ కష్టార్జితాన్ని బ్యాంకుల్లో డిపాజిట్ల రూపకంలో పొదుపు చేసుకుంటే, ఆ డబ్బును బ్యాంకులు కార్పొరేట్ కంపెనీలకు అప్పుగా ఇచ్చి, వారు ఎగవేస్తే ప్రజల సొమ్మే కదా పోతేపోని అని మౌనంగా ఉన్నాయి. దాంతో బ్యాంకుల వద్ద తమ భవిష్యత్ వ్యాపార అవసరాలకు సరిపడా పెట్టుబడి లేకుండా పోయింది.

ఇంతలో బాసెల్–III నిబంధనల డెడ్‌లైన్ దగ్గర పడింది. స్విట్జర్లాండ్‌లోని బాసెల్ పట్టణ కేంద్రంగా పనిచేసే 'బ్యాంక్ ఫర్

ఇంటర్నేషనల్ సెటిల్‌మెంట్' అనే అంతర్జాతీయ సంస్థలో భారతదేశం కూడా ఒక సభ్యురాలు. వివిధ స్థాయి సంక్షోభాలల్లో ఆర్థిక వ్యవస్థకు గుండెకాయ లాంటి బ్యాంకులు కూలిపోకుండా తట్టుకొని నిలబడడానికి కొన్ని నిబంధనలు సభ్య దేశాలు అందరు కలిసి తయారు చేశారు. దాంట్లో భాగంగా మార్చ్ 2019 నాటికి బాసెల్ - III నిబంధనలు అమలు చేయాలి. ఈ నిబంధనల ప్రకారం సభ్య దేశాలలో ఉన్న ప్రతి బ్యాంకు వద్ద తప్పనిసరి ఎల్లవేళలా కొంత శాతం నగదు రిజర్వులు ఉండాలి. దీన్ని ఎట్టి పరిస్థితులలో కూడా వాడకూడదు. ఈ నిబంధనల ప్రకారం అవసరమయ్యే నిధులు భారతదేశంలోని బ్యాంకుల వద్ద లేవు. ఎందుకంటే కార్పొరేట్ కంపెనీలు తమ బకాయిలను కట్టడం లేదు కాబట్టి. ఒకవేళ మార్చ్ 2019 నాటికి భారత బ్యాంకులు బాసెల్ -III నిబంధనలు పాటించకపోతే, అప్పుడు వాటికి నాన్-కంప్లాయంట్ (నిబంధనలు అతిక్రమించిన) బ్యాంకులుగా ముద్ర పడుతుంది. దాంతో అంతర్జాతీయ రేటింగ్ ఏజన్సీలు ఆ బ్యాంకులకు 'జంక్ స్టేటస్' (చెత్త బ్యాంకులని) ఇస్తాయి. దాంతో ఆ బ్యాంకుల షేర్లు ఏ సంస్థ కొనదు, కొన్న సంస్థలు వాటిని వదిలించుకుంటాయి. దాంతో భారత బ్యాంకులు కుప్పకూలిపోయి, ఆర్థిక వ్యవస్థ అల్లకల్లోలంగా తయారయి, విదేశీ పెట్టుబడులు పారిపోతాయి. నవంబర్ నుండి లెక్కవేస్తే కేవలం 26 నెలలలోనే ఇలాంటి సంక్షోభం రాబోతుంది.

బాసెల్-III నిబంధనలు సంతృప్తి పరచడానికి అడ్డంకిగా ఉన్న కార్పొరేట్ కంపెనీల బకాయిలను, ఆయా కంపెనీల ఆస్థులను జప్తు చేయడం ద్వారా పరిష్కరించవచ్చు. కాని ప్రభుత్వాలను ఆ కార్పొరేట్ కంపెనీలే నడుపుతున్నందున వాటి ఆస్తులు జప్తు చేయకుండా, నోట్ల రద్దు ద్వారా ప్రజల సొమ్మును జప్తు చేశారు. అంటే, ప్రజలు తమ కష్టార్జితాన్ని డిపాజిట్ల రూపంలో బ్యాంకుల్లో పొదుపు చేస్తే, ఆ సొమ్మును కార్పొరేట్ కంపెనీలకు అప్పులిచ్చి, వారు ఎగవేస్తే, ఆ కంపెనీల ఆస్థులను స్వాధీనం చేసుకోకుండా, బ్యాంకులకు పడిన ఆ బొక్కను నోట్ల రద్దు చర్య ద్వారా ప్రజల సొమ్మును స్వాధీనం చేసుకొని పూడ్చుతున్నారు. ప్రజలు ఎక్కువగా నగదు వాడకుండా రకరకాల నిబంధనలు విధించి, వీలైనంతగా డిజిటల్ చెల్లింపుల ద్వారానే లావాదేవీలు జరిగేట్టు చేయడం వలన బ్యాంకుల వద్ద నిరంతరాయంగా డిజిటల్ రూపంలో (మన డబ్బు మన వద్ద నగదు రూపంలో కాకుండా) ద్రవ్యం ఉంటుంది. దాంతో బ్యాంకులు బాసెల్-III నిబంధనలు సంతృప్తి పరుచగలుగుతాయి. ఇంకో వైపు కార్పొరేట్ కంపెనీలకు మళ్లీ అప్పులు ఇవ్వడానికి బ్యాంకుల వద్ద నిల్వలు ఉంటాయి. ఇదీ కె.వి. కామత్ అన్న మాటల వెనక ఉన్న రహస్యం. నోట్ల రద్దు వెనుక ఉన్న రహస్య లక్ష్యాలలో ప్రధానమైన వాటిలో ఇది ఒకటి.

నోట్ల రద్దుకు సంబంధించి వివిధ కోణాలు బయటకొస్తున్నాయి. అయితే ఏ కోణంను పరిశీలించినప్పటికీ మనకు అర్థమయ్యేది ఏమంటే, ఇది కేవలం కార్పొరేట్ కంపెనీలకు, విదేశీ పెట్టుబడిదారులకు మాత్రమే లాభం చేకూర్చేదనే విషయం స్పష్టం. కావున అన్ని కోణాలకు చెందిన విశ్లేషణలను లోతుగా పరిశీలించాలి. మొత్తంగా నోట్ల రద్దు పేరున ప్రజలను డిజిటల్ పేమెంట్స్ వైపు నెట్టడం ప్రజలపై తీవ్ర భారం. ఇది ప్రజలకు అనుభవ పూర్వకంగా అర్థం కావడానికి కనీసం 5 నుండి 10 సంవత్సరాలు పడుతుంది.

**కొసమెరుపు**

నోట్ల రద్దు నిర్ణయం అత్యంత రహస్యంగా జరిగిందని ప్రధాన మంత్రి, ఇతర మంత్రులు ఊదరగొట్టారు కదా! నిజానికి రు. 500, 1000 నోట్లు రద్దు కాబోతున్నాయనే రిపోర్టులను, ఊహాగానాలను ఉటంకిస్తూ స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాకు చెందిన చీఫ్ ఎకనామిక్ అడ్వైజర్ ఆధ్వర్యంలో నెలవారి ప్రచురితమయ్యే 'ఎకొవాచ్ రిపోర్ట్' మార్చ్ 2016లోనే ప్రచురించారు. రానున్న నోట్ల రద్దు వార్త ముందే తెలిసిన కొందరు వేలాది కోట్లలో బంగారం, నగలు కొంటున్నారని, బ్యాంకుల్లో మార్చుకుంటున్నారని, మార్చ్ 2016 నెలలోనే ఆ రిపోర్ట్‌లోని 8వ పేజీలో ప్రచురించారు. ఇంటర్నెట్‌లో ఆ రిపోర్ట్ మార్చ్ 2016 నుండే అందరికి లభ్యం అవుతున్నది. నాకు స్వయంగా తెలిసిన కొన్ని సంఘటనలు ఉన్నాయి. ఒకటి, మా బంధువు ఒకరు ఒక రాజకీయ నాయకునికి చెందిన ఇంజనీరింగ్ కళాశాలలో పనిచేస్తుంది. ప్రతినెల స్టాఫ్ జీతాలు బ్యాంక్ అకౌంట్‌లో వేసేవారు. కాని నవంబర్ నెలలో మాత్రం నోట్ల రద్దుకు ఐదు రోజుల ముందే అందరికి రు. 500, 1000 నోట్లతో నగదు రూపంలో జీతాలు ఇచ్చారు.

రెండవ సాక్ష్యం. నిజామాబాద్‌కు చెందిన ఒక బడా విద్యా సంస్థ (అందులో మాకు తెలిసినవారు పనిచేస్తారు) నోట్ల రద్దుకు నాలుగు రోజుల ముందు ప్రతి ఒక్క స్టాఫ్‌కు ఐదు నెలల జీతాన్ని ముందే రు. 500, 1000 నోట్ల ద్వారా ఇచ్చారు.

ఈ మూడవ విషయం మరీ ఆశ్చర్యం కలిగించేదిగా ఉంది. పెద్ద స్థాయిలో పరిచయాలున్న ఒకతను ఈ సంవత్సరం ఫిబ్రవరిలో జరిగిన విషయం చెప్పాడు. అతనికి తెలిసిన ఒక వ్యక్తి రెండు కోట్ల రూపాయల పాత నోట్లను ఆర్‌బిఐ ద్వారా కొత్త నోట్లలోకి మార్చుకున్నాడట. మన ఊహకు కూడా అందని అన్ని రకాల అక్రమాలు ప్రభుత్వ పరంగా జరుగుతున్నాయి. ఇదంతా ప్రజలకు తీవ్ర నష్టం కలిగించేవి.

వ్యక్తిగత ఆస్తులు రద్దు జరగనంత వరకు ఈ అక్రమాలు, అన్యాయాలు జరుగుతూనే ఉంటాయి. వ్యక్తిగత ఆస్థులను రద్దు చేసే సోషలిజపు వ్యవస్థ నిర్మించుకోవడమే ఏకైక పరిష్కారం.

*(రచయిత ఆర్థిక, వ్యాపార పరిశోధకుడు)* వీ

**రచయితలకు సూచన :** తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. - సం.

# నగదు రహిత ఆర్థిక వ్యవస్థ అసలు రహస్యాలు-2

***పెద్దనోట్ల రద్దుతో ప్రారంభించి నగదు రహిత ఆర్థిక వ్యవస్థ, డిజిటలైజేషన్ దాకా సాగుతున్న ప్రభుత్వ విధానాలను నిర్ణయించిన దెవరో, శాసిస్తున్నదెవరో, ఎవరి ప్రయోజనాలకో అసలు రహస్యాలను వివరిస్తున్నారు సాదుం శ్రీకాంత్***

*(గతవారం తరువాయి...)*

**మసాలా బాండ్స్:**

మన ఆర్థికశాఖ 2014-15 లో విడుదల చేసిన వార్షిక నివేదిక ప్రకారం 2013-14 ఆర్థిక సంవత్సరానికి గాను ఐఎఫ్‌సి భారత్‌లో ఫైనాన్షియల్ ఇంక్లూజన్ మౌలిక సాధన సంపత్తి కోసం 1.5 బిలియన్ డాలర్లు (రూ.9300 కోట్లు ) ను, 2014-15 లో 1 బిలియన్ డాలర్లు (రు: 6200 కోట్లు) పెట్టుబడి పెట్టింది. ఇవన్నీ అప్పులే. ఇందులో రు. 1000 కోట్లు దేశభక్తి లండన్ స్టాక్ ఎక్స్ చేంజిలో అమ్ముడుపోదు కాబట్టి ఐఎఫ్‌సి బాండుల రూపేణా సేకరించింది. వీటికి భారతీయ సంస్కృతికి అద్దంపట్టేలా 'మసాలా బాండుల'ని పేరు మాత్రం పెట్టి బేరంతో పాటు 'పుణ్యం' కూడా మూట కట్టుకుంది. ఊరికే ఇవ్వరు మహానుభావులు అన్నట్లు అప్పులతో పాటు కొన్ని సంస్కరణల వర్కుషాపులు కూడా నిర్వహించామని చెప్పుకుంది ప్రభుత్వం . దీని ప్రభావంతోనే 2016 డిసెంబర్ 21న మంత్రివర్గం నగదు రహిత జీతాలకి సంబంధించి ఒక కొత్త ఉత్తర్వును తీసుకొచ్చింది. ఆ ఉత్తర్వుతో రూ. 18000 లోపు జీతం గల కార్మికులు జీతాన్ని తమకు అనుకూలమైన రూపంలో (నగదు లేదా చెక్ మొదలైనవి) పొందే పేమెంట్ ఆఫ్ వేజెస్ అక్ట్ 1936 అనే కార్మిక హక్కుల చట్టాన్ని కాలరాయడం జరిగింది. మనుషులకు అక్కర్లేని ఇలాంటి మార్కెట్ చట్టాలు ముమ్మందు మరెన్నో మన ముందుకు రానున్నాయి.

కన్సల్టేటివ్ గ్రూప్ టు అసిస్ట్ ది పూర్ అనే సంస్థ తన అధ్యయనంలో, ఫైనాన్షియల్ ఇంక్లూజన్ అనేది బ్యాంకింగ్ ఆర్థిక పరిణామ క్రమంలో మైక్రో ఫైనాన్సుకి తరువాతి పరిణామ దశ అని స్పష్టంగా పేర్కొనింది. 'ట్రెండ్స్ ఇన్ ఇంటర్నేషనల్ ఫండింగ్స్ ఫర్ ఫైనాన్షియల్ ఇంక్లూజన్' అనే అధ్యయనంలో 2008 నుంచి 2015 వరకూ ఫైనాన్షియల్ ఇంక్లూజన్ ప్రచారం కోసం 54 మంది 'ధాతల' నుంచి సేకరించిన నిధుల వివరాలు పేర్కొన్నారు. ఆ నిధులు ఏ ఏ రంగంలో, ఏఏ దేశంలో ఎంతెంత మొత్తంలో ఖర్చు పెట్టారో వివరాలు అందులో ఉన్నాయి. 2015లో ప్రపంచం మొత్తంగా ప్రభుత్వ రంగ సంస్థలు 24.4 (72 శాతం) బిలియన్ డాలర్లను ఈ అజెండాకై ఖర్చు చేయగా, ప్రైవేట్ రంగ సంస్థలు 9.4 (28 శాతం) డాలర్లు ఖర్చు చేసినట్లు లెక్కలు చెబుతున్నాయి. ప్రభుత్వ రంగ సంస్థలు అప్పులు చేసి మరీ ఖర్చు పెడుతుంటే ప్రవేటు సంస్థలు మాత్రం కార్పొరేట్ సోషల్ రెస్పాన్సిబిలిటీ, కింద, స్వచ్ఛంద సంస్థల ముసుగేసుకుని విశాల హృదయాలై 'విరాళాల' రూపంలో ఖర్చు పెడుతున్నాయి. మన దేశానికి సంబంధించి ఇప్పటి వరకూ దాదాపు 1.3 బిలియన్ డాలర్లను ఖర్చుచేసే హామీలిచ్చినట్లు ఇందులో పేర్కొన్నారు. ఈ మొత్తం ఐఎఫ్‌సి ద్వారా అప్పురూపాన అంది ఉండే అవకాశముంది. ఇదివరకే చెప్పినట్లు మన ఆర్థిక శాఖ 2013-15లో ఐఎఫ్‌సి నుంచి తీసుకున్న అప్పును దేశంలో ఫైనాన్షియల్ ఇంక్లూజన్ కు అవసరమైన 'డిజిటల్' మౌలిక వసతుల ఏర్పాటుకై ఖర్చుపెట్టి ఉండవచ్చు. ఇలా పేద దేశాలకు అప్పులు అంటగట్టి తమకు కావలసిన మార్కెట్ సామ్రాజ్యాన్ని విస్తరించుకుంటున్న ప్రపంచ బ్యాంకు సేనలు పేరుకు మాత్రం 'పేదరిక నిర్మూలన' తమ లక్ష్యమని మహా ఆర్భాటంగా ప్రచారం చేసుకుంటున్నాయి. ఈ అప్పుల్ని తిరిగి చెల్లించడానికి అది రుద్దే 'రాజ్యాంగ సవరణలు' (స్ట్రక్చరల్ అడ్జస్ట్‌మెంట్స్), దేశాలని తాకట్టులో పెట్టుకుని కార్పొరేట్ బ్యాంకులకు అవి ఇచ్చే 'బెయిల్ అవుట్' ల గురించి మనం మరిచిపోయినా గ్రీస్, సైప్రస్, ఐస్లాండ్ వంటి దేశాలలో అవింకా నెత్తురోడుతున్న పచ్చి గాయాలే.

2015లో ఐటి కన్సల్టెన్సీ అక్సెంచర్ విడుదల చేసిన ఒక నివేదిక (బిలియన్ రీజన్స్ టు బ్యాంక్ ఇంక్లూజివ్‌లీ)లో ప్రపంచం మొత్తంగా 2020 కంతా ఒక్క వెనుకబడ్డ దేశాల నుంచే ఈ ఫైనాన్షియల్ ఇంక్లూజన్ అమలు చేసినట్లైతే బ్యాంకులు 380 బిలియన్ డాలర్ల (రు. 26 లక్షల కోట్లు) అదనపు వార్షికాదాయాన్ని పొందవచ్చని అంచనా వేసింది.

ఈ నివేదిక దక్షిణ ఆసియా దేశాలైన భారత్, పాకిస్తాన్, నేపాల్ లలో అత్యధికంగా 63 కోట్ల మందికి బ్యాంకింగ్ సేవలు అందడం లేదని తేల్చింది. అలాగే తూర్పు ఆసియా దేశాలైన చైనా, ఇండోనేషియా, వియత్నాం లాంటి దేశాలలో ఈ సంఖ్య 50 కోట్లు కాగా ఆఫ్రికాలో 34 కోట్ల మంది, లాటిన్ అమెరికా దేశాల్లో 20 కోట్ల మంది యూరోప్, మధ్య ఆసియాలో 17 కోట్ల మంది, పశ్చిమ ఆసియా, ఉత్తర ఆఫ్రికాలో 14 కోట్ల మంది, అమెరికాలో 2 కోట్ల మంది బ్యాంకింగ్ రంగానికి దూరంగా ఉంటున్నట్లు అంచనా వేసింది. ప్రపంచం మొత్తంగా ఈ సంఖ్య 200 కోట్లని అంచనా వేశారు. ఇదే మాటల్ని మనం ప్రపంచ బ్యాంకు అధినేత జిమ్ నోటివెంట తరుచుగా వింటుంటాం. దీని అసలు అర్థం ఏమిటంటే, ఇన్ని కోట్లమంది మార్కెట్ చక్రపు ఇరుసులో చిక్కుకుని లేరని, బైట ఉన్నారని పరోక్షంగా చెప్పడమే.

ఫైనాన్షియల్ ఇంక్లూజన్ వలన 12 దేశాలలో బ్యాంకులు పొందే వార్షికాదాయాన్ని కూడా ఈ నివేదిక అంచనా కట్టింది. అందులో బ్రెజిల్ 39 బిలియన్ డాలర్లతో అగ్రస్థానంలో ఉండగా 24.4 బిలియన్ డాలర్ల (1 లక్షా 50 వేల కోట్ల రూపాయలు) తో భారతదేశం తర్వాతి స్థానంలో నిలిచింది. 12.1 బిలియన్ డాలర్లతో మెక్సికో మూడవ స్థానాన్ని ఆక్రమించింది. ఇది కేవలం ప్రారంభం మాత్రమే. పోను పోను ఈ లెక్కలు ఆకాశాన్ని అంటుతాయి. ఇదే విషయాన్ని అంతర్జాతీయ బ్యాంకుల

కూటమి జులై 2016లో విడుదల చేసిన నివేదికలో వెల్లడించింది (ది బిజినెస్ ఆఫ్ ఫైనాన్షియల్ ఇంక్లూజన్: ఇన్సైట్స్ ఫ్రమ్ బాంక్స్ ఇన్ ఎమర్జింగ్ మార్కెట్స్)

కేర్, ఆక్సెంచర్ సంస్థలు సంయుక్తంగా 2015లో వెలువరించిన 'విథిన్ రీచ్' అనే మరో నివేదికలో పైన పేర్కొన్న లెక్కలనే నొక్కివక్కాణిస్తూ "ప్రస్తుత ఆర్థిక పరిస్థితుల్లో ఫైనాన్షియల్ ఇంక్లూజన్ వ్యాపార అనివార్యత అని, దాన్ని అందిపుచ్చుకుని (ఖాతాలలో) జమ చేసిన నగదు ను (వ్యాపారంలో) వినియోగించుకోవడం మినహా (బ్యాంకులకు) మరో గత్యంతరం లేదని, ఇక్కడే చవకైన ఆర్థిక వనరు అందుబాటులో ఉందని" ఒక బ్యాంకర్ అన్నట్లు పేర్కొనింది. ముఖ్యంగా మహిళలు తాము జమ చేసిన నిధులని ఎక్కువ కాలం అలాగే ఖాతాలలో ఉంచుతారని, పురుషుల కంటే మహిళలే అప్పు చెల్లింపుల విషయంలో నిజాయితీగా ఉంటారని కూడా ఆ నివేదికలో పేర్కొన్నాయి. ఈ రెండు నివేదికల్లో బ్యాంకులు తమ అజెండాని అమలుచేసే క్రమంలో తీసుకోవలసిన మార్గదర్శకాలని అనేక ఉదాహరణలతో సహా వివరించడం జరిగింది. అదేవిధంగా ఈ అజెండాని ఆయా దేశాలలోని సెంట్రల్ బ్యాంకుల ఎన్జీవోలు, ప్రపంచ బ్యాంకు సహకారంతో ఎలా ముందుకు తీసుకుపోతున్నాయో కూడా వివరించడం జరిగింది. ఈ విశ్లేషణలు, నివేదికలు, సూత్రీకరణలు ఎవరెన్ని చేసినప్పటికీ, వాటన్నిటికీ కూడా మౌలికంగా అవసరమయ్యే సమాచార వనరంతా ప్రపంచ బ్యాంకు అందజేయడం గమనించదగ్గ విషయం.

ఇప్పుడేవిధంగా ఐతే బడుగు దేశాలలో అతి తక్కువ ధరకే మానవ వనరులు (శ్రామికులు), ఖనిజ సంపద, సరుకులమ్ముకోడానికి అవసరమైన విస్తారమైన మార్కెట్ వనరులు లభ్యమవుతున్నాయో, అదేవిధంగా మున్ముందు అక్కడున్న అరకొర ఆర్థిక సంపద కూడా ఒక చవకైన వనరు కాబోతోందన్నమాట. ఆ వనరుకు ఎర వేసి పట్టే ఆర్థిక తీవ్రవాదం ఇది.

ఈ నివేదికల, అధ్యయనాల సారాంశం చూశాక అప్పటి వరకూ తమకు అక్కరకురాని 'పేదరికం' ఇప్పుడు వాళ్లకు అవసరమైందని తెలుతుంది. పోటీ ప్రపంచంలో వెనుకబడి ఓడిపోకుండా అదొక అనివార్యత కూడా. ప్రపంచ బ్యాంకు లెక్కల ప్రకారం అప్పటి వరకూ బ్యాంకర్లకు అందకుండా ఉన్న 200 కోట్ల ప్రజలపై, 'వెలివాడల'పై దోపిడీ వర్గానికి అమాంతం వల్లమాలిన ప్రేమ పుట్టుకువచ్చి బ్యాంకింగ్ తలుపులు తీయనున్నారు. అందరూ కలిసి దానికి ఫైనాన్షియల్ ఇంక్లూజన్ అనే ముద్దుపేరు పెట్టుకున్నారు. అందుకు కావలసిన ప్రణాళికను, దిశానిర్దేశాలను ప్రపంచబ్యాంకు తయారుచేసి, పేద దేశాలలో పాలకుల రూపంలో చలామణీ అవుతున్న తన దళారులకు ఆ పనిచేసి పెట్టమని పురమాయించింది. పిడికెడు దేశాల చెప్పు చేతుల్లో కీలుబొమ్మైన ప్రపంచ బ్యాంకు, ఐక్యరాజ్యసమితి, దాతలుగా చలామణీ అవుతున్న దోపిడీ దారుల దూతలైన ఎన్జీవోలు అందరూ కూడబలుక్కుని ఈ దోపిడీ కార్యాచరణ దిశగా అడుగులేస్తున్నారు.

మరోపక్క యూరప్ బ్యాంకులు దాదాపు 1.2 ట్రిలియన్ యూరోల మొండి బకాయి లతో అల్లాడుతున్నాయి. మన దేశంలోని బ్యాంకుల పరిస్థితి అందుకు భిన్నంగా ఏమీ లేదు. 2013-14 ఆర్థిక సంవత్సరానికి గాను రు. 234, 583 కోట్ల మొండి బకాయిలుంటే నేడది దాదాపు 6 లక్షల కోట్లకు చేరుకుంది. ఈ మొత్తం సొమ్ము బ్యాంకులు ఇచ్చిన మొత్తం అప్పులో 17 శాతం. పైపెచ్చు భారత దేశంలోని ప్రభుత్వ రంగ బ్యాంకులు 2013-15 ఆర్థిక సంవత్సరాలలో రు. 1 లక్షా 14 వేల కోట్ల వసూలుకాని మొండి బకాయిల్ని రద్దుచేసాయి. ఈ అప్పులు ఎగ్గొడుతున్న తిమింగలాలన్నీ అది ఇది అనకుండా అన్ని రాజకీయ పార్టీలకూ అవసరమైనప్పుడల్లా తగినంత దానా వేస్తూ పాలకులు తానా అంటే తందానా అంటూ వంత పాడుతుంటారు. అంబానీ, అదానీ లు మొదలుకుని అదానీ ల వరకూ ఇందులో భాగమే. గోరుచుట్టు పై రోకటి పోటన్నట్లు దానికితోడు కేంద్ర బడ్జెట్లో ప్రతి సంవత్సరం కార్పొరేట్ రాయితీలకొండ ఆంజనేయ తోకలా అంతకంతకూ పెరుగుతోంది. దీని విలువ నేడు దాదాపు 70 వేల కోట్లకు చేరుకుందని బడ్జెట్ లెక్కలు చెబుతున్నాయి. 2010 కేంద్ర ప్రభుత్వం వసూలు చేసిన మొత్తం పన్నులో కార్పొరేట్ పన్ను 39 శాతం కాగా, అదికాస్తా 2016 వచ్చేసరికి 30 శాతం కి పడిపోయింది. ఇదే సందర్భంలో 2010 మొత్తం పన్నులో 9 శాతం సర్వీస్ టాక్స్ ఉండగా అదికాస్తా 2016 కంతా 14 శాతం పెరిగింది. దీన్నిబట్టి ప్రభుత్వాలు క్రమంగా బ్యాంకింగ్, ఫైనాన్షియల్ రంగం వైపు కదులుతున్నట్లు, ప్రజలు కట్టే సర్వీస్ టాక్స్ లపై మరింతగా ఆధారపడనున్నట్లు స్పష్టమౌతోంది. ఈ పన్నులో సింహభాగం సామాన్య ప్రజలు కడుతున్నదేనని మనం మరవకూడదు.

ఫైనాన్షియల్ ఇంక్లూజన్ కు ఈ లెక్కలు పట్టవు. దాన్ని ప్రచారం చేస్తున్న సంస్థలు ' భారతదేశం లాంటి దేశాలలో ప్రభుత్వం ప్రజలకు చెల్లించే రాయితీలు, ఇతర చెల్లింపులు 'అవినీతి' కారణంగా లబ్దిదారులకు పూర్తిగా అందడం లేదని, డిజిటల్ చెల్లింపులు అమలులోకి వస్తే అవినీతికి తావులేకుండా పోయి సంక్షేమ ఫలాలు పూర్తి స్థాయిలో ప్రజలకు చేరుతాయన్న' వాదన వినిపిస్తున్నాయి. ఇందులో కొంత వాస్తవం లేకపోలేదు కూడా. భారతదేశంలో ఉన్నటువంటి 640,867 గ్రామాలకి ప్రతి ఏడు ఎన్ ఆర్ఇజిఎ, ఎన్ఎస్ఎపి, జనని సురక్ష యోజన, విద్యార్థులకందుతున్న స్కాలర్ షిప్పులు, పెట్రోల్, గ్యాస్ రాయితీల పథకాల ద్వారా సంవత్సరానికి 70 వేల కోట్ల రూపాయలు రాయితీల రూపంలో అందుతున్నాయి. కాని ఇందులో అవినీతి కారణంగా దాదాపు 30 శాతం వరకూ ప్రజలకు చేరడం లేదని, అదే డిజిటలైజేషన్ పద్ధతిలో ఈ మొత్తం చెల్లింపులు జరిగితే ఈ నష్టాన్ని 18 శాతం నికి తగ్గించవచ్చని ఒక అంచనా. ప్రపంచ బ్యాంకు 'వరల్డ్ డెవలప్మెంట్ రిపోర్ట్' ప్రకారం దేశం మొత్తంగా ప్రతి సంవత్సరం దాదాపు 20 బిలియన్ డాలర్లని, అంటే 1 శాతం జిడిపి ని డిజిటల్ చెల్లింపుల ద్వారా నష్టపోకుండా చూడొచ్చని అంచనా కట్టింది.

ఇందులో డిజిటల్ చెల్లింపులకు కావలసిన మౌలిక వసతుల కోసం ప్రభుత్వం ఖర్చుపెడుతున్న కోట్లాది రూపాయల్ని లెక్కలోకి తీసుకోలేదు. ఈ మొత్తం చెల్లింపులకై ప్రభుత్వం బ్యాంకులకు ప్రస్తుతం చెల్లిస్తున్న 2 శాతం కమిషన్ని లెక్కలోకి తీసుకోలేదు. ఇది చాలక ఈ కమిషన్ని 3 శాతం పెంచాలని, అదే గిరిజన ప్రాంతాలకైతే దాన్ని 3.5 శాతం చెల్లించాలని ఇప్పటికే ప్రభుత్వంపై బ్యాంకుల 'ఆదేశాల'ను లెక్కలోకి తీసుకోలేదు. ఖర్చుల్ని మినహాయించిన ఫైనాన్షియల్ ఇంక్లూజన్ అన్నమాట. మరో ముఖ్యవిషయం ఏమిటంటే ఈ లెక్కలన్నీ కేవలం ప్రభుత్వ చెల్లింపులకు మాత్రమే పరిమితమయ్యాయి. ఇందులో ఒకపక్క

నుంచి ప్రజలు లబ్దిదారులుగా కనిపించినప్పటికీ మరోపక్క ప్రజలు చెల్లించే పన్నులకి, నిత్య జీవితంలో చేసే ఇతర లావాదేవీలకి వాళ్లు కట్టాల్సిన కమిషన్ గురించీ మాట మాత్రమైనా చెప్పలేదు. ఆ కమిషన్ కోసమే మాస్టర్ కార్డ్, వీసా లాంటి సంస్థలు కాచుకు కూర్చున్నాయి. ఇ-అగ్రికల్చర్, ఇ-హెల్త్, ఇ-ఎడ్యుకేషన్ ఇలా ఈల వేస్తూ భారతదేశం చుట్టూ బిల్ గేట్స్ చెక్కర్లు కొట్టడానికి గల అసలు రహస్యం అదే. ఇదివరకే చెప్పినట్లు భారతదేశంలో సాలీనా వినియోగదారుల ఖర్చు పెడుతున్న మొత్తం విలువ రు. 80 లక్షల కోట్లు( క్రెడిట్ స్విస్ ). దీనికి కేవలం 2 శాతం సర్వీసు ఫీజు వసూలు చేసినా దాదాపు రు. 1.6 లక్షల కోట్లు రూపాయలు (26 బిలియన్ డాలర్లు) ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రజల చేతుల్లో నుంచి కమిషన్ రూపంలో బ్యాంకులకు, ఇతర సంస్థల ఖాతాలలోకి 'డిజిటలైజేషన్' ద్వారా చేరిపోతుంది. అందులోనూ ఇది కేవలం కమిషన్ లెక్క మాత్రమే. పైపెచ్చు బీమా లాంటి ఇతర ఆదాయ వనరులు అనేకం ఉన్నాయి. ఈ లెక్కలు ఆక్సెంచర్ చెప్పిన లెక్కలతో సరితూగుతున్నాయి. అందుకే బిల్ గేట్స్ లాంటి వాళ్లు ఇక్కడ 'సేవల' పేరిట తెగ ఉపన్యాసాలిస్తుంటే విదేశాలలో ఆయన సంస్థ ఉద్యోగులు మాత్రం 'బ్యాంకింగ్ చట్రంలో లేని చాలా మంది ఆర్థిక లావాదేవీలలో చాలా చురుకుగా ఉంటారని, వాళ్లు రోజులో అనేకసార్లు నగదు లావాదేవీలు జరుపుతుంటారని' చెప్తుంటారు (హౌ ఫైనాన్షియల్ ఇంక్లూజన్ విల్ చేంజ్ ది ఫేస్ ఆఫ్ బ్యాంకింగ్ ). బిల్ అండ్ మెలిండా ఫౌండేషన్ కెన్యాలోని మాస్టర్‌కార్డు ల్యాబ్‌కు 19 మిలియన్ డాలర్ల ఆర్థిక సహాయం కూడా అందించింది. ఈ మధ్య మనదేశంలో పర్యటించిన కెన్యా ప్రెసిడెంట్ రాకకు ప్రధాన కారణం ఫైనాన్షియల్ ఇంక్లూజన్ అయినా ఆశ్చర్యపోనక్కర్లేదు. ఎందుకంటే అక్కడ ఈ ప్రయోగం 2010 లోనే మొదలయ్యింది. బిల్ గేట్స్‌కు ముఖ్యంగా మన ప్రభుత్వ చెల్లింపులపైన కన్నుపడింది. ఈ డిజిటలైజేషన్ చెల్లింపుల వలన భారతదేశంలో పెరగనున్న రీటైల్ మార్కెట్‌ని చేజిక్కించుకోడానికే అమెజాన్, ఆలీబాబా, వాల్మార్ట్ లాంటి సంస్థలు పోటీ పడుతున్నాయి. టెక్నాలజీ, మొబైల్ రంగాలకి బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, రీటైల్ రంగాలు చోదక శక్తిగా పనిచేస్తుంటాయి. అందుకే ఆక్సెంచర్, యూనినార్‌లు ఇందులో పాలుపంచుకుంటున్నాయి. ఇక నష్టపోయేదల్లా ఇదంతా ఏ ప్రజల కోసమేనని పాలకుడు కోడై కూస్తున్నాడో ఆ ప్రజలే. చిన్న వ్యాపారస్తులు తమ పెట్టుబడిపై వచ్చే 5-7 శాతం లాభంలో ఇక మీదట 2-3 శాతం కమిషన్ రూపంలో కోల్పోవాల్సివస్తుంది. ఇలా దాదాపు 5-7 కోట్ల చిరు వ్యాపారుల్ని తిమింగలాలు మింగేయనున్నాయి.

సమాజంలో నగదు అందుబాటులో లేకపోవడంతో బ్యాంకు ఖాతాల్లోకి జమ అయ్యే సొమ్ముపై సిటి బ్యాంకు లాంటి కార్పొరేట్ బ్యాంకుల కన్ను ఉంది. మరీ ముఖ్యంగా 2030 కంతా భారతదేశ బ్యాంకింగ్ వ్యవస్థలో సింహభాగం ప్రైవేటీకరణ చెందే అవకాశం పుష్కలంగా కనబడుతోంది. అంటే ప్రస్తుతం ప్రభుత్వం చెల్లిస్తున్న 2 శాతం కమిషన్ తో పాటు ప్రజలు చెల్లించే కమిషన్ కూడా కార్పొరేట్లపాలు కాకతప్పదు. అప్పటికే ప్రభుత్వం వసతుల కోసమని లక్షల కోట్లు అప్పులు చేసి మరో ఆదాయ వనరులేక, తెచ్చిన అప్పులు చెల్లించలేని దుస్థితి వస్తుంది. 1980 లో లాటిన్ అమెరికాలో తలెత్తిన సంక్షోభమైతేనేం, 1991 మనదేశంలో తలెత్తిన సంక్షోభమైతేనేం, 2008 ఐస్లాండ్ సంక్షోభమైతేనేం, నేటి గ్రీసు సంక్షోభమైతేనేం ఇవన్నీ వేరు వేరు దేశాల్లో వేరు వేరు కాలాల్లో తలెత్తిన ప్రపంచ బ్యాంకు కుట్రకు ప్రతిరూపాలే. 2008 సంక్షోభం భారతదేశంపై అంతగా ప్రభావం చూపకపోవడానికి గల కారణాలలో ఎంతచెడినా ఇక్కడి వ్యవస్థ పునాదులు ఇంకా గ్రామీణ ఉత్పత్తి రంగంపైనే ఆధారపడి ఉండడం, మన బ్యాంకింగ్ వ్యవస్థలోకి పాశ్చాత్య టాక్సిక్ మోర్ట్ గేజ్ ప్రొడక్ట్స్ చేరుకోలేక పోవడం, ప్రజల చేతుల్లో ఎంతో కొంత నగదు రూపంలో చలామణిలో ఉంటూ సమాజాన్ని ఒక ఇంధనంగా నడిపించగల్గడం ప్రధానమైనవి. కానీ ఒకసారి ఈ వ్యవస్థ దెబ్బతిని కార్పొరేట్ బ్యాంకుల చెప్పుచేతుల్లోకి గనక మన ఆర్థిక రంగం పోయినట్లయితే, సమాజం చేతిలో చిల్లిగవ్వ లేకుండా బ్యాంకులకు గుత్తాధిపత్యం కట్టబెట్టినప్పుడు అవి ఆ సొమ్మును విచ్చలవిడిగా ఉపయోగించి మార్కెట్ ప్రయోగం చేసి నష్టపోయే ప్రమాదముంది. 'టూ బిగ్ టు ఫెయిల్' స్థాయికి ఎదిగిన ఈ బ్యాంకులను ఆదుకోడానికి తిరిగి ఐ ఎం ఎఫ్, ప్రపంచ బ్యాంకులు రంగంలోకి దిగుతాయి. మన ప్రభుత్వానికి అప్పులిచ్చి మరీ ప్రైవేట్ బ్యాంకులను ఆదుకోమంటాయి. అదే బెయిల్ ఔట్ కథ. అప్పుడిక ప్రభుత్వం ప్రజలకిచ్చే రాయితీలు కాదు కదా వాళ్లు కూడబెట్టుకున్న సొమ్ముని కూడా కోల్పోవాల్సి వస్తుంది. ఖర్చు మాత్రం ప్రజలది లాభాలు మాత్రం కార్పొరేట్లవి. నేడు గ్రీసులో జరుగుతున్నదిదే. 2007 ఆఫ్రికా ఖండంలోని మలాయ్ లో 'ప్రజల ఆకలి కంటే తామిచ్చిన అప్పులే తమకు ముఖ్యమని రైతులకి రాయితీలివ్వద్దన్న' ఐ ఎం ఎఫ్ ఇప్పుడు 'పేదల' గురించి మాట్లాడుతోంది.

నిన్నటి చేతకాని కాంగ్రెస్ పాలకులు 'ఆధార్ కార్డు' పేరిట, ఎన్ సి పిఐ సేవల పేరిట ఈ సంక్షోభానికి పునాదులేస్తే నేటి నిరంకుశ బిజేపీ పాలకులు దాన్ని విస్తరించే పనిలో 'నోట్లరద్దు' చేసి 'డిజిటల్' రాగం ఎత్తుకున్నారు. వీళ్లిద్దరూ అమెరికా లాంటి పిడికెడు దేశాలు స్థాపించిన 'వరల్డ్ ఆర్డర్' ని పరిరక్షించే పనిలో ఉన్న ప్రపంచ బ్యాంకు కుట్రకి అమ్ముడుబోయిన దళారులే. ఈ ప్రయోగం జోగాడే పసిపాపకు దబ్బులు కట్టి నడిపించే దుర్మార్గపు ఆలోచన తప్ప మరొకటి కాదు. ఎత్తు పెంచుతామని చెప్పి తప్పుడు భ్రమల్ని సృష్టించి అసలు 'మనిషి ని నడవలేకుండా చేసిన కార్పొరేట్ మరయంత్ర వైద్యానికి నేటి పాలకుల నోట్లరద్దు నిర్వాకానికి పెద్దగా తేడా కనిపించదు. మనది సహజంగా ఉత్పత్తి రంగ ఆర్థిక వ్యవస్థ. అందులోనూ వ్యవసాయ రంగం వెన్నెముకగా కల్గింది. సర్వీసు రంగానికి రంగుల హంగులు అవసరం కానీ మనకు కాదు. ఆప్షన్స్, ప్యూచర్స్, వంటి గాలి బుడగలతో మార్కెట్ శక్తులు వ్యవసాయ ఉత్పత్తుల్ని, వాటి ధరల్ని ఇప్పటికే తమ గుప్పిట పెట్టుకున్నాయి. చీమల్లా అహర్నిశలు కష్టపడి కూడబెట్టుకున్న మన సొమ్ముకి గాలం వేసి పట్టాలని చూస్తోంది బ్యాంకింగ్ రంగం. హరిత విప్లవం అనంతరం విత్తనాలు, ఎరువులు రైతుల చేతుల్లో నుంచి కార్పొరేట్ల అధీనంలోకి ఎలా తరలిపోయి వ్యవసాయ రంగంపై రైతాంగం తన అధికారాన్ని కోల్పోవాల్సి వచ్చిందో నేడు కూడా దేశ ఆర్థిక వనరుల్ని కోల్పోయి కార్పొరేట్ల గుప్పిట్లోకి మన నిత్యజీవితం బదిలీ కానుంది.

వాతలకు అలవాటు పడ్డాక కోతలు షరామామూలైపోతాయి. సబ్ చార్జీలు, సర్వీస్ ఫీజుల మోత మోగిపోతుంది. మరోపక్క మనిషి మెదడుకు కార్పొరేట్ 'అంటు'ని అంటగట్టాక ఆ అంటు మానై పూసే పువ్వులు,

కాసే కాయలు ఎలాగుంటాయో నేటి విద్యా విధానం చూస్తే అర్థమౌతుంది. చివరకు అభ్యుదయం అనిపించుకునే ఆలోచనలు కూడా ఆ భావజాలం పరిధిలోనే ఉండే ప్రమాదం ఉంది. అప్పుడు అభివృద్ధికి అసలు అర్థం మరుగున పడి అభ్యుదయం కూడా ప్రపంచ బ్యాంకు పరిధిలోకి కుంచించుకు పోతుంది. వలసవాదుల చేతుల్లో దోపిడి - పీడనలకు గురైన పేద దేశాల (వాడి పరిభాషలో అభివృద్ధి చెందుతున్న) నేటి దుస్థితి అదే. భౌతిక వనరులు లేని 'అభివృద్ధి చెందిన'వనిపించుకునే దోపిడి రాజ్యాలు వలసవాద కాలంలో అవి కూడబెట్టుకున్న దొంగ సొమ్మును గ్లోబలైజేషన్ గుర్రం ఎక్కించి మార్కెట్లో సవారీ గావించి లాభాల బాట పట్టించాలంటే వాటికి టెక్నాలజీ, బ్యాంకింగ్, కన్సల్టెన్సీ ఇలా కంటికి కనబడని సర్వీసులు అవసరం. కొత్త ప్రమాణాలు, సరికొత్త కొలబద్దలు రుద్దడం అవసరం. ఈ సూచీలకి పౌరుల ప్రాణాలు అక్కర్లేదు. భోపాల్ దుర్ఘటనలో వేలాదిమంది మృత్యువాత పడితే నేటికి కూడా వాళ్ల దాహార్తిని తీర్చలేని దాతృత్వం వీళ్లది. 2004లో సునామీ వచ్చి దేశాలు శవాల దిబ్బలైతే 'పునర్నిర్మాణం' పేరిట రయ్యిన పైకెగిసిన మార్కెట్లు వాళ్లవి. వాటికి మనుషుల కన్నీళ్లతో పన్లేదు. అవి పెట్రోలు మాత్రమే తాగుతాయి.

ఈ మార్కెట్ శక్తులే నేడు మళ్లీ నల్లధనం పేరిట, అవినీతి పేరిట, ఉగ్రవాదం పేరిట, పేదరికం పేరిట నోట్ల రద్దు యాగం చేస్తున్నాయి. అవి పేదలు అంటున్నది మనుషుల పేదరికం గురించి కాదు. వనరుల కరువుతో లాభాల ఆకలి తీరక కడుపు మాడి బక్కచిక్కి పోతున్న బ్యాంకుల పేదరికం గురించి. సంవత్సరానికి ఆకలి మంటల్లో మాడి బుగ్గిపాలౌతున్న 25 లక్షల పసిబుగ్గల కంటే మన పాలకులకు ఆ కార్పొరేట్ల కడుపు నింపడం అత్యవసరం అయింది. కాబట్టే నవంబర్ 8 రాత్రి నోట్ల రద్దుకు తెరలేచింది. మరుసటి రోజు పొద్దున ఏ జాతీయ వార్తాపత్రికను చూసినా, 'డిజిటల్ బాబా' ను కీర్తిస్తూ 'పేటీఎం' (ఆలీబాబా, రతన్ టాటా లకు ఈ కంపెనీలో కొంత వాటా ఉంది)లు, ఓలాలు 'కాష్‌లెస్' జోలపాట పాడడం మొదలుపెట్టాయి. దొంగలంతా ఏకమై అసలు దొంగను పట్టుకుంటామని కోడై కూస్తున్నారు. వాళ్ల ద్రోహానికి దేశభక్తి అని, అభివృద్ధి అని ముసుగేస్తున్నారు. "అంతర్జాతీయ అంగట్లో దేశమాత అంగాంగం తాకట్టు పెట్టే" వాళ్లను నమ్మి అమాయకంగా సింహాల గుహలో తల దూర్చడమా లేదంటే ఈ అప్రజాస్వామిక, నిరంకుశ నిర్ణయంపై నిరసించి పోరాడడమా అనేది నిర్ణయించుకోవాల్సిన చారిత్రిక సందర్భం ఇది.

*(రచయిత అమెరికాలో అంతర్జాతీయ ద్రవ్య సంస్థ ఉద్యోగి)* వీ

---

*(... 4వ పేజీ తరువాయి)*

*ఉన్నట్లు తెలిపారు. నిర్బంధ సమయ పరిమితి, జైళ్లలో చావులు, జైళ్ల నిర్వహణ సిబ్బంది, అధికారుల గణాంకాలు, వారి కరప్షన్, మహిళా ఖైదీల మరణాలతో సహా జైళ్లు ఎంత దుర్భరంగా ఉంటాయో తెలిపారు. '1982 జైళ్లలో అమానవీయ పరిస్థితుల గురించి' ఖైదీలపై పెట్టే ఖర్చుల గురించి, శిక్షాకాలం పూర్తయినా వారి దేశాలకు వెళ్లాలన్నా డబ్బులు లేనందున, సరియైన పత్రాలు లేక చాలా మంది జైళ్లలోనే ఉండిపోవడం జరుగుతుందని తెలిపారు. రచయిత జైళ్లలో మగ్గుతున్న వారి విషయంలో చాలా సమాచారం అందించారు. సమాచారం వలన జైళ్లలో ఎటువంటి దుర్భరమైన పరిస్థితులు ఉన్నాయో తెలిసింది. ఈ సమాచారాన్ని అందించినందుకు రాజేంద్రబాబు గారికి కృతజ్ఞతలు.*

*- ఎస్. ప్రభాకర్*
*జోగులాంబ గద్వాల*

*వీక్షణం ఫిబ్రవరి సంచికలో ప్రచురించిన 'జైళ్లలోనే జీవితంలో సగభాగం' అన్న రాజేంద్రబాబు రచనా చాలా విజ్ఞాన దాయకంగా ఉంది. వారు సేకరించిన వివరాలు శ్లాఘనీయం. ప్రతి పౌరుడు ఆలోచించవలసిన విషయాలు. విచారణ లేకుండా నెలల తరబడి జైళ్లలో మగ్గుతున్న వారి స్థితిగతులను గురించి క్షుణ్ణంగా వివరించారు. వారి రచనకు అనుబంధంగా స్వీయ అనుభవంతో ఈ కింది వివరాలు పాఠకులకు తెలియజేయాలని అనుకుంటున్నాను.*

*క్రిమినల్ ప్రొసిజర్ కోడ్ (నేర విచారణ స్మృతి) సెక్షన్ 167 ప్రకారం ఒక నేరారోపణలో భాగంగా ఏ వ్యక్తిని అయినా పోలీసు వారు నిర్బంధించినపుడు, దర్యాప్తు 24 గంటలలో పూర్తి కాలేని సందర్భంలో దర్యాప్తు అధికారి, నివేదిక మేరకు, ప్రాంతీయ న్యాయాధికారి నిందితున్ని 15 రోజులు న్యాయ సంబంధిత నిర్బంధంలో (జుడిషియల్ కస్టడీలో) ఉంచుటకు ఆదేశించవచ్చును. అట్టి నిర్బంధం అదే సెక్షన్‌లోని 2(1)(ఎ)(1)(11) నిబంధన మేరకు 90 లేదా 60 రోజుల వరకు పోతే పొడిగించవచ్చును. (నేరానికి మరణ శిక్ష లేదా జీవితఖైదు శిక్ష విధించబడే వాటికి మాత్రమే 90 లేదా 60 రోజుల నిర్బంధం వర్తించవచ్చు.)*

*అయితే పైన తెలిపిన 90/60 రోజుల లోపల దర్యాప్తు అధికారి, నిందితునిపై నేరారోపణ పత్రం (చార్జ్ షీట్) న్యాయస్థానంలో దాఖలు పర్చలేని పక్షంలో న్యాయాధికారి, అట్టి నిందితున్ని బేషరతుగా స్వంత పూచికత్తుపై (సెల్ఫ్ బెయిల్) విడుదల చేయవచ్చును. ఈ విషయం సి.ఆర్.పి.సి సెక్షన్ 437లో వివరించారు. కాని అధికశాతం న్యాయాధికారులు అలా చేయడంలేదు. ఇది నా స్వీయానుభవం. న్యాయాధికారుల పనివత్తిడి, లేదా కింది సిబ్బంది నిర్లక్ష్యం వల్ల కావచ్చును.*

*అలాంటి తప్పిదాల వల్ల, మానవ హక్కులకు భంగం కలుగకుండా, భారత ప్రభుత్వం, సుప్రీంకోర్టు, ఉమ్మడిగా ఇటువంటి కేసులను 3 నెలలకోమారు సమీక్షించవలసిందిగా తనిఖీ బృందాలను ఏర్పాటు చేసింది. జిల్లా న్యాయమూర్తి, జిల్లా పోలీసు అధికారి, జైలు సూపరిండెంట్ల పర్యవేక్షణలో పరిశీలించి, నివేదిక ఇచ్చినట్లుగా కార్యనిర్వాహక ఆదేశాలు జారీచేశారు. అయినా సత్ఫలితాలు పూజ్యం. విధి నిర్వహణలో వారి వారి ఉదాసీనత కొట్టొచ్చినట్లు కనబడుతుంది.*

*ఈ అవకాశాన్ని వినియోగించుకోవడానికి నిందితునికి కూడా హక్కుంది. లేఖల ద్వారా గాని ప్రత్యక్షంగా గాని న్యాయమూర్తిని అడగవచ్చును. అయితే రాజేంద్రబాబు చెప్పినట్లు, దేశంలో 2/3 వంతు ఖైదీలు, షెడ్యులు/కులాలు/తెగలు/వెనకబడిన వర్గాల ప్రజలే. వారికి చట్టాలపై 90 శాతం ఎలాంటి అవగాహన లేని వారు. రాజ్యాంగంలోని వారి హక్కులను గురించి వారికే తెలియదు. న్యాయవాదులు, బార్ కౌన్సిళ్లు ఈ విషయంలో ఎలాంటి శ్రద్ధ చూపడం లేదు. వారికి ప్రాక్టీసు పైన ఉన్న శ్రద్ధలో 25 శాతం ఇలాంటి విషయాలలో శ్రద్ధ వహిస్తే నిర్బంధ ఖైదీల సంఖ్య చాలా వరకు తగ్గిపోతుంది.*

*చివరగా నా సూచన ఏమంటే : మానవ హక్కుల సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వాలు చొరవ తీసుకొని, అధికారంలో ఉన్న ప్రతి ప్రథమశ్రేణి న్యాయాధికారికి, ఒకటి లేదా రెండు జైళ్లను కేటాయించి, తనిఖీలు చేయునట్లుగా ఆదేశాలు ఇవ్వాలి. వారి తనిఖీల నివేదికల సారాంశాన్ని ప్రజా బాహుళ్యానికి, ఏదో రూపంలో తెలియజేయాలి. తత్ఫలితంగా, ప్రభుత్వాలకు జైళ్ల శాఖలకు కేటాయించే వ్యయం తగ్గుతుంది.*

*- డా. బి. విఠల్, (డిఎస్‌పి రిటైర్డ్)*
హైదరాబాద్

*ఫిబ్రవరి వి. హనుమంతరావు ప్రత్యేక సంచిక, గత జ్ఞాపకాలతో పత్రిక కోసం పరితపించిన శ్రద్ధ, కృషి, పట్టుదల ఎంతో శ్లాఘనీయం. పత్రికకి గణాంకాలే ఆధారాలుగా పది కాలాలు నిలవాలని, నిలుపుతారని ఆశిస్తూ అభినందిస్తూ...*

*- ఎస్. పట్టాభి*
విశాఖపట్నం

# పాలకుల వేట - ప్రజల ప్రతిఘటనా సందర్భం

**భూములను, సముద్రాలను, అడవులను, ఖనిజ సంపదను విదేశీ సంస్థలకు కట్టబెట్టడానికి రాజ్యం ఆదివాసులను నిత్యం నిర్బంధాలకు, హత్యలకు, అత్యాచారాలకు గురిచేస్తోందనీ, ప్రజలు ఐక్యంగా ప్రతిఘటిస్తేనే తమ ఉనికిని కాపాడుకోగలుగుతారనీ అంటున్నారు బి.ఎస్.రాజు**

వేట, వేట, నిత్య వేట. వేట లేని పూట లేదు. వేటాడని రోజు లేదు. వేటకు గురికాని నేలంటూ మిగలడం లేదు. ఇప్పుడు భారత దేశంలో అడవులు, కొండలు, గుట్టలు, పంట భూములు, కమ్యూనిటీ భూములు, నివాస స్థలాలు, బస్తీలు; సముద్ర జలాలు, సాగర తీరాలు; నదులు, వాగులు, వంకలు, కాలువలు, చెరువులు, బోదులు ఏవీ మినహాయింపు కాదు ఈ వేటకు.

బొగ్గుకై, ఇనుప ఖనిజానికై వేట. బాక్సైట్, యురేనియంల కోసం వేట. సున్నపు రాయికి, గ్రానైట్ రాయికి, ఇసుకకు, మట్టికి వేట. పచ్చని అడవిని, పంట పొలాలను, చెట్టు చేమలను, అక్కడ నివసించే పశు పక్ష్యాదులను, మనుషులను, తరిమికొట్టే వేట. కొండలు గుట్టలు మింగేసే వేట. లాభాల మేటలకై వేట. ప్రతిచోటా, ఈ వేట ఆగకుండా అతివేగంగా కొనసాగాల్సిందే! ఇది పాలకుల అభివృద్ధి నియమం.

అభివృద్ధి పేరిట, పాలకులు నిత్యం జరుపుతున్న ఈ వేటకు బలైపోతున్న ప్రజలు, నిర్వాసితులౌతున్న ప్రజలు, తమ ఆవాస నివాసాలను, జీవన వనరులను కోల్పోతున్న ప్రజలు; పాలకుల అభివృద్ధి సృష్టిస్తున్న నాలుగు పెను భూతాలైన నిర్వాసిత్వం, విధ్వంసం, దీనత్వం, చావులకు ఆహుతైపోతున్న ప్రజలు తమను తాము రక్షించు కోవడానికి, తమకు భుక్తి నిస్తున్న నేలను, అడవులను, తాగే నీటిని, పీల్చే గాలిని కాపాడుకోవడానికి పాలకుల వేటను ప్రతిఘటిస్తున్నారు.

ఈ ప్రతిఘటన పాలకుల ఉక్కుపాదాల కింద నలిగిపోతున్నది. బలహీనులైన ప్రజలు, నిస్సహాయులైన ప్రజలను అక్రమ అరెస్టులతో జైళ్లలో నిర్బంధిస్తున్నారు. పాలకుల తుపాకుల కాల్పులకు నేలకొరిగి పోతున్నారు. పోలీసులు, సాధారణ ప్రజలను అకారణంగా బూటకపు ఎన్‌కౌంటర్లతో చంపని రోజు ఉండడం లేదు. పాలకుల ఖనిజాల వేటలో భాగంగా పోలీసు, పారామిలటరీ బలగాలు అడవులను బలవంతంగా ఖాళీ చేయిస్తున్నాయి. ఆదివాసుల గూడేలను తగల బెడుతున్నారు. వారి సర్వ హక్కులను కాలరాస్తున్నారు. ఆదివాసీ స్త్రీలను భయానక చిత్రహింసలకు గురిచేస్తూ, అత్యాచారాలు, మానభంగాలు చేస్తూ, మొత్తం ఆదివాసీ సమాజాన్నే తుడిచిపారేసే దుర్నీతితో యుద్ధ తంత్రాన్ని అమలు చేస్తున్నారు. దేశ భద్రతకై నిర్మితమైన సైన్యం ఈ రోజు దేశ పౌరులపైనే ఆకాశ దాడులకు, యుద్ధ బీభత్సానికి తెగబడుతున్నది.

మధ్యభారతంలో మొదలైన ఈ వేట ఇప్పుడు తూర్పు, దక్షిణ, ఉత్తర ప్రాంతాలకు శరవేగంగా విస్తరిస్తున్నది. తెలంగాణ, ఆంధ్రా ముఖ్య మంత్రులే కాక అన్ని రాష్ట్రాల ముఖ్య మంత్రులు పోటా పోటీగా పెట్టుబడి సదస్సులు నిర్వహిస్తూ, పెట్టుబడిదారులపై వరాల జల్లులు కురిపిస్తున్నారు. రాయితీలు ప్రకటిస్తున్నారు. వారికోసం లక్షల ఎకరాల 'భూ-బ్యాంకులు' తయారుగా ఉంచామని చెబుతున్నారు. పరిశ్రమలు పెట్టమని, వ్యాపారాలు చేసుకోండని స్వదేశీ, విదేశీ పెట్టుబడులకు ఏ ఆటంకం ఉండదని, వ్యాపార సరళీకరణ, చట్టాల సరళీకరణ, పెట్టుబడికి అత్యంత అనుకూలంగా మలిచామని ప్రకటిస్తున్నారు.

పారిశ్రామిక, సముద్ర తీర మండళ్లు-కారిడార్లు, పోర్టులు, విమానాశ్రయాలు, పెట్రో కెమికల్ కాంప్లెక్సులు స్థాపించడానికి ప్రజా సంపదను ప్రయివేటు పరంచేస్తూ లాభాల వేటలో తరించమని పెట్టుబడికి పూజారులుగా మంత్రోచ్చాటన చేస్తున్నారు. 'మేక్ ఇన్ ఇండియా' అని కేంద్రంలో దేశ ప్రధాని మోడీ అంటుంటే, 'మేక్ ఇన్ మా రాష్ట్రం' అని రాష్ట్ర ముఖ్య మంత్రులు గొంతులు చించుకొంటున్నారు. మైకుల్లో ఊదర గొడుతున్నారు. కోట్ల రూపాయల ప్రజాధనాన్ని రోడ్డు షోలు, సదస్సుల నిర్వహణా ఆడంబరాలకు తగలబెడుతున్నారు.

ఇక గనుల నుండి ఖనిజాల తవ్వకాలు తారస్థాయికి చేరుకొని 'గనుల మాఫియా' ఆదివాసీ సమాజాలను దీనావస్థకు గురిచేస్తోంది. మొత్తానికి మొత్తం అరణ్యాలు, ఆదివాసులు కనుమరుగైపోయే ఓ భయానక దాడి ఈ రోజు చత్తీస్‌గడ్, ఝార్ఖండ్, బీహార్, ఒడిశా, ఆంధ్ర, తెలంగాణ, మధ్యప్రదేశ్, రాజస్థాన్, గుజరాత్, ఈశాన్య రాష్ట్రాల్లో పెద్ద ఎత్తున కొనసాగుతోంది. ఉపరితల గనుల తవ్వకాలు ఊపందుకుని గ్రామాలు మసిబారిపోతున్నాయి. ఈ తవ్వకాల మూలంగా ప్రజలు ఊపిరాడక చనిపోవడమో లేక ఊళ్లు కాళీ చేసి వెళ్లిపోవడమో తప్ప వేరే మార్గం లేని పరిస్థితి ఇవ్వాళ దేశ ప్రజలు ఎదుర్కొంటున్నారు.

పెట్టుబడి జరిపే ఈ వేటలో విస్థాపనకు గురౌతున్న ప్రజల దుర్భర పరిస్థితులను; రాజ్య బలగాలు ప్రజలపై ప్రయోగిస్తున్న అమానుష హింసా చర్యలను ఖండిస్తున్న, ప్రచారం చేసే సాహసం చేస్తున్న సామాజిక కార్యకర్తలను, న్యాయవాదులను, స్వతంత్ర మీడియాను భయభ్రాంతులకు గురిచేయడం, వారిపై దాడులు చేయడం, చట్ట వ్యతిరేకంగా అరెస్టులు చేయడం, తప్పుడు అభియోగాలు మోపి జైళ్లలో నిర్బంధించడం పెట్టుబడికి కొమ్ముకాస్తున్న రాజ్య వ్యవస్థ తన ప్రధాన కర్తవ్యంగా ఎంచుకుని పనిచేస్తున్నది. ప్రజా క్షేత్రంలో ఉండి పని చేస్తున్న ఇటువంటి వారి అడ్డు తొలగించి, దోపిడీ పెట్టుబడికి ఏ ఆటంకం లేని రాచమార్గాలను నిర్మించడంలో పాలక వ్యవస్థ తలమునకలై ఉంది.

రాజ్య వ్యవస్థ, ఏ రాజ్యాంగపు చెట్టు పేరుచెప్పి కాయలమ్ము కుంటున్నదో, అదే రాజ్యాంగాన్ని, చట్టాలను, న్యాయ వ్యవస్థను అభాసుపాలు చేస్తున్నది. ఈ వ్యవస్థలన్నీ పెట్టుబడి దాసోహ అభివృద్ధి పంథాకు తరచూ అడ్డు తగులుతున్నాయి కాబట్టి వీటిని కూడా కాలరాసి వెయ్యాలనే రాజ్యపు దూకుడు, దాష్టీకం స్పష్టంగా బహిర్గత మౌతున్నది. ఇటువంటి భయానక స్థితిని రాజ్యమే కల్పిస్తున్నప్పుడు ఇక ప్రజలకు ఏమి మిగిలి ఉంటుంది? తమ ఉనికిని, తమ జీవన వనరులను

# కులం-బహుజన ప్రజాస్వామిక విప్లవం

*భారత సమాజం అర్ధ వలస, అర్ధ భూస్వామ్యం అని సూత్రీకరించడం వాస్తవ విరుద్ధమని వాదిస్తున్నారు*

**డా. పట్టా వెంకటేశ్వర్లు**

మార్క్సిస్ట్ పరిజ్ఞానం ఉన్నవారు చరిత్రని అర్థం చేసుకోకుండా భవిష్యత్‌ను నిర్మించలేమంటారు. అందుకు వారు మార్క్స్ చారిత్రిక భౌతికవాద సిద్ధాంతాన్ని ప్రాతిపదికగా చేసుకొని ఏ దేశ చరిత్రనైనా అర్థం చేసుకోవడాకి ప్రయత్నిస్తారు. అందులో భాగంగా సమాజంలో ఈనాటికి ఏర్పడుతూ వచ్చిన వివిధ దశలు, ఆయా దశల్లో జరిగిన వర్గపోరాటాలు. అవి జరగడానికి గల కారణాలు. ఆ వర్గపోరాటాల వల్ల ఏర్పడే నూతన వ్యవస్థలు. అలాగే ప్రస్తుత సమాజ స్థితి. ఈ స్థితి మార్చడానికి ఎంచుకోవాల్సిన దశను నిర్ధారించుకొంటారు. కాని గొప్ప మార్క్సిస్టు విశ్లేషకులైన రంగనాయకమ్మ లాంటి వారు కులం గురించి రాస్తున్న వ్యాసాల్లో కుల నిర్మూలన దశ దిశ గురించి మాట్లాడకుండా, అలాగే ఆ దశలో అనుసరించాల్సిన రాజకీయ కార్యక్రమం గురించి మాట్లాడకుండా ఈ విషయంలో తనకు తగినంత పరిచయం లేదనడం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. పైగా కులానికి మూడు వేల సంవత్సరాల చరిత్ర ఉంది. ఇది ఉత్పత్తి కులాల అదనపు శ్రమని వారసత్వంగా దోచుకోవడం కోసమే ఏర్పడింది. ఈనాటికి కూడా కొనసాగుతూనే ఉంది. కుల చారిత్రిక పరిణామ క్రమాన్ని అర్థం చేసుకోకుండా, కుల నిర్మూలనకు అనుసరించాల్సిన రాజకీయ కార్యక్రమం గురించి మాట్లాడకుండా దాన్ని నిర్మూలించడం సాధ్యమయ్యే పనికాదు.

మార్క్స్ ఉత్పత్తి శక్తుల అభివృద్ధి, ఉత్పత్తి సంబంధాల్లో వచ్చే మార్పు చరిత్ర గమనాన్ని నిర్దేశిస్తుందంటాడు. ఈ చారిత్రక పరిణామ క్రమంలో భాగంగా ఆదిమ సమాజం, బానిస సమాజం, భూస్వామ్య సమాజం, పెట్టుబడిదారీ సమాజం, అఖరున కమ్యూనిజం ఏర్పడుతుందని చెబుతాడు. ఈ పద్ధతి ఆధారంగా భారతదేశ చరిత్రను పరిశీలించే వారికి మార్క్స్ చెప్పిన చారిత్రక దశలు ఇక్కడ అంత స్పష్టంగా కనబడవు. కాబట్టి ఇక్కడ బానిస సమాజం ఏ రూపంలో, ఎప్పుడు ఏర్పడిందో పరిశీలిద్దాం. పశ్చిమ ఆసియా నుండి వచ్చిన ఆర్యులు ఇక్కడి తెగలను (మూలవాసులను) ఓడించి, వారిని బానిసలుగా (శూద్రులు) చేసుకొన్నారని చరిత్రకారుల్లో మెజారిటీ మంది అంగీకరిస్తున్నారు. ఈ ఆర్యా వైదిక వర్ణవ్యవస్థలో బానిసలైన చార్వాకులు వైదిక ధర్మాలను సవాల్ చేసినట్లు తెలుస్తుంది. కాని వారి రాజకీయ పోరాటాల చరిత్ర ఏమిటనేది తెలియడం లేదు.

ఆర్యులది ప్రధానంగా పశుపోషణ సంచారం నుండి వ్యవసాయ జీవన విధానం కలిగిన సమాజం. వారికి వ్యాపారం తెలియదు. పైగా దాన్ని ఈసడించుకున్నారు. యజ్ఞ, యాగాల పేరు మీద పశుసంపదని బలి చేసేవారు. ఈ రకమైన ఉత్పత్తి విధానం నూతన ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని అడ్డుకున్నది. దీనికి వ్యతిరేకంగా బౌద్ధ, జైన ఉద్యమాలు ముందుకు వచ్చాయి. అటు తర్వాతనే నగర కేంద్రాలుగా పెద్ద రాజ్యాలు ఏర్పడ్డాయి.

బింబిసారుడు మొదటిసారిగా మగధ సామ్రాజ్యాన్ని ఏర్పాటు చేశాడు. అతని కుమారుడైన అజాత శత్రువు మగధ సామ్రాజ్యాన్ని మరింత విస్తరింపజేస్తాడు. అప్పటి నుండి గ్రీకులతో, పశ్చిమాసియాతో వ్యాపార సంబంధాల అభివృద్ధి జరిగింది. (ఇక్కడ సింధు నాగరికతను పరిగణన లోనికి తీసుకోవడం లేదు). అందుకనే రాజులు, వ్యాపారులు, బౌద్ధ, జైనాన్ని ప్రోత్సహించారు. ఈ కాలంలోనే ఇనుము వినియోగంలోకి వచ్చింది. ఇది ఉత్పత్తి పెరుగుదలకు దారితీసింది. అందుకనే అంబేద్కర్ బౌద్ధ కాలాన్ని మొదటి సామాజిక విప్లవంగా పేర్కొంటాడు. కానీ ఈ

---

కాపాడుకోవడానికి రాజ్యంతో యుద్ధం చేయడం తప్పు? అంటే రాజ్యమే ప్రజలపై యుద్ధాన్ని రుద్ది, పెట్టుబడి తరఫున రాజ్య బలగాలను మోహరించి, వికాసం పేరుతో వినాశనాన్ని సృష్టిస్తున్నది.

అయితే, రక్తమోడుతూ కూడా ప్రజలు పాలకుల దుర్మార్గపు విస్థాపనా రాజకీయాలను, బూటకపు భూకబ్జా అభివృద్ధిని ప్రతిఘటిస్తున్నారు. వందల గ్రామాల్లో గ్రామ సభలు నిర్వహించి, 'మా ఊళ్ళో మా రాజ్యం', 'జల్-జంగిల్-జమీన్' హమారా, 'నీరు-అడవి-భూమి' మావేనని, కిస్కా జమీన్ హై - ఉసీకా ఖనిజ్ హై', 'భూమి ఎవరిదో -వారిదే ఖనిజం' అని ప్రకటిస్తూ, ప్రజా ఉద్యమాలను నిర్మించుకుంటూ, రాజ్యాన్ని నిలువరిస్తున్నారు. మరో పక్క జనతన సర్కార్లను స్థాపించుకుంటున్నారు. మా అభివృద్ధిని మేమే సాధించుకుంటామని, ప్రత్యామ్నాయ ప్రజా అభివృద్ధి నమూనాతో మా సమాజ వికాసాన్ని మేమే రచించుకుంటామని నడుంకట్టి నడుస్తున్నారు. పాలకుల వినాశకర దాడులనుండి తమ సొంత వ్యవస్థలను కాపాడుకోవడానికి ప్రజా యుద్ధమార్గాన్ని అనుసరిస్తామని, ఆ దారి తప్ప వేరే మార్గం తమకు రాజ్యం మిగల్చడం లేదని చెబుతున్నారు.

క్రమంగా ప్రజలు పాలకుల దోపిడీ విధానాలను తిరస్కరిస్తున్నారు. రాజ్యం, పెట్టుబడికి దాసోహమై తమ సమస్త వనరులను కైంకర్యం చేస్తోందని గ్రహిస్తున్నారు. ప్రతిఘటనా పోరు తప్ప, ప్రజా యుద్ధం తప్ప వేరే మార్గాలు లేవని నిర్ణయించుకుంటున్నారు. ఇక శాంతియుత సందేశాలకు మోసపోని సందర్భంలోనికి ప్రజలు ప్రవేశించారు. గాంధీ బొమ్మకు కొత్తరూపమే మోడీ బొమ్మని గ్రహించారు. గ్రహణశక్తి పెరిగినప్పుడు ప్రజల ధర్మాగ్రహం భగ్గుమంటుంది. ఇప్పటి మలుపు అదే! కొనసాగబోయే కాలం యుద్ధ కాలమే! ప్రజాయుద్ధమే భారత దేశ దశ, దిశా కూడా!

*(రచయిత జాతీయ కౌన్సిల్ సభ్యుడు, విస్థాపన్ విరోధి జన వికాస్ ఆందోళన్)* ☐

సామాజిక విప్లవానికి వ్యతిరేకంగా బ్రాహ్మణుడైన పుష్యమిత్ర శృంగునీ నాయకత్వంలో ప్రతిఘాత విప్లవం జరిగింది. ఇందువల్ల తిరిగి వైదిక వ్యవస్థ పైచెయ్యి సాధించింది. దీంతో శూద్ర బానిసలను పద్ధతి ప్రకారంగా విభజించే కులవ్యవస్థ ఏర్పడింది. ఈ విధంగా వర్ణ బానిసత్వం, కుల భూస్వామ్యం విడదీయ లేనంతగా పెనవేసుకొని అప్రతిహతంగా కొనసాగాయి.

అయితే ఇవి యూరప్ మాదిరి బానిస, ఫ్యూడల్ వ్యవస్థ లాంటివి కావు. ఈ క్రమంలో రాజుల మధ్య యుద్ధాలు, విదేశీయుల దండయాత్రలు అనేకం జరుగుతున్నప్పటికీ సమాజంలో మార్పులు పెద్దగా చోటు చేసుకోలేదు. ముఖ్యంగా గ్రామీణ సమాజం గిడసబారి పోయింది. భారతీయ సమాజాన్ని అధ్యయనం చేసిన సి.బోగ్లే అనే పరిశోధకుడు "ఇతర నాగరికతలు మామూలుగా దాటుకుంటు పోయిన దశలనే భారతదేశం బలవంతంగా పొడిగించింది. ఈ పొడిగింపుతో వికాసం కుంటుబడింది. అంటే తిరోగమ దశలోనే ప్రయాణం సాగించిం దంటాడు", అందుకనే మార్క్స్ ఈ లక్షణాన్ని 'ఏషియాటిక్ ఉత్పత్తి విధానమని' అన్నాడు. దీన్ని గురించి 1853లో 'ది బ్రిటిష్ రూల్ ఇన్ ఇండియా' అనే గ్రంథంలో చర్చిస్తూ, "భారతీయ సామాజిక వ్యవస్థ మానవుడి బుద్ధిని అత్యంత సంకుచితమైన పరిధిలో బందీగా, మూఢనమ్మకాల చేతిలో పని ముట్టుగా, సాంప్రదాయ భావాలను బానిసగా మార్చి వేసిందనీ, ఇక్కడ శ్రమ విభజన, దానిమీద ఆధారపడ్డ కుల వ్యవస్థ భారతీయుల శక్తికి, అభివృద్ధికి ప్రతిబంధకాలుగా మారిందనీ, స్వయం అభివృద్ధి చెందుతున్న సామాజిక రాజ్యాన్ని మార్పులేని ప్రకృతి సూత్రంగా మార్చి వేశాయనీ" అంటాడు.

కానీ బ్రిటిష్ సామ్రాజ్యవాదం భారతదేశంలో యూరప్ పారిశ్రామిక విజ్ఞానంతో కూడిన నూతన ఉత్పత్తి శక్తులను ప్రవేశ పెట్టింది. రైల్వేలు, పరిశ్రమలు, మిలటరీ, లిబరల్ విద్యను వాడి హిందూ వర్ణ, కుల వ్యవస్థని కదిలించే ప్రయత్నం చేసింది. దీన్ని మార్క్స్ విశ్లేషిస్తూ "భారత ఉపఖండంలో జరిగిన అన్ని పౌర యుద్ధాలు, దండయాత్రలు, కరవు కాటకాలు స్వయం పోషక గ్రామీణ వ్యవస్థను మార్చలేకపోయాయి. కానీ బ్రిటిష్ వారు ప్రవేశ పెట్టిన ఆవిరి ఇంజన్, స్వేచ్ఛా వ్యాపార విధానం అర్ధ అనాగరిక, అర్ధనాగరిక సంఘాల ఆర్థిక పునాదులను విధ్వంసం చేసి తత్ఫలితంగా వాటిని విచ్ఛిన్నం గావించింది. ఈ విధంగా బృహత్తరమైన, నిజం చెప్పాల్సి వస్తే ఆసియా ఖండం తన మనుగడ అంతటిలోనూ ఎరిగిన ఏకైక సామాజిక విప్లవాన్ని అది తీసుకొచ్చింది.

అలాగే హిందూస్థాన్‌లో సామాజిక విప్లవం సంభవించేటట్లు చేయడంలో ఇంగ్లాండ్ కేవలం పరమనీచమైనట్టి స్వార్థ ప్రయోజనాలు ఉన్నది నిజమే. కానీ అదికాదు సమస్య. సమస్య ఏంటంటే ఆసియా సామాజిక వ్యవస్థలో మౌలికమైన విప్లవం జరగకుండ మానవాళి తన భవితవ్యాన్ని ఫలింపజేసుకోగలుగుతుందా?" అని ప్రశ్నిస్తూనే "ఇంగ్లాండ్ ఈ విప్లవాన్ని సఫలీకృతం గావించడంలో తాను ఎరగకుండానే చరిత్ర చేతుల్లో పనిముట్టుగా పని చేసిందంటాడు".

ఈ విధంగా పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలు వర్ణ, కుల ఫ్యూడల్ ఉత్పత్తి సంబంధాలపైనే రుద్దబడ్డాయి. కాబట్టి యూరప్ లాగ బానిస వ్యవస్థ పతనమై భూస్వామ్య వ్యవస్థ పుట్టినట్లు, భూస్వామ్య వ్యవస్థ నుండి పెట్టుబడిదారీ వ్యవస్థ పుట్టుకొచ్చినట్లు గాక, వర్ణ బానిస వ్యవస్థ పతనం కాకుండానే అది కుల వ్యవస్థగా పెరగడం, ఈ కుల వ్యవస్థ పైనే బయట నుండి వచ్చిన పెట్టుబడిదారీ వ్యవస్థ రుద్దబడడం మన ప్రత్యేకత. ఈ విధంగా ఒకే కాలంలో అన్ని వ్యవస్థల సంపర్కాన్నీ నేటికి చూడవచ్చు. అందుకే స్పార్టకస్ లాంటి బానిసల తిరుగుబాటు నాయకుడు కాని, ఫ్రాన్స్‌లో భూస్వాములకు వ్యతిరేకంగా పెట్టుబడిదారుల తిరుగుబాటు కాని, ఇంగ్లాండ్‌లో రాజుకు పార్లమెంటుకు మధ్య జరిగిన ఘర్షణ లాంటివి ఇక్కడ కనబడవు. అలాగే మనదేశంలో మధ్య యుగాల్లో ముందుకొచ్చిన భక్తి ఉద్యమాలు కూడా కుల వ్యవస్థను, స్త్రీ పురుష అసమానతలను ప్రశ్నించడమే గానీ తిరస్కరించలేదు. అందువల్ల సమాజంలో యథాతథస్థితే కొనసాగించబడింది. (వెండీ డోనిగర్, హిందువులు-ఒక ప్రత్యామ్నాయ చరిత్ర. 2016, ఎచ్‌బిటి, పేజి 216.)

ఇక బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయ బూర్జువ, భూస్వామ్య వర్గ నాయకత్వంలో జరిగిన స్వాతంత్ర్య ఉద్యమం మనకు తెలిసిందే. వైపరీత్యమేమంటే 1857లో జరిగిన మొదటి సిపాయిల తిరుగుబాటు గానీ, ముంబయిలో జరిగిన మొదటి పారిశ్రామిక సమ్మెగానీ బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా జరిగినవి కావు. అది ఎలాగంటే, సిపాయిలు ఉపయోగించే మందుగుండు సామాగ్రి ఆవు, పందికొవ్వుతో చేయబడ్డవనే వదంతులతో హిందూ, ముస్లిం సిపాయిలు తిరుగుబాటు చేస్తే, బొంబాయి నూలు పరిశ్రమల్లో షెడ్యులు కులాలు ఇతర కార్మికులతో కలిసి భోజనం చేసే విధంగా బ్రిటిష్ వారు కామన్ డైనింగ్ ఏర్పాటు చేస్తే, దానికి వ్యతిరేకంగా దళితేతర కార్మికులు సమ్మె చేస్తారు. ఇది బ్రిటిష్ వ్యతిరేక తిరుగుబాట్ల పరిస్థితి. కాని పునాది కార్మికవర్గమైన షెడ్యూల్ కులాల హక్కుల కోసం తనదైన పద్ధతిలో ఆందోళన చేసిన అంబేద్కర్‌ను సామ్రాజ్యవాద ఏజెంటుగా గతంలోను ఇప్పుడు కూడా ముద్రవేసే వారు ఉన్నారు.

ఏమైతేనేం 1947లో స్వాతంత్ర్యం వచ్చింది. దానికి 70 ఏళ్లు నిండాయి. ఈ 70 ఏండ్ల భారత దేశ స్వరూపాన్ని అంచన వేసే దగ్గర కమ్యూనిస్టు పార్టీలు, గ్రూపులు 'అర్ధ భూస్వామ్య - అర్ధవలస దేశంగా' భావిస్తున్నాయని రంగనాయకమ్మ చెబుతున్నారు. మరీ ఈ అర్ధ భూస్వామ్య, అర్ధవలస వ్యవస్థలో వర్ణ, కులాలు ఎక్కడ దాక్కొన్నాయి? లేదా అంతమైపోయాయా? ఈ గ్రూపుల వారు కానీ, రంగనాయకమ్మ గానీ జవాబు చెప్పితే మంచిది. ఎందుకంటే మార్క్సిజం నిర్దిష్ట పరిస్థితులను నిర్దిష్టంగా అంచనా వేయమని చెబుతుంది. నిజంగా కమ్యూనిస్టులు చెబుతున్నట్లు మన దేశం అర్ధ వలస, అర్ధ భూస్వామ్య వ్యవస్థ కాదనీ, భారతదేశంలో ఉన్నది పెట్టుబడిదారీ విధానమేననీ, దాన్ని అధ్యయనం చేసే శ్రద్ధలేని, అధ్యయనం చేయని మార్క్సిస్టులు చైనాను గుడ్డిగా యథాతథంగా అనుకరిస్తూ అర్ధ భూస్వామ్య సూత్రీకరణ చేశారనీ అర్థ శాస్త్రవేత్త అశోక్ రుద్రా 1970లోనే ఒక ఆరోపణ చేశారు. (ఎన్. వేణుగోపాల్, వీక్షణం ఆగస్ట్ 2016).

నిజంగా ఆయన చెప్పినదాన్ని సీరియస్‌గానే పరిశీలించాల్సి ఉంటుంది. అందుకు నేను 1970లోని వివరాల్ని కాక ప్రస్తుత గణాంకాల ఆధారంగా పరిశీలిస్తాను.

భారత ఆర్థిక వ్యవస్థలో వివిధ రంగాలు ఆదాయ పరంగా, ఉపాధి పరంగా సమకూర్చుతున్న వాట వివరాలను చూస్తే, 1950-51లో స్థూల జాతీయ ఉత్పత్తిలో వ్యవసాయ రంగం వాటా 55 శాతంగా ఉంటే, అది 2013-14నాటికి 13.9 శాతానికి తగ్గిపోయింది. అదే సమయంలో పారిశ్రామిక రంగం వాటా 15 శాతం నుండి 26.2 శాతానికి పెరిగింది. ఇక సేవారంగం 30 నుండి 59.9 శాతానికి పెరిగింది. అంటే 2013-14 లెక్కల ప్రకారం జిడిపిలో పారిశ్రామిక సేవారంగాలు కలిపి ఆదాయపరంగా 86.1శాతం వాటాని పొందుతున్నాయి. కేవలం 13.9 శాతానికి వ్యవసాయ రంగం కుదించబడ్డది. దీన్నిబట్టి అర్థమయేదేమంటే, భారతదేశం వ్యవసాయ ఆధారిత ఆర్థిక వ్యవస్థగా ఎంత మాత్రం లేదని తెలుస్తుంది.

ఉపాధి విషయానికి వస్తే 1960లో వ్యవసాయ రంగం 70శాతం మందికి ఉపాధిని కల్పిస్తుంటే అది 2010 నాటికి 51.1 శాతానికి తగ్గింది. అంటే ఇప్పటికీ జనాభాలో సగం మందికి వ్యవసాయ రంగమే ఉపాధిని కల్పిస్తున్నది. 1960లో పారిశ్రామిక రంగం జనాభాలో 11 శాతం మందికి, 2010లో 22.4 శాతం మందికి ఉపాధిని కల్పిస్తున్నది. సేవా రంగం 1960లో 15 శాతం నుండి 2010లో 26.5 శాతానికి ఉపాధిని పెంచింది. కానీ ఈ రెండు రంగాలు కలిసి జిడిపిలో అవి పొందుతున్న ఆదాయ శాతాలకు అనుగుణంగా ఉపాధిని కల్పించడం లేదు. ఇందువల్ల వ్యవసాయ రంగంపైనే గత్యంతరం లేని పరిస్థితుల్లో సగం జనాభా ఆధారపడవల్సి వస్తుంది. ఇక వృద్ధి రేటు విషయాన్ని పరిశీలిస్తే, 2008లో భారత ఆర్థిక వ్యవస్థ వృద్ధిరేటు 9.5 శాతంగా ఉంది. ఇదే కాలంలో సేవా రంగం 15 శాతం, పారిశ్రామిక రంగం 6 శాతం, వ్యవసాయ రంగం కేవలం రెండు శాతం వృద్ధిరేటును నమోదు చేసింది. అలాగే సేవా రంగంలో భాగంగా ఉన్న ఐ.టి. రంగం 40 శాతం వృద్ధిరేటును సాధించింది. ఈ వృద్ధిరేట్లు దేశ సంపదలో ఏయే రంగాలు ఏయే శాతంలో ఆదాయాలు పొందుతున్నాయనేది తెల్పుతున్నాయి.

జిడిపి పరంగా పారిశ్రామిక, సేవారంగాలు 86.1 శాతం ఆదాయాన్ని పొందుతూ, 48.9 శాతం మాత్రమే ఉపాధి అవకాశాన్ని కల్పిస్తున్నాయని ఇప్పుడు పరిశీలించిన గణాంకాలు తెలియజేస్తున్నాయి. జిడిపిలో 13.9 శాతం ఉన్న వ్యవసాయ రంగం మాత్రం 50 శాతం మందికి ఉపాధిని కల్పించడం వల్ల ఈ 13.9 శాతం ఆదాయాన్నే ఈ 50 శాతం మంది పంచుకోవాల్సి వస్తుంది. ఇందువల్ల ఈ రంగంలో పనిచేసే వారి ఆదాయాలు కనీస అవసరాలు తీర్చుకొనేందుకు సరిపోవడం లేదు. అందువల్లనే గ్రామీణ రుణ భారం పెరగడం, దానివల్ల రైతుల ఆత్మహత్యలు పెరుగుతున్నాయి.

ఈనాడు ఆర్థిక వ్యవస్థలో సేవా రంగం జిడిపిలో 59.9 శాతం ఆదాయం పొందే విషయంలో అగ్రభాగాన ఉన్నప్పటికీ అది 26.5 శాతం మందికి ఉపాధి కల్పిస్తూ ఉండడంతో వారి ఆదాయాలు అత్యధిక స్థాయిలో ఉంటున్నాయి. ఇక ఐ.టి. రంగం 40 శాతం వృద్ధిరేటులో ఉన్నప్పుడు వారి ఆదాయాల వృద్ధిరేటు కూడా అదే స్థాయిలో పెరుగుతున్నాయి. ఇంత అత్యధిక ఆదాయాలు కల్పిస్తున్న ఈ రంగం 85 శాతంగా ఉన్న బహుజన కులాలకు ఉపాధిని కేవలం 3శాతం మాత్రమే కల్పిస్తున్నది. ఈ విధంగా 9.5 శాతం వృద్ధిరేటులో పైభాగంలో నున్న 10 నుండి 15 శాతం మందికి మాత్రమే చేరిందని ప్రముఖ ఆర్థికవేత్త అశోక్‌మిత్ర పేర్కొన్నాడు. దీన్ని బట్టి అర్థమయేది ఏమంటే వృద్ధిరేటు ఎక్కువగా ఉన్న రంగాలు ఆధునిక మానువాద రంగాలుగానే ఉంచబడుతున్నాయి.

ఇక భూస్వామ్య వ్యవస్థ ఎంత బలంగా ఉందనే దాన్ని కూడా పరిశీలిద్దాం. కేంద్ర వ్యవసాయ మంత్రిత్వ శాఖ ఇస్తున్న వివరాలను పరిశీలిస్తే చిన్న, సన్నకారు రైతులు 2003 నాటికి మొత్తం సాగుదార్లలో వారు 90.4 శాతంగా ఉన్నారు. మొత్తం సాగుదార్లలో చిన్న, సన్నకారు రైతులే అత్యధికంగా ఉన్నారు. కాని వారు సాగు చేస్తున్న భూమి 43.4 శాతం మాత్రమే. ఇక సెమీ మీడియం రైతులు 6.0 శాతం కాగా వారు సాగుచేస్తున్న భూపరిమాణం 22శాతం. అలాగే మాధ్యమిక రైతులు 3.0 శాతం కాగా వారు చేస్తున్న భూపరిమాణం మాత్రం 23.1 శాతం. ఇక పెద్ద రైతులు లేదా భూస్వాముల విషయానికి వస్తే మొత్తం సాగుదారుల్లో ప్రస్తుతం 0.6 శాతానికే పరిమితమైపోయారు. అలాగే వారి సాగు విస్తీర్ణం కేవలం 11.5 శాతం మాత్రమే. మొత్తం సాగవుతున్న భూమిలో చిన్న, సన్న, మధ్యతరగతి రైతుల చేతుల్లో 89.5 శాతం ఉంది. మొత్తం ఈ విశ్లేషణ స్థూలంగా తెలియజేస్తున్నది ఏమంటే భూస్వామ్య అవశేషాలు చాలా పరిమిత స్థాయిలోనే ఉన్నట్లు తెలియజేస్తున్నది. కానీ కమ్యూనిస్టు పార్టీలు ఇంకా అర్ధ భూస్వామ్య వ్యవస్థగా ఉన్నట్లు, అందుకని 'వ్యవసాయక విప్లవమే ఇరుసుగా' ఉండాలని వారి రాజకీయ కార్యక్రమాలు తెలుపుతున్నాయి. అందుకే భూపోరాటాల ఎజెండా వారి కార్యక్రమంలో అతి ముఖ్యమైనది ఉంటుంది.

మరీ భూసమస్య కీలకమైనప్పుడు తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం, నక్సల్‌బరీ ఉద్యమంలో భాగంగా వచ్చిన శ్రీకాకుళం, గోదావరిలోయ, జగిత్యాల పోరాటాల తర్వాత ప్రస్తుతం అదే తీవ్రస్థాయిలో భూపోరాటాలు ఎందుకు జరగడం లేదనేది ప్రశ్నగా ఉంది. ఒకప్పుడు భూసమస్య ప్రధానంగా రైతాంగ కులాల సమస్యగా ఉంటే అది ప్రస్తుతం భూమిలేని వ్యవసాయ కూలీలు (ఎస్.సి.ల) సమస్యగా ఉంది. అయినప్పటికీ భూపోరాటాలు అనేవి కేవలం కాగితం మీది ఎజెండాగానే మిగిలిపోయాయి. ఈ అంశంమీద పి.ఎస్.అజయ్‌కుమార్ ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ మీద మంచి అధ్యయనం చేశారు.

1956లో 2.45 ఎకరాల నుంచి 10 ఎకరాలలోపు ఉన్నవారి కమతాలు మొత్తం కమతాలలో 74.56 శాతం ఉంటే వారి స్వాధీనంలో ఉన్న భూమి 85 లక్షల ఎకరాలు. అదే 2001 నాటికి ఈ వర్గాల కమతాల సంఖ్య 95.08 శాతానికి పెరిగింది. వాటి విస్తీర్ణం 255 లక్షల ఎకరాలకు పెరిగింది. ఇంకా మనం భూస్వాములు అని పిలిచే 25 ఎకరాల పైబడిన వారి కమతాలు 1956లో 8.69 శాతం కాగా వాటి విస్తీర్ణం 97 లక్షలు. అదే 2001 నాటికి కమతాలు 0.57 శాతానికి తగ్గి వాటి విస్తీర్ణం 26 లక్షల ఎకరాలకు తగ్గింది.

ధనిక పెద్ద రైతులకు చెందిన 25 శాతం వారి చేతుల్లో 66 శాతం భూమి 1956లో ఉండగా 2001 నాటికి ఈ వర్గాల భూకమతాలు సాగుదార్లు 5 శాతంగా ఉంటే వాటి విస్తీర్ణం 27 శాతంగా ఉంది. ఇందులో నుంచి ధనిక రైతులను తీస్తే పెద్ద కమతాల విస్తీర్ణం 7.5 శాతానికి తగ్గిపోయింది. ఇలా తగ్గిపోవడానికి చాలా కారణాలు ఉన్నాయి. అయితే కమ్యూనిస్టులు ఇంకా వ్యవసాయక విప్లవమే ఇరుసుగా అంచనా వేయడం మారుతున్న పరిస్థితులకు మారని సిద్ధాంతానికి ఉన్న అగాధమే వారిని విశాల ప్రజారాసుల నుంచి దూరం చేస్తున్నది. ఈ స్థానాన్ని పాత పార్టీలు, కొత్త పార్టీలు, కథానాయకులు, చిల్లర దేవుళ్లు భర్తీ చేస్తున్నారు. తాము పోరాడేందుకు భూస్వాముల కోసం వెతకడం కంటే వాస్తవ పరిస్థితులను గుర్తించి సిద్ధాంతాన్ని సృజనాత్మకంగా అన్వయించడం మంచిదేమో. భూస్వాములు లేని స్థితిలో భూపోరాటాలు ఎవరి మీద చేయాలి? ఎవరి భూములు ఎవరికి పంచాలనే సమస్య ఎదురవుతుంది. అందుకే వామపక్షాల పోరాటం చెదురుముదురుగా, ఎంపిక చేసుకున్న ప్రాంతాలకు, ఇళ్ల స్థలాలకు పరిమితం కావడం వెనక గల కారణాలను అన్వేషిస్తే మారుతున్న సమాజం, భూ సంబంధాలు మనకు కనిపిస్తాయి. (పి.ఎస్. అజయ్‌కుమార్, భూస్వాములు కావలెను, వార్త, అక్టోబర్ 22.2010) పైగా ఈనాడు భూమి వేరే అవసరాలకు మళ్లించబడుతుంది. పారిశ్రామిక అవసరాలకే కాక, ముఖ్యంగా రియల్ ఎస్టేట్ రంగం ముందుకు రావడంతో రైతుల నుండి భూమి బదలాయింపు జరుగుతున్నది.

*(మిగతా వచ్చే సంచికలో)*

*(రచయిత అర్థశాస్త్ర ఉపన్యాకుడు)* వీ

# డచ్ రోగం - 'జనతన' వాక్సిన్

*భారత ఆర్థిక వ్యవస్థలో తీవ్రమైన ఎగుడు దిగుళ్లు రావడానికి కారణాలేమిటో, ఆ డచ్ రోగానికిపరిష్కారమేమిటో వివరిస్తున్నారు* **వెన్నెలకంటి రామారావు**

రోగ లక్షణాల గురించి, కారణాల గురించి అవగాహన చేసుకుంటే, దాన్ని సగం నయం చేసినట్టే లెక్క. మనుషులకైనా, సమాజానికైనా ఇది వర్తిస్తుంది. దేశ స్థూల దేశీయోత్పత్తి (జిడిపి) రేటు పెరుగుదల గురించి పాలకులు ఎన్ని మాటలు చెప్పినా, ప్రపంచ ఆర్థిక సంక్షోభంలో భాగంగా మనదేశ ఆర్థికవ్యవస్థ అనేక రుగ్మతలతో ఉదాసీనంగా తయారైంది. ప్రజల కొనుగోలు శక్తిని పెంచడం ద్వారా దేశీయ మార్కెట్‌ను బలోపేతం చేసి, ఆర్థిక సంక్షోభాన్ని నివారించే చర్యల్ని చేపట్టడంలో మన పాలకుల విధానాలు విఫలమయ్యాయి. అందుకు భిన్నంగా ప్రజల కొనుగోలు శక్తిని, దేశీయ మార్కెట్ ను హరించి వేసే దిగుమతుల సరళీకరణ, విదేశీ మదుపులు ఆకర్షించే విధానాల ద్వారా కార్పొరేట్ శక్తులను బలోపేతం చేసే ద్రవ్య, ఆర్థిక విధానాలు పాలకులు చేపడుతున్నారు. అవి సంక్షోభాన్ని మరింత తీవ్రతరం చేశాయి. వలసానంతరం 1991 వరకు దేశంలో కొనసాగిన మిశ్రమ ఆర్థిక వ్యవస్థ 'హిందూ వృద్ధిరేటు' (3 శాతం జిడిపి వృద్ధి రేటు) అనే రోగంతో గిడసబారింది. దాంతో మన ఆర్థిక వ్యవస్థలో నెలకొన్న మాంద్యం సుదీర్ఘకాలం కొనసాగింది. పర్యవసానంగా చోటుచేసుకున్న సామాజికార్థిక రుగ్మతలకు సర్వరోగ నివారిణిగా 1991లో ప్రారంభించిన ఉదారీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ (ఎల్‌పిజి) సంస్కరణల చికిత్స క్రమంగా వికటించింది. దాంతో 'హిందూ వృద్ధి రేటు' రోగం కంటే ఎల్‌పిజి చికిత్స (ప్రపంచీకరణ) మరింత ప్రమాదకరంగా పరిణమించింది. ప్రపంచీకరణ పర్యవసానంగా దారిద్ర్య మహా సముద్రంలో సంపద ద్వీపాలు ఏర్పడిన చందంగా సమాజం తయారైంది.

**మైనింగ్ వేలం వెర్రి**

ప్రపంచీకరణ చికిత్స వల్ల ఎగుమతులు పెరిగి దేశం వాణిజ్య లోటులోకి జారుకుంది. ఖనిజాల వంటి సహజ సంపదల ఎగుమతులతో ఆర్థిక గందరగోళాన్ని చక్కదిద్దుకోవాలని విధాన కర్తలు ఆశించారు. వాణిజ్య ఆంక్షల్ని తొలగించారు. అందుకు అనుగుణంగా ఖనిజ ఉత్పత్తిని పెంచేందుకు 1993లో మైనింగ్ చట్టాన్ని పాలకులు సవరించారు. మైనింగ్ రంగంలోకి వంద శాతం విదేశీ ప్రత్యక్ష మదుపుల (ఎఫ్‌డిఐ) ప్రవేశానికి కేంద్రం అనుమతించింది. క్రమంగా ఖనిజ ఎగుమతులు పుంజుకున్నాయి. ప్రధానంగా 89 ఖనిజాలను మైనింగ్ చేస్తూ ప్రపంచంలోనే భారత్ నాల్గవ స్థానంలో నిలిచింది. ప్రపంచ బొగ్గు నిల్వల్లో 4వ స్థానంలోను, బాక్సైట్ నిల్వల్లో 5వ స్థానంలోను, ఇనుము, మాంగనీసు నిల్వల్లో 7వ స్థానంలోను ఉన్నది. 2000 నాటికి ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో ఖనిజ వాణిజ్య డిమాండ్ ఒక్కసారిగా అనూహ్యంగా పెరిగింది. దాంతో దేశీయ మైనింగ్ కార్యకలాపాలు బాగా విస్తరించాయి. దేశ ఆర్థిక కార్యకలాపాలలో మైనింగ్ ప్రాధామ్య రంగంగా మారింది. దాంతో స్వదేశీ, విదేశీ లాభదాయక మదుపుల గమ్యంగా మైనింగ్ రంగం మారింది. పర్యవసానంగా ఖనిజ సంపదలున్న ప్రాంతాల్లో భూ లావాదేవీలు పెరిగాయి. దాంతో నిర్వాసితుల సమస్య, పర్యావరణం, స్థానిక సంస్కృతుల విధ్వంసం తదితర సమస్యలు ప్రధానంగా ముందుకొచ్చాయి.

కర్ణాటకలో బళ్లారి, పశ్చిమాన సింగ్భూమ్, జార్ఖండ్ కోల్ బెల్ట్, ఒడిశాలోని కియోనఝార్, ఇబ్ లోయ, సుందర్ గఢ్, గుజరాత్‌లోని కచ్, జామ్‌నగర్, జునాగడ్, ఛత్తీస్‌గడ్‌లోని రాయ్‌గఢ్, గోవా ప్రాంతాలలోని హరిత వైవిధ్యం చాలానే ధ్వంసమైంది. జెఎస్‌డబ్ల్యు స్టీల్ లిమిటెడ్, జిందాల్ గ్రూప్, అదాని ఎంటర్ ప్రైజెస్, సెసా గోవా లిమిటెడ్, ఎఎస్‌పీల్ లిమిటెడ్... బల్డోడా గ్రూప్ తదితర కార్పొరేట్ మైనింగ్ దిగ్గజాలు పై ప్రాంతాల్లో పెద్ద ఎత్తున మైనింగ్ కార్యక్రమాల్ని చేపట్టాయి. దండకారణ్యం, తదితర ప్రాంతాలలో జరిగిన మైనింగ్ వ్యతిరేక ప్రజా ఉద్యమాల కారణంగా, ఐరన్ ఓర్ ఎగుమతుల కోసం ప్రజా ఉద్యమాలు బలంగాలేని కర్ణాటకలోని బళ్లారి ప్రాంతంపై ఖనిజ ఎగుమతి కంపెనీలు కేంద్రీకరించాయి. దాంతో దేశం మొత్తంగా జరుగుతున్న 240 మిలియన్ టన్నుల ఇనుప ఖనిజం ఎగుమతుల్లో 60 శాతం బళ్లారి జిల్లాలోని 124 మైన్‌లలోనే జరిగింది. 400 మైనింగ్ కంపెనీలు అక్రమ మైనింగ్ కార్యకలాపాలకు పాల్పడినట్లు కర్ణాటక లోకాయుక్త 2011 నివేదికలో వెల్లడించింది.

ఐరన్ ఓర్ మైనింగ్ కారణంగా బళ్లారి ప్రాంతంలో 45 శాతం హరిత వైవిధ్యం ధ్వంసమైంది. ఒక్క బళ్లారి తాలూకాలోనే 43 వేల హెక్టార్ల సాగు భూమి నిరుపయోగంగా మారింది. పొలాలపైన, పంటల పైన ఇనుప ఖనిజ ధూళి పేరుకుపోవడంతో ఫోటో సింథసిస్ (కిరణజన్య సంయోగ క్రియ) ప్రక్రియకు అవరోధం ఏర్పడి వ్యవసాయం దెబ్బతినింది. ఖనిజాల, మైనింగ్ రవాణా ప్రక్రియలలో తూర్పు, పశ్చిమ తీరాలలోని పోర్టులకు వెళ్లే రహదారులు, వాటి అంచున ఉన్న ప్రాంతాల్లోని వ్యవసాయం, వృక్షజాలం సైతం తీవ్రంగా దెబ్బతినింది. ముడి ఇనుము రవాణా కారణంగా రహదారుల విధ్వంసం, ప్రమాదాల కారణంగా ప్రజా ధనం, ప్రాణ నష్టాలు పెరిగాయి. ఊపిరితిత్తుల వ్యాధులు, టీబీ తదితర వ్యాధులు ప్రబలాయి. అక్రమంగా డబ్బు చలామణి, భారీ లాభాలు కారణంగా మైనింగ్ ప్రాంతాలలో మాఫియా గ్యాంగులు తలెత్తడం

ప్రపంచవ్యాప్తంగా సంభవిస్తున్న పరిణామం. దాంతో ప్రజల్లో వినిమయ సాంస్కృతిక వైపరీత్యం బాగా పెరిగింది. మద్యం, మత్తు పదార్థాల వాడకం, విశృంఖల వ్యభిచారం వంటి దురలవాట్లు తారస్థాయికి చేరుకుంటాయి. ఖనిజ వాణిజ్యం పెరిగేకొద్దీ డబ్బు చలామణి పరిమాణం, వేగం పెరుగుతుంది. రాజకీయ వ్యవస్థలు, ప్రభుత్వ యంత్రాంగం సహా సకల రంగాలలో ఇప్పటికే వ్యవస్థీకృతమైన అవినీతి పెచ్చరిల్లిపోయింది. మైనింగ్ మాఫియా విసిరే డబ్బు ప్రలోభానికి లోనైన బళ్లారి ప్రాంతం ఒక కమీషన్ల రాజ్యంగా అవతరించింది. పర్యవసానంగా స్వయంచలిత నియమాలతో నడుస్తున్నట్లు కనిపించే, భ్రమపెట్టే సకల రాజ్యాంగ వ్యవస్థలు, సంస్థలు, పౌర సామాజిక నిర్మాణాలు మైనింగ్ నడమంత్రపు సిరి పొగమంచులో గాడి తప్పుతాయి. బళ్లారిలోనూ అదే జరిగింది.

### భారత రిపబ్లిక్ గర్భంలో బళ్లారి రిపబ్లిక్

గాలి బ్రదర్స్ (జనార్దన్‌రెడ్డి, కరుణాకర్‌రెడ్డి, సోమశేఖర్‌రెడ్డి) బళ్లారి రిపబ్లిక్ స్థాపకులు. అనంతపురం జిల్లాలో ఏర్పాటు చేసిన 'ఓబులాపురం మైనింగ్ కంపెనీ' (ఓఎంసీ)ని అడ్డం పెట్టుకుని కర్ణాటకలోని బళ్లారి రిజర్వ్ ఫారెస్టును పెద్ద ఎత్తున అక్రమంగా తవ్వేశారు గాలి బ్రదర్స్. స్థానిక ప్రజలు ఆరాధించే, వారి సంస్కృతికి చిహ్నమైన సుగులమ్మ దేవత గుడిని పేల్చివేశారు. అక్రమంగా 27 లక్షల టన్నుల ఐరన్ ఓర్‌ని తవ్వి అమ్ముకున్నారు. గాలి బ్రదర్స్ అక్రమ మైనింగ్ వల్ల ఒక్క కర్ణాటక రాష్ట్రానికే 16,085 కోట్ల రూపాయల నష్టం వాటిల్లింది. మైనింగ్ డబ్బు మాయ ఆ ప్రాంతాన్ని కమ్మేయడంతో స్థానిక మైనింగ్ డబ్బు కేంద్రంగా మానవ వనరులు కేంద్రీకృతమయ్యాయి. మైనింగ్‌తో ప్రజల తలసరి ఆదాయం అయితే పెరిగింది కానీ, ఆ ప్రాంతంలోని సంప్రదాయ ఆర్థిక వ్యవస్థ కుదేలయింది. దీనికి సమాంతరంగా కొనుగోలు శక్తి పెరిగి జీవనశైలిలో మార్పు వచ్చింది. కానీ, స్థిరమైన జీవన ప్రమాణాలు బాగా పడిపోయాయి. సంపద తారతమ్యాలు గతంలో కంటే అధికమయ్యాయి. కాలుష్యం, దురలవాట్ల కారణంగా ప్రజారోగ్యం ఘోరంగా దెబ్బతినింది.

ప్రజా ఉద్యమాలేవీ లేకపోవడం, 'ఐరన్ ఓర్ రష్' (ఇనుప ఖనిజం వేలంవెర్రి)తో ప్రజలు వెంపర్లాడడం కారణంగా ఆ ప్రాంత సకల జీవన రంగాలపై బళ్లారి రిపబ్లిక్ ఆధిపత్యం నెలకొనింది. బళ్లారి ప్రాంతంలో భారత గణతంత్ర పాలన, యంత్రాంగం కుప్పకూలిందని లోకాయుక్త 2011 నివేదిక వెల్లడించింది. పంచాయితి నుంచి పార్లమెంట్ వరకు ప్రజా ప్రాతినిధ్య వ్యవస్థలు, రాజకీయ సంస్థలు, వివిధ ప్రభుత్వ శాఖల్లో విధులు నిర్వహిస్తున్న అధికార గణం, పోలీసు వ్యవస్థ, న్యాయ వ్యవస్థ, వివిధ ప్రజా సంఘాలు, ప్రతిపక్షాలు సైతం మైనింగ్ మాఫియా కనుసన్నల్లో నడుస్తున్న పరిస్థితి. దాంతో ప్రజా జీవనం అతలాకుతలమైంది. అయితే స్వయం చలిత నియమాలతో పనిచేస్తున్నట్టుగా మేధావుల్ని, ప్రజల్ని భ్రమింప చేసే పౌర, ప్రజాస్వామిక వ్యవస్థలు, సంస్థలు, రాజ్యాధికార అంగాలు ఆర్థిక వ్యవస్థలోని మైనింగ్ రంగంలో సంభవించిన అనూహ్య వ్యాప్తికి, లాభాపేక్షకు పేకమేడల్లా కూలిపోయాయి. పౌర ప్రజాస్వామిక, రాజ్యాంగ వ్యవస్థలు, సంస్థలు స్వతంత్రంగా పనిచేస్తూ, సమాజంలోని వైపరీత్యాలను నియంత్రిస్తాయన్న భ్రమల్ని బళ్లారి ఉదంతం భగ్నం చేసింది.

### సమాంతర రాజ్యం

రాజ్యాంగ వ్యవస్థలు, సంస్థల్ని నిర్వీర్యం చేసి భారత రిపబ్లిక్ గర్భంలోనే బళ్లారిలో ఒక సమాంతర, ప్రత్యామ్నాయ రాజ్య వ్యవస్థను గాలి బ్రదర్స్ ఏర్పాటు చేశారు. అయితే దేశ వ్యాప్తంగా మైనింగ్ ప్రాంతాల్లోని సకల జీవన రంగాలపై మాఫియా ముఠాలదే ఆధిపత్యం. ఇతర ఆర్థిక రంగాల్లోకి మైనింగ్ మాఫియా సామ్రాజ్యం చొరబడి ఆధిపత్యం వహించనంత వరకు మాత్రమే దాని విస్తరణకు, విజృంభణకు అవకాశం ఉంటుంది.

ఆ లక్ష్మణ రేఖ దాటినపుడు మాత్రమే దాన్ని కట్టడి చేసి వాణిజ్య, పారిశ్రామిక కార్యక్రమాలు యథాస్థితికి లేదా సాధారణ స్థితికి తీసుకొచ్చేందుకు రాజ్యం తనకు తాను 'ఒక సర్వసాధారణ రూపంలోని పాలకవర్గం'గా వ్యవహరిస్తుంది. తీవ్ర ఆర్థిక పరిణామాలు సంభవిస్తున్నపుడు ప్రజాస్వామిక పాలనకు హామీగా నిలిచే రిపబ్లిక్ (గణతంత్ర రాజ్యం) వ్యవహరించే తీరును, దాని 'సర్వసాధారణ పాలక వర్గ' స్వభావాన్ని, ప్రజాస్వామిక వ్యవస్థల, సంస్థల డొల్లతనాన్ని ప్రజలు అర్థం చేసుకోగలిగితే, దానికి హేతుబద్ధ ప్రత్యామ్నాయాన్ని వారు ఎంచుకోగలుగుతారు. నిజమైన ప్రజాస్వామ్యమనేది ఒక రాజకీయ అపవాదు మాత్రమేనన్న సత్యాన్ని ప్రజలు గుర్తించగలుగుతారు. సామాజిక వర్గ సమరాంగణంలో పౌర, ప్రజాస్వామిక సంస్థలు సామాజిక నిష్పాక్షికత అనే మేలి ముసుగును తొలగించుకొని వికృతంగా ప్రజల ముందు కొస్తాయన్న విషయం బళ్లారి రిపబ్లిక్ ఉదంతంతో మరోసారి రుజువైంది.

ఆర్థిక వ్యవస్థలోని ఖనిజాల మైనింగ్‌లో వచ్చిన ఆకస్మిక వాణిజ్యాభివృద్ధి (బూమ్) కారణంగా ఏర్పడిన సామాజికార్థిక విధ్వంసం పర్యవసానమే బళ్లారి రిపబ్లిక్. స్థానిక ప్రజల ప్రతిఘటన స్వభావంపై ఆధారపడి దేశవ్యాప్తంగా వివిధ మైనింగ్ ప్రాంతాల్లో మైనింగ్ మాఫియా సామ్రాజ్యాలు తరతమ భేదాలతో అవతరించిన విషయం తెలిసిందే. మాఫియా సామ్రాజ్యం ఉనికిలోకి వచ్చిన చోటల్లా మన గణ తంత్ర రాజ్య సర్వసత్తాకతకు గండిపడినట్టే లెక్క. బళ్లారి తరహా మైనింగ్ కార్యకలాపాలు దేశవ్యాప్తంగా ఖనిజ నిల్వలున్న ప్రాంతాలన్నిటిలోనూ విస్తరించి ఉంటే భారత రిపబ్లిక్ పరిస్థితి ఎలా ఉండేదో ఆలోచిస్తే ఒళ్లు గగుర్పాటుకు లోనవుతుంది. భారత రిపబ్లిక్‌కు సమాంతరంగా బళ్లారిలో జరిగినట్లుగా అనేక మైనింగ్ మాఫియా రిపబ్లిక్‌లు ఏర్పడి ఉండేవి. లేదా జాతీయ స్థాయిలో మరో మాఫియా రిపబ్లిక్ ఏర్పడే సంభావ్యతనూ కాదనలేం. పర్యవసానంగా అందుకు ప్రతిక్రియగా సమాజం అంతర్యుద్ధంలోకి జారిపోయే ప్రమాదం ఉంది. ప్రపంచవ్యాప్తంగా ఇలాంటి రాజకీయ పరిణామాలు అనేక దేశాల్లో సంభవించి ఉన్నాయి.

### డచ్ రోగం

సహజ వనరుల వంటి ఏదైనా ఒక ఆర్థిక రంగంలో అనూహ్యమైన అభివృద్ధి జరగడానికీ, అదే సమయంలో సామాగ్రి ఉత్పత్తి లేదా వ్యవసాయ రంగాలు క్షీణించడానికీ మధ్య స్పష్టంగా కనిపిస్తున్న కార్యకారణ సంబంధాన్ని 'డచ్ రోగం' అని ఆర్థికవేత్తలు సూత్రీకరించారు. సాధారణంగా ప్రకృతి వనరుల వాణిజ్య రంగాన్ని దీనికి ఏకైక ఉదాహరణగా తీసుకుంటుంటారు. ఆర్థిక వ్యవస్థలోని ఏ రంగంలో జరిగిన అనూహ్య వృద్ధికైనా ఇది వర్తిస్తుంది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో ఏదైనా ఒక రంగంలో తలెత్తే భారీ డిమాండ్‌కు అనుగుణంగా దేశంలోనికి

ప్రవహించే భారీ విదేశీ మారక ద్రవ్యం (సహజ వనరుల ధరలు భారీగా పెరగడం సహా), విదేశీ నిధుల సహాయం, విదేశీ ప్రత్యక్ష, పరోక్ష మదుపుల ప్రవాహం పెరగడం వగైరా పరిణామాలు డచ్ రోగానికి కారకమవుతాయి. 1959లో డచ్‌లోని గ్రానింగ్జెన్ ప్రాంతంలో ఆయిల్ నిక్షేపాల్ని డచ్ (ప్రస్తుతం నెదర్లాండ్స్) ప్రభుత్వం కొత్తగా కనుగొనింది. అప్పటి నెదర్లాండ్స్ ప్రభుత్వం ఆ సహజవాయువు వాణిజ్యంపై ప్రధానంగా దృష్టి కేంద్రీకరించి ప్రపంచ మార్కెట్లో ఇతర దేశాలతో విజయవంతంగా పోటీ పడింది. గ్యాస్ ఉత్పత్తి కోసం పెద్ద ఎత్తున స్వదేశీ, విదేశీ మదుపులు, గ్యాస్ వాణిజ్యంలో భారీగా విదేశీ మారక ద్రవ్యాన్ని డచ్ సమీకరించ గలిగింది. ఈ నేపథ్యంలో డచ్ తలసరి ఆదాయం భారీగా పెరిగినా, ఇతర రంగాలలో అభివృద్ధి దెబ్బతినడంతో ఆర్థిక వ్యవస్థ కుంటుపడింది. గ్యాస్ ఎగుమతులు తప్ప మిగతా వస్తుసామగ్రి రంగం (మాన్యుఫాక్చరింగ్ రంగం) ఎగుమతుల వాణిజ్యం ఘోరంగా దెబ్బతినింది.

విదేశీ మదుపులు, వాణిజ్య ఆదాయాలు దేశంలోకి ప్రవహించడంతో డచ్ కరెన్సీ విలువ పెరిగి, డచ్ వస్తువుల ధరలు అంతర్జాతీయ విపణిలో భారీగా పెరిగాయి. దాంతో డచ్ సామగ్రి సరకుల గిరాకీ బాగా క్షీణించింది. డచ్ ఎగుమతులు క్షీణించడంతో దేశీయ వస్తూత్పత్తి రంగం కుదేలయింది. అన్ని రంగాలలో స్వదేశీ వస్తువులకు ప్రత్యామ్నాయంగా చౌకగా దిగుమతులుండడంతో వస్తూత్పత్తి రంగం పూర్తిగా తుడిచిపెట్టుకు పోయింది. దేశీయ నైపుణ్యం, వస్తూత్పత్తి సామర్థ్యం అంతరించిపోయింది. నిరుద్యోగం తీవ్రంగా ప్రబలింది. దాంతో నెదర్లాండ్స్ ఆర్థిక వ్యవస్థ వేగంగా ఆర్థిక మాంద్యంలోకి జారిపోయింది. పర్యవసానంగా సామాజిక అశాంతి పెచ్చరిల్లిపోయి, ప్రజా ఉద్యమాలు ముందుకొచ్చాయి. ఈ డచ్ రోగం అనే సామాజికార్థిక సమస్య ప్రపంచంలోని అతి పెద్ద సామ్రాజ్యాల అంతర్గత ఆర్థిక వ్యవస్థల్ని సైతం దెబ్బతీసింది.

రోమ్ సామ్రాజ్యం రిపబ్లిక్‌గా మారుతున్న సమయంలోనూ, వలసవాద బ్రిటీష్ సామ్రాజ్యం అత్యున్నత స్థాయికి చేరుకున్న దశలోనూ వాటి అంతర్గత ఆర్థిక వ్యవస్థలు డచ్ రోగంతో అతలాకుతలమయ్యాయి. ఆధునిక కాలంలో ఆయిల్ వాణిజ్యంతో వెనెజులా; వజ్రాలు ఆయిల్ వాణిజ్యంతో అంగోలా; వజ్రాల ఎగుమతులతో కాంగో; ఆయిల్, గ్యాస్ వాణిజ్యంతో రష్యా; ఫాస్పేట్ ఎగుమతులతో సౌరా దేశాలు డచ్ రోగగ్రస్థ దేశాలుగా మారాయి. 19వ శతాబ్దంలో (1859 కెయిర్న్)లో ఆస్ట్రేలియాలో బంగారంపై వేలంవెర్రి; 2000, 2010లలో ఆస్ట్రేలియా ఖనిజ వాణిజ్యం; 2000లో చిలీలో రాగి ఖనిజం; 2000లో అజర్బైజాన్ ఆయిల్; అథబాస్కా ఆయిల్‌తో కెనడా; 1974, 1979 ఆయిల్ బూమ్‌తో ఇండోనేషియా; 1990లలో నైజీరియా తదితర ఆఫ్రికా దేశాలు; 16వ శతాబ్దంలో బంగారం, తదితర సంపదల అక్రమ దిగుమతుల కారణంగా స్పెయిన్, పోర్చుగల్; 1970-90ల మధ్య నార్త్ సీ ఆయిల్ వల్ల నార్వే, యూకేల వస్తూత్పత్తి రంగాలు దెబ్బతిన్న ఉదంతం డచ్ రోగానికి సజీవ సాక్ష్యాలుగా నిలుస్తాయి. ఆ దేశాల తలసరి ఆదాయాలు తాత్కాలికంగా పెరిగి, వాణిజ్యేతర సేవల రంగాలు బుడగలాగా పెరిగి, స్వదేశీ ఆర్థిక వ్యవస్థ దెబ్బతిని సంక్షోభంలో కూరుకుపోయాయి.

**వాణిజ్య, వాణిజ్యేతర రంగాలు... వలసలు**

డచ్ రోగం వల్ల ఆర్థిక వ్యవస్థలో తలెత్తే పరిణామాలు చూద్దాం. ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా వాణిజ్య, వాణిజ్యేతర రంగాలుగా విభజితమైంది. వాణిజ్య రంగం రెండు విభాగాలుగా 1.ఆకస్మిక వాణిజ్యాభివృద్ధి రంగం (బూమింగ్ సెక్టార్), 2. మందకొడి అభివృద్ధి రంగం (నాన్ బూమింగ్) లేదా (లాగింగ్ = వెనకబడిన) విభజితమై ఉంది. వాణిజ్యేతర రంగం అనేది వివిధ రకాల సేవలు, మౌలిక సదుపాయాల కల్పన తదితర (పాదార్థికేతర) ఆర్థిక కార్యకలాపాలతో కూడుకొని ఉంది. ఈ రెండు రంగాల మధ్య సంతులిత సమన్వయంతోనే ఒక ఆర్థిక వ్యవస్థ ఆరోగ్యకరంగా పురోగతి చెందుతుంది. అలాగాక వాణిజ్య, వాణిజ్యేతర రంగాల మధ్య ఆదాన ప్రదానాలలో అసమతుల్యత ఏర్పడితే సంక్షోభం వస్తుంది.

ఆయిల్, గ్యాస్, బంగారం, వెండి, వజ్రాలు తదితర విలువైన రాళ్లు, బొగ్గు, బాక్సైట్ తదితర ఖనిజాలు వగైరా సహజ సంపదలు ఆకస్మిక వాణిజ్యాభివృద్ధి (బూమింగ్) రంగం పరిధిలోకి వస్తాయి. కాఫీ, కోకో, పత్తి, ఆహార ధాన్యాలు, తృణ ధాన్యాలు, నూనె గింజలు తదితర వ్యవసాయోత్పత్తులు, మాన్యుఫ్యాక్చరింగ్ (వస్తు సామగ్రి) వంటివి నాన్ బూమింగ్ అంటే మందకొడి వాణిజ్యాభివృద్ధి (లాగింగ్) రంగం పరిధిలోకి వస్తాయి. ప్రకృతి వనరుల వాణిజ్యం ఊపందుకోగానే శ్రమశక్తి గిరాకీ పెరుగుతుంది. దాంతో వస్తూత్పత్తి, వ్యవసాయం వంటి నాన్ బూమింగ్ (మందకొడి వాణిజ్యాభివృద్ధి) రంగం నుంచి ఆకస్మికాభివృద్ధి రంగం వైపుకు శ్రమశక్తి తరలిపోతుంది. బూమింగ్ రంగంలో ఉపాధి అవకాశాలు పరిమితం కావడం మూలాన వలసలు అంత పెద్ద ఎత్తున జరగవు. అయితే బూమింగ్ సెక్టార్ లో ఉత్పన్నమయ్యే భారీ ఆదాయాలు దేశ తలసరి ఆదాయాన్ని ఒక దశ వరకు పెంచడంతో సమాజంలో వినిమయ సంస్కృతి బాగా ప్రబలుతుంది. 'వినిమయ ప్రభావం' (స్పెండింగ్ ఎఫెక్ట్)తో వాణిజ్యేతర (సేవలు, మౌలిక సదుపాయాల కల్పన వగైరా) రంగం వేగంగా పెరుగుతుంది. దాంతో శ్రమశక్తి వనరులు (మానవ వనరులు) సేవల రంగం వైపుకు పెద్ద ఎత్తున తరలి పోతాయి. ప్రధానంగా మందకొడి వాణిజ్యాభివృద్ధి రంగం నుంచి వస్తు సామగ్రి ఉత్పత్తి, వ్యవసాయ రంగం నుంచి భారీగా వలసలు సంభవిస్తాయి.

వాణిజ్య రంగంలోని ఆకస్మిక వాణిజ్యాభివృద్ధి (బూమింగ్) ఉపరంగంలోకి నాన్ బూమింగ్ ఉపరంగం (వ్యవసాయం, వస్తూత్పత్తి తదితరాలు) నుంచి వచ్చే శ్రమశక్తి వలసల ప్రక్రియను ప్రత్యక్ష అపారిశ్రామికీకరణ (డైరెక్ట్ డి. ఇండస్ట్రియలైజేషన్) అని పిలుస్తారు. ఇది ఆరోగ్యకర పరిణామం. పెట్టుబడిదారీ విధానంగా ఒక సమాజం సంఘటితం అయ్యేందుకు ఇది దోహదం చేస్తుంది. అదే విధంగా నాన్ బూమింగ్ రంగం (వ్యవసాయం, వస్తు సామగ్రి ఉత్పత్తి తదితరాలు) నుంచి శ్రమశక్తి వలసల ప్రక్రియ వాణిజ్యేతర రంగం (సేవలు, మౌలిక సదుపాయాల కల్పన వగైరా)లోకి ఉన్నట్లయితే, దాన్ని పరోక్ష అపారిశ్రామికీకరణ (ఇండైరెక్ట్ ఇండస్ట్రియలైజేషన్) అని పిలుస్తారు. అయితే ప్రపంచార్థిక వ్యవస్థ కేంద్రంగా ఉన్న అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ పారిశ్రామిక దేశాల్లో వలసల ప్రక్రియ ప్రధానంగా ప్రత్యక్ష పారిశ్రామికీకరణ రూపంలో జరిగింది. ఆ తర్వాత అక్కడ పెట్టుబడిదారీ విధానం ద్రవ్య పెట్టుబడిదారీ విధానంగా మారడంతో పరోక్ష అపారిశ్రామికీకరణ ప్రక్రియ రూపంలోని వలసల ప్రధాన స్వభావంగా మారింది.

*(మిగతా వచ్చే సంచికలో)*

*(రచయిత పాత్రికేయులు)*

వీ

# తరాలు మారినా మారని మన్యం వైద్యం

**అటవీ ప్రాంతాలలో, మారుమూల గ్రామాల్లో నివసిస్తున్న ఆదివాసులకు, ప్రజలకు ప్రాథమిక వైద్యం అందుబాటులో లేకుండా పోయిందనీ, పాలకుల నిర్లక్ష్యం, వెనుకబాటు కారణంగా ప్రజలు ప్రాణాలు కోల్పోతున్నారనీ అంటున్నారు జి.రజిని కుమారి**

నాగరికతకు దూరంగా, అడవుల్లో, కొండల్లో కోనల్లో దయనీయ స్థితిలో జీవిస్తున్నవారు ఆదివాసి గిరిజనులు. జబ్బు వస్తే నయం చేయించుకోలేని పరిస్థితుల్లో ఈ ప్రజానీకం జీవిస్తున్నారు. ఆసుపత్రికి కొండంత దూరం, వారి జీవనానికి భారం. ప్రభుత్వ ఆసుపత్రులలో అందని వైద్యం, ప్రైవేట్ వైద్యం చేయించుకోలేని దైన్యం. ఆసుపత్రిలో కన్నుమూసిన వారిని ఇంటికి చేర్చడానికి పెనుభారంగా మారుతున్న పరిస్థితులు. తరాలు మారుతున్నా టెక్నాలజి పెరుగుతున్నా వారి జీవన విధానంలో, సామాజిక పరిస్థితులలో ఇంకా వెనుకడుగులోనే ఉన్నాయి.

ఖమ్మం జిల్లా, భద్రాచలం ఐ.టి.డి.ఎ. పరిధిలో 10 ఏజెన్సీ మండలాల్లో గిరిజనుల ఆరోగ్య పరిస్థితిపై జరిపిన పరిశోధన జరిపాం. ఐ.టి.డి.ఎ., భద్రాచలం పరిధిలో జిల్లా అదనపు ఆసుపత్రి -1, ఏరియా ఆసుపత్రులు - 3, కమ్యూనిటి హెల్త్, న్యూట్రిషన్ సెంటర్స్ - 12, కమ్యూనిటి హెల్త్ సెంటర్స్ - 5, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు -38, ఉప ఆరోగ్య కేంద్రాలు - 340, ఎచ్.ఐ.వి. / ఎయిడ్స్ నియంత్రణ కేంద్రం - 1, నవజాత శిశు సంక్షేమ కేంద్రం -1, సీమాంక్ కేంద్రాలు -2, పోషకాహార, పునరావాస కేంద్రం -1, అదనపు జిల్లా టి.బి. నివారణ కేంద్రం - 1, జిల్లా మలేరియా కార్యాలయం -1, నర్సింగ్ ట్రైనింగ్ స్కూల్, యాంటి యాస్ యూనిట్ -1, బ్రాంచ్ డ్రగ్ స్టోర్ -1, బర్త్ వెయిటింగ్ హోమ్స్ -3, మాతా శిశు సంరక్షణ, ఎపిడెమిక్ టీమ్స్ -7, 104-21, 108-17 ఉన్నవి. తగినన్ని డాక్టర్స్, స్టాఫ్‌నర్స్, ఎం.పి.ఎచ్.ఎ(ఎఫ్), ఎం.పి.ఎచ్.ఎ.(ఎం) ఫార్మసిస్ట్స్, ల్యాబ్ టెక్నిషియన్స్, ఎచ్.ఇ.ఒ., ఎం.పి.ఎచ్.ఇ.ఒ., ఎం.పి.ఎచ్.ఎస్. (ఎం), ఎం.పి.ఎచ్.ఎస్.(ఎఫ్), పి.ఎచ్.ఎన్., ఆశా వర్కర్స్ పోస్టులతో ఏజెన్సీలో వైద్యశాఖ పనిచేస్తున్నది. అయినప్పటికి చిన్న చిన్న వ్యాధులతో గిరిజనం మరణిస్తున్నది. అందుకు కారణాలు అనేకమని చెప్పవచ్చును.

ఏజెన్సీలో పది మండలాలైన వెంకటాపురం, చర్ల, దుమ్ముగూడెం, బూర్గంపహాడ్, అశ్వాపురం, మణుగూరు, పినపాక, పాల్వంచ, ఇల్లందు, గుండాలలలో గల పి.ఎచ్.సి.లలో డాక్టర్స్, సిబ్బందితో మాట్లాడి తెలుసుకున్న కొన్ని అంశాలు, ఆ గ్రామాలలోని ప్రజల నుండి సేకరించిన విషయాల ప్రకారం ఏజెన్సీ మారుమూల గ్రామాల్లో ప్రజల కోసం ఏర్పాటు చేసిన ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో వనరుల కొరత, సౌకర్యాలలేమి, మరుగు దొడ్లు, మంచినీరు, పడక గదులు, మందుల కొరత వలన గిరిజనులు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. గతంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల భవనాలే లేని దుస్థితి. ప్రస్తుతం అన్ని పి.ఎచ్.సి.లకు భవనాలు ఏర్పాటు చేశారు. అయినప్పటికీ సిబ్బంది కొరత వెంటాడుతున్నది. ఎ.ఎన్.ఎం. కాంట్రాక్ట్ పద్ధతిలోనే ఎక్కువగా కొనసాగుతున్నారు. ఎంతకాలం చేసినా ఇదే జీతభత్యాలతో గడపాలని అసంతృప్తి వారిని వేధిస్తున్నది. సీనియారిటీ ప్రకారం ప్రమోషన్స్ లేవని నిరాశ కూడా ఉన్నది. సకాలంలో వైద్యులు అందుబాటులో ఉండడం లేదు. అన్ని మందులు సకాలంలో అందని పరిస్థితి.

పి.ఎచ్.సి.ల కంటే గిరిజనం ఆర్.ఎం.పి. ల మీదనే ఎక్కువగా ఆధారపడి బతుకుతున్నారు. ఆశా వర్కర్స్‌కు కనీస వేతనం ఇవ్వడం లేదని ధర్నాలు సైతం చేశారు. గ్రామాల్లో అందుబాటులో ఉంటూ ఆరోగ్య పరిస్థితులు తెలుసుకొని పి.ఎచ్.సి. వరకు పంపించడం వారి బాధ్యత. అయినప్పటికీ వారికి ఇచ్చే రు. 500లు కూడా సరిగా ఇవ్వని ప్రభుత్వం అక్కడి సిబ్బంది సైతం అసౌకర్యాలను గురించి వివరించారు.

మన్యంలో ఉన్న గిరిజనులకు వైద్యం అందించడానికి మేము సిద్ధంగా ఉన్నామని మా వంతు కృషి చేస్తున్నామని ప్రభుత్వం చెబుతున్నది. ఆరోగ్య సేవల కోసం మొబైల్ టీమ్‌లు సైతం అడవులలో సంచరిస్తూ ప్రాథమిక వైద్యాన్ని అందిస్తున్నారని తెలిపింది. అడవులలో వర్షాకాలంలో వాగులు, వంకలు దాటి వెళ్లడం వలన ఇబ్బందికర పరిస్థితులు ఎదుర్కొంటున్నారని, ఫీల్డ్ ఎ.ఎన్.ఎం.లు విధిగా గ్రామాలలో సంచరిస్తున్నారని, అయినప్పటికీ గిరిజనుల ఆరోగ్యాన్ని మెరుగుపరచలేక పోతున్నారన్నారు. మలేరియా, టైఫాయిడ్ జ్వరాలతోనే చాలామంది చనిపోతున్నారు. టి.బి., ఎయిడ్స్ వంటి వ్యాధులు వారిని వదలడం లేదు. నిరక్షరాస్యత, అవగాహన లేమి, మితిమీరుతున్న మూఢనమ్మకాలు వారిని వీడడం లేదు.

### గ్రామాల్లో ఆదివాసి వైద్య పరిస్థితులు

దట్టమైన అడవులలో నివసిస్తున్న చర్ల మండలంలోని కుర్నపల్లి, బత్తినపల్లి, రామచంద్రాపురం వంటి గ్రామాలకు వెళ్లాలంటే వర్షాకాలంలో కత్తిమీద సాము లాంటిది. చాలా వాగులు, వంకలు దాటాలి. చూడడానికి పెద్ద గ్రామంలా కనిపిస్తున్న కుర్నపల్లిలో టి.బి. తాండవం చేస్తున్నవి. పసిపిల్లలు గ్లాండ్స్‌తో ఇబ్బంది పడుతూ, నడవలేని స్థితిలో నరకం అనుభవిస్తున్నారు. అదే విధంగా కడుపులో గడ్డలు (కణుతులలో) మరణిస్తున్న మహిళలు ఉన్నారు. జన్యుపరమైన వ్యాధులతో చిన్నపిల్లల్లో పెరుగుదల లేకుండా ఆగిపోయినవారు ఉన్నారు. అక్కడి ప్రజలకు అందుబాటులో ఒక సబ్ సెంటర్ అయినా లేదు. బత్తినపల్లి అనే గ్రామంలో అపరిశుభ్రత తాండవిస్తుంది. మలేరియా, టైఫాయిడ్‌లతో జనం అల్లాడుతూనే ఉన్నారు. నిరక్షరాస్యత పూర్తిగా కనిపిస్తున్న గ్రామం అది. దానికి తోడు మితిమీరిన మూఢనమ్మకాలు. దేవర దగ్గరకు వెళితేనే

జబ్బు నయం అవుతుందని గాఢంగా నమ్ముతున్న గ్రామాలవి. దుమ్ముగూడెం మండలంలో చినబండిరేవు ప్రాంతంలో ఎయిడ్స్‌తో చనిపోతున్న వారు ఉన్నారు. అక్కడ ప్రజలు వాడుతున్న నీరు కారణంగా ఒళ్లునొప్పులు, కీళ్ల నొప్పులతో బాధపడుతున్నారు.

బూర్గంపహాడ్ మండలం అటవీ ప్రాంతమైన ఊర్లదోసపల్లిలో వలస ఆదివాసులు నివాసముంటున్నారు. అక్షరం ముక్క చదువుకున్న వారు లేరు. అపరిశుభ్రతతో నిండి ఉన్న గ్రామం. సరైన ఆహారపు అలవాట్లు కూడా లేకుండా జీవనం సాగిస్తున్నారు. నాటుసారా తాగుతూ, దొరికింది తింటూ జీవిస్తున్నారు. నకిరిపేట, వేపులగడ్డ, గోపాలపురం గ్రామాల్లో ఏమి జరిగినా చేతబడి తప్ప, మరో ఆలోచనే లేకుండా జీవితాలను చేజార్చుకుంటున్నారు. మంచినీరు పరంగా చూస్తే అందరూ చేతిపంపు నీటి మీద ఎక్కువగా ఆధారపడుతున్నారు. దగ్గరలో గల పి.ఎచ్.సి.లను వినియోగించుకుంటున్న ప్రజలు తక్కువ. భద్రాచలం దగ్గర ప్రాంతం అవడం వలన ప్రైవేటు ఆసుపత్రులకు పరుగులు తీస్తున్నారు. పాల్వంచ మండలంలోని కొత్తూరు, మల్లారం, ఉల్వనూరు, గంగమ్మకాలనీలకు పి.ఎచ్.సి. సౌకర్యం ఉన్నప్పటికీ డాక్టర్స్ అందుబాటులో లేకపోవటం, పాల్వంచకు చేరుకోవడానికి సుమారు 70 కి.మీ. దూరం వలన ప్రజలు అవస్థలు పడుతున్నారు.

మల్లారం గ్రామంలో స్థానికంగా నివాసం ఉంటూ ఆర్.ఎం.పి.లు వైద్యసేవలు అందిస్తున్నారు. కాని ప్రాథమిక వైద్యం వారికి అందడంలేదు. వెంకటాపురం మండంలోని ఆలుబాక, ముత్తారం, రామచంద్రాపురం, ముర్రవానిగూడెం ప్రజలు కొంత వరకు పి.ఎచ్.సి.లకు వెళ్తున్నారు. కాని కొన్ని పెద్ద జబ్బులకు వైద్య ఖర్చులను ఎదుర్కొనలేక చనిపోతున్నారు. ఇప్పటికీ బావి నీటినే మంచినీరుగా తాగుతూ జీవిస్తున్నారు. ప్రభుత్వ పథకాలకు చాలా దూరంగా నివాసిస్తున్నారు. అశ్వాపురం మండలంలోని కొత్తూరు, తుమ్మలచెరువు, వెంకటాపురం, మామిళ్లవాయి గ్రామాలు కాస్త పి.ఎచ్.సి. వైద్యం వినియోగించుకుంటున్న వారు ఉన్నారు. ప్రైవేటు వైద్యానికి భద్రాచలం చేరుతున్నారు.

మామిళ్లవాయి గ్రామం నందు తెల్లం పున్నమ్మ అనే ఆశా వర్కర్ తన భర్త మలేరియా కారణంగా మరణిస్తే అది ఆమెలో స్ఫూర్తిని నింపింది. మరొకరు ఎవరూ తన భర్తలా కాకూడదనే ఉద్దేశంతో ప్రతి ఒక్కరిని గ్రామంలో పరిశీలిస్తూ సకాలంలో వైద్యసేవల కొరకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు తీసుకుపోతున్న వైనం ఎందరికో స్ఫూర్తిదాయకం. జిల్లా కలెక్టర్ చేతులు మీదుగా అవార్డు తీసుకున్న ఘనత తనకు దక్కినది. అయితే ఈమెలాంటి స్ఫూర్తి ఆస్పత్రి సిబ్బందిలో కొరవడింది. ఆశా వర్కర్స్‌ను మరికొంత చదువు వైపుకు ప్రోత్సహిస్తూ తగిన పారితోషికం ఇప్పించినట్లయితే మరింత పురోగతి కనిపించవచ్చు.

మణుగూరు మండలం నందు తిర్లాపురం, చినరావిగూడెం, గట్టు మల్లారం, కట్టుమల్లారం, గనిబోయిన గుంపు ప్రజలు ఇంకా ఆరోగ్యాన్ని మెరుగుపరుచుకునే స్థితిలో లేరు. తిర్లాపురంలో టి.బి., ఎయిడ్స్‌తో బాధపడేవారు ఎక్కువగానే ఉన్నారు. టి.బి.మందులు పూర్తిగా వాడక పోవడం వలన మరణాన్ని కొని తెచ్చుకుంటున్నారు.

గుండాల మండలం సుదూర అటవీ ప్రాంతం. రహదారులు సైతం సరిగా లేకుండా వాగులు, వంకలు, దాటుతూ చేరవలసిన మండలం. అనారోగ్య పరిస్థితులు ఏర్పడితే ఖమ్మంకు రావాలంటే సరైన రోడ్డు రవాణా లేదు. అయితే కొంతవరకు రవాణా పరంగా ఈ మధ్యకాలంలో రోడ్డు సౌకర్యాన్ని కల్పించారు. అయినప్పటికీ గిరిజనులు ప్రైవేటు వైద్యాన్ని వినియోగించుకుంటున్నారు. అత్యవసర పరిస్థితులలో నాటు వైద్యం, ఇంకా చెప్పాలంటే మంత్రగాడిని ఆశ్రయిస్తూ వైద్యాన్ని చేయించు కుంటున్నారు. కాని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను విస్మరిస్తున్నారు. దీనికి ఇక్కడ ప్రచార కార్యక్రమాలు ఆరోగ్యం పట్ల అవగాహనను కల్పిస్తున్నట్లు వైద్య సిబ్బంది కనిపించడం లేదు. గర్భిణీలు ఇబ్బందులు పడక తప్పడం లేదు. పాముకాటు, తేలుకాటుకు మందులు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో తక్కువగా లేదా అసలు లేని పరిస్థితులు ఉన్నాయని ప్రభుత్వ ఆసుపత్రి సిబ్బంది చెబుతున్నారు.

104, 108 వాహనాలు విధిగా నడపవలసిన ఆస్పత్రులు డీజిల్ లేదని, మరమత్తులు అని కొన్ని చోట్ల మూలనపడ్డవి. దీని మూలంగా అడవి ప్రజలు జెట్టీల సహాయంతో రోగిని కొన్ని కిలోమీటర్ల వరకు మోస్తూ కాలినడకన తీసుకుని వస్తున్నారు. ఈ మధ్యలో రోగి పరిస్థితి గాని, గర్భిణి పరిస్థితి గాని విషమిస్తే ప్రాణాలు వదలడమే. 108 సౌకర్యం ఉండికూడా దాని సహకారాన్ని పూర్తిగా వినియోగించుకోలేక పోతున్నారు.

మరోవైపు ఆరోగ్యశ్రీ పథకం పేద ప్రజల కోసమే అని నడుస్తు న్నప్పటికీ దానిని వినియోగించుకోలేరు. పూర్తిస్థాయిలో వారికి అవగాహన లేదు. పెద్ద జబ్బు అనగానే ప్రైవేట్ వైద్యం వైపు పరుగులు తీస్తున్నారు. మోయలేని కొండంత ఆర్థిక భారంతో చనిపోతున్నారు. కార్పొరేట్ వైద్యం అనేది వారికి తీరని కల మాత్రమే.

పల్లెల్లో విజృంభిస్తున్న విష జ్వరాలు డెంగ్యూ, మలేరియా, టైఫాయిడ్, టి.బి., ఎయిడ్స్ వంటి రోగాలను నివారించడానికి సరైన స్థాయిలో ప్రచారం అవసరం. అవగాహనను కల్పించవలసిన బాధ్యత వైద్య సిబ్బందిదే. ఈ లోపం ప్రతి గ్రామంలో కనిపిస్తున్నది. కనీసం వైద్యం అందక ఇప్పటికీ చనిపోతున్నవారు ఉన్నారు.

గర్భిణీ స్త్రీలు ప్రసవ వేదనను అనుభవిస్తున్నారు. సుదూర ప్రాంతాలలో నివాసం వారికి శాపంగా మారింది. ఈ పరిస్థితే ఆసుపత్రిలో రోగి మరణిస్తే కనీసం ఇంటికి తీసుకుని వెళ్లడానికి ఖర్చుకు డబ్బులు లేక కొన్ని కిలోమీటర్లు భుజంపైనే మోస్తూ ఇంటికి చేర్చి దహన ఖర్చులు సైతం లేకుండా పేదరికం అనుభవిస్తున్నారు.

ముందుగా వివరించిన ప్రకారం ఆస్పత్రి సౌకర్యాలు అన్నీ ఉన్నప్పటికీ మన్యంలో గిరిజనులకు వైద్యం మాత్రం పూర్తిస్థాయిలో అందడం లేదు. ఇన్ని మండలాలలో పరిశీలన తరువాత తెలిసిన అంశం ప్రభుత్వ వైద్యశాలకు వెళ్లి వైద్యం చేయించుకుంటున్నవారు తక్కువగా ఉంటున్నారు. ఇందుకు కారణం 'ప్రభుత్వ ఆసుపత్రులకు వెళితే పూర్తిస్థాయిలో జబ్బులు తగ్గవు' అని గిరిపుత్రులు గట్టిగా నమ్ముతున్నారు. ఈ భావనను పూర్తిగా మార్చే విధంగా ప్రభుత్వ ఆసుపత్రులు పనిచేయాలి. ఇంకా ప్రభుత్వ వైద్యశాఖ చొరవ చూపి ప్రచార కార్యక్రమాలు ఎక్కువగా చేస్తూ, అందుబాటులోనే డాక్టర్లు, సిబ్బంది ఉంటూ తగిన కృషిని చేస్తే గనుక ఆశించిన ఫలితాలు అందుకోవచ్చును.

గిరిజనం కూడా సుదూర ప్రాంతాలలో నివసించినప్పటికీ సకాలంలో వైద్యం చేయించుకోవడం అవసరం. మూఢనమ్మకాలు, నాటు వైద్యం

# చర్చ గురించిన చర్చ

- లంకా పాపిరెడ్డి

ఫిబ్రవరి వీక్షణంలో ప్రసాద్, ప్రీతమ్‌లు మరోసారి వారి అభిప్రాయాలను వ్యక్తం చేశారు. వీరితో పాటు కస్తూరి రావిపాటి కూడా ఒక లేఖ రాశారు. విషయంలోకి వెళ్లడానికి ముందు చర్చ గురించి కొద్దిగా చర్చిద్దాం. రంగనాయకమ్మను ఎవరైనా విమర్శిస్తే, వారు ఏదో పాత కోపాలతో కక్ష్యలతోనే విమర్శిస్తున్నారని రంగనాయకమ్మ అభిమానులు అదే పనిగా రాస్తున్నారు. ప్రతీకారం తీర్చుకోవడానికే విమర్శిస్తున్నారు అంటున్నారు. ప్రసాద్ 'ప్రతీకార పునరుద్ఘాటన' అని రాశారు. కస్తూరి రావిపాటి 'రంగనాయకమ్మ పట్ల ఇతరేతర వ్యతిరేకత ఉంటే తప్ప... ఆ కారణం చేతనే లింగమూర్తి రంగనాయకమ్మ పట్ల వాస్తవ విరుద్ధమైన వ్యాఖ్య ఇంకోటి చేశారు' అంటూ రాశారు. ఇలా రాయడం వెనక ఉన్న ఉద్దేశ్యం ఏమిటి? లేక అర్థం ఏమిటి? అంటే రంగనాయకమ్మ 'విమర్శకు' (తిట్లకు, శాపనార్థాలకు) గురైనవారు ఎవరూ కూడా ఇక వారిని విమర్శించకూడదా? ఒకసారి రంగనాయకమ్మ ఇంటు × గుర్తుపెడితే వారు ఖతం అన్నమాట. ఇక వారు చర్చలలోకి రాకూడదు అన్న మాట. రంగనాయకమ్మ రెండు తెలుగు రాష్ట్రాలలోని అందరిని 'విమర్శించారు'. కావున ఇక ఎవరూ విమర్శించ వద్దు. వారు ఏది రాస్తే దాన్ని అహెూం అహెూం అంటూ మోయాలి. అంతేనా? అలా అయితే రంగనాయకమ్మ ఏదైనా వ్యాసం, సమీక్ష రాసి ఏదైనా పత్రికకు పంపిస్తే దానితో పాటు ఒక నోటు కూడా పంపించమనండి 'గతంలో రంగనాయకమ్మ 'విమర్శకు' గురైన వారు ఎవరూ కూడా ఈ వ్యాసాన్ని, విమర్శించడానికి అర్హులు కారు', అని. అసలు ఏ పత్రికకు పంపకుంటే ఎవరూ విమర్శించరు. అంతే కాని 'ప్రతీకార వాదం' అనే సాకుతో ఇతరుల విమర్శించే, ప్రశ్నించే హక్కును తిరస్కరించడం ప్రజాస్వామ్యం కాదు. చర్చను పక్కదారి పట్టించడమే అవుతుంది.

ఇక విషయంలోకి వస్తే ప్రసాద్ కమ్యూనిజమే మానవ సమాజానికి అంతిమ దశ అని మార్క్స్ ఎంగెల్స్‌లు "ఎలా భావించి" ఏమి చెప్పారో అంటూ వారి రచనల నుండి చాలానే కొటేషన్స్ ఇచ్చారు. ఈ కొటేషన్‌ల విన్యాసాలు చూస్తే జాలి వేస్తుంది. ఆయన నిరూపించాలనుకున్న విషయానికి ఈ కొటేషన్‌లకు ఏమి సంబధం లేదు. ఈ కొటేషన్‌లతో రుజువు అయ్యే విషయం ఏమిటంటే కమ్యూనిజం వర్గరహిత సమాజం అని మాత్రమే. కమ్యూనిజం వర్గ రహిత సమాజం అవునా కాదా అనేది చర్చ కాదు కదా. కమ్యూనిజం అంటే వర్గరహిత సమాజం అని మార్క్సిస్టులందరికి తెలుసు. కమ్యూనిజమే మానవ జాతికి అంతిమ దశ అని మార్క్స్ ఎంగెల్స్‌లు ఎక్కడ చెప్పారు అనేది కదా చర్చ. అసలు విషయాన్ని సంబంధం లేని కొటేషన్‌ల కింద కప్పేసి అబ్రక దబ్రక మంత్రం చదివేసి కమ్యూనిజమే అంతిమ దశ అంటూ మార్క్స్ ఎంగెల్స్‌లు చెప్పారహెూ అంటూ గొప్ప మ్యాజిక్ చేశారు ప్రసాద్. మాయ ఏమిటంటే మార్క్స్ ఎంగెల్స్‌లు "ఎలా భావించి" ఏమి చెప్పే అవకాశం ఉంది అని వారి తరపున ప్రసాద్ గారే బాగా లోతుగా ఆలోచించి చెప్పారన్నమాట. ఇదిగో చూడు రుజువు అని చెప్పి, ఇంకేదో చెప్పడం పాఠకులను మోసం చేయడమే తప్ప మరేమి కాదు.

మార్క్సిజం పరిపూర్ణ సిద్ధాంతం కాదని చెప్పే జగన్‌మోహన్ రావుకి మార్క్సిజం మాట ఎందుకు అని రాశారు. (మార్క్సిజం మీద మొత్తం పేటెంట్ హక్కులన్ని వీరివే) ఇతరుల విషయం వదిలేయండి అసలు మీరు నిజంగానే మార్క్సిజం ముందు ముందు ఏ విధంగానూ అభివృద్ధి చెందాల్సిన అవసరం లేని సర్వ సంపూర్ణ సిద్ధాంతం అని నమ్ముతున్నారా? నవంబర్ వీక్షణంలో ప్రీతం ఇలా రాశారు. "ఈ విషయంలో ఎంగెల్స్, లెనిన్, మావోలు స్పష్టంగా చెప్పలేదు. ఈ పాయింట్‌ను ఆ మేధావులు స్పృశించలేదు. కాబట్టి రంగనాయకమ్మ స్పృశించాల్సి వచ్చింది". "పరమాణువు కథ చాడ్విక్ దగ్గరే ఆగిందా? జె.జె. థామ్సన్, రూథర్‌ఫర్డ్, నీల్ బోర్, ఆ తరువాత క్వాంటమ్ సిద్ధాంతం దాన్ని అభివృద్ధి పరచలేదా? మార్క్సిజాన్ని లెనిన్ మావోలు వివరించలేదా, వారి వివరణలో లేని విషయాన్ని ఇతరులు చెప్పకూడదా?" మార్క్సిజం సర్వ సంపూర్ణమైన సిద్ధాంతం అని చెప్పేవారే పై విధంగా కూడా చెప్పుతున్నారు. అంతెందుకు మార్క్స్ కాపిటల్ లోనే ఉన్న లోపాలను రంగనాయకమ్మ సరిదిద్ది 'అభివృద్ధి' చేయబోతున్నారు అని చెప్పుతున్నారు కదా. మార్క్సిజం సర్వ సంపూర్ణ సిద్ధాంతం అయితే రంగనాయకమ్మ కాపిటల్‌ను 'సరిదిద్దాల్సిన' అవసరం ఏమి వచ్చింది? మార్క్సిజం సర్వసంపూర్ణ సిద్ధాంతమే కాని దానిని ఏమైనా అభివృద్ధి చేయాల్సివస్తే రంగనాయకమ్మ మాత్రమే చేస్తారు, కావున మిగతా వారికి అది సర్వసంపూర్ణ సిద్ధాంతమే అంటారా? పనిలో పని రంగనాయకమ్మ మాత్రమే మార్క్సిజానికి అధికారిక చివరి ప్రవక్త అని కూడా ప్రకటించండి. ఇక అప్పుడు చర్చ కూడా ముగుస్తుంది. వీ

---

విడనాడాలి. నిరక్షరాస్యత ఎక్కువగా ఉన్న గిరిజన గ్రామాలు అక్షరాస్యత వైపు అడుగులు వేయాలి. వర్షాకాలంలో గ్రామ గ్రామాలలో మురుగునీటి కాలువలు శుభ్రం చేయిస్తూ, బ్లీచింగ్ పౌడర్, కిరోసిన్ సరఫరా చేయాలి. ఆసుపత్రులకు సకాలంలో నిధులను మంజూరు చేయాలి. పూర్తి స్థాయిలో వైద్య సిబ్బంది ఉండేలా ఖాళీలను భర్తీ చేయాలి. 104, 108 సిబ్బందికి వేతనాలు అందజేయాలి. వారికి కావలసిన ప్రోత్సాహకాలను అందిస్తే మరింత మెరుగ్గా అవి పనిచేసే అవకాశం ఉంటుంది. లక్షలు పోసి ఆరోగ్య కేంద్రాలు ఉన్నప్పటికీ సౌకర్యాలు సరిగా లేవని సిబ్బంది అందుబాటులో ఉండడం లేదు.

కాబట్టి తగిన సౌకర్యాలు కల్పిస్తూ వైద్యులను, వైద్యాన్ని అందించేలా చూడాలి. ప్రభుత్వ వైద్యశాఖ మరింత కృషిచేస్తే గనుక ఆదివాసీల ఆరోగ్య పరిస్థితులు కొంతైనా మారే అవకాశం ఉంటుంది. ఆ రోజులు రావాలని, వారి ఆరోగ్య స్థితిగతులు పూర్తిగా మారే రోజు కోసం ఎదురుచూద్దాం.

*(కాకతీయ యూనివర్సిటీ పరిశోధక విద్యార్థిని)* వీ

### అంతర్జాతీయ గని కార్మికుల రెండవ మహాసభ

అంతర్జాతీయ గని కార్మికుల రెండవ మహాసభలు పెద్దపల్లి జిల్లా గోదావరిఖని ఎన్‌టిపిసిలో ఫిబ్రవరి 2 నుండి 6 తేదీల్లో జరిగాయి. పాలకులు, కార్పొరేట్ శక్తులు కలిసి ప్రపంచ వ్యాప్తంగా కార్మికులపై ముప్పేట దాడి చేస్తున్నారని, కార్మికులు తమ శ్రమను ధారపోసి ప్రపంచ సంపద సృష్టిస్తున్నా బతుకుకే భద్రత కరువైందని వక్తలన్నారు. కార్మికులు ఐక్యపోరాటాలతో రాజ్యాన్ని హస్తగతం చేసుకోవాలని, అప్పుడే సమసమాజ స్థాపన సాధ్యమవుతుందని అన్నారు. ఈ సభల్లో ఐసిజి.సభ్యులైన పెరూ, కొలంబియా, కజకిస్తాన్, కాంగో తదితర దేశాల నాయకులు పాల్గొన్నారు.

### విరసం సాహిత్య పాఠశాల

విప్లవ రచయితల సంఘం 'సంక్షోభ కాలంలో ప్రజా ఆకాంక్షలు-ఆచరణ సోషలిజమే ప్రత్యామ్నాయం' అనే అంశంపై సాహిత్య పాఠశాలను కడప జిల్లాలోని ప్రొద్దుటూరులో ఫిబ్రవరి 11, 12 తేదీల్లో చిలుకూరి దేవపుత్ర ప్రాంగణంలో నిర్వహించింది. రెండు రోజులు జరిగిన ఈ సాహిత్య పాఠశాలలో సోషలిజమే ప్రత్యామ్నాయం, రాయలసీమ రాష్ట్రం-ప్రజాస్వామిక దృక్పథం, నోట్ల రద్దు రాజకీయార్థిక మూలాలు, బోల్షివిక్ విప్లవం-సాహిత్యం, నక్సల్బరీ రాజకీయాలు-తెలుగు సాహిత్యం, చైనా సాంస్కృతిక విప్లవం - నక్సల్బరీ - దండకారణ్యం అనే అంశాలపై వక్తలు ప్రసంగించారు. 20 పుస్తకాల వరకు ఆవిష్కరించారు. సాహిత్య పాఠశాల జరుగుతున్న హాల్ ముందు నక్సల్స్ బాధితుల పేరుతో పోలీసులు 20 మంది కూలీలను తీసుకు వచ్చి మావోయిస్టు పార్టీకి వ్యతిరేకంగా నినాదాలు చేశారు.

### ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ మహా సభలు

ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ ఆధ్వర్యంలో అఖిల భారత మహాసభలను ఫిబ్రవరి 12, 13లతో హైదరాబాద్‌లోని బాగ్‌లింగంపల్లి సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో నిర్వహించింది. అన్ని రాష్ట్రాల ప్రతినిధులు ఊరేగింపుగా రాంనగర్ క్రాస్ రోడ్డు నుండి సుందరయ్య విజ్ఞాన కేంద్రం చేరుకున్నారు. దేశంలో ప్రజాస్వామ్యం లేదని, ప్రజాస్వామ్యం లేనిదే మానవ హక్కుల ఉనికే ఉండదని వక్తలు అన్నారు. నేటి ప్రభుత్వాలు ప్రజల హక్కులను కాపాడడం మానేసి రిలయెన్స్, అదాని, టాటా, బిర్లా లాంటి కార్పొరేట్‌శక్తుల ప్రయోజనాలను కాపాడానికి అత్యుత్సాహం ప్రదర్శిస్తున్నాయని అన్నారు.

### నయీం కేసుల మూసివేత!

నయీం అరాచకాలపై వచ్చిన ఫిర్యాదులు, వాటి ఆధారంగా నమోదైన కేసులలో కొన్నింటిని ఆధారాలు లేవంటూ మూసివేసే ప్రక్రియ ప్రారంభమైంది. ఇప్పటికే కొన్ని కేసులను మూసివేసేందుకు అనుమతించాలని కోరుతూ న్యాయస్థానంలో పోలీసు శాఖ పిటిషన్లు దాఖలు చేసింది. నయీం అనేకమంది రాజకీయ నాయకుల, పోలీసు అధికారుల సహకారంతో వందలాది ఎకరాల భూమి కబ్జాచేసి, కోట్లాది రూపాయలు బలవంతంగా వసూలు చేసి, కిడ్నాప్‌లకు పాల్పడ్డాడని ఫిర్యాదులు వచ్చాయి. వీటి ఆధారంగా 174 కేసులు నమోదు చేసి 124 మందిని అరెస్ట్ చేశారు. నయీంతో పోలీసు అధికారులకు, రాజకీయ నాయకులకు సంబంధాలు ఉన్నట్లు ఫొటోలు కూడా బయట పడ్డాయి. నయీంతో ప్రజాప్రతినిధులకు, పోలీసు అధికారులకు సంబంధాలు ఉన్నట్లు తమకు ఆధారాలు లభించలేదని ప్రభుత్వం హైకోర్టులో దాఖలు చేసిన ప్రమాణపత్రంలో పేర్కొన్న వార్త ఫిబ్రవరి 14న పత్రికల్లో వచ్చింది.

### కలెక్టర్ కార్యాలయాల ముందు టిడిఎఫ్ ధర్నా

ఛత్తీస్‌గఢ్ సుక్మా జైలులో నిర్బంధించిన తెలంగాణ ప్రజాస్వామిక వేదిక (టిడిఎఫ్) నిజనిర్ధారణ బృందం సభ్యులను బేషరతుగా విడుదల చేయాలని డిమాండ్ చేస్తూ తెలంగాణ వ్యాప్తంగా అన్ని కలెక్టరేట్‌ల ముందు టిడిఎఫ్ ఆధ్వర్యంలో ఫిబ్రవరి 16న ధర్నా నిర్వహించారు. ప్రజాస్వామిక సంస్థలో పనిచేస్తున్న వారిని అక్రమ అరెస్టులకు గురిచేస్తూ వేధిస్తున్నారని, ప్రజాస్వామిక వాతావరణం, పౌరస్వేచ్ఛలను పాలకులు కాలరాస్తున్నారని ధర్నాలో పాల్గొన్న వారు తెలిపారు. ఈ ధర్నాలో ప్రజాస్వామిక వాదులు, వివిధ ప్రజా సంఘాల కార్యకర్తలు, నాయకులు పాల్గొన్నారు.

### విద్యా పోరాట యాత్ర - ధర్నా

కెజి నుండి పిజి వరకు ఉచిత విద్యను ప్రభుత్వ విద్యా సంస్థల ద్వారా పేద, ధనిక తేడా లేకుండా అందరికి ఒకే విద్యా విధానాన్ని అమలు చేయాలి. ప్రైవేట్ విశ్వవిద్యాలయాల బిల్లును విరమించుకొని, ఉన్నత విశ్వ విద్యాలయాలను బలోపేతం చేయాలి. విద్యారంగంలో ప్రైవేటీకరణను, కాషాయీకరణను ఉపసంహరించుకోవాలి అనే డిమాండ్లతో తెలంగాణ జిల్లాల్లోని అన్ని ప్రాంతాల్లో విద్యా పోరాట యాత్రను విద్యా పరిరక్షణ కమిటీ ఆధ్వర్యంలో ఫిబ్రవరి 6 నుండి 20 వరకు నిర్వహించింది. ముగింపుగా ఫిబ్రవరి 20న హైదరాబాద్‌లోని ఇందిరా పార్క్ వద్ద ఉపాధ్యాయ సంఘాలు, విద్యార్థి సంఘాలు ధర్నా నిర్వహించాయి. ఈ ర్యాలీ, ధర్నాలో విద్యార్థులు, ఉపాధ్యాయులు, ప్రజాస్వామికవాదులు పాల్గొన్నారు.

### దళిత మహిళ - తెలుగు సాహిత్యంపై సదస్సు

వర్ధమాన భారత సామాజంలో దళిత మహిళ-తెలుగు సాహిత్యం అనే అంశంపై ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక, ప్రభుత్వ డిగ్రీ కళాశాల తెలుగు విభాగం జమ్మికుంట ఆధ్వర్యంలో ఫిబ్రవరి 18, 19 తేదీల్లో జమ్మికుంటలో జాతీయ సదస్సు నిర్వహించారు. దళిత స్త్రీల సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక జీవన విధానంపై అధ్యయనాలను ప్రేరేపించడమే ఈ సదస్సు ఉద్దేశం అన్నారు. ఈ సదస్సులో పూలే, అంబేద్కర్, పెరియార్ ఆలోచనా విధానాలు-మహిళ; దళిత స్త్రీల ఆత్మకథలు; పితృస్వామ్య కుల కుటుంబ సంబంధాలు-దళిత స్త్రీ; దళిత స్త్రీల హక్కులు,-చట్టాలు; కథా సాహిత్యం - దళిత మహిళ అంశాలను సదస్సులో చర్చించారు.

### నిరుద్యోగ ర్యాలీపై అణచివేత

తెలంగాణ జెఎసి ఆధ్వర్యంలో ఫిబ్రవరి 22న హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రం నుంచి ఇందిరా పార్క్ వరకు నిర్వహించాలనుకున్న నిరుద్యోగ ర్యాలీని పోలీసులు అనుమతి లేదంటూ అడ్డుకున్నారు. ఫిబ్రవరి 22న ఉదయం 3 గంటలకే జెఎసి చైర్మన్ కోదండరామ్‌ను, ఇతర జెఎసి నేతలను, విద్యార్థులను తెలంగాణ వ్యాప్తంగా ఎక్కడికక్కడ అరెస్ట్ చేశారు. జిల్లాల నుంచి రాజధానికి వచ్చే మార్గాల్లో చెక్ పోస్టులు ఏర్పాటుచేసి రాష్ట్రం వ్యాప్తంగా 3,220 మందిని అరెస్ట్ చేసినట్లు పోలీస్ శాఖ తెలిపింది.

### దివీస్ ఉద్యమంపై దమనకాండ

తూర్పు గోదావరి జిల్లాలోని తొండంగి మండలంలో నిర్మించ తలపెట్టిన దివీస్ ఫార్మా కంపెనీ వద్దంటూ ఫిబ్రవరి 23న ప్రజలు ఆందోళన చేపట్టారు. దివీస్ యాజమాన్యం, ప్రభుత్వం అక్రమంగా స్వాధీనం చేసుకున్న భూములను తిరిగి ఇచ్చేయాలని ప్రజలు నిరసన తెలిపారు. పంపాదిపేటలో 144 సెక్షన్ ఉన్నా దివీస్ నిర్మాణ ప్రదేశానికి ప్రజలు చేరుకొని కట్టడాలను తొలగించారు. నిరసనకారులపై పోలీసులు దాడి చేయడంతో మహిళలతో పాటు పలువురు తీవ్రంగా గాయపడ్డారు. వందమందిని పైగా అరెస్టు చేశారు.

### వలస కూలీల దుర్మరణం

హైదరాబాద్, అత్తాపూర్‌లోని ఒక ఎయిర్‌కూలర్ గోదాంలో ఫిబ్రవరి 22న షార్ట్ సర్క్యూట్ వల్ల జరిగిన అగ్ని ప్రమాదంలో ఏడుగురు కూలీలు మరణించారు. ప్రమాదం సమయంలో ఆ గోదాంకు ఉన్న ఒక్క ద్వారానికి తాళం వేసి ఉండడం, అగ్నిమాపక నిబంధనలు పాటించకపోవడం, వ్యాపారి లాభాపేక్ష, అధికారుల నిర్లక్ష్యం వల్ల ఈ ప్రమాదం సంభవించింది. మరణించిన వారంతా జార్ఖండ్ నుంచి వలస వచ్చి పని చేస్తున్న కార్మికులు.

### విశాఖ ఏజెన్సీలో ఎన్‌కౌంటర్

విశాఖ ఏజెన్సీలో కొయ్యూరు మండలం అన్నవరం అటవీ ప్రాంతంలో ఫిబ్రవరి 24న జరిగిన ఎదురు కాల్పుల్లో ఇద్దరు మావోయిస్టులు చనిపోయినట్లు జిల్లా ఎస్‌పి రాహుల్‌దేవ్ శర్మ ప్రకటించారు. పోలీసులు కూబింగ్ నిర్వహిస్తుండగా మావోయిస్టులు సమావేశం నిర్వహిస్తూ కనిపించారనీ, హెచ్చరించినా వినకపోడంతో ఎదురు కాల్పులు జరిపామనీ, ఈ కాల్పుల్లో ఇద్దరు మావోయిస్టులు చనిపోయారని తెలిపారు. వీ

## నెత్తురోడుతున్న చత్తీస్‌గఢ్

ఎటబిలో జాతీయ రహదారి-26పై సుంకి సమీపాన ఫిబ్రవరి 1న మావోయిస్టులు పేల్చిన మందుపాతరతో ఎనిమిది మంది పోలీసులు మరణించారు. మరోవైపు ఫిబ్రవరి 7న చత్తీస్‌గఢ్, నారాయణపూర్ జిల్లాలోని అకాబీడా అటవీ ప్రాంతంలో కూంబింగ్ నిర్వహిస్తున్న భద్రతా బలగాలకు మావోయిస్టులు తారసపడడంతో ఎన్‌కౌంటర్ జరిగిందనీ, ఈ ఎన్‌కౌంటర్‌లో 12 మంది మావోయిస్టులు ప్రాణాలు కోల్పోయారనీ పోలీసులు ప్రకటించారు. ఫిబ్రవరి 21న నారాయణపూర్-దంతెవాడ జిల్లాల సరిహద్దు అటవీ ప్రాంతం బర్సూర్‌లో జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఏడుగురు మావోయిస్టులు చనిపోయినట్లు నారాయణ్‌పూర్ ఎస్‌పి తెలిపారు.

## గుజరాత్‌లో నిందితులను నిర్దోషులుగా తేల్చిన కోర్టు

గోద్రా ఘటన అనంతరం జరిగిన ఘర్షణలకు సంబంధించిన కేసులో 28 మంది నిందితులను నిర్దోషులుగా పేర్కొంటూ గుజరాత్‌లోని గాంధీనగర్ కోర్టు ఫిబ్రవరి 3న తీర్పునిచ్చింది. ఈ కేసుకు సంబంధించి వారిపై సరైన సాక్ష్యాధారాలు లేనందున వారిని నిర్దోషులుగా వదిలిపెడుతున్నట్టు కోర్టు పేర్కొంది. గోద్రా రైల్వే స్టేషన్‌లో 2002 ఫిబ్రవరి 27న సబర్మతీ ఎక్స్‌ప్రెస్ రైలులోని ఎస్-6 బోగికి నిప్పంటించిన ఘటనలో 58 మంది మృతి చెందారు. తరువాత రోజు 28న గాంధీనగర్‌లోని పలియాడ్ గ్రామంలో గృహ దహనాలు, అల్లర్లు, లూటీలు, మైనార్టీ కమ్యూనిటీకి చెందిన వారి ఆస్తుల విధ్వంసంలో 250 మంది పాల్గొన్నారని తెలిపారు. అందులో 28 మందిని నిందితులుగా పేర్కొంటూ ఎఫ్ఐఆర్ నమోదు చేసింది. మైనారిటీ కమ్యూనిటీకి చెందిన వెయ్యి మందికి పైగా హత్యకు గురయ్యారు.

## కేంద్ర బడ్జెట్ 2017-18

2017-18కి సంబంధించిన కేంద్ర బడ్జెట్‌ను ఆర్థిక మంత్రి అరుణ్‌జైట్లీ ఫిబ్రవరి 1న పార్లమెంట్‌లో ప్రవేశపెట్టారు. ఈ ఏడాది కేంద్ర బడ్జెట్‌తో పాటు రైల్వే బడ్జెట్‌ను కలిపి పార్లమెంట్‌కు సమర్పించారు. ఇందులో గ్రామీణాభివృద్ధికి రు. 1,28,560 కోట్లు, విద్య, ఆరోగ్యానికి రు. 1,30,215 కోట్లు, సామాజిక సేవలకు రు. 1,95,473 కోట్లు, మౌలిక రంగాలకు రు. 3,96,135 కోట్లు, వ్యవసాయ, అనుబంధ రంగాలకు రు. 58,663 కోట్లు, ఇతర రంగాలకు రు. 36,032 కోట్లు కేటాయించారు. 2017-18 ఆర్థిక సంవత్సరానికి మొత్తం వసూళ్లు రు. 21,46,735 కోట్లుగా అంచనా వేశారు.

## జల్లికట్టు క్రీడలో ముగ్గురు మృతి

తమిళనాడులో జల్లికట్టు క్రీడలో ఎద్దు పొడిచి ముగ్గురు యువకులు మృతిచెందారు. ఈ సంఘటన తమిళనాడులోని కృష్ణగిరి జిల్లా బర్గూరు, రాయకోటలలో ఫిబ్రవరి 12న జరిగింది. యువకులు ఎద్దును నిలువరించడానికి ప్రయత్నించినపుడు అది పొడవడంతో తీవ్ర రక్తస్రావంతో ఇద్దరు అక్కడికక్కడే మృతి చెందారు. హోసూరు సమీపంలోని రాయకోటలో నిర్వహించిన క్రీడలో ఓ యువకుడు తీవ్రంగా గాయపడి మృతిచెందాడు.

## కశ్మీర్‌లో ఎన్‌కౌంటర్ హత్యలు

జమ్ముకశ్మీర్‌లోని కుల్గామ్ జిల్లాలో ఫిబ్రవరి 12న సైనికులకు కశ్మీరీ వేర్పాటువాద మిలిటెంట్లకు మధ్య జరిగిన ఎదురు కాల్పుల్లో నలుగురు మిలిటెంట్లు, ఇద్దరు సైనికులు, ఒక పౌరుడు మృతి చెందారు. ఇదే ఘటనలో ముగ్గురు సైనిక సిబ్బంది గాయపడ్డారు. ఈ ఘటన అనంతరం భద్రతాదళాలకు వ్యతిరేకంగా స్థానికులు నినాదాలు చేస్తూ రాళ్లు రువ్వడంతో సైనికులు లాఠీచార్జి చేసి బాష్పవాయువు ప్రయోగించాయి. కాల్పులు జరిపాయి. ఈ కాల్పుల్లో ఓ యువకుడు మృతిచెందగా 14 మంది గాయపడ్డారు. నాగబల్ గ్రామంలో ఒక ఇంట్లో మిలిటెంట్లు ఉన్న సమాచారం ఆధారంగా ఈ దాడి చేసినట్లు సైనిక అధికారులు తెలిపారు.

## రద్దయిన అగ్ని, వికాస్ సంఘర్ష్ సమితి

బస్తర్‌లో ఐజిపి కల్లూరి సెలవుపై వెళ్లిన తరువాత ఫిబ్రవరి 9న సల్వాజుడుం తరహాలో పనిచేసిన జాతీయ సమైక్యతా కార్యచరణ బృందం (అగ్ని), వికాస్ సంఘర్ష్ సమితిలను రద్దు చేస్తున్నట్లుగా జగ్దల్‌పూర్ నుండి, సుకుమ జిల్లాల నుండి ఆ సంస్థలు ప్రకటించాయి. 'అగ్నిని స్థాపించిన నాటి నుండి మావోయిస్టు వ్యతిరేక కార్యకలాపాలను అత్యంత శాంతియుత ప్రజాస్వామిక పద్ధతులలో పోలీసులకు మద్దతునివ్వడానికి' పనిచేసిందని అగ్ని కన్వీనర్ ఆనంద్ మోహన్ మిశ్రా అన్నారు. కొన్ని గంటల తేడాతో రద్దుచేసిన సల్వాజుడుం నాయకుడు, ప్రస్తుత వికాస్ సంఘర్ష్ సమితి కన్వీనర్ పి. విజయ్ ఇదే తరహా ప్రకటన చేశారు. జగ్దల్‌పూర్ లీగల్ ఏయిడ్ గ్రూప్ (జగ్‌లాగ్) లాయర్లను, జర్నలిస్టు మాళిని సుబ్రమణ్యంను వేధించారని ఆరోపణలు ఎదుర్కొన్న 'సమాజిక ఎక్తా మంచ్'ను ఏప్రిల్‌లో 2016లో రద్దుచేశారు. రెండు నెలలు గడవకుండానే ఆ సంస్థ సభ్యులందరు అగ్నిలో, మరికొందరు వికాస్ సంఘర్ష్ సమితిలో ఉన్నారు.

## తమిళనాడు పరిణామాలు

తమిళనాడు ముఖ్యమంత్రిగా ఎడప్పాడి పళనిస్వామి ఎన్నికయ్యారు. ఫిబ్రవరి 15న గవర్నర్ సి.ఎచ్. విద్యాసాగర్ రావు ఆయన చేత ప్రమాణ స్వీకారం చేయించారు. ముఖ్యమంత్రిగా ఉన్న పన్నీర్‌సెల్వం ఫిబ్రవరి 6న తన పదవికి రాజీనామా చేశారు. గవర్నర్ రాజీనామా ఆమోదించడంతో ఆయనను ఆపద్ధర్మ ముఖ్యమంత్రిగా కొనసాగారు. ఫిబ్రవరి 14న ఆయనను అన్నాడిఎంకె పార్టీ నుంచి బహిష్కరిస్తున్నట్లు పార్టీ అధ్యక్షురాలు శశికళ ప్రకటించడంతో ముఖ్యమంత్రి పదవి నుంచి తప్పుకున్నారు. ఈ నేపథ్యంలో ఫిబ్రవరి 14న సుప్రీంకోర్టు అక్రమ ఆస్తుల కేసులో శశికళను దోషిగా తీర్పు చెప్పడంతో ఆమె ఫిబ్రవరి 15న కోర్టు ముందు లొంగిపోయారు. శశికళ సిఎం పదవికి పళనిస్వామిని ప్రతిపాదించడంతో తమిళనాడులో ఆయనను పార్టీ ఎంఎల్ఎలు ఎన్నుకున్నారు. ఫిబ్రవరి 18న అసెంబ్లీలో జరిగిన బల ప్రదర్శనలో పళనిస్వామికి అనుకూలంగా 122 మంది ఓటు వేశారు. డిఎంకె పార్టీ రహస్య ఓటింగ్‌కు పట్టుపట్టడంతో ఘర్షణ జరగడంతో స్పీకర్ ఆ పార్టీ ఎంఎల్ఎలను అసెంబ్లీ నుంచి సస్పెండ్ చేశారు.

## నాగాలాండ్ ముఖ్యమంత్రిగా లాయిజెత్సు

నాగా పీపుల్స్ ఫ్రంట్ (ఎన్‌పిఎఫ్) అధ్యక్షుడు సుర్హోజీలి లాయిజెత్సు (81) ఫిబ్రవరి 22న నాగాలాండ్ ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేశారు. పట్టణ, స్థానిక సంస్థల ఎన్నికల్లో మహిళలకు ముప్పైమూడు శాతం రిజర్వేషన్లు ఇవ్వాలని జెలియాంగ్ ప్రభుత్వం నిర్ణయించగా, స్థానిక గిరిజన జాతుల నుండి తీవ్ర వ్యతిరేకత వ్యక్తమయింది. ప్రజలు నిరసనలు చేపట్టగా జనవరి 31న నిరసనకారులపై పోలీసులు కాల్పులు జరపడంతో ఇద్దరు మరణించారు. ఈ నేపథ్యంలో ముఖ్యమంత్రి జెలియాంగ్ రాష్ట్రంలో నెలకొన్న పరిస్థితులకు బాధ్యత వహిస్తూ జనవరి 19న రాజీనామా చేశారు.

## ఢిల్లీ యూనివర్సిటీలో ఎబివిపి దాడి

ఢిల్లీ యూనివర్సిటీ రాంజాస్ కాలేజీలో ఫిబ్రవరి 21న 'కల్చర్స్ ఆఫ్ ప్రొటెస్ట్' అంశంపై జరిగిన సదస్సుపై ఎబివిపి కార్యకర్తలు దాడి చేశారు. ఈ కార్యక్రమానికి జెఎన్‌యు విద్యార్థి నాయకులు ఉమర్ ఖాలీద్, షెహ్లా రషీద్ ఉపన్యాసకులుగా ఉన్నారు. సదస్సు జరుగుతున్న హాలుపై రాళ్లు విసిరి, తలుపులు మూసి సదస్సుకు హాజరైన విద్యార్థులనూ, అధ్యాపకులనూ నిర్బంధించారు. ఈ దాడికి నిరసనగా విద్యార్థులు కాలేజ్ నుంచి మారిస్ నగర్ పోలీస్ స్టేషన్‌కు ఊరేగింపు నిర్వహించడానికి ప్రయత్నించగా మరోసారి ఎబివిపి కార్యకర్తలు దాడి చేశారు. ఈ సందర్భంగా పలువురు విద్యార్థులు, అధ్యాపకులు గాయపడ్డారు. వీ

### ట్రంప్‌కు వ్యతిరేకంగా నిరసనలు

అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ జాతీయోన్మాద వ్యాఖ్యలు, చర్యలతో అమెరికాతో సహా అన్ని ప్రపంచ దేశాలలో ఆయనకు వ్యతిరేకంగా నిరసనలు, ఆందోళనలు జరుగుతున్నాయి. ఇరాన్, ఇరాక్, సిరియా, లిబియా, సోమాలియా, సుడాన్, యెమన్ దేశాలకు చెందిన వలసదారులను 90 రోజుల పాటు, సిరియా శరణార్థులను 120 రోజుల పాటు అమెరికాలో నిషేధిస్తున్నట్లు కార్యనిర్వాహక ఉత్తర్వులపై జనవరి 27న ట్రంప్ సంతకం చేశారు. ఈ నిర్ణయాన్ని నిరసిస్తూ అమెరికాలోని ప్రధాన నగరాలు ఆందోళనలు, నిరసన ప్రదర్శనలు, నినాదాలతో హోరెత్తాయి. న్యూయార్క్, మెక్సికో, వాషింగ్టన్ తదితర నగరాల్లో కూడా భారీ నిరసన ప్రదర్శనలు జరిగాయి. ఈ నిర్ణయాన్ని సవాలు చేస్తూ పలు సంస్థలు స్థానిక కోర్టులను ఆశ్రయించగా ఇరుపక్షాల వాదనలు విన్న యునైటెడ్ స్టేట్స్ ఫెడరల్ కోర్టు సహా అమెరికాలోని పలు న్యాయస్థానాలు ట్రంప్ కార్యనిర్వాహక ఉత్తర్వులపై స్టే ఆర్డర్స్ జారీ చేశాయి.

### సిరియాలో వేలాది మంది ఉరి

సిరియా ప్రభుత్వం 2011 నుంచి 2015 మధ్య కాలంలో 13వేల మందిని ఉరి తీసిందంటూ అంతర్జాతీయ మానవహక్కుల సంస్థ ఆమ్నెస్టీ ఆవేదన వ్యక్తం చేసింది. డమాస్కస్‌లోని సైద్నాయా జైలులో ఈ సామూహిక ఉరితీతలు జరిగాయని నివేదికలో వెల్లడించింది. వారానికి కనీసం ఒక్కసారైనా యాభై వరకు ఖైదీలను జైలు గదుల్లోంచి నిరంకుశ విచారణలకు లాక్కువెళ్లేవారని, చిత్రహింసలకు గురిచేసి ఉరితీసేవారని తెలిపింది. ప్రక్రియ సాగినంతసేపు బాధితుల కళ్లకు గంతలు కట్టేవారని పేర్కొంది. బాధితుల్లో ఎక్కువ మంది అధ్యక్షుడు బషర్ అల్ అసద్ ప్రభుత్వాన్ని వ్యతిరేకించిన సాధారణ పౌరులని తెలిపింది.

### అఫ్ఘనిస్తాన్‌లో బాంబు పేలుడు

అఫ్ఘనిస్తాన్‌లో ఫిబ్రవరి 7న సుప్రీంకోర్టు ఆవరణలో జరిగిన ఆత్మాహుతి దాడిలో ఇరవై మంది చనిపోయారు. యాభై మందికి పైగా గాయపడ్డారు. కోర్టు సిబ్బంది విధులు ముగించుకుని బస్సు ఎక్కుతుండగా కాలికి పేలుడు పదార్థాలు తగిలించుకున్న వ్యక్తి తనను తాను పేల్చుకున్నాడు. మరణించిన వారిలో, క్షతగాత్రులలో మహిళలు, చిన్నారులు ఎక్కువగా ఉన్నారు.

### కిమ్ జోంగ్ నామ్ హత్య

ఉత్తర కొరియా అధ్యక్షుడు కిమ్ జోంగ్ ఉన్ సవతి సోదరుడు కిమ్ జోంగ్ నామ్‌ను విషపూరిత వీఎక్స్ నర్వ్ ఏజెంట్ విష ప్రయోగంతో హత్య చేశారు. ఫిబ్రవరి 13న కౌలాలంపూర్ అంతర్జాతీయ విమానాశ్రయంలో ఇద్దరు మహిళలు ఆయనపై ఈ విషపు రసాయనం చల్లడంతో మరణించాడు. నామ్‌ను కిమ్ జోంగ్ ఉన్ హత్య చేసినట్లు ఆరోపిస్తున్నారు.

### కొలంబియాలో శాంతి చర్చలు

ఈక్వెడార్‌లోని కేథలిక్ యూనివర్సిటీ వేదికగా కొలంబియాలో శాంతి చర్చలు ప్రారంభమయ్యాయి. యాభై ఏండ్లకు పైగా కొనసాగుతున్న సాయుధ ఘర్షణలకు స్వస్తి పలికేందుకు కొలంబియా ప్రభుత్వం, నేషనల్ లిబరేషన్ ఆర్మీ (ఇఎల్ఎన్) శాంతి చర్చల్లో పాల్గొన్నాయి. ఎజెండాలో ప్రధానంగా ఆరు అంశాలు ఉన్నాయి. శాంతి నిర్మాణంలో సమాజ భాగస్వామ్యం, శాంతి కోసం ప్రజాస్వామ్యం, పరివర్తనలు, బాధితులు, ఘర్షణ నివారణ, అమలు అనే అంశాలపై చర్చలు జరుగుతాయి. కొలంబియా అధ్యక్షుడు జువాన్ మాన్యుయల్ శాంటోస్ ప్రభుత్వ ప్రతినిధి బృందానికి నేతృత్వం వహించగా, పాబ్లో బెల్ట్రాన్ ఇఎల్ఎన్ బృందానికి నాయకత్వం వహించాడు. ఈ చర్చల్లో ఈక్వెడార్‌తో పాటు చిలీ, క్యూబా, నార్వే, వెనిజులాలు హామీదారులుగా పాల్గొంటున్నాడు.

### అమెరికా భద్రతా సలహాదారు రాజీనామా

అమెరికా జాతీయ భద్రతా సలహాదారుడు మైఖేల్ ఫ్లిన్ ఫిబ్రవరి 14న తన పదవికి రాజీనామా చేశారు. డోనాల్డ్ ట్రంప్ అధ్యక్షుడు కాకముందు నుంచే రష్యాతో దౌత్య సంబంధాలు జరిపాడన్న ఆరోపణలు రావడంతో ఆయన తన పదవికి రాజీనామా చేశారు. ఆయన స్థానంలో జోసెఫ్ కీత్ కెల్లాగ్‌ను తాత్కాలిక భద్రతా సలహాదారుగా నియమిస్తున్నట్లు వైట్‌హౌజ్ అధికారులు తెలిపారు.

### మెక్సికోలో ట్రంప్‌కు వ్యతిరేకంగా నిరసనలు

ట్రంప్ ఇమ్మిగ్రేషన్ పాలసీకి, అమెరికా-మెక్సికో సరిహద్దులో గోడ నిర్మాణానికి వ్యతిరేకంగా మెక్సికో ప్రజలు ఆందోళనలు చేపట్టారు. ఫిబ్రవరి 13న దేశవ్యాప్తంగా పట్టణాల్లోని ప్రజలు తెల్ల వస్త్రాల్లో వీధుల్లోకి వచ్చి జాతీయ పతాకాన్ని, ట్రంప్ వ్యతిరేక ప్లకార్డులను ప్రదర్శిస్తూ నిరసన వ్యక్తం చేశారు. దేశంలో హింస, అవినీతిని అరికట్టడంలో మెక్సికో అధ్యక్షుడు ఎన్రిక్ పీనా నీటోకు వ్యతిరేకంగా కూడా వారు ఈ సందర్భంగా నిరసన తెలిపారు.

### పాకిస్తాన్‌లో ఆత్మాహుతి దాడులు

పాకిస్తాన్ లాహోర్ నగరంలో ఫిబ్రవరి 13న భారీ బాంబు పేలుడు సంభవించింది. ఈ పేలుడులో పదహారు మంది చనిపోగా, అరవై మందికి పైగా గాయపడ్డారు. పంజాబ్ అసెంబ్లీ గేట్ వద్ద ఔషధ దుకాణదారులు నిరసన కార్యక్రమాలు నిర్వహించారు. ఆ సమయంలో ఒక వ్యక్తి తనను తాను పేల్చుకుని ఆత్మాహుతికి పాల్పడ్డాడు. మరో సంఘటనలో ఫిబ్రవరి 16న సింధు రాష్ట్రంలోని సెహ్వాన్ పట్టణంలో షాబాజ్ ఖలందర్ మసీద్ ప్రవేశద్వారానికి సమీపాన జరిగిన ఆత్మాహుతి దాడిలో దాదాపు వంద మంది చనిపోయారు. రెండు వందల యాభై మందికి పైగా గాయపడ్డారు. సూఫీలు నిర్వహించే ధమాల్ సందర్భంగా వందలాది మంది ప్రార్థనల కోసం మసీదుకు చేరుకున్న సమయంలో ఈ దాడి జరిగింది. మృతుల్లో అధికంగా మహిళలు, చిన్న పిల్లలు ఉన్నట్లు అధికారులు తెలిపారు. ఈ దాడికి ఐఎస్ఐఎస్ పాల్పడింది. దీనికి ప్రతీకారంగా పాకిస్తాన్ సైన్యం ఐసిస్ తిరుగుబాటుదారులపై దాడులు చేసింది. ఫిబ్రవరి 17న జరిపిన ఈ దాడిలో వంద మంది ఉగ్రవాదులను చంపింది.

### ఇరాక్‌లో బాంబు దాడి

ఇరాక్ రాజధాని బాగ్దాద్‌లో ఫిబ్రవరి 16న జరిగిన బాంబు దాడిలో అరవై మంది మరణించారు. అరవై మందికి పైగా గాయపడ్డారు. మోసూల్ పట్టణంలో ఇరాక్ – అమెరికా సంయుక్తంగా చేపడుతున్న సైనిక ఆపరేషన్‌కు ప్రతీకారంగా ఐఎస్ ఈ దాడికి పాల్పడిందని అధికారులు తెలిపారు. దక్షిణ బాగ్దాద్‌లోని మార్కెట్‌లోకి ఓ కారు వేగంగా దూసుకువచ్చి వెంటనే పేలిపోయింది. పెద్ద సంఖ్యలో ప్రజలు గుమిగూడి ఉండడంతో ప్రాణ నష్టం అధికంగా సంభవించింది.

### సిరియాలో ఆత్మాహుతి దాడులు

ఐఎస్ఐఎస్ దళాల ఆత్మాహుతి దాడులు కొనసాగుతున్నాయి. సిరియాలోని అలెప్పో గవర్నరేట్ ప్రావిన్స్ అల్-బాబ్ నగరంలో ఫిబ్రవరి 24న జరిగిన ఆత్మాహుతి దాడిలో అరవై మంది మరణించారు. మరో వంద మందికి పైగా గాయపడ్డారు. ఫిబ్రవరి 25న జరిగిన బాంబు దాడిలో నలభై రెండు మంది మరణించారు. హోమ్స్ నగరంలో భద్రతా స్థావరాలను లక్ష్యంగా చేసుకుని ఆరుగురు ఆత్మాహుతి దళ సభ్యులు దాడికి పాల్పడ్డారు. 42 మంది చనిపోగా, మరో ఇరవై మందికి పైగా గాయపడ్డారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(జనవరి 1 నుండి జనవరి 31, 2017 వరకు తెలంగాణలోని 9 జిల్లాలు (1108), ఆంధ్రప్రదేశ్‌లోని 11 జిల్లాలలో (707) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1815)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 4 | - | 22 | 24 | 4 | 9 | 6 | 3 | 2 | 3 | 3 | - | 2 | 24 | 33 | - | - | - | 4 | - |
| హైదరాబాద్ | - | - | - | 7 | 8 | - | 1 | - | - | - | 3 | 5 | 7 | 2 | 23 | 6 | - | - | - | - | - |
| కరీంనగర్ | - | 2 | - | 6 | 9 | - | 3 | 1 | 1 | 1 | 3 | 3 | 2 | 3 | 20 | 13 | - | - | - | - | - |
| ఖమ్మం | | | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | |
| మహబూబ్‌నగర్ | - | 7 | - | 11 | 7 | 2 | - | 1 | - | - | 8 | 8 | 8 | - | 32 | 3 | - | - | - | - | - |
| మెదక్ | 2 | 19 | 1 | 19 | 29 | 34 | 29 | 1 | 32 | 12 | 25 | 16 | 52 | 60 | 90 | 102 | - | - | - | 6 | 1 |
| నల్గొండ | - | - | - | 3 | 6 | 1 | 4 | 1 | 2 | 1 | 3 | 1 | 1 | 6 | 28 | 12 | - | - | - | - | - |
| నిజామాబాద్ | - | 1 | - | 4 | 4 | - | 1 | - | - | 3 | 1 | 4 | 1 | 2 | 16 | 13 | - | - | - | - | - |
| వరంగల్ | - | 2 | - | 2 | 8 | 1 | 3 | 1 | - | - | - | 2 | 3 | 2 | 13 | 7 | - | - | - | - | - |
| వికారాబాద్ | - | 2 | - | 4 | - | - | - | - | 1 | - | - | 4 | 4 | 5 | 24 | 11 | - | - | - | - | - |
| **తెలంగాణ** | **3** | **37** | **1** | **78** | **95** | **42** | **50** | **11** | **39** | **19** | **46** | **46** | **78** | **82** | **270** | **200** | **-** | **-** | **-** | **10** | **1** |
| అనంతపురం | | | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | |
| చిత్తూరు | - | 1 | - | 3 | 6 | 8 | 10 | - | 1 | 3 | 5 | 4 | 6 | 1 | 38 | - | - | - | - | - | - |
| కడప | - | 1 | - | 7 | 13 | - | 1 | - | 4 | - | 1 | 2 | - | 2 | 19 | 2 | - | - | - | - | - |
| గుంటూరు | - | - | - | 3 | 9 | 5 | 5 | 1 | - | 1 | 3 | 5 | - | 2 | 22 | 13 | - | - | - | - | - |
| కృష్ణా | - | - | - | 5 | 2 | 1 | 1 | - | - | 1 | 1 | - | - | 2 | 17 | 8 | - | - | - | - | - |
| కర్నూలు | | | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | |
| తూర్పు గోదావరి | - | - | - | 1 | 6 | 1 | 14 | 1 | 2 | 4 | 2 | 2 | 2 | 1 | 33 | 23 | - | 1 | - | 1 | - |
| ప్రకాశం | - | 2 | - | 2 | 7 | 1 | 5 | 3 | 1 | - | - | 1 | - | 2 | 23 | 6 | - | - | - | - | - |
| శ్రీకాకుళం | - | - | - | 3 | 6 | 3 | 5 | - | - | 1 | 1 | 1 | - | 2 | 20 | 10 | - | - | - | - | - |
| పశ్చిమ గోదావరి | - | - | - | 7 | 6 | 1 | 2 | 1 | - | 3 | 2 | 1 | - | - | 16 | 10 | - | - | - | - | - |
| నెల్లూరు | - | - | - | 2 | 7 | 4 | 7 | - | - | 3 | 2 | - | 3 | 3 | 18 | 8 | - | - | - | - | - |
| విజయనగరం | - | - | - | 2 | 2 | 1 | 2 | 2 | - | 1 | 1 | - | 2 | 1 | 18 | 47 | - | - | - | - | - |
| విశాఖపట్నం | - | - | - | 7 | 8 | - | - | - | 1 | 1 | 1 | 2 | - | - | 29 | 20 | - | - | - | 9 | - |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **4** | **-** | **42** | **72** | **25** | **52** | **8** | **9** | **18** | **19** | **18** | **13** | **16** | **253** | **147** | **-** | **1** | **-** | **10** | **-** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| క దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| ట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| భివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| త్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| రి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| బందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| త్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| ధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| తు ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే | రైతు సేవా సమితి | 100 |
| రతదేశంలో ఉత్పత్తి విధానం-<br>త్పత్తి సంబంధాలు | విరసం | 20 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| లంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| చినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| రగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 150 |
| లంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| త్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| మగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| వరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| శ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| ానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| వకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| కృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| వశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| నుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| ణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| జ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం-మతం

| | | |
|---|---|---|
| ా బతుకులు | బేబి కాంబ్లే | 130 |
| జరాత్ ఫైల్స్ | రానా అయూబ్ | 130 |
| రతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| ంచతంత్రం | బొజ్జా తారకం | 200 |
| లం వర్గం | బొజ్జా తారకం | 60 |
| రిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| ంద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| ర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| లాంగిరి | జోతిబా ఫూలే | 60 |
| ల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| ంద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| ముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| తతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| వుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 120 |
| ను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 100 |

### సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| రజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| విత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| ్వచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| ాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 200 |
| ాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| లసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| లసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 | విరసం ప్రచురణ | 270 |
| రసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| హోదయం | కె.వి.ఆర్. | 200 |
| విఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| విఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| విఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| విఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| ాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| ందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| ామాజికం | వి. చెంచయ్య | 30 |
| న ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| ల్లంరాజయ్య కథలు పరిశీలన | ఎస్. నీలాదేవి | 75 |
| ారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | రు. 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం | 125 |

### చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 120 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| మహాత్మా జ్యోతిరావ్ ఫూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| తలపుల తోవ | షౌకత్ కైఫీ | 100 |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 60 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| ఏది నేరం?! | బి. అనూరాధ | 75 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు అమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| జనతన రాజ్యం | పాణి | 300 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| మలుపు తిప్పిన మహో ఉద్యమం | విరసం ప్రచురణ | 60 |
| వామపక్ష కమ్యూనిజం - ఒక బాలరిష్టం | లెనిన్ ప్రసిద్ధ రచన | 30 |

### కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు (2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 120 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| దళితులు - రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 100 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |
| అభాగ్యజీవులు | ఫ్రాంజ్ ఫనాన్ | 170 |
| నా గొడవ | కాళోజీ కవితలు | 400 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 188 - March 2017 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/02/2017 • Postal Regn. No. L II/RNP/HD/1100/2017-19



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | KLVA105M173 |
| --- | --- |
| పుస్తకం పేరు | వీక్షణం |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |